# విశ్వనాథ వారి కృష్ణకావ్యాలు




డా॥ టి. శ్రీరంగస్వామి

శ్రీలేఖ సాహితి
H.No. 5-11-~~114/4~~ 481 విద్యారణ్యపురి,
506 009

'Vishwanathavari krishna kavyalu' - Doctoral thesis of Dr. T. Sri-ranga Swamy, H. No. 5-11-114/4, Vidyaranya puri, Warangal 506 009.



Copies : 1000

10 th Sept '94

Price : Rs. 60/-

Cover design : Praswaji

Copies can be had from :

T. Sriranga Swamy
H.No. 5.11.~~114/4~~, 481
Vidyaranyapuri,
Warangal - 506 009.

Vishalandhra Book House,
Abids, Hyderabad & other branches.

Printed at :

Padmavathi Art Printers,
1-1-517/B/1, New Bakaram,

# శ్రీలేఖ

తమ సాధనసంపత్తులతో కృషీభూతులై తమ విశిష్ట కృషి ద్వారా ఉత్తమశ్రేణి సాహిత్య విమర్శకులుగ రూపొందుతున్నవారు శ్రీ టి. శ్రీరంగ స్వామిగారు. సాహిత్యపరమయిన వారి వ్యాసాలు అనేకం పత్రికల్లో అనేకులకు చిరపరిచితం. గతంలో మా శ్రీలేఖ సాహితి వారి 'వరంగల్లు జిల్లా రచయితల వాఙ్మయ జీవితసూచిక, కోవెల సుప్రసన్నాచార్యుల వాఙ్మయ జీవితసూచిక'లను అందించింది. ప్రస్తుతం వారి పరిశోధనా గ్రంథం (Ph D.) "విశ్వనాథవారి కృష్ణకావ్యాలు" మీ ముందుంచుతున్నాము.

శ్రీలేఖ సాహితి ఇప్పటికి వివిధ సాహిత్య ప్రక్రియలకు చెందిన పదిహేడు గ్రంథాలను ప్రచురించటం ద్వారా సాహిత్య సేవలో తన వంతు బాధ్యతను నిర్వహించటంతో ముందుకు సాగుతున్నది. ప్రస్తుతం విశ్వనాథవారి కృష్ణ కావ్యాలను అందించటానికి అనుమతించిన శ్రీ టి. శ్రీరంగస్వామి గారికి మనః స్ఫూర్తిగా మా కృతజ్ఞతలు.

మా సాహితీ సంస్థ పురోగమించటంలో సహృదయుల చేయూతను సర్వదా ఆశిస్తూ—

శ్రీలేఖ సాహితి

వరంగల్లు.

# మా ప్రచురణలు

1. శ్రీరామ శతకము - శ్రీ టి. రామానుజస్వామి రూ. 10.00
2. కవితాగానం - శ్రీమతి టి. ఇందిరా చిరంజీవి రూ. 3.00
3. ద టు జెంటిల్ మెన్ ఆఫ్ వెరోనా - డా॥ జి. దామోదర్ (తెలుగు అనువాదం) రూ. 5.00
4. వేణుతరంగాలు - యల్. వేణుగోపాలరావు రూ. 5.00
5. ప్రభవ (కవితా సంకలనం) - శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) ఒక సహృదయం
6. వరంగల్లు జిల్లా రచయితల వాఙ్మయ జీవిత సూచిక - శ్రీ టి. శ్రీరంగస్వామి రూ. 15.00
7. కవితావనం - శ్రీమతి టి. ఇందిరా చిరంజీవి రూ. 6.00
8. జన్మభూమిసిరులు - శ్రీ పల్లెసీను రూ. 6.00
9. జీవనరాగాలు - శ్రీ యల్. వేణుగోపాలరావు రూ. 10.00
10. శుక్ల (కవితా సంకలనం) - శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) రూ. 5.00
11. ఎమ్మెస్సార్ కథలు - శ్రీ యం. సుబ్బారావు రూ. 9.00
12. ప్రమోదూత (కవితా సంకలనం)- శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) రూ. 6.00
13. నా మాట (శతకం) - శ్రీ యం. సుబ్బారావు రూ. 3.00
14. ఏకశిల వైతాళికులు (వ్యాస సంకలనం) - శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) రూ. 30.00
15. ప్రజోత్పత్తి (కవితా సంకలనం) శ్రీ టి. శ్రీరంగస్వామి (సంపాదకత్వం) రూ. 6.00
16. కోవెల సుప్రసన్నాచార్యుల వాఙ్మయ జీవిత సూచిక - శ్రీ టి. శ్రీరంగస్వామి రూ. 15.00
17 కావ్యం-కవిస్వామ్యం-శ్రీ కోవెల సంపత్కుమారాచార్యులు రూ. 30.00
18. విశ్వనాథవారి కృష్ణకావ్యాలు - శ్రీ టి. శ్రీరంగస్వామి రూ. 60.00

"—మనము జ్ఞాపకమా యదువంశ మౌళికిన్"

మరువద్దనే అభ్యర్థనతో—

ఈ కృతి—



| | | | |
|---|---|---|---|
| 1. | Name | : | Dr. T. Sriranga Swamy |
| 2. | Date of Birth | : | 16th July, 1950 |
| 3. | Parents | : | Sri T. Ramanuja Swamy<br>Smt. T. Tayamma |
| 4. | Place of Birth | : | Parlapally,<br>Tq. & Dist. Karimnagar (A.P.) |
| 5. | Qualifications | : | B.Com., M.A. (Telugu), Ph.D., |
| 6. | Present Address | : | H.No. 5-11-~~114~~/4,<br>Vidyaranyapuri,<br>Warangal-5060 009 (A.P.) India. |
| 7. | Books Published | : | 1. Madhura (Freeverse poetry) .... 1984<br>2. Shikharam ,, .... 1986<br>3. Manasasancharare ... ,, .... 1988<br>4. Vipanchi (Essays) .... 1986<br>5. Warangal Zilla Rachayitala vangmaya jeevitha suchika .... 1987<br>6. Devulapalli Ramanuja Rao-oka Rekha chitram .... 1991 |

7 Kovela Suprasannachar yulu vangmaya jeevitha such ka ... 1991

8. Vishwanathavari Krishna Kavyalu (Ph D. Thesis) .... 1994

_Translations of other languages : 1. Kozara to Ekashila (Ajasa Zahirovich of Yogoslavia poetess)

2. Few poetry of English & Hindi

_Edited Books : 1. Chaitanya Freeverse poetry) .... 1980

2 N B Rao Kavitha samalochanam .... 1986

3. Diviti (Free verse) .... 1986

4 Swaramalika ,, .... 1986

5. Prabhava ,, .... 1987

6. Shukla ,, .... 1989

7. Pramodootha ,, .... 1990

8. Prajothpatti ,, .... 1991

9. Ekashila Vythalikulu (Essays) .... 1991

_Un-published Books : 1 Kozara to Ekashila (Poetry)

2. Shataka sahitya Vikasumu (After 1960's)

3. Warangal natakaranga charitra

4. Nigamanthasara Sangraham (Edited from Talapatra grandham)

5. Warangal zillalo devalayalu

6. Katragadda Sahithi Samalochonam
7. ....Other articles published in various papers

7. Translation by others : 1. Serbocrenation (Yogoslavai)
2. English
3. Hindi
4 Kannada

8. Associated with : 1. Srilekha Sahithi, Warangal
Founder & Secretary
2. Authors Guild of India, New Delhi.
Member
3. INTACH, New Delhi.
Member
4. Dist. Cultural Council, Warangal.
Member
5. Yuva Bharathi, Secunderabad.
Life Member
6. Prasarika Literary monthly, Warangal.
Honarary Editor, 1980 to 1988.

# అనుక్రమణిక

# "అయి! మురళీ—"

—జువ్వాడి గౌతమరావు

"అయి మురళి! ముకుంద స్మేర వక్త్రార పాద
శ్వసన మధురసజ్ఞే! త్వాం ప్రణమ్యాద్యయాచే
అధరమణి సమీపం ప్రాప్త వత్యాం భవత్యాం
కథయ రహసికర్ణే మద్దశాం నందసూనోః"

'అని ప్రవహిల్లినట్టె కర్ణామృతమ్ము' యొక్క 'మౌనగీతి' తనకెన్ని విధాల వినిపించిందో విశ్వనాథ సత్యనారాయణగారు ఎప్పుడో డెబ్బైయేండ్లకు పూర్వం 'అయిమురళీ' అనే శీర్షికతో రాసిన పద్యాలలో వివరించినారు.

ఓసి మురళీ! నీవు శ్రీకృష్ణుని అధర సామీప్యమును పొందియున్నప్పుడు నా దుర్దశను నందసూనుని చెవిలో ఏకాంతముగా వినిపింపుము అని స్థూలంగా ఈ శ్లోకానికి అర్థం. నా దశను కృష్ణునికి వినిపింపుమని కవి అన్నాడు కదా! ఆ దశ ఎట్టిది అని ప్రశ్న.

వేయిపడగలు చదివిన వాళ్ళకు తెలుస్తుంది అందులో దేవదాసి ఉన్నది. ఆమె సర్వవేళలయందు సర్వాత్మనా తన వేదనను కృష్ణస్వామికి నివేదిస్తూనే ఉంటుంది. అదీ ఈ శ్లోకంలోని కృష్ణునికి నివేదించ దగిన దశా రెండూ ఒక్కటే.

ఈ పుస్తకం విశ్వనాథవారి కృష్ణ కావ్యాలను సమీక్షిస్తూ వ్రాసిన గ్రంథం. విశ్వనాథ సర్వకృష్ణ సాహిత్యం ఒక యజ్ఞకుండం అయితే తద్యజన సంభవ దేవదాసి. వేయిపడగల రచయిత తన ప్రాణమంతా పెట్టి నిర్మించిన పాత్ర దేవదాసిది. అందులోని ఇరువది తొమ్మిదవ అధ్యాయం సర్వకృష్ణ భక్తి సాహిత్యానికి మకుటాయమానమైనది. అయితే అది ఒక నవలలోని భాగం కావటంచేత దానిని ఈ సమీక్షలోని భాగంగా రచయిత అంగీకరించలేదు. అంతే.

విశ్వనాథ వారి కృష్ణ కావ్యాల బీజాలు వేయిపడగల్లో ఉన్నవి. శృంగారవీథి వేయిపడగలకు ముందే వ్రాయబడిన కావ్యమైనా దాని లక్షణం వేరు. ఆ కావ్యంలో శృంగారం పాలు అధికం. తరువాత కావ్యాలలో భక్తిపాలు అధికం.

ఈ కృష్ణ కావ్యాలన్నీ విశిష్టకావ్యాలే, ఒక్క రామాయణ కల్పవృక్షం చదివి విశ్వనాథ వారిని సంపూర్ణంగా చదివినామనుకొనటం పొరపాటు. అందుతో ఇముడనివి కొన్ని ఉన్నవి. ఈ కృష్ణ కావ్యాలూ అటువంటివే. అందులో శ్రీకృష్ణ సంగీతం దారి మరీ కొత్తది. నూటయెనిమిది మంది వివిధ రీతుల్లో కృష్ణుని గురించి చేసిన గాఢభావన ఈ కావ్యానికి వస్తువు. వారందరూ గోపికలు కారు. మరొక వైశిష్ట్యమేమనగా ప్రాయికముగా సమాసభూయిష్ఠమైన విశ్వనాథవారి పద్య రచన ఇందులో క్రొత్తదారి తొక్కింది. సుమారు నాలుగువేలపై చిలుకు చరణా లలో సమాసాల కోసం మనం ప్రయత్నించి వెదుకవలెనన్నట్లుగా ఈ పద్య రచన ఉన్నది. ఈ శ్రీకృష్ణ సంగీతాన్ని గురించి వివేచించి వ్రాయటం నిజంగా కష్టసాధ్యమైన విషయం. అన్నీ నూట యెనిమిది శీర్షికలైతే అందులో ఎన్నో మలుపులు వాళ్ళు నూటఎనిమిది తీర్ల మనుషులు. వాళ్ళు ఊహించే పద్ధతిలో ఏకత లేదు. పట్టు దొరకదు ఇంత కష్టసాధ్యమైన దానిని సమర్థంగా నిర్వహించి నందులకు శ్రీరంగ స్వామిగారిని అభినందించక తప్పదు.

ఈ గ్రంథం పిహెచ్. డి పట్టం కోసం సమర్పింపబడిన సిద్ధాంత గ్రంథం. విశ్వవిద్యాలయాలలో పట్టాల కోసం సమర్పింపబడే సిద్ధాంతగ్రంథాలను గురించి లోకంలో సదభిప్రాయంలేదు. నాకూలేదు. తీగకదపితే డొంకంతాకదులు తుంది. అందుచేత ఇప్పుడా విషయంలోనికి పోవాలనే ఊహ నాకు లేదు. కాని ఒక్క విషయం విన్నవించక తప్పదు. ఈ సిద్ధాంత గ్రంథాలను గురించి సదభి ప్రాయం లేకపోవడానికి కారణం ఆయా గ్రంథాలు వ్రాసిన వాళ్ళు మాత్రమే అని అనటం న్యాయం కాదు. పట్టాప్రదానం జరుగుతూనే ఉన్నది కదా, ఎవడు మాత్రం ఎందుకు శ్రమపడవలె? డిగ్రీలు ఇచ్చేవాళ్ళు, తీసుకొనేవాళ్ళు, వారిద్దరి మధ్య ఉన్నవాళ్ళు, వెనుక వాళ్ళందరినీ కదలకుండా పడేసిపట్టుకొన్న మహా మాయాజాలం ఇంత ఉన్నది!

పెద్ద పెద్ద అడవుల్లో దయ్యపు సాలీడులుంటవట. మన ఇళ్ళల్లోని సాలీళ్ళగూళ్ళల్లో పడేవి ఈగలు, దోమలవంటి క్షుద్ర జీవులు. ఆ సాలీండ్లు వేసే వలల్లో పెద్దపులులూ సింహాలూ చిక్కుకున్నా బయటికి రాలేవట. అట్లాంటి వాగుర అది. ఇప్పుడైతే అడవులు లేవు. కాని అంతంత అడవులనూ, ఆ సాలీటి గూళ్ళనూ వాటిలో చిక్కిన మృగాలతో సహా భోంచేసి నిద్రబోతున్న వాతాపులు ఉన్నారు. అయ్యో! స్వామీ! అగస్త్య మహర్షీ! ఎక్కడ ఉన్నావు? అనేది మన అరణ్య రోదన.

ఈ పరిస్థితుల్లో ఉత్తమ ఫలితాలకోసం అన్వేషించటం వృథా అనుకొనే దానికికూడా అపవాదుల్లాగా అప్పుడప్పుడు ఈ గ్రంథంలాంటివి కొన్ని కనబడతవి. ఇంత చక్కని గ్రంథానికి నాలుగు మాటలు వ్రాయమని ఆపేక్షతో నన్ను అడిగిన ఈ రచయిత సౌజన్యాన్ని మన్నిస్తూ విశ్వనాథ వారి మాటలనే ఆయనకు ఆశీర్వాదంగా వల్లిస్తూ సెలవు తీసుకుంటున్నాను.

"లలితవంశీరసాలాసబృందావనీ
దశదిశాకృత ప్రతిధ్వానములును
వినబడెడుగాక, ప్రాణముల్ విచ్చుగాక
త్రోచుకొని గుండెలోతులు దూరుగాక
మీ కులమ్ములు రక్షించుగాక స్వామి."

జ్యోతినగర్
కరీంనగరం-505002.

మీ,
జువ్వాడి గౌతమరావు

# మంగళాశాసనము

—ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యులు

విశ్వనాథ వారి కృష్ణ కావ్యాలు అన్న ఈ పుస్తకాన్ని రచించినవారు మా విద్యార్థి చిరంజీవి టి. శ్రీరంగస్వామి. జగద్గురువైన శ్రీకృష్ణ దేవుని మహాను భావము ఈ గ్రంథానికి వస్తువైతే, ఆంధ్ర సాహిత్య జగద్గురువైన శ్రీ విశ్వనాథ సత్యనారాయణ రచనల మీద ఈ గ్రంథం పరిశోధన కావటం ముందు మాట వ్రాయటం ఒక విధంగా గురుపూజా సన్నివేశమే.

అయిదు వేల సంవత్సరాలుగా శ్రీకృష్ణ చైతన్యం భారతీయ తత్త్వానికి సంస్కారానికి చైతన్యానికీ కేంద్ర బిందువు. మహాభారతము, హరివంశము, విష్ణు పురాణము, శ్రీమద్భాగవతము ఈ కృష్ణ తత్త్వాన్ని చెప్పేందుకు యథా సౌఖ్యముగా ప్రయత్నించిన గ్రంథాలు. అద్భుత రసో లక్షణమైన బాలకృష్ణ తత్త్వము, మధుర మోహనమైన శృంగార కృష్ణ తత్త్వము, వీర రసావతారమైన దైత్యాంతర కృషి తత్త్వము, స్థితి లక్షణ కారణమైన భారత కృష్ణ తత్త్వము, జగద్గురువైన యోగీశ్వరుడైన గీతా కృష్ణ తత్త్వము, వీటన్నింటి సమష్టి రూప మైన పరబ్రహ్మాత్మకమైన శాంతకృష్ణ తత్త్వము- ఇట్లా బహు వర్ణ శబలితమైన ఇంద్రచాపంవంటి యశోదానందుని లక్షణాన్ని భారతీయ వాఙ్మయము సంగీత నాట్య చిత్రకళల రూపాలు, వేదాంత విచారణమూ చివరివరకు పట్టుకోలేక పోతున్నాయి. "యతో వాచోనివర్తంతే అప్రాప్యమనసాసహ".

ఈనాటి భారతీయ వాఙ్మయ పరిషత్తులో విశ్వనాథ సత్యనారాయణ సృజన చైతన్యాన్ని పట్టుకోవడం కూడా అంతే క్లిష్టమైన సన్నివేశం. "తేనెల్ వాలును, మేఘ గర్జనలు ఏతెంచున్, పికకన్య కానూనవ్యాహృతి, మాధు పంచమము చిందుకద్యోనదాంతః కణ శ్రీనృత్యంబులు చూపుసత్కవిత" ఈ వైవిధ్యం ఏ చట్టంలో ఇముడుతుంది? బహు ప్రక్రియా ప్రపంచ శిఖరాయమాణ రచనా లోహంమైన ఆయన ప్రజ్ఞను ఏ సృజన శిల్ప పరిమితులలో నిబంధించగలమా?

విశ్వజనీనమైన తాత్త్వికచింతనలో భూత భవిష్య ద్వర్తమానాల చిదబ్ధి వ్యక్తికి కుదురైన ఆయన భావచైతన్యాన్ని ఏ తాత్త్విక పరిమితులలో కట్టివేయగలము? ఈ విరాట్స్వరూపాన్ని భావన చేయలేకపోవటంవల్లనే విశ్వనాథను తెలుగు సాహిత్య విమర్శ యింకా సరిగ్గా అంచనా వేయలేకపోయిందేమో? ఉపరితలంలో ఉండే అంశాలు ఆధారంగానే అరవై సంవత్సరాలుగా ఆయన సాహిత్యంలోని మౌలిక జీవన సూత్రాన్ని పట్టుకోలేకపోయిందేమో!

వస్తు భావ రచనలు ఏ రచనను అంచనా వేయటానికైనా మౌలికాంశాలే కాని వ్యస్తంగా ఆయా అంశాలను పరిశీలించడంకంటే, వాటిని సమష్టిగా చూడడం చాలావరకు మేలైన అంశం. అయితే ఒక మహాగ్రంథాన్ని(classic), ఒక మహా రచయితను నియతమైన పరిమితులతో, ప్రమాణాలతో కొలవ బూనడం అంత సమంజసమైనదేమీ కాదు. ఈ వస్తు భావ రచనల త్రిపుటికి ఉద్గమహేతువై సృజన కేంద్రానికి చేరి అక్కడ "నీవారశూకం" కంటే సూక్ష్మంగా స్ఫురించే ఋత స్వరూపాన్ని దర్శనం చేయవలసి ఉంటుంది.

విశ్వనాథకు ఆత్మదర్శనోపలబ్ధికోసం కొనసాగిన 'జీవుని వేదన' నిరంతర ధారగా, తన ప్రపంచానికి ఆధారభూమిగా కొనసాగింది. అందువల్ల చరాచర జగత్తులో కలిగే వేదనాస్పందం సర్వమూ ఆయన సాహిత్య వస్తువైంది. అది ఒక ప్రాంతానికీ, దేశానికీ, మానవ సృష్టికీ పరిమితమైన అంశం కాదు. అది విశ్వాలయమును తనతోపాటు అనుసంధించుకునే అద్భుత వాగర్థ గోష్ఠి. అందువల్లనే—

"నా కవితన్ విశాలజఘనా! ఒక యాచితిలేదు భాషలే
దాకృతి లేద యూరక రసాత్మతనే స్రవియించి పోదు నీ
వాకృతి యందమాచిన రసాత్మవు నీకును నాకభిన్న తా
శ్రీకత కల్గెనా పులకరించెను బొమ్మ రస ప్రపంచముల్."

(స్నానసుందరి)

విశ్వచైతన్యానికీ, కవికీ కలిగిన అభిన్నతవల్ల విశ్వనాథ వాక్కు రస ప్రపంచానికే పులకరింతలయింది. ఆయన వేయిపడగలు నవల ఎలా ఉండ గూడదో అలా ఉందని ఒక విమర్శకుడన్నా, మరొక కవి ఆయనవల్ల ఎలా

రాయగూడదో నేర్చుకొన్నానని అన్నా - ఆ వాక్కుల అర్థం ఈ రస ప్రపంచా నికి ద్వారాలు తెరచుకునే తాళంచెవి, సంకుచిత చిత్తవృత్తిగల వాళ్ళకు యింకా లభించలేదనే తెలియవస్తుంది.

బంగారం విలువ దాని వన్నెనుబట్టియే కాని దాని రూప వైఖరులను బట్టి కానట్లే మహాగ్రంథం విలువ దాని విశ్వజనీనతనుబట్టి తప్ప కేవల తత్కాలస్థితాలైన సాహిత్య ప్రమాణాలను బట్టి మాత్రంకాదు నిర్ణయించేది.

విశ్వనాథ కృష్ణ కావ్యాలన్నీ వివేచన కేవలం వస్తు పరిమితులలో చేసిన అధ్యయనం. దివ్య దివ్య లోకాలకు ముడి వేయనెంచిన ఈ కవి రచనలో భారతీ యాస్తిక భావ ప్రపంచం ఒక ప్రధాన భాగమే. అక్కడ రామకృష్ణ శివ మూర్తులు దేవీమూర్తులు అన్నీ ఒక చైతన్యానికి బహు ఆవిష్కరణాలే. వ్యక్తమైన సగుణోపాసనము అవ్యక్త నిర్గుణోపాసనకు సోపానమ్. కవి తపోమార్గం కవితా ముఖమైంది. ఆ కారణం వల్లనే-

"అల మీశ కేశవ వాయుసూన రఘూద్వహాధిక సేవయా
అల మింద్రియ స్వతతేర్జ యాధిక యత్న జీవన బాధయా
అలమస్తిమే సుకుమార కోమల కామినీ నితగండభాకే
హసితాళి కావ్య వసంత పుష్పవనీ నిరంతర చంద్రికా" (కేదారగౌళ)

ఈ నిరంతర చంద్రిక ఆస్తిక నాస్తిక భావ పరిధుల కతీతమైంది. అక్కడ మౌలికమైంది - పరిమితమైన చైతన్యం అనంత చైతన్యంలో అనంత మార్గంలో అనుసంధానం కలిపించుకోవడం లక్షణం.

కవి రామోపాసకుడే అయి, తా కృష్ణ చైతన్య సంవృత చిత్తుడు. భాగ వతం ఆయన అరవప్రాణం, చిన్నతనం నుంచీ పోతన ఆయనకు నిత్య సన్ని హితుడు. అందుకే పుణ్యపేటి.

"యదువృలయందు పుట్టము, లకాంగలయందున భర్త, ద్వారకా
స్పదులగువారికి నా ప్రభువు, భక్తుల పాలిట కామధేనువా
యదుకుల మౌళి ఏదియగు! అన్నియునౌ మఱి యేదికాడునె
య్యదియును కాదు, తత్ప్రభుదృగంతపు వెన్నెల సర్వమైచనన్"

(శృంగార వీధి)

భక్తునికి స్వామి తోడి సంబంధము ఏ విధమైనదైనా కావచ్చు. ఆ వ్యక్తి పరిధి తొలగిపోతే ఏదీకాకపోవచ్చు. "తత్ప్రియ దృగంతపు వెన్నెల" పైన చెప్పిన "నిరంతర చంద్రిక" సర్వచైతన్య మూలము.

కవికి అందుకే శ్రీకృష్ణుడు రాజితమానస హంస-బోధాయతిమూర్తియైన వసుధాయత బ్రహ్మమునై చరించె-స్వామిదర్శనంలో రెండు పార్శ్వాలు జ్ఞాన మూర్తి రసమూర్తి. కవి ఉపాసించింది ప్రధానంగా రసమూర్తినే అందువల్లనే "యిలాతలమూరక" సౌమ్యనిల్చినది.

స్వామిరసమూర్తియే రాసమూర్తి. ఆయన వేణుగీతము బ్రహ్మగీతము. అది చెవిబడినంతనే గోపికాశ్రేణి విరహాగ్నికి గేహములు. తనూజులు ప్రాణ పదులు అందరూ అంతర్హితులైనారు-పురానుగత సంధులు ప్రవయ్యలయినవి. భగ వద్విరహాగ్ని శక్తి అది.

విశ్వనాథ కృష్ణ కావ్యాలన్నింటిలో గోచరమయ్యేది ఈ విశ్వవిరహం. ఆయన ప్రతిభాగర్భంలోనుంచి కృష్ణ విరహావతారమైన గిరికాదేవి వేయిపడగ లలో ఉద్భవించింది. ఈమె పూర్వరూపాలు శ్రీగోదాదేవి, శ్రీ మీరాదేవి, జయ దేవ, లీలాశుకులు, నారాయణతీర్థులు విశ్వనాథ ఆత్మలో పోతన్నగారితోపాటు కూర్చున్న వాళ్ళు.

భగవద్విరహం వస్తువు తమిళ దేశంలో ఈ శఠకోపుల శ్రీ గోదాదేవి రచనలలో భక్తి సాహిత్యం యొక్క మాధుర్య పార్శ్వం ఆరంభమైందని అని పిస్తుంది.నప్పిన్న (నీళాదేవి) తిరుప్పావైలో శ్రీకృష్ణప్రేయసి. తిరువాయిమొళిలో శ్రీశఠకోపులు నాయికా భావాన్ని తామేపొంది మధురభక్తి శిఖరాగ్రాలను అందు కున్నారు. ఈ లక్షణానికి సమాంతరంగా భాగవత గోపికలకు పెన్నిధిగా వాళ్ళ సమష్టి చైతన్యంగా రాధాదేవి ఆవిర్భవించినట్లు తోస్తున్నది. రాధస్ శబ్దానికి వాంఛిత వస్తువు, ప్రియవస్తువని వైదికార్థం. రాధే శబ్దం విశాఖ నక్షత్ర ద్వయాన్ని సూచిస్తుంది. ఆ తర్వాతి నక్షత్రమైన అనూరాధకూడా, విశాఖకు రాధనామమన్న అంశాన్ని తెలియచేస్తుంది. అయితే జయదేవుని గీతగోవిందము కృష్ణ చరిత్రలో రాధకు శృంగార పట్టాభిషేకం చేసింది. చైతన్యసంప్రదాయము రాధాకృష్ణోపాసనకు అత్యంత ప్రాధాన్యాన్ని సంతరించింది. ఈ శృంగార భావసిద్ధిని ఆ మార్గం 'మహాభావ'మని పేర్కొంది.

ఆధునికాంధ్ర కవిత్వములో వంగదేశపు ప్రభావం వైష్ణవభక్తి ప్రాచుర్యం రవీంద్రుని రచనా రోచిస్సులు రాధను తెలుగు కవులకు దగ్గరగా తీసుకు వచ్చాయి. ఆ రీతిలో బసవరాజు, కృష్ణశాస్త్రి రచనలతోపాటు విశ్వనాథ 'శృంగారవీథి' రాధాతత్త్వాన్ని ఉజ్జ్వలంగా ప్రకాశింప చేసింది. శృంగారవీథిలో రాధాతత్త్వం ఒక పార్శ్వం అయితే శ్రీకృష్ణదేవుని నిర్వేదము, ప్రాతఃస్తవము ఈ రెండు కావ్యాలు మరెరెండు పార్శ్వాలు. పృథ్వీలోనికి దిగివచ్చిన ఈశ్వర చైతన్యము ఆ తమఃపరిమితులలోనుంచి ఎట్లా పడిపడి ఉద్గమించిందో చెప్పడం ఒకదానిలో వస్తువయితే, ఆ ఉద్గమ చైతన్యాన్ని ఈ సృష్టియే యశోదయై వాత్సల్యభావ మాధుర్యంతో ఆత్మీయంగా చేసుకోవడం ప్రాతఃస్తవములో వస్తువయినది.

భ్రమరగీతలు, గోపికాగీతలు ఉత్తరోత్తరం సౌకుమార్యం పండించు కున్న రచనలు ప్రద్యుమ్నోదయం విశ్వనాథ కథన శిల్పవైభవంతోపాటు హరి హరాభేదాన్ని వ్యూహ తత్త్వాన్ని వ్యాఖ్యానించే రచనలు. పోతన, నాచన సోమనల రచనల మీద ఈ రచన తాత్త్వికభావ ఆధార భూమికమీద ముందుకు వచ్చిన కావ్యం. శ్రీకృష్ణ సంగీతం కవి నిత్య భగవద్భావనతో తానే 108 సార్లు గోపికయై అతని నిత్య సన్నిధిని భావించుకున్న కావ్యం. శృంగారవీథి రామాయణ కల్పవృక్ష రచనకు పూర్వరచన అయితే మిగిలినవి కల్పవృక్షా నంతర రచనలు. ఒక తీరికతో కూడిన భావనాలక్షణం ఈ రచనల్లో స్పష్టంగా దర్శనమిస్తుంది. తెలుగు పలుకుబడి వాటిల్లో విశ్వరూపం దాల్చి కనిపిస్తుంది. పలుకుబడికి, భాషకు వాతావరణ కల్పనకు ఈనాడు నశించిపోతూ ఉన్న, అకృత్రిమమైన తెలుగుదేశంలోని, జీవితంలోని గ్రామీణ వాతావరణము ఈ కావ్యాలలో నిబద్ధమైంది. రామాయణ కల్పవృక్షాంతర రచనలలో విశ్వనాథ తెలుగు పలుకుబడికి మళ్ళీ ప్రాణం పోసింది. తెలుగు కవితా సింహాసనం మీద పునః ప్రతిష్ఠించింది. వేణుగోపాల శతకాలు రెండూ ఆయన వేదనకు రెండు సెలయేటి పాయలు.

ఈ గ్రంథం విశ్వనాథ వారి కృష్ణకావ్య ప్రపంచ పరిణాహాన్ని వివరిస్తూ చూపించింది. అందినకొలది లోతులోనికి ప్రవేశించే ప్రయత్నం జరిగింది. ఒక ఉదటున సర్వమూ ఆకళించుకొనే విలయునదేమికాదు ఈ కృష్ణకావ్య ప్రపంచం.

ఈ కృతికి చిరంజీవి శ్రీరంగస్వామి ప్రయత్నం చేసి ప్రకాశకుడు చేసింది ఈ వ్యవహారాన్ని నిర్వహించింది. ఈ కావ్యాలలోని మాధుర్యాన్ని వివేచిస్తూ ఈ రచయిత అనేక విధాలుగా వెల్లడించాడు. శృంగార మాధుర్యం, విరహభక్తి మాధుర్యం, వేదనా మాధుర్యం, భక్తి ఉపాసన వైవిధ్యమాధుర్యం, ఆత్మిక మాధుర్యం, శాంతమాధుర్యం అని ఆరు విధాలుగా ఆ కావ్యాలలో ఈ తత్త్వం వ్యాపించి ఉన్నదని చెప్పడం జరిగింది. (156 వ పుట) ఉజ్జ్వలనీలమణి భక్తిరసామృత సింధువుల ఆధారంగా ఈ విభాగాల్లోని సామరస్యాన్ని కూడా పరిశీలించవలసి వుంది.

చిందుల వల్లి సిస్తు చిరంజిమ్మిన కైవడి వేణి విచ్చి కా
శింది, చక చ్చకచల దలీమలిలంబుగా విదిర్చినన్
నందకుమారు నీలమస్మణచ్ఛవి మత్తనుకాంతి లుప్తమై
క్రిందువడెన్ మరుండును నిగిడ్చి మగిడ్చిన వౌతమోఽస్త్రమై

(శ్రీకృష్ణదేవుని నిర్వేదము)

ఈ పద్యము ఈశ్వరునికి, మాయకు, కామానికి త్రిభుజాకారంగా ఉండే మిథ్యాసంబంధాన్ని వ్యక్తీకరిస్తుంది. భగవంతుని దగ్గర మాయ ఎట్లా అశక్తమైందో చెప్పే ఈ పద్యం మననం చేయదగ్గది. నిగిడ్చి, మగిడ్చిన అస్త్రమంద మన్మథ వైఫల్యం - మాయావైఫల్యం ధ్వన్యమాన మవుతుంది.

భావ గాఢత చేతనే ప్రవేశ సాధ్యమయ్యే క్లిష్ట విషయాన్ని స్వీకరించి సఫలమైన ఈ గ్రంథాన్ని రచించిన శ్రీరంగస్వామికి, ఈ వ్యాజంగా శ్రీకృష్ణ ధ్యానాన్ని అనుభవించిన మనకు సర్వవిధ సౌభాగ్యములు కలిగించవలెనని ఈ కృతిపతియైన శ్రీకృష్ణదేవుని ప్రార్థిస్తున్నాను.

పరిమళ కాలనీ
వడ్డేపల్లి, హన్మకొండ

కోవెల సుప్రసన్నాచార్యులు

# ఎర్రంచు నల్లచీర

డా॥ తుమ్మపూడి కోటేశ్వరరావు

"కాంచుచునుండ బండికిని"– అన్న పద్య వివరణ (201 పుట) యతి స్థానాలలో వున్న క్రియలను గూర్చి చేసిన విమర్శకానీ, 200 పుటలో "దవ్వో పిల్లనగ్రోవిరవము"-198 వ పుట పద్యవివరణ, 197 పుటలో "చిందుల నల్లనీళ్ళు" అన్న పద్యవిమర్శ, 104 వ పుటలో "నే వర్ణించిన స్వామియే" - అన్న పద్య వివరణ ఇలా ఎక్కడ చూచినా ఈ గ్రంథకర్తకు ప్రాచీన వాఙ్మయంతో చిక్కని పరిచయమున్న లక్షణం కన్పిస్తుంది. వివిధ స్థలాలలో విశ్వనాథ వారి కృష్ణతత్త్వాన్ని ఆవిష్కరించడానికి ఈ విమర్శకుడుచేసిన విమర్శనైపథ్యంలో అనేక ప్రాచీన కావ్య అవలోడన సంభార మేగాక ఎంతో సంప్రదాయ అగాధత్వం కన్నులకు కట్టినట్లు కన్పించక మానదు. అలంకార శాస్త్రంతోపాటు వైష్ణవమత, కుండలినీయోగ సంప్రదాయాదులెన్నో తెచ్చి విశ్వనాథ వారి కృష్ణ తత్త్వావిష్కరణకు అలంకరించిన లక్షణం కొట్టవచ్చినట్టు కానవస్తున్నది. రాధాతత్త్వ వివరణలాగానే భాగవత తత్త్వ - విశ్వనాథ కావ్యతత్త్వ అనుసంధానంలోగాని కృష్ణ కర్ణామృతాన్ని తెచ్చే మెరువుల్లాగా ఆ శ్లోకాలను ప్రయోగించడంలో గాని ఎన్నో రకాలుగా ఈ పరిశోధన విమర్శన గ్రంథం మధురాద్భుతంగా ఉంది

విశ్వనాథ వారిలో శ్రీరామ కృష్ణులిద్దరు రెండు దళాలు గల జీవ బీజ ముంది. అది దొరికినప్పుడల్లా ప్రతి రచనలోను పొటమరిస్తూనే ఉంది. దానికి ఉద్బోధకమైన కారణ సామగ్రి ఈ విమర్శకుడు చక్కగా వివరించాడు. ఏక వీరలో గొల్లకలాపం, భామాకలాపాలను గూర్చి చేసిన విమర్శలోనే వేయి పడగలలో గిరిక పాత్రావిష్కరణకు శ్రీకృష్ణ కథానుసంధానం చేయడంలోనూ ఈ కృష్ణ కావ్యతత్త్వ బీజాలు వున్నవి. గొల్లకలాపాల నుండి గోపికా గీతాలు- భామాకలాపాలనుండి భ్రమర గీతాలు, గిరిక నాట్యం నుండి శ్రీకృష్ణ సంగీతం, ఇలాగా అనుసంధించుకుంటూ పోతే మాష్టరుగారి కవిత బీజ స్వరూప స్వభావాల

మూలతత్త్వం అవగతమవుతుంది. దాన్ని ప్రధానంగా ఆవిష్కరించే ప్రయత్నమే ఈ పి హెచ్ డి విమర్శన గ్రంథం చేసిన పని. ఈ పీఠికా కర్త కరీంనగరములో గురువుగారితోపాటు పనిచేస్తున్న రోజులలో వారొక మాట అన్నారు: "మా గురువులు అంటుండేవారు- భాగవతాన్ని పోతనగారు కనుక వ్రాయకుండావుంటే కాసుల పురుషోత్తము వ్రాసివుండేవాడు అని" ఈ మాట విశ్వనాథవారు కృష్ణ కావ్య రచన చేస్తున్న సమయంలో వారి హృదయంతరాలలో వుందేమో! దాని వివరణ పద్ధతి ఈ గ్రంథం పెట్టుకోలేదు కాని, ఆ చూపు కూడా విమర్శ నీయమేనని అనుకుంటాను.

ఈ కృష్ణ కావ్యాల మీద ఒక పి హెచ్.డి. పరిశోధన చేయించాలన్న ఆకాంక్ష ప్రధానంగా శ్రీకృష్ణ సంగీతం మీద ఈ పీఠికాకర్తకు చాలా కాలంగా ఉండేది. అది కుదరలేదు. ఆ లోపాన్ని మిత్రులు సంపత్కుమార నేతృత్వంలో (గురుత్వం) మిత్రుడు శ్రీరంగస్వామి చేయడంవల్ల చాలా తృప్తి కలుగుతుంది.

మాష్టారుగారు అన్నారు కరీంనగర్‌లోనే - 'మున్నంగిలో ఉన్న నా శిష్యులు నన్ను పిలిచి సన్మానించి మా వూరు వేణుగోపాలుని మీద ఒక కావ్యం వ్రాసిపెట్టమన్నారు. 'మున్నంగి వేణుగోపాల' అన్న మకుటం సరిపడ్డ ఛందస్సు కోసం చూస్తే మధ్యాక్కర ఒక్కటే అనువుగా తోచింది. సరే వ్రాస్తూ పోదును గదా! అప్పుడు తెలిసింది ఓరి బాబో! తెలుగు మాట్లాడే వైఖరికి అతి సన్నిహిత ఛందస్సు మధ్యాక్కర ఒక్కటేనని. ఇందువలననే వేయి మధ్యాక్కరలు వ్రాశాను. భద్రగిరి శతకంలో ఈ మధ్యాక్కర వ్రాసిందిందుకే—

వెసఁదెల్గు తెల్గంచు జనము వెఱ్ఱిగంతులు వేయుచున్న
దెసమూలు మాజాతికివొకండవు తెలుఁగుదైవమవు
కసితీర నుతియింతు నిన్నుఁదెలుగువక్కణములతోడ
నిసిపోవఁబగలురా భద్రగిరిపుణ్యనిలయ శ్రీరామ!" 10 వ పద్యం)

ఇందుకే తెలుగుదేశంలో తరువాత ఎందరో మధ్యాక్కర కవులు పుట్టారు. ఒక మహాకవి వాక్కు-కున్న మండలవిస్తృతి కొలతలకందేదికాదు. (మిత్రుడు సుప్రసన్న, ఈ పీఠికాకర్త కూడా ఈ మధ్యాక్కర మండలమధ్యస్థులే.)

"ఈ అనిలాధ్వ మెల్ల నివదించెడు మువ్వలమ్రోత—"అన్న పద్యం దగ్గర కాళిదాసు రమ్యాణివీక్షణను తెచ్చి అతికిన శ్రీరంగస్వామిగారి మధుర స్ఫురణ శ్రీరంగశయనునిపై తొండరడిప్పొడి ఆళ్వారు పాడిన "తిరుప్పళ్ళిఎళుచ్చి" అన్న సుప్రభాతంలాగా మధురంగా ఉంది.

గురువులు కీ॥ శే॥ దూశిపాళ శ్రీరామమూర్తిగారు విశ్వనాథవారి జీవనని వేదనపై వ్యాసాలు వ్రాశారు. వారంటుండేవారు-"మాస్టరుగారు ఈ పద్యం వ్రాసే నాటికి కాళిదాసు రమ్యాణివీక్ష చదవనేలేదటోయ్" అని. ఆ శ్లోకం భారతీయ రససిద్ధాంతానికి మూలస్తంభంగా చేశారు శ్రీ అభినవగుప్త పాదాచార్యులవారు ఆధునిక మనస్తత్వ శాస్త్రంలో దాని అగాధత వ్యాఖ్యానింపబడింది. ఈ ప్రస్తుత గ్రంథంలో ఈ పద్య పరామర్శ చాలా అద్భుతంగా ఉంది.

ఈ గ్రంథం ప్రధానంగా విశ్వనాథ వారి కృష్ణతత్త్వ అవిష్కరణకోసం పుట్టినది. విశ్వనాథ పద్య రచన భావ సౌందర్య వ్యాఖ్యానం, ఆ మహాకవి పలుకు బడులు, సొంపులు, నవీన వక్రోక్తి విధానం, తెలుగుదనం మొదలైన కావ్య శిల్పాంగాలు జోలి అంతగా పెట్టుకోలేదు. ఇక్కడ ప్రధానంగా వస్తు మాధు ర్యమే విన్యస్తమైనది. ఈ గ్రంథ పరిధి ఇది. అక్కడక్కడ కావ్య శిల్పాంగ పరిశీలనం చేయకపోలేదు. చేసిన ఘట్టాలకు సూచనగానే వ్యాసారంభం జరిగింది కదా!

మొదటిపద్యం 'కాంచుచునుండ'- రచనలో 'ఇంచుక యేని' అన్న నన్నయగారి పద్యం ధ్వనించడం లేదా! 'నేవర్ణించిన స్వామి-' అన్న పద్యంలో 'ఋషీనాంపునరాధ్యానాం' అన్న భవభూతి శ్లోకాన్ని, నన్నయగారి ప్రసన్న కథాకలితార్థ యుక్తిలో విశ్వనాథవారు వ్యాఖ్యానించిన తీరు ధ్వనించడం లేదా! 'ప్రద్యుమ్నోదయం'లో అగ్నిద్యోతన శబ్దాన్ని విశ్వనాథ వారు వాఖ్యానించిన తీరు ఈ విమర్శకుడెంత హృద్యంగా ఆవిష్కరించాడు. (136 వ పుటలో.) "కొన్నాళ్ళు తానెందుకు ధర్మితికరుదెంచె" - అన్న సీస పద్యంలో క్రమంగా ప్రయోగింపబడ్డ బిడ్డ, బాల, యువతి, దేవి అన్న శబ్దాలను భాగవత పద్య తులనా త్మక పరిశీలనంతోపాటు ఎంత రమణీయముగా ఈ విమర్శకుడు వివరించాడో!! ఈ కృష్ణకావ్యాల తత్త్వావిష్కరణ దగ్గర కల్పవృక్షాన్ని ఎంత చక్కగా సమన్వ యించాడు అంటే విశ్వనాథ వాఙ్మయ భాగీరథిని సమగ్రంగా చూచిన లక్షణం ఈ విమర్శలో అంతటా తళతళలాడుతూనే ఉంది. కనుక విశ్వనాథ పద్యశిల్ప విమర్శ ఈ గ్రంథం పెట్టుకోలేదు అనడానికి వీలులేదు. వస్తు విన్యాస మాధుర్యం ప్రధానాంశం అన్నంతవరకే.

శ్రీకృష్ణ సంగీతం లాంటి కవితలను వ్యాఖ్యానించడం చాలా కష్టం. ఎందుకంటె- ఒకచోట ఆధునిక వేదమహర్షి శ్రీ అరవిందులన్నారు. "When I Speak the reason says, "This will I say", but God takes the word out of my mouth at the lips says something else at which reason trembles." ఇలాంటి కవిత్వం దగ్గర మన కొలతలు

ఇమడవు. అందుకే ఒక మిత్రుడు ఒకసారి అన్నాడు: ఏమిటి. ఇదికూడా కవిత్వమేనా? "కుక్కిమంచం, కృష్ణుడు, పిల్లికూతలు. పిల్లనగ్రోవి" అని. ఈ విరుద్ధ ద్వంద్వాన్ని ఆయన చదివిన వేదాంతం సమన్వయించుకోలేకపోయింది. ఈ దేశానికి పుస్తక వేదాంతవిద్య పెట్టిన భిక్ష ఇది కాబోలు! మరొక మనీషి సత్యనారాయణగారు వ్రాసిన మంచి పుస్తకం ఇదొక్కటే అన్నారు. (రామాయణ సృష్టికర్త అని అంగీకరించలేక.) ఈ వాక్యాలకర్థం బహుశా పైన ఉదహరించిన శ్రీ అరవిందుల మాటలలో వుందనుకుంటాను కావ్య శిల్పాంగాలు లేకుండా సాహిత్యాన్ని విమర్శించడం తెలియక పడే ఇబ్బంది అనుభవంలో కనిపిస్తూనే వివరణ కందదు. ఇది శ్రీకృష్ణ సంగీతంలోని తమాషా. కాని, ఈ విమర్శకుడు చాలా చక్కగా కృతకృత్యుడైనాడని చెప్పక తప్పదు శృంగారవీధిని విమర్శించడం తీరు, అలాగే ప్రద్యుమ్నోదయాలకొలతలు శ్రీకృష్ణ సంగీతం దగ్గర కుదరవు. అసంలక్ష్యక్రమ వ్యంగ్యం దగ్గర అనుభవం ఉంటుంది తప్ప సంలక్ష్యక్రమ వ్యంగ్యం దగ్గరనున్న తర్కం వుండదు కనుక, విశ్వనాథ వారి కృష్ణ కావ్యాలలో శ్రీకృష్ణ సంగీతమొక ప్రత్యేకమైన ధోరణి.

రాధాతత్త్వాన్ని గూర్చి వివరిస్తూ ఈ విమర్శకుడు చెప్పిన విషయం చాలా హృదయ దఘ్నంగా ఉంది. (చూడు పుట 69.) స్త్రీలో శిశుభావన, భర్తృభావన ఈ రెండు ఒకదాని మీదొకటి ఆరోపితాలు కావడమన్న విచిత్ర మనస్తత్వం ఈ వివరణలో అగాధత్వం. గాథాసప్తశతిలో ఒక పద్యంలో ఈ మనస్తత్త్వం చాలా అద్భుతంగా చిత్రింపబడింది.

"పసివాడిపాలకు, పతిగాడి గోలకు
పడతి ద్రవించిన తీరు"

విశ్వనాథ వారు ఎర్రంచు నల్లచీర శృంగారవీధి నుండి కల్పవృక్షందాకా అల్లబడ్డ కవితా వస్త్రం- అది ఆంధ్ర సరస్వతి కర్పింపబడ్డ జరీఅంచు పట్టుచీర. 'వాణి' అన్న శబ్దనిరుక్తి 'వేసేది' అన్న విశ్వనాథవాణి ఈ ఎర్రంచు నల్లచీర ఈ సమస్త విశ్వం ఈశ్వరునకు వసనమైనట్లు (ఈశావ్యాసం) విశ్వనాథ వాఙ్మయ సర్వస్వం వాణీ స్వరూపం. భవభూతి తన వాక్కును 'మాతేవగంగే వచ-' అన్నాడు కదా! ఆ పవిత్ర వాక్తత్త్వాన్ని ఈ ప్రస్తుత గ్రంథం ఆవిష్కరిస్తున్నది. ఇదొక వాఙ్మయ తపస్సు. శ్రీరంగస్వామిగారు ఈ తపస్సును ముమ్ముందు ఇంకా పండించుకోగలరని అభిలషిస్తూ—

మలయకూటము,
శ్రీవెంకటేశ్వరపురం,
అనంతపురం. —డా॥ తుమ్మపూడి కోటేశ్వరరావు

# అభినందన

—జానమద్ది హనుమచ్ఛాస్త్రి

శ్రీమద్రామణ కల్పవృక్ష కావ్యస్రష్టగా సువిఖ్యాతులు, మహాకవి విశ్వనాథ సత్యనారాయణ గారు.

విభిన్న సాహిత్య ప్రక్రియల్లో తమదైన ప్రత్యేకతను నిక్షేపించిన ప్రాహ్మీమయమూర్తి శ్రీవిశ్వనాథవారు.

విశ్వనాథవారు కృష్ణతత్వ ప్రధానంగా రచించిన శృంగారవీధి, భ్రమర గీతలు, గోపికాగీతలు, ప్రద్యుమ్నోదయం, శ్రీకృష్ణ సంగీతం, మరికొన్ని శతకములను అధ్యయనమొనర్చి సిద్ధాంత గ్రంథముగా రూపొందించి కాకతీయ విశ్వవిద్యాలయం నుండి "డాక్టరేట్" పట్టము నందుకున్న సాహితీబంధు డా॥ శ్రీరంగస్వామిగారిని మనసారా అభినందిస్తున్నాను.

ఏకశిల వైతాళికులు, వరంగల్లు జిల్లా రచయితల వాఙ్మయ జీవిత సూచిక మున్నగు రచనల నెన్నిటినో, తమ "శ్రీలేఖ సాహితి" ద్వారా ప్రచురించిన సాహిత్యసముద్ధారకులు డా॥ శ్రీరంగస్వామి గారి సాహిత్యానురక్తి అనన్యమైనది.

డా॥ శ్రీరంగస్వామి గారిని వాగ్దేవి సర్వ శుభములతో అనుగ్రహింప వేడికోలు.

# 'గోకులాంగనా శ్రీరమణీయమార్గము'

## —కోవెల సంపత్కుమారాచార్య

శ్రీమద్రామాయణ కల్పవృక్షావతారికలో— 'మరల నిదేల రామాయణం బన్నచో....' అని ప్రశ్నవేసుకొని '....ఈ ప్రపంచకమెల్ల యెల్లవేళ దినుచున్న యన్నమే తినుచున్న దిన్నాళ్ళు, తన రుచి బ్రతుకులు తనవిగానే, చేసిన సంసారమే సేయుచున్నది. తనదైన యనుభూతి తనదిగాన....' అంటూ చివరకు '....తలచిన రామునే తలచెద నేనును, నా భక్తి రచనలు నావిగాన' అన్నారు సత్యనారాయణగారు. మరి, ఈ విధమయిన సమాధానం 'రామ కావ్యా'నికి మాదిరిగానే సత్యనారాయణగారి 'కృష్ణకావ్యా'లకు గూడా ఇంచుమించు, యథా తథంగా అనువర్తిస్తుంది. మరల గోపికాగీతాలూ, మరల భ్రమరగీతాలూ రచించటమెందుకు? అవి భాగవతంలో ఉండనే ఉన్నాయిగదా! 'తెలుగుల పుణ్య పేటి' పోతనగారు వాటిని మధుర మధురంగానే 'తెనుగుం జేసిరి'గదా!....అంటే, ఇందుకు - తలచిన కృష్ణునే తలచెద నేనును 'నా భక్తి రచనలు నావి గాన' అనేదే మరలా సమాధానం. సత్యనారాయణగారి భక్తి తీరూ, రచనలు తీరూ; ఆయన 'భక్తి రచన'ల తీరూ ఆయన స్వంతం. అది అనితర సామ్యం. ఆయన 'దర్శనం', ఆయన అనుభవం. తద్భావన, తదభివ్యక్తి - ఈ మొదలయినవన్నీ ఆయన రచనలను 'ఆయనవి'గానే మనకు సాక్షాత్కరింపజేస్తాయి. నిజానికి ఆయన సర్వరచనలూ - రామ/కృష్ణ కావ్యాలు మాత్రమే గాక - అన్నీ అంతే. ఈ రచనలు ప్రస్తుతం కాబట్టి వీటిని ప్రధానీకరించటం మాత్రమే. కాగా, వీటికి ఏవేవో పోలికలు తెచ్చి చూసుకోవటానికి ప్రయత్నం చేయటం వీటి తీవ్రత, గాఢత్వం అనుభవంలోకి తెచ్చుకొనేందుకు ఒక విధమయిన అభ్యాసం మాత్రమే.

శ్రీకృష్ణ భావనలో సత్యనారాయణ గారు 'ముక్తి త్రోవ' లందు - 'గోకులాంగనా శ్రీరమణీయ మధ్వము'ను దర్శించారు. ఆ అధ్వమును-మార్గాన్ని మాధవుని మారట రూపమయిన ముని - వ్యాసుడు 'సృష్టి యొనర్చె' నన్నారు

(పు 105) సత్యనారాయణగారు. వ్యాసుడు సృష్టించినా ఉన్నదట్లా ఉంచి, దాన్ని దర్శించింది మాత్రం సత్యనారాయణగారే. ఈ సంప్రదాయావిచ్ఛిన్నత కోసం ఆయన వ్యాసుని సంస్మరించారు - రామ కావ్యవిషయంలో వాల్మీకినివలె. ఒక విధంగా ఇది సత్యనారాయణోపజ్ఞకం. అపునన్నది 'శ్రీకృష్ణ సంగీతం'. వినగలిగితే అనుభవంలోకి వస్తుంది. శతప్రమితలయి గోకులాంగనల మధుర భావనా సంకలితమయిన మార్గాన్ని భావించటంలోనూ, లక్షించటంలోనూ అంతులేని ఆరాటంతో తదధ్వగామికావటంలోని ముక్తిత్రోవలలో దీని వైలక్షణ్యం స్పష్టపడుతుంది. నిజానికి స్పష్టపడటం, పడకపోవటం, స్పష్టపడటంలోని రకరకాల మేరలూ మన కౌతుకమూ, మన స్పందన శీలంలోని నైశిత్యానికీ సంబంధించినవి కాని, వీటితో ఆయనకు పనిలేదు.

ఇది మెచ్చెదరో, మెచ్చరో
ఇవియును జదివెదరు చదువ, రేలా నాక
య్యది? నా యెద మీతో రా
చెద నద్దానికి ఫలంబు చెందించు, శివా!

(రామా. బాల. కల్యాణ. 299) అంటూ ఆయన తనదైన మార్గంలో సాగిపోయినారు. ఇది రామ కావ్య విషయమయినా కృష్ణ కావ్య విషయమయినా - ఇంతే. ఆయన ఒక గోకులాంగన. 'ఒకసారి నాలోన నూహించి యేమియో, స్త్రీవోలె సిగ్గు పొందెదను నేను' (పు. 74) అన్న స్థితినుంచి గోకులాంగనగా సమగ్రంగా ఎదిగిపోయి —

గుంపులుగాగ పోవగను గోపకులాంగన, లందులోపలన్
వెంపరలాడి దొంగగ ప్రవేశము నందితి స్వీకరింతువో
గుంపును గుంపుగా నను చు, గొల్లవు, వేరివటంచు, లెక్కకుం
దింపకువే, వికుంఠపురి తెర్వుము ద్వారము, లాశితావనా!

(పు. 86) అంటారు. ఇదంతా ఏమిటి? శ్రీకృష్ణుడు గొల్లలగూడెం లోపలికి దొంగగా అవతరించాడు. వారితో కలిసిపోయినాడు. మరి అదే విధంగా ఆయన గూడా ఆ గోకులాంగనల గుంపులో దొంగగా ప్రవేశించాడు. మరి, ఆయనకో

లెక్కా, తనకో లెక్కనా? అందుకే లెక్కలలోకి దింవకుమనటం. బుద్ధిగా వైకుంఠపురీ ద్వారాలు తెరువుమనటం. తెరువకేం చేస్తాడు? ఆశ్రితావనుడికి తెరువక తప్పదు. ఇదంతా 'గోకులాంగనా శ్రీరమణీయాధ్వము'.

ఇంతకూ ఈ 'అధ్వ' స్వరూప స్వభావాలేమిటి? ఒక విధంగా చూస్తే, ఈ ప్రశ్న కిక్కడ ఆస్కారమేలేదు. గోపికలు పరమార్తితో సాగిసాగి పరమేశ్వరుడిని పొందిన 'కామ' భక్తి - మధుర భక్తి మార్గం 'కామోత్కంఠత గోపికల్....' హరిని పొందారని పోతనగారు అననే అన్నారు. ఆ విధంగా ఈ 'అధ్వ' మేమిటో స్పష్టపడుతూనే ఉంది. ఎందరో ఈ మార్గంలో సాగి కృతార్థులయినవారే. కాని, సత్యనారాయణగారు దర్శించిన మార్గాన్ని మరో కోణంలోనూ దర్శించే అవకాశం కలుగుతున్నది.

'గోకుల' మంటే, వాక్సమూహం. 'కుల' మంటే కుటుంబం, తెగ, సమూహం... ఇత్యాదిగా ప్రసిద్ధమే - 'శృంగార వీథి'లోని 'సాక్షాత్కార' ఖండికలో 'గోతతి' అంటే వాక్సమూహం, వాక్సమాజమనీ అర్థం భావించటమయింది. ఇక్కడ కూడా అదే విధం. ఈ సమూహం వట్టి 'గుంపు' కాదు. సమగ్రంగా ఊహితమయింది. కాగా, ఒకానొక విధమయిన పొందికగల పలుకుల కూడిక. మరి, 'గోకులాంగన' అంటే '....పలుకుల కూడికయనగ నొప్పు శారదామూర్తి' (రామా. బాల. అవ 25). మరి, ఆమె శోభచేత రమణము పొందదగిన - రమణీయ - మధురమార్గం. అంటే, కవితామార్గం.

'కవితా రూప తపస్సు చేసెదను శ్రీకంఠా! మనస్సంయమా
ది వికారమ్ముల చేతగాని తనమైతిన్, మూర్తి సంవిత్కలా
యువతీ భోగ! హరింప జేయుటకు మారోద్ధుంజుమీ; ఇంద్రియా
ది వికారంబులు భావనా విమల వాక్తీర్థంబులే పారగన్'

(రామా. అరణ్య. శబరి. 411.) అని సత్యనారాయణగారు చెప్పనే చెప్పినారు. ఈ 'కవితా రూప తపస్సూ' ఈ 'గోకులాంగనా శ్రీ రమణీయాధ్వ' యానమూ ఒకటే మనస్సంయమాది విధానాలుకాక, సర్వభావాలనూ పరమేశ్వరుడియందు పర్యవసింప జేయటం ఈ మార్గంలోని విశిష్టమయిన విధానం. పరమేశ్వరుడు

సర్వభావమయుడు, సర్వరసమయుడు, సర్వక్రియా లక్ష్యమూర్తి. 'ఉదాహరణ' కావ్య పరమార్థ భావనలో సత్యనారాయణగారు ఈ అంశాన్ని స్పష్టీకరించారు. 'జగత్తంతయు క్రియారూపము సర్వక్రియలును పరమేశ్వరునందు పర్యవసించును. ధాతువు సర్వదా విభక్త్యాశ్రయము. ఏ విభక్తితోను సంబంధము లేక క్రియలేదు. అందుచేత నన్ని విభక్తులతో పరమేశ్వరుని చెప్పునప్పుడు భగవంతుడు సర్వక్రియాస్థానభూతుడని వ్యంగ్యము' అన్నారాయన. (సత్యనారాయణగారి 'ఉదాహరణ' కావ్యం—'గోపాలోదాహరణము' ఈ కృష్ణ కావ్యాలలో చేరి ఉండవలసిందనిపిస్తుంది.) కాగా, ఈ కవితా మార్గంలో అన్వయించరాని భావమంటూ క్రియకలాపమంటూ ఏవీ ఉండదు. ఇవన్నీ కవితాసంభారాలే.

సర్వో నిర్గతమైన సర్వకవితా సంభారమున్ నీకు నై
వేద్యం బిచ్చితి, రామచంద్ర! ప్రభువా! విశ్వాసముం బూనవే,
అద్యంబై చను జీవ లక్షణము సంహారంబు గావింపవే;
హృద్యంబై చను నీదు తేజమును సారింపంగదే; గుండియన్.

(యుద్ధ. ఉపసంహరణ. 412) అని సత్యనారాయణగారు శ్రీరామచంద్రునికి విన్నవించుకొన్నారు. 'గోకులాంగనా శ్రీరమణీయాధ్వ' మందు గూడా ముందుకు సాగి శ్రీవికుంఠపురీ ద్వారాలు తెరువుమని శ్రీకృష్ణుడిని ప్రార్థించారు. శ్రీరామచంద్రుడినీ శివునీ అభిన్నంగా భావించి శివుని 'తుది జన్మగ చేయుము దీని; ధూర్జటీ!' అని ఆక్రోశించారు. (రామా. యుద్ధ. ఉప. 413) ఈ విధంగా శివరామకృష్ణమయ భావనా భావితాత్ముడాయన, అదట్లా ఉండగా—

గోకులాంగన సరస్వతి, ఆమెతో శ్రీదేవి. పరిశేషన్యాయంగా రమణి పార్వతి అవుతూనే ఉంది. పరిశేషన్యాయ మనటం గూడా అక్కరలేదేమో! లలితా సహస్రనామాల ప్రకారం రమణి లలితాదేవి. కాగా, గోకులాంగనా శ్రీ రమణులు శ్రీవాణీగిరిజామయత్వాన్ని స్పందింపజేస్తున్నారు. 'గోకులాంగనా శ్రీ రమణీయమయిన అధ్వం'...శక్తిత్రయ సంవలితం. ఈ విధంగా భావిస్తే - ఈ శక్తి శక్తిత్రయీ మధుర విలసనం సత్యనారాయణగారి కావ్య 'దర్శన'మందంతటా పరిస్పందితమవుతూనే ఉన్నది వామేతరోపాసనా సర్వస్వం సత్యనారాయణగారి దర్శనంలో అద్భుతమయిన సమన్వయం సాధించటం ఆయన జీవుని వేదనా

ప్రసార వైలక్షణ్యం. అందుకే, సత్యనారాయణగారి శ్రీమద్రామాయణ కల్ప వృక్షంలో ఈ కృష్ణకావ్య వల్లరిని అనుసంధించుకొని వేదనా మాధుర్య తీవ్రతా గాఢతలను అనుభవంలోకి ప్రవహింపజేసుకోవలసి ఉంటుంది. అందువల్లనే—

శ్రీ జయదేవ 'సంస్మృతి శ్రీ విభవాస్పదంబయిన చిత్తముతో' ఈ 'శృంగార వీధి'లో సాగగా, శ్రీకృష్ణ సంగీతం ఒక బంభరీ నినాదంగా అంతః కరణంలో మ్రోగినప్పుడు ఈ కృష్ణకావ్యాల సౌందర్యం సువ్యక్తమవుతుంది. అందుకని సత్యనారాయణగారి కృష్ణ కావ్యాల అధ్యయనం, అనుభవం అవసరమ వుతున్నది. వ్యక్తావ్యక్తంగా ఈ అవసరం కలిగించిన ప్రేరణతో చిరంజీవి శ్రీ రంగస్వామి ఈ అధ్యయనంలోకి దిగాడు.

కృష్ణకావ్యాల్లో ఒక్కొక్కటీ ప్రత్యేక ప్రత్యేకంగా అధ్యయనం చేయవల సిన లోతులూ, విస్తృతులూ కలిగి ఉన్నది. లోతులకు పోయినా కొద్దీ, వ్యక్త మయ్యే, స్ఫురించే వివిధాంశాలను గమనిస్తూంటే వాటిని వివరించటం కోసమయిన శక్తి సామర్థ్యాలను గూర్చి భయం కలుగుతూ ఉంటుంది. శ్రీరంగస్వామి వెలువ రిస్తున్న ఈ అధ్యయనాన్ని చూస్తుంటే ఆ భయంతోపాటు భక్తిగూడా అడు గడుగునా పరిస్ఫుటమవుతూనే ఉన్నాయి. ఇది ఆ కావ్యాల అగాధత్వాన్నీ ఉన్న తత్వాన్నీ సూచిస్తుందే తప్ప అధ్యేత యొక్క భయాన్ని ఒక లోపంగా సూచించదు. శ్రీరంగస్వామి మొదట పి హెచ్ డి కోసమని ఈ కృష్ణకావ్యా లను 'విషయంగా'గా ఎన్నుకొన్నా గూడా, క్రమక్రమంగా విషయంలో తన్మ యత్వం పొందిన జాడలుగూడ ఈ రచనలో కన్పిస్తాయి.

ఇంత చేసాక, మొత్తం కృష్ణ కావ్యాలు కాక, పి.హెచ్. డి. కోసం ఏదో ఒక కావ్యాన్ని తీసుకుంటే బాగుండేదేమోననే దశ ఏర్పడ్డట్టు గూడా కన్పిస్తుంది. ఈ విధంగా చూస్తుంటే ఒక 'శ్రీకృష్ణదేవుని నిర్వేదము' చాలు నన్పిస్తుంది. నాకు అందినంతవరకు ఈ విధమయిన కావ్యం తెలుగులోనే కాదు, మరే భాషా కావ్య ప్రపంచంలోనూ కన్పించదు. మరి, అట్లాంటిది ఈ అధ్య యనంలో ఒక చిన్న 'భాగం'గానే ఉండిపోయింది. ఈ విధంగా చూస్తుంటే, ఈ అధ్యయనం యొక్క పరిమితులు తెలుస్తూనే ఉన్నాయి. ఈ దృష్ట్యా ఈ అధ్యయన రచనలోని సంగ్రహ లక్షణాన్నీ, వేగాన్నీ సరిగానే అర్థం చేసుకో వచ్చు.

ఈ అధ్యయన సందర్భంగా శ్రీరంగస్వామి తన సాహిత్య పరిధిని విస్తృతపరచుకొన్నందుకూ, అభ్యాస పూర్వకంగా రచనలో ఒకానొక సౌమ్యమయిన సౌలభ్యం సంపాదించుకొన్నందుకు మనఃపూర్వకంగా ఆయనను అభినందిస్తున్నాను. ఈ అధ్యయనంలో రుచి, అనుభూతి దొరికినాయి కాబట్టి ఇక దొరికిన దారిలో ముందుకు నిరంతరాయంగా సాగుతూనే ఉంటాడనే విశ్వాసమూ నాకు ఉంది. అయితే, ఆ విధంగా సాగటానికి తగిన అవకాశం ఆయనకు లభించాలని ఆశిస్తున్నాను.

ఇది సత్యనారాయణగారి శత జయంతి సంవత్సరారంభం. ఈ ఆరంభ శుభసందర్భాన ఆ మహానుభావుని సాహిత్య సరస్వతికి ఎత్తిన నీరాజనం ఈ 'కృష్ణకావ్యాలు' అధ్యయనం ప్రచురణ. శ్రీరంగస్వామి ఉచితజ్ఞతని మరోసారి అభినందిస్తూ-

ఆశీస్సులతో—

15-9-64 రామన్న పేట
వరంగల్లు - 506002.

—సంపత్కుమారాచార్య

# వినతి

పోతనగారు తెలుగులో భాగవతం ఆరంభిస్తూ భాగవత రచన "తన పురాకృత శుభాధిక్య" మన్నారు. అ విధంగానే విశ్వనాథ వారి కృష్ణ కావ్యాలను పరిశోధన నిమిత్తం వాటిని అధ్యయనం చేస్తున్నప్పుడు, వ్రాస్తున్నప్పుడు అది "నా పురాకృత శుభాధిక్యమే అనిపిస్తుండేది. నాకు విశ్వనాథ స్వరూపాన్ని, కృష్ణ కావ్యాల రహస్యాన్ని, కృష్ణ తత్త్వమును అక్షర ప్రత్యక్షరం ఈ భౌమ పరిధులను అతిక్రమించి ఉపదేశించిన మదీయ గురుపాదులు శ్రీమాన్ కోవెల సంపత్కుమారాచార్యులు గారికి కృతజ్ఞతలు ఏమని చెప్పాలి!?

కాకతీయ విశ్వవిద్యాలయంలో పిహెచ్.డి. లో చేరడానికి కారకులు, ప్రోత్సాహకులు మాత్రమే కాక నా కృషి పూర్తయ్యేదాకా సలహాలతో వెన్ను తట్టినవారు ఆచార్య కోవెల సుప్రసన్నాచార్యులుగారు. వారికి నా హృదయాంజలి.

నా పరిశోధనను గురించి ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ, హెచ్చరిస్తూ, కర్తవ్యాన్ని మరువనీయనివారు మా అమ్మా. బాపులు - శ్రీమతి తాయారమ్మ, రామానుజ స్వామిగార్లు. ఈ కృషిలోపడ్డ నావలన ఇబ్బందులు పడుతూనే అన్ని విధాలుగ సహకరించినది నా శ్రీమతి శ్రీలక్ష్మి. నా పరిశోధన వ్యాసంగానికి అనేక విధాలుగా సహకరించిన ప్రత్యక్ష మిత్రుల్లో శ్రీ బి. జనార్దన్ గారు చెప్పుకోదగిన వారు.

నా సాహిత్య కృషిని ప్రోత్సహించే చిరకాల మిత్రులు ఆశావాది ప్రకాశ రావు, జానుమద్ది హనుమచ్ఛాస్త్రి, ఆచార్య తిరుమల గారలు.

కొందరు మిత్రులుంటారు. వారు మనకు చాలా ఆత్మీయులు. సహృదయత సౌమనస్య లక్షణం సాగుతుంటుంది. వారికి మనకు ప్రత్యక్ష పరిచయం ఉండదు. అయినా, మన కదలికలను ఎప్పటికప్పుడు వారు గమనిస్తూనే ఉంటారు. మనపట్ల వారలు ఎప్పుడూ ఆర్ద్రితను, భవిష్యత్ సాఫల్యాన్ని ఆశిస్తుంటారు. అలాంటి మిత్రులను కలిగిన నేను ఎంతో ధన్యుణ్ణి. వారికి నా కృతజ్ఞతాంజలులు.

నా ఈ గ్రంథ ప్రచురణకు ఆర్థిక సహకారాన్ని అందించిన తిరుమ లేశునికి - తిరుమల తిరుపతి దేవస్థానం కౌన్సిల్ వారికి కృతజ్ఞతలు.

ఈ సిద్ధాంత వ్యాసానికి శుద్ధప్రతి సిద్ధం చేసిన శేషుకు ఆశీస్సులు. స్వల్ప వ్యవధిలో ముద్రించిన పద్మావతి ప్రింటింగ్ ప్రెస్ సిబ్బందికి, ప్రెస్ అధినేత శ్రీ శ్రీనివాస్‌గౌడ్ గారికి కృతజ్ఞతలు. ముఖచిత్రాన్ని అందించిన శ్రీ ప్రస్వాజికి కృతజ్ఞతలు.

ఈ పుస్తకానికి అడిగిన వెంటనే తమ అభిప్రాయాలను అందించిన శ్రీ జువ్వాడి గౌతమరావుగారికి నమోవాకములు. విలక్షణంగా పరీక్షించిన శ్రీ తుమ్మపూడి కోటేశ్వరరావుగారికి సవినయ ప్రణతులు. నిరంతరం నామీద అవ్యాజానురాగమును చూపిస్తున్న శ్రీమాన్ కోవెల సుప్రసన్నాచార్యులు, శ్రీమాన్ సంపత్కుమారాచార్యులగార్లు తమ అభిప్రాయముల ద్వారా ఆశీర్వ దించినందులకు కైమోడ్పులు. స్నేహ హస్తాన్ని అందించిన శ్రీ జానుమద్ది హనుమచ్ఛాస్త్రిగారికి నమస్సులు.

ప్రత్యక్షంగా, పరోక్షంగా వేరువేరు రీతులలో సహకరించిన మిత్రు లందరికి నా అభివందనలు. పెద్దలకు వందనాలు.

—టి. శ్రీరంగస్వామి

# మొదటి అధ్యాయం

# అవతారిక

ఈ శతాబ్దం పూర్వోత్తరార్థాలలో వ్యాపించి దాదాపు 60 సం॥లు తెలుగు సాహిత్యంలో అద్వితీయంగా వెలుగొందిన అనన్య ప్రతిభాశాలి విశ్వనాథ సత్యనారాయణగారు. ఆయన సృష్టించిన సాహిత్య ప్రపంచం అతి విశాలమైంది. సహస్ర ముఖాలుగా విశ్వరూప సందర్శనం చేయించింది. సాహిత్యాన్నంతా గద్య పద్య భేదంతో రెండుగా విభజించినా, ఆ రెండింటిలోనూ వివిధ ప్రక్రియల దృష్టితో చూసినా ఆయన సాహిత్యం యొక్క బహుముఖీనత దర్శనమిస్తుంది. సాహిత్యంలో సత్యనారాయణగారు చేపట్టని ప్రక్రియ లేదని, పట్టి బంగారం కావించని ప్రక్రియ కూడా లేదనేది వాస్తవికంగా ఆయన విషయంలో యదార్థమైన "లోకవార్త"1 అయింది. ముక్తకం నుంచి మహా కావ్యం దాకా, వాక్చిత్రం నుంచి నవలేతిహాసం దాకా పద్య గద్య విధానాల్లో ఆయన సృష్టించిన రచనలు ఏ ఒక్కటీ మరొక దానివలె కాక స్వయం వ్యక్తిత్వంతో స్వతంత్రంగా వ్యవహరిస్తాయి. ఆయన రచనలలో ఏ ఒక్కటి కూడా వినోదానికి కాదని, ప్రతిదీ ఏదో ఒక మౌలిక ప్రయోజనానికి అనుసంధింపబడి ఉంటుందనేది ఆయన సాహిత్యాధ్యయనం చేసిన సహృదయులందరికీ కొత్త విషయమేమీకాదు.

భాషా దృష్టితో ఆయన సృష్టించిన సాహిత్యమంతా తెలుగు భాషకే పరిమితమైనా కూడా తన సాహిత్యంలో చిత్రించిన మానవ జీవితం, అందులోని అనేక విధాలైన సంఘర్షణలు, భౌతిక, వైజ్ఞానిక, మానసిక, ఆధ్యాత్మిక ప్రవృత్తులు, వాటిలోని వైవిధ్యం, స్థాయీ భేదం మొదలైన అంశాలన్నీ దేశ భాషా పరిమితులను దాటి సమస్త విశ్వాన్ని సమావరించుకున్నవి. ఇంతటి వైవిధ్యంగల సాహిత్యం- అసాధారణమైన, అనన్యమైన రచనా విధానం మరొకచోట కనిపించదు. ఏవో ఊహా - అపోహల మీద కాకుండా ఆయన రచించిన ప్రతిదీ ఆయన

అనుభవంలో నుంచి, అనుభవ భావనల నుంచి వచ్చినవి మాత్రమే. జీవితంలోని కలిమిలేములు; ఉదాత్తత్వ - అనుదాత్తత్వాలు; కష్ట-సుఖాలు - ఈ విధంగా ఎన్నెన్నో ఆయన అనుభవంలోని విషయాలు. పల్లెల జీవితం, నాగరిక జీవితం ఆయన రచనలలో వాస్తవికంగా పొందిన చిత్రణ ఆయన అనుభవంలో నుంచి సాగినదే. జీవితాన్ని అన్నివిధాలుగా నిండుగా అనుభవించినవాడు మాత్రమే మహా రచయిత, మహాకవి అవుతాడనే సూక్తికి తెలుగులో ప్రత్యక్ష నిదర్శనం సత్యనారాయణగారు. అనుభవం అనేది ఆయనకు ఉపరితలాల వరకే పరిమితం కాదు; మూలాలవరకు చేరుకొనేది; చాలా గాఢమైనది. అందుకే ఆయన రచనల్లో వ్యక్తీకరించే భావాలకు, చిత్రీకరించే సన్నివేశాలకు, రూపొందించే పాత్రలకు అంతటి సజీవత్వము బలము సమకూరినాయి. ఆయన అనుభవ విధానం ఎంత లోతైనదో ఎంత గాఢమైనదో ఆయన ప్రతిభ అంత ఉత్తాలమైనది, అంత తీవ్రమైనది. ఆయనను కృష్ణశాస్త్రిగారు "గాఢ ప్రతిభుడు"[2] అని ప్రకటించి నారు. ఈ 'గాఢప్రతిభుడు.' అన్నది నన్నయగారి గురించి శ్రీనాథుడు భక్తితో ఉపయోగించిన విశేషణము.

"నెట్టుకొని గొల్తు నన్నయ
భట్టోపాధ్యాయ సార్వభౌముఁ గవితా
పట్టాభిషిక్తు భారత
ఘట్టోల్లంఘన పటిష్ఠ గాఢప్రతిభున్"[3] - అంటాడు శ్రీనాథుడు. సత్యనారాయణగారు భారతీయ సాహిత్య ఘట్టోల్లంఘన పటిష్ఠ గాఢప్రతిభుడు.

నన్నయగారి నుండి తన దాకా సాగివచ్చిన తెలుగు సాహిత్యంలోని అన్ని విధాల మర్మాలు, ఒడుపులు ఆయనలో రంగరించుకున్నాయి. వ్యాస, వాల్మీకి, కాళిదాసాది మహా కవుల విశిష్టతలు ఆయన ప్రతిభను మరింత పదును బెట్టినవి. దీనికి తోడు భారతీయ విజ్ఞానము, ఆధునిక సాహిత్య ప్రపంచములో అనన్య సాధ్యుడుగా సమకాలీనులు అందుకోలేని ఎత్తులలో ఆయనను నిలబెట్టి నాయి. ఆయన స్వస్వరూప విజ్ఞానం కలవాడు. అందుకే నిస్సంకోచంగా "ప్రోవౌ సర్వ కవిత్వ మర్మ విదుడ"నని ఆయన తనను ప్రకటించుకోగలిగినారు. తన "సకలోహ వైభవ సనాథ"మైన శ్రీమద్రామాయణ కల్ప వృక్షమును గూర్చి—

"ఎదకు పురాంధ్ర సంస్కృత కవీశ్వర భారతి దీప్తి కల్గినన్
సదమలబుద్ధికిన్ బహుళశాస్త్ర రహస్య వివేకమబ్బినన్
మదికి నుదాత్త కల్పనల మక్కువ కల్గిన విశ్వనాథ శా
రద సకలార్థదాయిని సురద్రుమ రామకథన్ భజింపుమీ"4 అన్నది కేవలం రామాయణ కల్పవృక్షానికి మాత్రమే పరిమితం కాదు; ఆయన సృష్టించిన సాహిత్య ప్రపంచానికంతటికీ విస్తరించేదే.

సత్యనారాయణగారు కేవలం కవి మాత్రమే కాదు; ఆయన గొప్ప విమర్శకుడు కూడా. తన విమర్శ విధానం ద్వారా కాళిదాసు, నన్నయ మొదలైన సంస్కృతాంధ్ర మహాకవుల కావ్యాలను అనుశీలించి, అనుభవించవలసిన తీరు తెన్నులను విన్నూతంగా సమకాలీన సాహిత్య లోకానికి విశదం చేసినారు. ఆ తీరు ఆయన సాహిత్యాన్ని కూడా సహృదయులు అనుశీలించడానికి మార్గదర్శక మైనది. కాగా, సాహిత్య సృజనకు మాత్రమే కాకుండా, తన సాహిత్య పాఠకులను కూడా ఆయన సృష్టించుకున్నారు. మల్లంపల్లి శరభయ్యగారన్నట్లు—

"మహాకవుల వాక్కునకు రెండు శక్తులుంటాయి. మహాకావ్యాలను ప్రభవించే శక్తి ఒకటి. తన జీవ సంపుటిలోని రసధర్మానికి సగంధులైన భావుకుల్ని సృష్టించే శక్తి ఒకటి. మొదటిదానికన్నా రెండవది ముఖ్యమైనది. కావ్యముల జీవితము దానిమీదనే ఆధారపడి ఉంటుంది కాబట్టి."5

సత్యనారాయణగారు రచనలలోని ఈ రెండు శక్తులు సమర్థంగా పని చేసినవి. అందుకే ఆయన సాహిత్యం సహృదయులను నిరంతరము స్పందింప చేస్తూనే ఉన్నది. "క్షణే క్షణే యన్నవతాముపైతి, తదేవరూపం రమణీయ తాయాః"6 అన్న రమణీయ సూత్రానికి లక్ష్యభూతంగా ఎప్పటికప్పుడు వినూత్నంగా దర్శనమిస్తూనే ఉన్నది.

సత్యనారాయణగారి సాహిత్య ప్రపంచంలో అటు శ్రీమద్రామాయణ కల్పవృక్షము, ఇటు వేయి పడగలు శిఖరాయమాణంగా ప్రసిద్ధమైనవి. అయితే, ఇవే కాకుండా ఆయన రచించిన కావ్యాలు, రచనలు పరిమాణంలో చిన్నవి

పెద్దవి అయినా, కావ్యత్వ దృష్ట్యా అసాధారణమైనవి అనేకంగా ఉన్నాయి. గిరికుమారుని ప్రేమ గీతాలు, శశిదూతము మొదలైన కావ్యాలు; ఝాన్సీరాణి, శివార్పణము వంటి కావ్యాలు; శ్రీకుమారాభ్యుదయము, ఋతు సంహారము, కిన్నెరసాని పాటలు వంటివి.... ఈ విధంగా వస్తురూప రసభావ వైవిధ్యం కల కావ్యాలు ఎన్నో ఉన్నాయి. ఇన్నింటిలో ఒక సముచ్చయంగా గుర్తింపదగినవి కృష్ణ కావ్యాలు-కృష్ణ విషయ ప్రధానమైన కావ్యాలు. ఇవి ప్రధానంగా అయిదు.

శృంగార వీథి
భ్రమర గీతలు
గోపికా గీతలు
ప్రద్యుమ్నోదయం
శ్రీకృష్ణ సంగీతం

వీటితోపాటు చెప్పుకోదగిన మరి రెండు రచనలు –

నందమూరు శతకం
మున్నంగి శతకం

ఈ రెండు "విశ్వనాథ మధ్యాక్కరలు" అన్న శతక సముచ్చయంలో ఏడవ, తొమ్మిదవ శతకాలుగా ఉన్నాయి. వీటి విషయం వేణుగోపాలుడు.

తెలుగులో స్పష్టమైన విభజన లేదు కాని, హిందీ సాహిత్యంలో రామభక్తి శాఖ, కృష్ణభక్తిశాఖ అని రెండు శాఖలుగా భక్తి సాహిత్యం ప్రవర్తించింది. సాధారణంగా కృష్ణభక్తి శాఖకు చెందిన కవులు, శ్రీరామచంద్ర ప్రధానంగా కావ్యాలు రచించటం కాని, రామభక్తి శాఖకు చెందిన కవులు శ్రీకృష్ణపరమైన కావ్యాలు రచించడం గాని కనిపించదు. సూరదాసు మొదలైనవారు కృష్ణభక్తి శాఖకు చెందినవారు కాగా, తులసీదాసు మొదలైనవారు రామభక్తి సాహిత్య శాఖకు చెందినవారు. అయితే, ఈ ఉభయ కవులలో వైరుధ్యంకాని వైమనస్యం కాని ఉన్నదని కాదు. భగవంతుని వివిధ రూపాలలో, అవతారాలలో ఒక్కొక్క దానియందు ఒక్కొక్కరికి మనస్సు నిష్ఠం కావడంవల్లనే దానిదానికి ప్రాధాన్యం తప్ప, భగవదవతారాలన్నీ అందరికీ సేవనీయమయినవే.

సత్యనారాయణగారి సాహిత్యంలో ఆధ్యాత్మిక ప్రవృత్తికి సంబంధించిన కావ్యాలు ఆయనలోని ఆ ప్రవృత్తికి ప్రతిబింబాలు. ఈ కావ్యాలను అనుశీలిస్తే సత్యనారాయణగారి ఆధ్యాత్మిక ప్రవృత్తి వైలక్షణ్యం, అనుభవ గాఢత్వం వ్యక్త మవుతాయి. అటు శ్రీమద్రామాయణ కల్పవృక్షము వంటి శ్రీరామచంద్ర విషయమైన మహాకావ్యం, ఇటు కృష్ణ కావ్యాలు, మరొకవైపు 'శివసాహస్రి' వంటి శివ ప్రాధాన్యం గల వివిధ రచనలు, దేవీ త్రిశతి వంటి శక్తి ప్రధాన రచనలు ఆయన ఆధ్యాత్మిక ప్రవృత్తిలోని అద్భుతమైన సమన్వయ లక్షణాన్ని వ్యక్తీకరిస్తాయి. వీరందరూ ఆయన ఆధ్యాత్మిక జీవితాన్ని పరిపాలించినట్లు కనిపిస్తుంది. వీరి నామరూప వైవిధ్యంలో తాత్త్వికమైన ఏకత్వం ఆయనకు ఆత్మనిష్ఠమైన విషయము. వేయిపడగల రచన నాటినుంచి ఆయనలోని భక్తి లక్షణం అనుస్యూతంగా ఆయన సాహిత్యంలో ప్రవహిస్తూనే వస్తున్నది. "వేయి పడగలు"లో గిరికాదేవి కథ ఈ అంశానికి ప్రథమోదాహరణ. జ్ఞానయోగులకు శివుడు ఉపాస్యదైవమని, భక్తియోగులకు కృష్ణుడు ఉపాస్యదైవమని ఒక నిర్ణయం[7] అందులో చేయబడింది. క్రమంగా అక్కడినుండి ఆయన సాహిత్యాన్ని అనుశీలిస్తూ వస్తే, ఈ రెండు యోగాల సమన్వయం సమగ్రమైన ఉజ్జ్వలమైన భక్తిగా అభివ్యక్తమవుతుంది.[8] కవితా వైభవాది విషయాలు, ధార్మిక, సామాజికాద్యనేకాంశాలు గల ఈ కావ్యాలలో ఒక మహాభక్తుని వ్యక్తిత్వంతో ఆయన మనకు దర్శనమిస్తారు.[9]

సత్యనారాయణగారి భక్తి రచనలలో శ్రీరామచంద్ర పరమైన రచనల తరువాత కృష్ణపరమైన రచనలే అధికంగా కనిపిస్తాయి. శ్రీరామచంద్రుని విషయంలో శ్రీమద్రామాయణ కల్పవృక్షమే ప్రముఖమైనది. కాని, కృష్ణ విషయంలో ప్రత్యేకంగా పేర్కొనబడిన కృష్ణ కావ్యాలే కాక అనేక సందర్భాలలో కృష్ణ ప్రాధాన్యం ప్రముఖంగా కనిపిస్తుంది. ఆయన నవలల్లో కృష్ణ ప్రస్తావన గల సందర్భాలు అనేకం. పురాణవైరగ్రంథమాల నవలలన్నీ కృష్ణతత్త్వం భూమికగా సాగినవే. నేపాళ, కాశ్మీర నవలలకు కూడా భూమికగా కృష్ణప్రాధాన్యం కనిపిస్తుంది. గుప్త పాశుపతమ్- తెలుగులో, సంస్కృతంలోనూ ఆయన రచించిన ఆ నాటకానికి మూలం కృష్ణతత్వమే. "జాగ్రదవస్థ నేమియన స్వప్న సుషుప్తులంగూడ రామనాము గ్రహణంబె నా వయిన మానస

జిహ్వాలు చేయు" అనీ; "నీలగళా! రఘూత్తముఁడు నీవును నిద్దురుకొని యట్లుగా నోలి భజించితిన్, మరియు నున్న దినంబులు నట్లచేసెదన్ వ్రాలెడు మేనుదాక" అనీ—

"కలవొక కొన్ని వేళలు నికామ భవత్పదచింతనానలో
జ్జ్వలిత శిఖాసనాథములు స్వామి! ననున్ మృతిఁబొంద నీవె యు
జ్జ్వలమగు తన్నిమేషమున జన్మయి కొక్కఁడు లేకయుండ వి
హ్వల కరణాభితప్తమయినట్టి జనుస్సులు చాలు ధూర్జటీ!"10

అని శ్రీరామచంద్రునికి శివునికి అభేదాన్ని పాటించిన సత్యనారాయణగారు కృష్ణ కావ్యాలలోను ఆ ఇద్దరినీ శ్రీకృష్ణునిలో విలీనం చేసినట్లు కనిపిస్తుంది. శ్రీకృష్ణ విషయం ఎక్కడ ప్రసక్తమైనా పరవశించే తీరు సర్వత్రా గోచరిస్తుంది. "దిండు కింది పోకచెక్క" అన్న నవలలో "బాలాయ నీల వపుషే"11 పద్య భావాన్ని సాక్షాత్కరించుకున్న తీరు ఇందుకు ఒక చిన్న ఉదాహరణ. ఆ నవలలోనే ఒక ప్రధాన పాత్ర అయిన గోస్వామి మాటలుగా—

"నేను పనిషద్వాదిని. కాని ఆ ఉపనిషదర్థమంతయు
నా మనస్సులో, నా ఆత్మలో శ్రీకృష్ణదేవుడుగా
తాండవించుచున్నాడు. భగవంతుడైన శ్రీకృష్ణుడు నాకు బహు
విషయములను స్ఫురింపచేయుచున్నాడు"12

అని అంటారు. గోపికా గీతలు, భ్రమర గీతలు దగ్గరకు వచ్చేసరికి ఒక గోదా దేవివలె, ఒక మీరాదేవివలె తానే ఒక గోపికగా మారిపోతారు సత్యనారాయణ గారు.

శ్రీకృష్ణతత్త్వము అతివిచిత్రమైనది. జ్ఞాన-భక్తులు రెండింటికి అది స్థానము. శ్రీరామచంద్రుని గూర్చి "పుంసాం మోహన రూపాయ" అని చెప్పబడుతున్నది. కాని, శ్రీకృష్ణుని మోహనతత్త్వము మిక్కిలి విలక్షణమైనది. సృష్టిలోని సౌందర్యాని కంతటికీ శ్రీకృష్ణుడు ప్రతీక. కావ్యం రససౌందర్యమయమైనట్లు శ్రీకృష్ణ తత్త్వం జ్ఞానసౌందర్యమయమైనది. సగుణ, నిర్గుణత్వాలు రెండూ ఆయనలో భక్తులకు సమన్వయం సాధించినాయి. అందువల్లనే జయదేవ, బిల్వమంగళా

దులు గీతగోవింద కృష్ణకర్ణామృతాదులలో శ్రీకృష్ణతత్త్వాన్ని సౌందర్యమహితంగా తీర్చిదిద్దినారు. భాగవతం దశమ స్కంధం ఈ మార్గంలో పరకాష్ఠ దశ చేరుకొన్నది.

సత్యనారాయణగారిని భాగవతం సమగ్రంగా లోగొన్నది. పూర్వకవులను స్మరిస్తూ రామాయణ కల్పవృక్షంలో చేర్చబడిన "ఋషివంటి నన్నయ రెండవ వాల్మీకి" అన్న పద్యంలో ప్రతి కవికి కవితా సంబంధమైన ఏదో ఒక విశేషం అనుసంధింపబడింది. కాని, పోతన్నగారి విషయంలో "పోతన్న తెలుగుల పుణ్యపేటి" అని మాత్రమే చెప్పబడింది. శ్రీ మద్రామాయణ కల్పవృక్షం "శ్రీమంజూషిక........" అంటూ ప్రారంభమవుతుంది. మంజూషిక అంటే పెట్టె అని అర్థం. పోతన్నగారిని గూర్చిన విశేషణం శ్రీ మంజూషికను స్ఫురింప చేస్తుంది. పోతన తెలుగువారి పుణ్యపేటి కావటం తెలుగువారి భక్తి సౌందర్యాన్నంతా భాగవత రూపములో ప్రవహింప చేయటమే. ఆ ప్రవాహం ఒక భక్తి భాగీరథి.

సత్యనారాయణగారు కృష్ణపరంగా రచించిన తొలికావ్య సంకలనం శృంగార వీధి. ఆ తరువాత దాదాపు ముప్పయేళ్ళకు కృష్ణ ప్రధానంగా రచింపబడింది "భ్రమర గీతలు." "భ్రమర గీతలు, గోపికా గీతలు, ప్రద్యుమ్నోదయం" - ఈ మూడింటి విషయ వస్తువు భాగవతంలో నుంచి అన్వయించుకోబడిందే. శ్రీకృష్ణ సంగీతంలోని వస్తువు కచ్చితంగా భాగవతంలో ఒకచోట కనిపించకపోయినా దాని ప్రవృత్తి భాగవతపు ప్రవృత్తియే. శృంగార వీధి లోని "శృంగార వీధి, కృష్ణదేవుని నిర్వేదము" అనే రెండు విలక్షణమైన కావ్యాలు. అవిగాక "ప్రాతః స్తవము, బ్రహ్మగీతము" మొదలైనవన్నీ భాగవతంలోని విషయాలే. శృంగార వీధిలోని రాధాప్రసక్తి భాగవతంలో కనిపించకపోయినా, రాధ కూడా ఒక గోపికయే కాబట్టి గోపికా పరత్వంవల్ల, దానికి కూడా భాగవతమే భూమిక. కృష్ణదేవుని నిర్వేదములో శ్రీకృష్ణుని పరబ్రహ్మ తత్త్వాన్ని ఆవిష్కరింపచేయటం బట్టి భాగవతంలో గూడా శ్రీకృష్ణుని పరబ్రహ్మత్వం దృష్ట్యా - ఉదాహరణకు —

"నీవు యశోద బిడ్డడవె నీరజనేత్ర! సమస్త జంతుచే
తో విదితాత్మ వీవడవు తొల్లి విరించి తలంచి లోకర
క్షావిధ మాచరింపుమని సన్నుతి సేయఁగ సత్కులంబునన్
భూవలయంబుఁ గావనిటు పుట్టితిగాదె మనోహరాకృతిన్"

(ఆ.మ.భాగ - 10 - 1042)

—భాగవత భూమిక కలదికానే భావించవచ్చు. "శ్రీకృష్ణదేవుని నిర్వేదం" లోని వస్తు నిర్వహణ మాత్రం భాగవత పద్ధతికన్న విలక్షణమైనది.

ఈ విధంగా సత్యనారాయణగారి కృష్ణ కావ్యాలన్నీ భాగవత మూలకాలు కావటంవల్ల సత్యనారాయణగారు ఈ మొత్తం కావ్యాలను "భాగవత భాగీరథి" అని సంకేతించాలనుకొన్నట్లు కనిపిస్తుంది. శృంగార వీధి తొలి ప్రచురణలో కాక తర్వాతి ప్రచురణ (1970) లో "భాగవత భాగీరథి" అనేది ప్రధాన శీర్షికగా శృంగార వీధి అనేది అందులోని ఒక తరంగమన్నట్లు స్ఫురణ కలిగే విధంగా ముద్రించబడింది. కాని, తరువాతి కావ్యాలలో, తర్వాతి ప్రచురణలలో, ఈ "భాగవత భాగీరథి" ప్రస్తావన కన్పించదు. కృష్ణపరమైన మరికొన్ని కావ్యాలను రచించాలని సత్యనారాయణగారు భావించి ఉండవచ్చు. కృష్ణ కావ్యాలలో మొదటిది శృంగార వీధి. అది వివిధ కావ్య ఖండికల సంకలనం. అందువల్ల తర్వాతి కృష్ణ కావ్యాలన్నీ కూడా ఆ వీధిలోనివే అని, దాని క్రమ వికాసమే మిగిలిన కావ్యాలన్నీ అనే ఒక అనుస్యూతిని సత్యనారాయణగారు వ్యక్తీకరించాలని అనుకున్నట్లుగా కూడా స్ఫురిస్తుంది. 1970 లో చతుర్థ ముద్రణగా ప్రచురితమైన "గోపికా గీతలు" కావ్యంలో కావ్యశీర్షిక కింద "శృంగారవీధి" అని కుండలీకరణంలో చేర్చటం వల్ల ఈ అంశం స్ఫురిస్తుంది. అయితే ఆ "భాగవత భాగీరథి" లేదా ఈ "శృంగారవీధి" అనే వాటిని స్థిరపరచాలనే వూనిక మాత్రం కనిపించదు. అందుకే మళ్ళీ ఇతర కావ్యాలలో వీటి ప్రసక్తి లేకపోవటమే ఈ అంశాన్ని విశదపరుస్తుంది. 1970 సం॥లో ప్రచురించబడిన శ్రీకృష్ణ సంగీతము కృష్ణకావ్య సముచ్చయం చివరిది.

సత్యనారాయణగారి మొత్తం కావ్యాలలో ఏకవస్తు ప్రధానమైన కావ్య సముచ్చయం ఈ కృష్ణ కావ్యాలు మాత్రమే. అందువల్ల ఈ కావ్యాలలోని వస్తు వైలక్షణ్యం, వస్తువిన్యాసం వంటి అంశాల అనుశీలన ద్వారా ఈ కావ్యాలను ప్రసన్నం చేయటమే ఈ సిద్ధాంత వ్యాసలక్ష్యం.

## పాద సూచికలు :

1. విశ్వనాథ శారద - 3 - పుట 11
"నేను పద్యాలు వ్రాయుదునన్న మాట లోకవార్తయై పోయెను...."
ఇక్కడ పద్యమనేది కవిత్వానికి పర్యాయపదం.
2. పాతిక సంవత్సరాల తెలుగు కవిత్వము - కృష్ణశాస్త్రి భారతి రజతోత్సవ సంచిక
3. భీమ ఖండము - పీఠిక
4. రామాయణ కల్పవృక్షము - బాలకాండ అవతారిక - 35 (1992)
5. విశ్వనాథ శారద - 3 - పుట 78.
6 కిరతార్జునీయం - మాఘుడు.
7. వేయిపడగలు - విశ్వనాథ - పుట 83 (1986)
8. మఱల నిదేల రామాయణంబన్నచో నీ ప్రపంచకమెల్ల నెల్లవేళ
దినుచున్నయన్నమే తినుచున్నదిన్నాళ్ళు తనరుచి బ్రదుకులు తనవిగాన
చేసిన సంసారమే సేయుచున్నది తనదైన యనుభూతి తనదిగాన
తలచిన రామునే తలచెద నేనును నా భక్తి రచనలు నావిగాన
కవి ప్రతిభలోన నుండును గావ్యగతశతాంశముల యందు
తొంబదియైన పాళ్ళు
ప్రాగ్విపశ్చిన్మతంబున రసము వేయిరెట్లు గొప్పది నవ కథాదృతినిమించి"
—రామాయణ కల్పవృక్షము - అవతారిక - 5
''నా భక్తి రచనలు నావి'' అంటే తన గాఢమయిన అనుభవం నుంచి వచ్చినవని తాత్పర్యం.
9. చూ. శ్రీ జువ్వాడి గౌతమరావుగారి లేఖ. అనుబంధం - 1
10. రామాయణ కల్పవృక్షము - యుద్ధకాండము - ఉపసంహరణ ఖండము - 415వ పద్యం - (1992)
11. దిండు క్రింది పోకచెక్క - విశ్వనాథ - పుట - 205
12. దిండు క్రింది పోకచెక్క - విశ్వనాథ - పుట - 203

# రెండవ అధ్యాయము

# శృంగార వీథీ విహారము

## సంకలన స్వరూపం :

విశ్వనాథ రచించిన కృష్ణ కావ్యా లైదింటిలో "శృంగార వీథి" మొదటిది. ఇది వివిధ ఖండికల సంకలనం. సంకలనం చేయబడ్డ ఖండికలు మొత్తం 15. ఈ ఖండికలు అన్నీ 1920 మొదలుకొని 1936 మధ్యకాలంలో రచించబడినట్లు కనిపిస్తుంది.

ప్రథమ ముద్రణలోని 15 ఖండికలివి :

1. శృంగార వీథి
2. శ్రీకృష్ణ దేవుని నిర్వేదము
3. బ్రహ్మ గీతము
4. స్వామి వేణువు
5. సాక్షాత్కారము
6. యమునా నది
7. రాధ స్వప్నము
8. అంతఃస్పృహ
9. ప్రాతఃస్తవము
10. రాధిక - 1
11. రాధిక - 2
12. రాధిక - 3 (భావ గద్య)
13. అమృతము
14. స్నాన సుందరి
15. కపిత బాలనము

ఈ సంకలనములో ఏయే ఖండికలు చేర్చాలనేది ఒక ప్రణాళికగా సత్యనారాయణగారు వ్రాసుకున్న ఆ కాగితంలో ఉన్న క్రమానికి అచ్చు పుస్తకంలోని క్రమానికి తేడా ఉన్నా గూడా, మొత్తం ఖండికలు అవే. అయితే ఈ ప్రణాళికలో లేని "శ్రీకృష్ణదేవుని నిర్వేదము" మాత్రము అచ్చు (ప్రథమ ముద్రణ) లో కన్పిస్తుంది. అంటే - ప్రణాళిక నాటికి దీనిని ఇందులో చేర్చే ఉద్దేశం లేదని, ఆ తరువాత అచ్చు సమయానికి చేర్చడం జరిగిందని అనిపిస్తుంది.[1] తరువాత ముద్రణలకూ ఈ తొలి ముద్రణకూ ఖండికలలో గుర్తింపదగిన మరొక తేడా కన్పిస్తుంది. తరువాతి ముద్రణలలో "రాధిక - I" కనిపించదు. కాని, 'నిరుక్తము, రహోమధురిమ' అనే రెండు ఖండికలు కొత్తగా చేరినవి. అట్లాగే 1970 సంవత్సరపు ముద్రణలో "రాధిక - 3" (భావగద్య) ఖండిక కూడా కనిపించదు. రాధిక శీర్షికతో రెండు ఖండికలున్నా కూడా వాటికి ఒకటి, రెండు అనే అంకెలు లేవు. ఆ రెండు వరుసగా లేవు "రాధిక-3" అను ఖండిక మొత్తం సంకలనంలో చివర చేర్చబడింది. ఆ తరువాత అది కూడా తొలగిపోయింది. ప్రస్తుత సంకలనాలలో కనిపించే "రాధిక-2' ఖండికలో మొదటి ముద్రణలో కనిపించే—

"నీవె నేనును మఱి నేనె నీ వటన్న
పలుకు సైతము మనమధ్య నిలువకుండ
నుడువరానట్టి యైక్యమును గ్రహింపు
వాగతీతమ్ముగాఁ గృపావారిఁబరపి"

అనే పద్యము కన్పించదు. ఇది అచ్చువేళలో జారిపోయి ఉండవచ్చు.

ఈ ఖండికల మార్పిడి వల్ల కొన్ని ముద్రణలలో 16 ఖండికలు, కొన్నింటిలో 15 ఖండికలు కనిపిస్తాయి. ఈ సంకలనంలో ఈ విధమైన ఖండికల చేర్పులు తీసివేతలు ఎందుకు జరిగినాయో ఖచ్చితంగా చెప్పే అవకాశం మాత్రము కనిపించదు. ఈ సందర్భములోనే మరొక మార్పు కూడ గమనించ వలసి ఉంది.

శృంగార వీథిలో చేర్చబడ్డ ఖండిక లన్నిటికీ ప్రత్యక్షంగానో, సూచనా ప్రాయంగానో కృష్ణ సంబంధ ముంది. కేవలం స్నానసుందరి, కుపితబాలనము

అవి మాత్రమే ఇందుకు అపవాదాలు. అందుకే కావచ్చు - సత్యనారాయణగారు చేసుకున్న మొదటి ప్రణాళికలో ఈ రెండు ఖండికలు, మిగతా ఖండికల [illegible] కాక వేరే వరుసలో ప్రత్యేకంగా రాయబడ్డాయి. వాటిని చేర్చాలా? వద్దా? అనే ఆలోచన సాగినట్లు దానివలన మనకు తెలుస్తున్నది. ఈ ఆలోచ[illegible]ంగానే పట్టికలో లేకున్నా కూడా "శ్రీకృష్ణదేవుని నిర్వేదము" [illegible] ఉంటుంది. చివరకు కృష్ణ స్పర్శ లేకున్నా కూడా ఈ రెండింటిని చేర్చాలనే నిర్ణయానికి వచ్చి ఉండవచ్చు. ఈ రెండింటిలోనూ 'శృంగార' భావం ఉండటం, ఈ సంకలనంలో అవి ఉండటానికి కారణం కావచ్చు. సంకలనం పేరు 'శృంగారవీధి' గదా!

తరువాత సంకలనాలలో చేర్చబడ్డ నిరుక్తము, రహోమధురిమ అన్న ఖండికల్లోనూ కూడా కృష్ణస్పర్శ లేదు. మొదటి ముద్రణ ప్రచురణ ప్రకారం శృంగారవీధి, రహోమధురిమ, కుపిత చాలనము తప్ప మిగిలిన 12 ఖండికలను [illegible] మాత్రమే ఈ సంకలనం 'కృష్ణకావ్య' మవుతున్నది. ఆ ఖండికలే ప్రస్తుతం పరిశీలించబడుతున్నవి.

## కావ్యం : ఖండిక

ఈ సంకలనంలోని ఖండికలన్నింటిలో "శృంగారవీధి" అన్న ఖండిక చాలా పెద్దది. ఇందులో 90 పద్యాలున్నాయి. దాని తర్వాత 77 పద్యాల పెద్ద ఖండిక "శ్రీకృష్ణదేవుని నిర్వేదము." ఈ రెండింటి తర్వాత మరొక పెద్ద ఖండిక 41 పద్యాల "ప్రాతఃస్తవము." మిగిలినవన్నీ పది పద్యాలకు మించని ఖండికలు. అన్నింటిలోనూ ఏదో ఒకవిధంగా - విస్తృతంగానో, సూచనప్రాయంగానో శృంగార భావన వ్యాపించి ఉన్నది. అందుకని మొత్తం సంకలనంలో పెద్ద ఖండిక అయిన "శృంగారవీధి" శీర్షికయే ఈ మొత్తం సంకలనానికి పేరుగా నిలిచి ఉంటుంది.

ఈ అన్నింటిని ఖండికలు అనటం కేవలం సాధారణ దృష్టితో మాత్రమే. వేరు వేరు ఖండికలను ఒకచోట కూర్చి ఒక సంకలనంగా వెలువరించటమనేది ఆధునికంగా చాలా ప్రచారంలోకి వచ్చిన ఒక విధానం. భావ కవితా మార్గాన [illegible] ఆద్యంతమూ కనిపిస్తుంది.

ఖండిక అంటే ఒక చిన్నముక్క అని అర్థం. కథ అనేది లేకుండా ఒక చిన్న భావనను కొన్ని పద్యాలలో బంధించటాన్ని ఖండిక అని స్థూలంగా అన వచ్చు. ఖండకావ్యం అనే మాట కూడా భావ కవితా కాలంలోనే ప్రసిద్ధికి వచ్చింది పూర్వాలంకారికులలో విశ్వనాథుడు కావ్యంలో ఏకదేశాన్ని అనువర్తించి ఉండడము ఖండ కావ్యానికి లక్షణంగా చెప్పినాడు.[2] అంటే, ఒక మహా కావ్యానికి చెందిన ఏదో ఒకటి రెండు అంశాలతో రచింపబడింది గాని, లేదా ఒక విస్తృత కావ్యంలో ఇముడడానికి వీలైందా అనిపించే రచన గాని ఖండకావ్యం కావచ్చునని చెప్పవచ్చు.

కాని భావ కవితా కాలంలో, ఆ తరువాత కూడా ఖండకావ్యాలని పేర్కొనబడుతున్న కవితల విధానం విశ్వనాథుని నిర్వచనానికి అనుగుణంగా కనిపించదు. ఖండికలనే ఖండకావ్యాలని వ్యవహరించడం కూడా ప్రచారంలో ఉంది. జాషువా గారు రచించిన 'ఖండకావ్యాలు' ఇందుకు ఒక ఉదాహరణగా చెప్పవచ్చును.

కవి రచించిన ఏ రచననైనా సామాన్య దృష్టితో కావ్యమని చెప్పవచ్చు.[3] అన్నివిధాలైన రచనలకు సామూహికంగా ఉపయోగించటానికి వీలైన పదమది. కాని, పూర్వాలంకారికులు ఆలోచించిన విధానాన్ని అనుసరించి గమనిస్తే "కావ్యమ్" అనే దానికి కొన్ని లక్షణాలున్నట్టు కనిపిస్తుంది. ప్రధానంగా కావ్యానికి ఒక కథా వస్తువు అవసరం. ఆదిమధ్యాంతాల సమన్వయంతో ఒక సమగ్రతను సాధించిన రచన మాత్రమే కావ్యమవుతుంది. ఇది కొంత విస్తృతంగానే ఉంటుంది. కావ్యంలో, లేదా మహా కావ్యంలో అష్టాదశ వర్ణనలుండాలని ప్రతిపాదించడంలో[4] ఇదే ఉద్దేశం కనిపిస్తుంది. ఆ వర్ణనలన్నీ కథకు సమగ్రతను సాధించేటట్టుగా చెప్పబడ్డాయి. కథ అంటే అది జీవితమే. ఏ విధమైన పాత్రల మీద ఆరోపించి కథ చెప్పినా కూడా అది మానవ జీవితానికి ప్రతిఫలనంగానే ఉంటుంది. అయితే, ఈ వర్ణనలన్నీ ప్రతి కావ్యంలోనూ లెక్కపెట్టినట్లుగా ఉండనక్కరలేదు. వీటిలో తక్కువైనా లోపమేమీ లేదని దండి అన్నాడు.[5] కావ్యం కోసం తీసుకొన్న కథావస్తువు స్వభావాన్ని, పరిధినిబట్టి కవి అవసరమైన వర్ణనలను మాత్రమే ఉపయోగించుకుంటాడు. వర్ణనల ప్రమేయంలేని కావ్యమంటూ సాధారణంగా కనిపించదు, ఇక్కడ కావ్యమన్నది అన్ని రచనలను ఉద్దేశించింది కాక, ఒక ప్రత్యేక ప్రక్రియకు సూచకమనిమాత్రమే గమనించవలసి ఉంటుంది.

కథతో ప్రమేయంలేకుండా వర్ణనాది విషయాలకు చెందినవి ముక్తక కావ్యాలో, ఖండకావ్యాలో అవుతాయి. ఖండకావ్యానికి మేఘదూతాన్ని విశ్వనాథుడు ఉదాహరించినాడు. మేఘదూతములో కథాస్ఫురణే తప్ప కథ అనేది లేదు. అందులో దేశ వర్ణన, నాయకుని నాయికాగతమైన విరహచిత్రణ ప్రాధాన్యం వహిస్తున్నది. కాబట్టి, కొంత దీర్ఘమైన రచనలను ఖండకావ్యాలని, చిన్న రచనలను ఖండికలని స్థూలంగా చెప్పకోవచ్చును. చిన్నచిన్న కావ్యాలను గూర్చి వివరించేటప్పడు పూర్వులు ముక్తకం, యుగ్మకం, సంధానితకం, కలాపకం, కులకం వంటి భేదాలను పేర్కొన్నారు.[6] ఒకే ఒక పద్యం ముక్తకం. చాటు పద్యాలన్నీ ముక్తకాలకిందకే వస్తాయి. దానికిముందు, వెనుక పద్యాలు ఉండక్కరలేదు. ఉన్నాగూడా వాటితో దానికి సంబంధము ఉండదు. ఆ పద్యానికి అదిగానే సమగ్రంగా ఉంటుంది అంటే,అందులో భావం ఆ పద్యం వరకే పరిమితంగా ఉంటుంది ఒకప్పుడు భావం రెండు పద్యాలకు వ్యాపించవచ్చు అప్పుడది "యుగ్మం." అయిదు పద్యాలకు, అంతకుమించి మరికొన్ని పద్యాలకు వ్యాపిస్తే దాన్ని "కులకం" అంటారు. ఈ విధమైనవన్నీ ఖండికలు. ఆధునికంగా కూడా ప్రచారంలో ఉన్నవి. శతకము వంటి వాటిని 'శతక కావ్యాలు' అని సాధారణంగా అనడమే తప్ప, వాస్తవానికి అవి అన్నీ గూడా ముక్తకాల సంకలనాలు మాత్రమే.

ఆధునిక కాలంలో భావ కవిత్వం విస్తరించినప్పుడు విపులమైన కావ్య రచననుండి దృష్టి మారి ఖండికా రచనకే ప్రాధాన్యం వచ్చింది. ఈ భావకవితా మార్గంలో, ఆ తరువాత అభ్యుదయ కవితా మార్గంలో కూడా కావ్యాలకు బదులు ఖండికలు, ఖండ కావ్యాలు మాత్రమే ప్రధాన రచనా విధానంగా వ్యాప్తిలోకి వచ్చినాయి. కథ అనేది నవల, కథానికలుగా వచన రూపములో వేరు వేరు ప్రక్రియలుగా విస్తరించటం; భావకవులు, ఆ తరువాత ఆ కవులు కథకన్నా కేవల భావ చిత్రణకు,[7] భావానుభూతికి ప్రాధాన్యము ఇవ్వటము వలన ఖండిక, ఖండకావ్య రచనకే ప్రాధాన్యం వచ్చింది.[8]

విశ్వనాథ సత్యనారాయణగారు భావకవితాయుగంలోనే కవిగా రూపు దిద్దుకున్నారు. భావకవిత కూడా విస్తృతంగా రచించినారు. కాని, ఆయన రచించిన భావకవిత ఆనాడు ప్రచారంలో ఉన్న భావకవితా ధోరణికిగాని, పరిమితు

లకు గాని ఇమడినట్లుగా కనిపించదు. గిరికుమారుని ప్రేమగీతాలు, అవిధంగానే భ్రష్టయోగి, కేదారగౌళలలోని ఖండికలను చూస్తే, ఈ విషయం స్పష్ట పడుతుంది. భావ కవితా కాలంలో ఆయన అనేక విధాలైన ప్రక్రియలు నిర్వహించినారు. శశిమాతము, కిన్నెరసాని పాటలు వంటి ఖండకావ్యాలు ఇందుకు ఉదాహరించుకోవచ్చు భావ కవితా మార్గంలోనే సాగుతున్నట్లు కనిపిస్తూ కూడా అందుకు అతీతమైన ఆధ్యాత్మిక స్ఫూర్తి, జాతీయ సంప్రదాయ భూమిక బలంగా ఆయనలో కనిపిస్తుంది. ఈ ప్రత్యేకతయే శృంగార వీథిలో కూడ చూడవచ్చు.

శృంగార వీథిలోని కవిత లన్నిటిని 'ఖండికలు' అనటం సాధారణమైన దృష్టితోటే తప్ప, నిజానికి అన్నీ ఖండికలు కావు ఈ సంకలనంలోని మొదటి, రెండు - శృంగారవీథి, శ్రీకృష్ణదేవుని నిర్వేదము అనేవి కావ్యాలు. వీటిలో కథ అని చెప్పదగినది కనిపించదు. అయినా, ఒక భావము యొక్క వికాసానికి, విస్తృతికి సహాయకంగా రేఖామాత్రమైన కథా లక్షణంతో ఆది మధ్యాంతాల సమన్వయంతో సమగ్రతను సాధించినవి ఈ కావ్యాలు. భావకవితాయుగంలో కాని, అనంతరం కాని 70, 90 పద్యాల సుదీర్ఘ "ఖండికలు" కనిపించవు. ఈ రెండింటి తర్వాత ప్రాతఃస్తవాన్ని ఖండకావ్యమని చెప్పవచ్చు. అందులో కథా ప్రసక్తి అసలే లేదు. కాని, ఒక మహా కావ్యంలో ఇమిడిపోయే లక్షణం అందులో ఉంది. ఇక మిగిలినవన్నీ ఖండికలు మాత్రమే. మొదట ఈ కావ్యాల స్వరూపం, ఆ తరువాత ఖండికల తీరుతెన్నులు క్రమంగా విశ్లేషించబడుతున్నాయి

## శృంగార వీథి :

శృంగార వీథి రాధాకృష్ణ ప్రణయ తత్వాన్ని విశిష్టంగా చిత్రించే కావ్యం. ఇందులో కృష్ణుని గూర్చి రాధాదేవి విరహం, దాని తీవ్రత, చివరకు రాధాకృష్ణ సమాగమం చిత్రించబడ్డాయి. రాధికా విరహ సమాగమానుభవమే ఈ కావ్యానికి వస్తువు. సత్యనారాయణగారి కృష్ణ కావ్యాల్లో రాధా ప్రసక్తి ఈ శృంగార వీథి కావ్యంలోను, ఈ సంకలనంలోని మరికొన్ని ఖండికల్లో మాత్రమే కనిపిస్తుంది. భావకవితా కాలంలో రాధాభావన వ్యాప్తిలో ఉండడం ప్రసిద్ధమే.

రాధ:- రాధా భావన భారతీయ భాషా సాహిత్యాలన్నింటిలోను విరివిగా కనిపిస్తుంది. అందులో వైవిధ్యం కూడా విరివిగానే ఉంది. రాధ భక్తిమార్గములో ఒక ఉదాత్తమైన స్థితికి ప్రతీక.

భారతీయ భక్తి భావనకు పట్టుగొమ్మ భాగవతం. ఇందులో సర్వ గాథలు, సన్నివేశాలు భక్తికి సంబంధించిన ఏదో ఒక రీతిని చిత్రీకరిస్తుంటాయి. ఈ భాగవతంలోనూ దశమస్కంధం భక్తి మార్గీయులకు వేదం వంటిది. దశమ స్కంధంలో శ్రీకృష్ణుడు, యశోద, గోపికలు-ఈ విధంగా అనేక మనోదశలకు సంబంధించిన వ్యక్తులకు భక్తిమయమైన పరమేశ్వర సంబంధం అత్యంత మనోహరంగా చిత్రించబడింది. కాని, ఇంతటి దశమస్కంధములోనూ రాధ ప్రసక్తి ఎక్కడ కూడా కనిపించదు. భాగవతంతోపాటు బ్రహ్మవైవర్త పురాణం, దేవీ భాగవతం, గర్గసంహిత వంటి ఇతర పురాణాలు కూడా భక్తి మార్గానికి ఆధారాలే. ఈ భాగవతేతర పురాణ గ్రంథాల్లో రాధ విషయం విస్తృతంగా కనిపిస్తుంది. ఇవన్నీ భాగవతానికి తర్వాత రచింపబడిన గ్రంథాలే. ప్రాచీనమైన భాగవతంలో లేని రాధ ఈ పురాణాల్లో ఎక్కడనుంచి వచ్చిందనే ప్రశ్నకు సమాధానంగా రాధ ప్రసక్తి భాగవతంలోనే సూచనగా ఉన్నదని చెప్పబడుతున్నది. శ్రీకృష్ణుడు శరద్వేళయందు యమునా తీరంలో వేణుగానం చేసినప్పుడు, వేణుగానం చేత ఆకర్షింపబడి గోపికలు ఆయన సన్నిధికి వెళ్ళడం, కృష్ణుడు అంతర్ధానం కావడం, గోపికల కృష్ణాన్వేషణ, కృష్ణ సాక్షాత్కారం, రాసక్రీడ - ఇవంతా భాగవత దశమస్కంధంలో చిత్రింపబడిన ఒక అత్యంత మధురమైన సన్నివేశం. గోపికల కృష్ణాన్వేషణలో ఒకచోట ఒక గోపిక మరొక గోపికతో :

"అనయారాధితో నూనమ్ భగవాన్ హరిరీశ్వరః
యన్నో విహాయ గోవిన్దః ప్రీతోయమానయద్రహః"10

గోపికలు శ్రీకృష్ణుని అన్వేషిస్తుండగా వారికి ఆయన పాదాల గుర్తులు కనిపిస్తాయి. ఆ అడుగులు కృష్ణుడు మరొక స్త్రీతో ముందుకు పోయినట్లుగా ఉంటాయి. వాటిని చూచి ఆ స్త్రీ తమలోని ఒక గోపికయే అని వారనుకుంటారు. [illegible] ఆమె యొక్క ధన్యతను భావిస్తూ - ఆమెచే ఆ పరమేశ్వరుడు

ఎంత ఆరాధింపబడినాడో! మనలనందరినీ వదిలి ఆమె వెంట పడివెళ్ళినాడు అని అనుకుంటారు. ఈ పద్యంలో ఉన్న "అనయా రాధితో...." అన్నప్పుడు "రాధిత" అనే దానిని ఆధారంగా చేసుకుని రాధ ప్రసక్తి భాగవతంలోనే ఉందని కొందరి భావన.

కృష్ణుని బాల్యమంతా దాదాపుగా వ్రేపల్లెలోనే గడిచింది. ఆ దశలో గోపికలు శ్రీకృష్ణునితో రకరకాలుగా సాన్నిహిత్యం కలిగిఉంటారు. ఈ గోపికా కృష్ణుల మధ్య చిత్రించబడిన శృంగారమంతా మధుర భక్తిగా భావించబడు తున్నది. ఈ గోపికలతో శ్రీకృష్ణునికి గల సంబంధాలలోని వైవిధ్యాన్ని బట్టి ఎవరు గొప్ప, ఎవరు తక్కువ అనే ప్రసక్తి లేదు. కృష్ణుని సేవించిన తరించిన విధానాలను భాగవతంలోని ఈ క్రింది పద్యం వ్యక్తీకరిస్తుంది :

"కామోత్కంఠత గోపికల్ భయమునం గంసుండు వైరక్రియా
సామాగ్రిన్ శిశుపాల ముఖ్య నృపతుల్ సంబంధులై వృష్ణులుం
బ్రేమన్ మీరలు భక్తినేము నిదె చక్రింగంటి మెట్లైన ను
ద్దామధ్యాగరిష్ఠులైన హరిజెందన్ వచ్చు ధాత్రీశ్వరా!!"11

ఏ భావముతోనైనా - ఆ భావము పరమేశ్వరుని గూర్చి మిక్కిలి తీవ్ర మైన స్థాయిలో ప్రవర్తించినట్లైతే "హరిని చెందన్ వచ్చు." గోపికలు "కామో త్కంఠత"తో హరిని సేవించినారు. ఈ కామమనేది మిక్కిలి తీవ్రమైన భావము. ఈ భావము పరమేశ్వరునికి అనుసంధించబడినప్పుడు అది మధుర భక్తిగా పరిణమిస్తున్నది. లౌకికమైన కామంలో భౌతికమైన శారీరక సంయోగం ఉంటుంది. భగవద్విషయమైన కామంలో ఇది ఉండదు. అక్కడ ఉండేది కేవలం ధ్యానానికి, భావనకు చెందింది మాత్రమే. దాదాపుగా ఈ గోపికలందరు వివా హిత స్త్రీలు. అయినా, శ్రీకృష్ణుని వెంటబడుతారు. అప్పటి శ్రీకృష్ణునిది లౌకిక మైన కామోపభోగానికి ఉపయోగపడని బాల్యదశ. అందువల్ల ఇక్కడి గోపికల విషయంలో చిత్రించబడిన కామప్రవృత్తి అంతా సాధారణ దృష్టికి, లౌకిక కామ ప్రవృత్తిగా భాసిస్తుంటుంది. కాని, వారికి బాలకృష్ణుని యందున్న పరమేశ్వర భావనవల్ల ఈ ప్రవర్తన అంతా మధురభక్తిగా స్పష్టపడుతుంది. ఈ గోపిక

[illegible] సంస్కారాన్నిబట్టి శ్రీకృష్ణ విషయంలో పరమేశ్వరభావన [illegible] కృష్ణుడు యశోద బిడ్డడుకాడు - పరమేశ్వరుడు.

[illegible] ఉద్భవమై నిరజన్మైత సమస్త జంతు చే
[illegible] విధవు తొల్లివిరించి దలంటి లోక ర
[illegible] మాదరింప్రమని సన్నుతి సేయఁగ సత్కులంబునన్
[illegible] యంబుఁగావ నిటుపుట్టితిగాదె మనోహరాకృతిన్."[12]

[illegible] గోపికల భావన. ఇందులో శ్రీకృష్ణుని పరమేశ్వర తత్త్వము [illegible] దానితోపాటు ప్రకృతి తత్త్వ ప్రసక్తి కూడా ఉన్నది. [illegible] తత్త్వమైన దేవి ప్రకృతికి ప్రతీక. ఆమె లక్ష్మిగా గుర్తింప [illegible] వివిధ అవతారాలతోపాటు, ఈ దేవి యొక్క [illegible] కూడా సమన్వయించబడుతున్నాయి. "రాఘవత్వేఽభవత్సీతా! [illegible]" మొదలైన ప్రసిద్ధ వాక్యాలు ఇందుకు ప్రమాణాలు. [illegible] లక్ష్మి రుక్మిణిగా అవతరించింది. రుక్మిణీ కళ్యాణ ఘట్టంలో [illegible] 'భగవత్యంశభవ' అని చెప్పినాడు. ఈ రుక్మిణి కృష్ణుడు [illegible] వివాహమాడింది. కాని, బాల్యంలో అతని సాన్ని[illegible] గోపికను భక్తి మార్గాన అత్యుత్తమ దశకు ప్రతీకగా గుర్తించే [illegible] 'రాధ' ఉపయోగించింది. కొన్ని పురాణాల్లో రాధాదేవి-కృష్ణుడు; [illegible] అనేక విషయాలు విస్తృతంగా చిత్రించబడ్డాయి. [illegible] పరమేశ్వరులని, వారి లీలావిలాసమే ఈ సృష్టియంతా [illegible] భక్తి మార్గము కూడా ప్రసిద్ధమైనదే.

[illegible] పురాణాలలోని ఓటకు భిన్నంగా లోకంలో రాధాకృష్ణ భావన [illegible] కూడా ప్రసరించింది రాధాకృష్ణుల సంబంధం లోకంలో రెండు [illegible] ఒకటి కృష్ణునిభార్య రాధ. రెండు కృష్ణుని ప్రియురాలు [illegible] వైవాహిక సంబంధం, రెండవది వివాహేతర సంబంధం. [illegible] మేనత్త అనేది ఈ రెండవ సంబంధానికి చెందిన అంశమే. ఈ [illegible] వ్యక్తుల సంస్కారాన్నిబట్టి భక్తి విధానాన్నిబట్టి, [illegible] ప్రవృత్తిలోనికి వచ్చిందని చెప్పవచ్చు.

భారతీయ కృష్ణభక్తి మార్గంలో రాధా ప్రాధాన్యం విస్తృతంగా ప్రచారం లోకి తెచ్చినవారు వల్లభాచార్యులు, చైతన్య మహాప్రభువు. కాని, సాహిత్యంలో వీరికన్న చాలా పూర్వమే జయదేవుని "గీతగోవిందం" ద్వారా రాధ ప్రసిద్ధి కెక్కింది. గీత గోవింద కావ్యం సాహిత్యపరంగానే కాకుండా, సంగీత నృత్యాభి నయాల ద్వారా కూడా మిక్కిలి వ్యాప్తిలోకి వచ్చింది. శిల్ప చిత్రాదికళల్లో కనిపించే రాధాకృష్ణుల తీరుతెన్నులకు జయదేవుని గీతగోవిందమే ప్రధాన ప్రేరణ.[13]

గీత గోవిందంలో రాధాకృష్ణుల విరహ సంయోగాలు, శ్రీకృష్ణుని లీలా విలాసాలు చిత్రించబడ్డాయి. గీతగోవిందంతోపాటు కృష్ణ కర్ణామృతం కూడా రాధా ప్రసిద్ధికి తోడ్పడిన ముక్తక కావ్యం. ఈ మార్గంలోనే కృష్ణ లీలా తరంగిణి కూడా పేర్కొనదగిన కావ్యం. ఈ విధమైన వివిధ కావ్యాల ద్వారా వల్లభ చైతన్యాదుల ద్వారా వివిధ ప్రాంతీయ సాహిత్యాలలో, ఉపాసనా మార్గా లలో రాధాకృష్ణ తత్వం గాఢంగా వ్యాపించింది.

తెలుగు సాహిత్యంలో రాధా ప్రసక్తి ప్రథమంగా శ్రీనాథుని దగ్గర కని పిస్తుంది. భీమ ఖండావతారికలోని—

"బాలిక మోముమత్త వనబర్హికిశోరక లాస్యలీలఁ బై
వాలిచి పచ్చకప్పురపు వాసనతోడి ముఖారవింద తాం
బూలపు మోవి మోవిపయి మోపుచు రాధకునిచ్చు ధూర్తగో
పాలుఁడు ప్రోచుగావుత మహారకృపామతి మంత్రి యన్ననిన్"[14]

అన్న పద్యములో రాధా ప్రసక్తి ఉన్నది. తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యంలో కూడా రాధాదేవి చరిత్ర చిత్రించబడింది. ఆమె తపస్సు చేసి శ్రీకృష్ణుని పొందుతుంది. చింతలపూడి ఎల్లన రాధామాధవగాథను ఒక ప్రత్యేక ప్రబంధంగా రచించాడు. ఇందులో రాధాదేవిని లక్ష్మీదేవి అవతారంగా చిత్రించి, రాధాకృష్ణులకు వివాహాన్ని జరిపించినాడు. కాని, ఆయన తర్వాత ముద్దు పళని వంటి వారి "రాధికా సాంత్వనము" మొదలైన కావ్యాలలో తాత్త్విక దృక్పథము మరుగుపడి కేవలం లౌకిక కామవిలాసమే విపరీతముగా కనిపిస్తుంది. సామాజిక దృష్ట్యా అవినీతి స్థాయి కూడా ఇందులో కనిపిస్తుంది. అందుకనే ఆధునికముగా,

కందుకూరి వీరేశలింగము మొదలైనవారు ఈ విధమైన కావ్యాలను అశ్లీల కావ్యాలుగా పరిగణించి నిరసించినారు.

రాధాకృష్ణ భావనలోని ఉదాత్త ప్రణయ తత్వము ఆధునికంగా భావ కవిత్వములో ప్రాధాన్యము పొందింది. కృష్ణశాస్త్రి రచించిన అన్వేషణము, బసవరాజు అప్పారావు కొన్ని గేయాలు మొదలైన భావకవితా కావ్యాలలో ఈ ఉదాత్తత్వాన్ని దర్శించవచ్చు. భావకవితా విధానానికి ముందే పానుగంటి వారి రాధాకృష్ణ నాటకము 1905 లో వెలువడింది. ప్రణయము ఉదాత్త భక్తిగా రాధ విషయములో పరిణమించిన తీరు చాలా గొప్పగా ఈ నాటకంలో చిత్రించ బడినది. ఈ నేపథ్యంలో 'శృంగార వీధి' కావ్యాన్ని దర్శించవలసి ఉంటుంది.

## శృంగారవీధి - గీత గోవిందం :

కావ్య నిర్మాణం దృష్ట్యా జయదేవుని గీత గోవిందానికి, శృంగార వీధికి చాలా పోలికలు కనిపిస్తాయి.

గీత గోవిందంలో 12 సర్గలు, 1, 7 సర్గలలో నాలుగేసి అష్టపదులు; 11 వ సర్గలో 3 అష్టపదులు; 2, 4, 5, 12 సర్గలలో రెండేసి అష్టపదులు; 3, 6, 8, 9, 10 సర్గలలో ఒక్కొక్క అష్టపది చొప్పున మొత్తము 24 అష్ట పదులు. ఆయా అష్టపదులు వాటిలోని విషయము సంఖ్యా విభాగాన్ననుసరించి ఈ విధముగా ఉన్నది:

## గీత గోవిందం :

| సర్గ | అష్టపది | విషయము |
|---|---|---|
| 1 | 1 | దశావతార వర్ణన. |
| | 2 | కృష్ణుని స్వరూప గుణ విభూతుల నిరూపణం. |
| | 3 | వసంత ఋతువులో కృష్ణునితో గోపికల విరహ వర్ణన- (సఖి అని సంబోధించి చెప్పినట్లుండును.) |
| | 4 | పై అష్టపదిలోని వర్ణనయే ఇందులో కొనసాగుతుంది. అయితే, మూడవ అష్ట పదిలో ప్రకృతి వర్ణన ఉండగా ఇందులో వివిధ గోప స్త్రీలతో శ్రీకృష్ణుని చేష్టలు వర్ణించ బడినవి. |

| సర్గ | అష్టపది | విషయము |
|---|---|---|
| 2 | (1) 5 | రాధ కృష్ణుని గురించి రకరకాలుగా స్మరించుట. ఈ స్మరణ సఖితో చెప్పినట్లుగా స్ఫురిస్తుంది. |
| | (2) 6 | కృష్ణుని తనకు చేకూర్చుమని చెలితో రాధ చెప్పడం. |
| 3 | (1) 7 | రాధ గురించి కృష్ణుని యనుతాపం |
| 4 | (1) 8 | కృష్ణునితో రాధ విరహం గూర్చి దూతిక చెప్పడం. |
| | (2) 9 | ఇందులో కూడా రాధా విరహావస్థను చెప్పడం. |
| 5 | (1) 10 | రాధతో కృష్ణుని విరహదశను చెప్పడం. |
| | (2) 11 | రాధను కృష్ణుని దగ్గరకు తొందరగా పొమ్మని చెప్పడం. |
| 6 | (1) 12 | కృష్ణునితో దూతి రాధయొక్క అశక్తతను చెప్పడం. |
| 7 | (1) 13 | రాధ విరహ విలాపము |
| | (2) 14 | కృష్ణుడు రాకపోవడముబట్టి అతను అన్యాసక్తుడని, ఇతర గోపికలతో విహరిస్తున్నాడని రాధ భావించడం |
| | (3) 15 | పూర్వ అష్టపదిలోని విషయమే మరింతగా సాగుతుంది. |
| | (4) 16 | కృష్ణునితో క్రీడించుట - కృష్ణుని విరహమును పొందు నాయికల స్థితిని ఊహించి చెప్పడం. |

ఈ సర్గతో రెండవ రోజు మొదలు అవుతుంది :

| | | |
|---|---|---|
| 8 | (1) 17 | తన దగ్గరకు వచ్చిన శ్రీకృష్ణుని రాధ ఖండిత నాయికగా అతన్ని నిరసిస్తుంది. |
| 9 | (1) 18 | కలహాంతరిత అయిన రాధకు కోపము వదలమని సఖి హితవచనం చెప్పడం. |
| 10 | (1) 19 | రాధతో శ్రీకృష్ణుని అనునయ వాక్యాలు. |
| 11 | (1) 20 | కృష్ణుని అనునయ వాక్యాలతో రాధ తేరుకొని, శ్రీకృష్ణుని కలుసుకొనబోవుటకుముందు ఒక చెలి చెప్పిన మాటలు. |
| | (2) 21 | పై అష్టపదిలోని అంశమే ఇందులోనూ సాగింది. |
| | (3) 22 | రాధ కృష్ణుని సేవించటం. |
| 12 | (1) 23 | రాధతో కృష్ణుని మధురవాక్యాలు. |
| | (2) 24 | రాధ తనను రకరకాలుగా అలంకరించమని కృష్ణునితో చెప్పడం. |

ఇది జయదేవుని గీతగోవింద విధానము.

"శృంగారవీథి"లోని నిర్మాణ విధానం ఈ క్రింది విధంగా ఉన్నది: "శృంగారవీథి" మొత్తం అయిదు భాగాలు. వీటిని అధ్యాయాలు, సర్గలు అని [illegible] రెండు అంటూ అయిదు ఖండాలుగా సత్యనారాయణగారు విభ[illegible]. రెండవ ఖండంలో రెండు, మూడవ ఖండంలో నాలుగు అంతర్విభాగా[illegible] కనిపిస్తున్నవి. ఆయా ఖండాలు విభాగాలనుబట్టి శృంగారవీథిలోని వస్తు విన్యాసం ఈ క్రింది విధముగా ఉన్నది.

| ఖండము | విషయము |
|---|---|
| మొదటి | రాధ యొక్క విరహవర్ణన. |
| రెండు | రాధ యొక్క విరహాన్ని కృష్ణునికి చెలికత్తె తెలియచేస్తుంది. |
| మూడు | మాలిక తిరిగివచ్చి రాధతో "మనము జ్ఞాపకమా యదువంశమౌళి కిక్" అని అంటుంది. రాధ అక్కడి విశేషాలు చెప్పమనడంతో మాలిక గోపికాకృష్ణుల రాసక్రీడను వర్ణించుతుంది. |
| | ఆ విషయాన్ని విని రాధ మూర్ఛపోతుంది. |
| నాలుగు | శ్రీకృష్ణుడు రాధ భావము మనస్సులో ఉప్పొంగగా రాధను చూడ టానికి వస్తాడు. |
| | రాధాస్థితిని చూచిన మాధవుడు, ఆయనను చూచిన రాధ అన్యోన్య దర్శన సుఖము అనుభవిస్తారు. |
| అయిదు | రాధాకృష్ణుల సంయోగము, వన విహారము, రాధను కృష్ణుడు లాలించడం ఇందులో వర్ణింపబడింది. |

ఈ రెండింటిని పోల్చి పరిశీలిస్తే ఈ క్రింది విషయాలు స్పష్ట మవుతాయి.

గీత గోవిందంలో కావ్యారంభంలో కనిపించే మంగళాశాసనం, దశావ తార వర్ణనం శృంగార వీథిలో లేవు. 'శృంగార వీథి' నేరుగా రాధ విరహంతోనే ప్రారంభమవుతుంది. స్థూలంగా చూస్తే 'శృంగార వీథి'లోని మొదటి ఖండం 5, 6 అష్టపదులతోను, రెండవ ఖండం 8, 9, 12 అష్టపదులతోను, మూడవ ఖండం 14 15, 16 అష్టపదులతోను, నాలుగవ ఖండము 19, 22, అష్టపదులతోను, అయిదవ ఖండము 22, 23, 24 అష్టపదులతోను సంబంధించి ఉన్నట్లు [illegible] వస్తు.

## వీధి - వస్తువు :

గార వీధిలోని వస్తువు నుద్దేశించి "రాధాకృష్ణులు, గోపికాకృష్ణుల యోగాలను, ఆమోద విషాదములను అయా పాత్రలనే ఆశ్రయించి విశ్వనాథవారి శృంగార వీధి. ఇది వస్త్వాశ్రయ రీతికి సంబం 15 ఈ కావ్యము రాధాకృష్ణుల విరహమునకు సంయోగమునకు ది. "ఈ శృంగారవీధి ఖండిక స్థూలముగా శృంగార గాథవలె ప్రణయ పథము ద్వారా ప్రణవము నందుకొను పద్ధతిలో సాగిన డా॥ సి. నారాయణరెడ్డిగారు స్థూలముగా చేసిన వ్యాఖ్య యిది. వస్తు విన్యాసాన్ని, అందులోని ఉదాత్తత్వాన్ని పరిశీలిస్తే శృంగార ౌందర్యం వ్యక్తమవుతుంది.

గారవీధి కావ్యములో కనిపించే వ్యక్తులు ఇద్దరు- మాధవుడు, రాధిక. రసానికి ఇద్దరు వ్యక్తులు అవసరం. శృంగారానికి తప్ప మరియే డా ఈ విధముగా ఇద్దరు వ్యక్తులు అవసరమున్నట్లు కనిపించదు. వీర రసములో ప్రతిపక్ష వ్యక్తి అవసరం ఉండవచ్చు. శృంగారంలో ్దరు వ్యక్తులు తప్పనిసరిగా స్త్రీ పురుషులే కావలిసి ఉంటుంది. రాధా కాక ఈ కావ్యంలో కనిపించే మరొక వ్యక్తి దూతిక. శృంగార ంలో దూతిక కూడా ఒక ప్రధానమైన వ్యక్తి. ఈ ముగ్గురు కాక, ికల ప్రసక్తి ఈ కావ్యంలో పరోక్షంగా కనిపిస్తుంది. ప్రకృతి ివిధాంశాలతో పాటు ఈ గోపికలు కూడా అప్రత్యక్షముగా ఉద్దీపన కావ్యంలో ప్రవర్తిస్తారు. వారి ప్రవృత్తి రాధిక యొక్క విరహ మరింతగా ఉద్దీపింప చేస్తుంది. ఈ విధంగా శృంగార వీధి కావ్యం స నిర్వహణకు అనుకూలంగా రూపొందింది

కావ్యంలో శృంగారమనేది అచ్చంగా కొన్ని ప్రబంధాలలో కనిపించే శృంగారం కాదు. చాలా వరకు ప్రబంధాలలో శృంగార మన్నది మితులకు లొంగి ఉంటుంది. కాని శృంగార వీధిలో లౌకిక పరిమితులను ి అలౌకిక తాత్త్వికరీతికి కూడా విస్తరిస్తున్నట్లు గమనించవచ్చు. ‍వ్యములోని ప్రధాన వ్యక్తులు రాధా మాధవులు కావటం కారణం.

శృంగార కావ్య పద్ధతిలో ఈ ఇద్దరిని నాయికా నాయకులు అనవచ్చు. సాధారణంగా ప్రబంధాలలో నాయికా నాయకుల మధ్య భోగ్య భోక్తృ సంబంధం మాత్రమే ప్రాధాన్యం వహించినట్లు కనిపిస్తుంది. ఇది లౌకిక పరిమితులకు పరిమితమైంది. కాని, శృంగార వీధిలో ఇందుకు భిన్నమైన విధానం విశిష్టంగా కనిపిస్తుంది.

వ్యక్తులమధ్య లౌకిక సంబంధాలు అనేక రకాలుగా ఉంటాయి. ఈ సంబంధాలన్నింటిని విశ్లేషించి వీటిని తొమ్మిది విధాలుగా[17] పూర్వులు వర్గీకరించారు.

1. ఆధారాధేయ సంబంధం
2. శరీరాత్మ సంబంధం
3. పితాపుత్ర సంబంధం
4. భార్యాభర్తృ సంబంధం
5. భోగ్య భోక్తృ సంబంధం
6. రక్ష్య రక్షక సంబంధం
7. జ్ఞాతృ జ్ఞేయ సంబంధం
8. స్వ - స్వామి సంబంధం
9. శేష శేషి సంబంధం

ఈ తొమ్మిదింటిలో కొన్ని పునరుక్తంగా కన్పించవచ్చు. కాని, మౌలికముగా ఆయా సంబంధాల భూమికల్లో వైవిధ్యము ఉంది.

శృంగార వీథిలో రాధామాధవుల మధ్య కూడా భోగ్య భోక్తృ సంబంధము చిత్రింపబడింది. భోగ్య వస్తువు చైతన్యవంతమైతే భోక్తను గూర్చిన అభిలాష, ఆవేదన వ్యక్తమౌతుంది. రాధాకృష్ణుల మధ్య ఉన్న ఈ సంబంధంలోని చైతన్య లక్షణ తీవ్రత లౌకిక పరిధికి సాగి, శరీరాత్మ సంబంధంగా, జ్ఞాతృ జ్ఞేయ సంబంధంగా, స్వ-స్వామి సంబంధంగా, శేష శేషి సంబంధంగా విస్తరిస్తుంది. ఈ విస్తరించిన లక్షణాన్ని కావ్యంలో గుర్తించవలసి ఉంది.

"మదన మహీపతి ప్రసవమార్గణ భిన్న శరీర, దీనతా
స్పద పరిపాండురానన, విసర్పితనీల పటాభిరామ, స
మ్మద మధులిట్ప్రదాహృత తమాలనికుంజల తాంత శయ్యపై
మదగజయాన పండుకొనె మాధవరాధిక వేప మాసయై."

ఈ పద్యంతో శృంగారవీధి కావ్యమారంభమవుతుంది. ఇందులో "మదన మహీపతి'' అన్న ప్రారంభ పదము జయదేవునిది.

''మదన మహీపతి కనక దణ్డరుచి కేసర కుసుమవికాసే
మిళిత శిలీముఖ పాటల పటల కృతస్మర తూణ విలాసే....''

అని గీత గోవిందంలో జయదేవు డంటాడు. సత్యనారాయణగారు ఈ పదబంధముతో కావ్యాన్ని ఆరంభించడం ఆయనకు జయదేవుని మీదగల గౌరవాన్ని, తన కావ్య నిర్మాణానికి గీతగోవిందం నిర్మాణ దృష్ట్యా ప్రేరణగా గ్రహించారు అనడానికి కూడా సూచన. ''మన్మథరాజు యొక్క స్వర్ణదండముల కాంతితో వికసించిన కేసర కుసుమములు కలిగి, పాటల కుసుమములు అను మన్మథ బాణములు గల అమ్ముల పొది విలాసముగల వసంతంలో బృందావనంలో కృష్ణుడు విహరిస్తున్నా"డని జయదేవుని గీత తాత్పర్యము.[18]

శృంగార వీథి తొలి పద్యములో ''మదన మహీపతి" యొక్క పూల బాణాలచే భిన్న శరీర అయిన స్త్రీ ప్రవేశపెట్టబడినది. మరి ఈమె ఎవరు? ఈమె పరిచయమేమిటి? పద్యము చివరి పాదములో సమాధానముగా ''మాధవ రాధిక'' అని చెప్పబడినది. మాధవ అనే పదానికి అనేకార్థాలున్నాయి. వాటిలో ఒకటి శ్రీకృష్ణుడు; మరొకటి వసంతుడు. వ్యుత్పత్తి ననుసరించి మాధవ శబ్దము విష్ణువాచకమైనది. లక్ష్మీదేవికి భర్త అని వ్యుత్పత్త్యర్థము. ఈ శబ్దము కృష్ణ వాచకముగా కూడా ప్రసిద్ధమే. సామాన్యముగా సాహిత్యములో విష్ణువాచక పదాలన్నీ కృష్ణవాచక పదాలుగా ప్రయోగంలో ఉన్నాయి. ఇక్కడ కృష్ణ పదం విష్ణువు యొక్క సంపూర్ణావతారానికి సంబంధించింది. కృష్ణుడు లీలామానుష విగ్రహుడని ప్రసిద్ధమే విష్ణువుతో ఈయనకు ఈ విధముగా అభేదము. మాధవ శబ్దము వసంతుని (ఋతువు) విషయంలో లోక రూఢమైనది మాధవ రాధిక అన్నప్పుడు కృష్ణుని యొక్క రాధిక అనిగాని, వసంతానికి సంబంధించిన రాధిక

...కాని చెప్పవచ్చు. వసంతము కూడా కృష్ణ రూపమే. భగవద్గీతలో శ్రీకృష్ణుడు తన విభూతిని వివరిస్తూ - "ఋతూనాం కుసుమాకరః" ఋతువు లలో నేను వసంత ఋతువును అంటాడు. మరి రాధకు విష్ణువుతో సంబంధ మేమిటి, విష్ణ్వవతారమైన కృష్ణునితో సంబంధమేమి? ఇక్కడ కృష్ణుడు పరమేశ్వరుడని, రాధిక ఒక జీవి అని గుర్తిస్తే వారిద్దరి మధ్య సంబంధము, జీవేశ్వర సంబంధమౌతుంది. ఈ సంబంధాన్ని అనుసరించి మిగిలిన సంబంధా లన్నీ ఆశ్రయిస్తాయి. శృంగార భావము కాబట్టి ఒక్క పితాపుత్ర సంబంధము మాత్రం ప్రసక్తము కాదు. అందువల్ల ఈ కావ్యంలో రాధామాధవులను గూర్చి వివరించేటప్పుడు కేవలం లౌకికమైన శృంగార దృష్టితో ఆలోచించడానికి వీలులేదు.

లౌకిక స్త్రీ పురుషుల మధ్య వ్యక్తమయ్యే ఉదాత్త శృంగార భావం జీవేశ్వరులకు అనువర్తిస్తే అది మధురభక్తి అవుతుంది. మధురభక్తి అంతా శృంగార స్వరూపమే. "శృంగార ఏవ, మధురః పరః, ప్రహ్లాదనోరసః" అని ఆనందవర్ధనుడన్నాడు. శృంగారమే పరము అంటే ఉత్తమము, మధురము. ...అత్యంత ఆహ్లాదము కలిగించు రసము అని తాత్పర్యము. దానినిబట్టి "మధుర" శబ్దం పరప్రహ్లాదనకరమైన ఉత్తమ శృంగార భావానికి ప్రతీక. 'పరప్రహ్లాదన' అన్నప్పుడు "పర" శబ్దం పరమేశ్వర సూచన మనుకొంటే శృంగారంయొక్క ప్రాశస్త్యం మరింత మనోమోహకంగా ఉంటుంది. మరి ఈ మాధుర్య ప్రహ్లాదనగుణం వల్ల భక్తి మధుర భక్తిగా, శృంగార రూపంగా భావించబడు తున్నది. అందుకే మధురభక్తి యొక్క వ్యక్తీకరణమంతా శృంగార రస పరి భాషలోనే సాగుతుంది.

"భక్తికి వాహకం శృంగారమే అంటే భక్తి అనుభవాన్ని ప్రకటించే భాష అంతా శృంగార రసోచితమే. దానిద్వారానే దానికి వ్యక్తీకృతి. ఇది జీవ సంపుటిలోని అనుభవ స్వరూపాన్నిబట్టి చెప్పిన మాట. ప్రపంచ సర్వ సాహిత్యాలలోను దైవానుభవము శృంగారాత్మక శబ్దంలోనే ప్రకటించ బడింది."19

అని ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావుగారు నిరూపించారు. భక్తి మార్గములో జీవుని వేదన ప్రధానము. జీవునిలో ప్రసుప్తంగా ఉన్న వేదన ఆయా జీవ సంస్కారాలనుబట్టి వ్యక్తము అవుతూ ఉంటుంది. అది ప్రాకృతిక పరిసరాలు, వ్యక్తులు మొదలైన వారివల్ల కలిగే ఉద్బోధతో తీవ్రతరం అవుతుంది. పరమేశ్వరుని పొందాలనే తపన పరాకాష్ఠ దశకు చేరినపుడు మాత్రమే పరమేశ్వర లాభం కలుగుతుంది. ఈ పరమేశ్వర లాభం కలిగిన తరువాత, ఆ పరమేశ్వరుడే జీవుని అనుసరియిస్తూ, తన సంబంధం వల్ల కలిగిన జీవుని ఆనందాన్ని పంచుకుంటాడు. ఇది ఈ కావ్యంలోని ప్రధాన వస్తువు

వైష్ణవ భక్తి మార్గంలో జీవేశ్వరుల మధ్య ఆచార్యుడు కూడా ఉంటాడు. ఈ కావ్యంలో దూతికది ఆచార్య స్థానం. ఆచార్యుడు జీవునిలోని తీవ్రవేదనా స్వరూపాన్ని భగవంతునికి వ్యక్తపరచినట్టే జీవునిలో పరమేశ్వరునికి సంబంధించిన తపనను ఉద్దీప్తం చేస్తుంటాడు. తీవ్ర తపనద్వారా తప్ప భగవంతుడు అల వోకగా లభ్యమయ్యేవాడు కాడనే భావం జీవునిలో దృఢపరుస్తాడు.

వేయి పడగలు నవలలో సత్యనారాయణగారు గిరిక, ధర్మారావుల మధ్య జరిగిన సంభాషణలో తపనను ఈ విధముగా వ్యక్తీకరిస్తారు -

> "గోపికలనగా భగవంతుని యందు బద్ధానురాగలైన స్త్రీ మూర్తులని కాని, గొల్లవారని కాదు. నీవు కూడా గోపికవే. 'అదె నందనందనుం దర్శితుండయ్యె బాటల్ తరువాత పట్టరమ్మ' అన్నంత యెడలు తెలియని తనము వచ్చుటయే గోపికా లక్షణము...." "తల్లీ, ఇది ఎనిమిది నెలలలోనే సిద్ధించెడి విద్యయైనచో ఋషులకు యుగములు పట్టుచేల?...." "చేసినదే చేసి, చేసినదే చేసి నీ ప్రాణము విసుగవలయును, అప్పుడతని ప్రాణములు విసుగును. అప్పుడుగాని ఆ దొంగ గుండె కరుగదు. ప్రాణము వేధించుటలో అతడె మొనగాడు."[20]

జీవునిలో తపన అంతగా గాఢతరము, గాఢతమము కావలెనన్న మాట! ఇందుకు ఆచార్యులు దోహదం చేస్తుంటారు. ఈ భూమికపై శృంగార వీథి కావ్యము విస్తరించింది.

## శృంగార వీథి: వస్తు విన్యాసము :

అయిదు భాగాలుగా ఉన్న "శృంగార వీథి" కావ్యము "వేపమానయైన" నాయికతో ఆరంభమవుతుంది. ఆమె "నిర్దయుడైన గోపరమణీ ప్రియునే స్మరియించుచు" కృష్ణుడు కాదుస్తుంటుంది. "తమాల నికుంజ లతాంత శయ్యా పీఠి" ఉన్న ఆమె పైకి—

"చల గోపాల కుమారు ముంగురులకూఁ పై గోప కన్యాకుదం
బుల సంబారజ తావిఁ గొల్లగొని యా పున్నాగవాటీమహు
త్పల మాకందర సోత్థమర్మసలిల స్నానంబులందేలి, కో
మల గంధా వలగంధ వాహములు బృందా భూమిఁ బ్రాకాడెడిన్"

ఆ కృష్ణుని ముంగురుల స్పృశించి వాయు ప్రసారము భగవంతుని గూర్చిన వివిధ భావనలను ప్రకోపింప చేస్తుంది. బృందావీధిలో గాలి, ఇసుక తిన్నెలు, చెట్లు మొదలైన సమస్తం "కేశవ శిశుక్రీడా పదస్థాన"ములుగా ఆమెకు దర్శన మిస్తుంటాయి. తన పరిసరాలలోని ప్రకృతి పూలు, పూల వాసనలు, కోకిల ధ్వనులు, చంద్రుడు, వెన్నెల మొదలైనవన్నీ భగవద్విరహాన్ని ఉద్దీప్తం చేస్తుంటాయి. సామాన్య ప్రబంధాలలో మందానిల చంద్రాదులు ఉద్దీపన విభావాలుగా ప్రదర్శించడం సాధారణమైన అంశం. ఇక్కడ కూడా ఆ ఛాయలే కనిపిస్తాయి కాని, అక్కడి ఈ ఉద్దీపన విభావాలు కేవలం లౌకిక పరిమితుల్లో మాత్రమే పరిభ్రమిస్తుంటాయి. కాని, ఇక్కడ ఇవన్నీ భగవత్సంబంధాన్ని ఉద్దీపింప చేస్తుంటాయి. మౌనిజన మస్తక దేశములలో కంటే బృందావీధులలో సమధిక ప్రవృత్తి, సంగత వైష్ణవ పాద చిహ్నములు స్పష్టపడుతున్నాయి.[12] అక్కడి ఇసుకలపై "గోపకన్యామకైశోర కేశవ పాదాంకిత శంఖచక్ర నవరాజి చిహ్నములు" కనబడుతున్నాయి. ఈ విధముగా సర్వము ఆమెకు భగవన్మయంగా భగవద్విలాసభాసురంగా కన్పిస్తుంది. ఆ భగవంతుని పొందును గూర్చి ఆమె వేదనను తీవ్రతను చేస్తుంటుంది.

"శ్రీదములై వైకుంఠనగరీముఖకుడ్యగతాత్మ దర్శనా
పాదిత సర్వమౌని జనవల్లభ మోక్షములై పురాసమా
స్వాదితమత్సమర్పిత లసత్పరిరంభరసాబ్ధులౌ భవ
త్పాద సరోరుహానుభవభాగ్యము విస్మృతి రాదు మాధవా!''

అంటూ ఆ పరమేశ్వరుని పొందుకలుగక పోవడంవల్ల దుఃఖపడుతుంది.

'హస్తగతాసువ న్స్రవహితాధిక బాష్పరుఘరన్మహర్మహు
స్స్రస్తకుచాంబర న్మృదుర సాలకిసాలపదన్ మనోవ్యథా
ధ్వస్తవివేకనున్ బ్రతిపద క్షుభితన్ సఖియోర్చె శ్రీపతి
న్యస్తమనోజ్ఞ బూర్వతరునవ్యనికుంజపునః ప్రవేశితన్.''

రాధ హస్తగతాసువు అయినది. ధారాపాతంగా దుఃఖిస్తున్నది. శయ్య
్యస తొలగిపోతున్నది. లౌకిక స్థితి వివేకము కోల్పోతున్నది. అనుక్షణం
ొందుతున్నది. ఈ స్థితిలో సఖి ఆమెకు ఓదార్పుగా నిలిచింది.

ఈ సఖి ఆచార్య స్థానీయురాలు. జీవునికి పరమేశ్వర సంయోగము
చేందుకు కావలసిన వ్యవహారాన్ని ఆచార్యుడే నిర్వహిస్తాడు. సఖిగా ఊర
దూతికగా వ్యవహరిస్తాడు. ఈ కావ్యంలో సఖి కృష్ణుని దగ్గరకు దూతి
వెళ్ళడంతో రెండవభాగం ఆరంభమవుతున్నది. ఈమె వెళ్ళేటప్పటికి
డు ''రాసకేళీలీలాజనిత శ్రమాపనోదార్థం''గా ఒక పొదరింటిలో విశ్ర
్నాడు. ఇక్కడ రాసకేళి ప్రస్తావన జీవేశ్వర కేళికి సూచన. ఆయన
 నుండే దూతిని గుర్తుపట్టి, ఆమెకు ఎదురువెడతాడు. ఈ వెళ్ళటం రాధ
శ్రీకృష్ణునికి గల గౌరవానికి సూచన.

ఈ కృష్ణుడు వ్రజపతి అంతకుముందే రాసక్రీడ జరిగింది. అందులో
న్న గోపికలెందరో తెలియదు. పాల్గొనని గోపికలు కూడా కొందరుండ
. పాల్గొనే అవకాశంలేని ఆ గోపికలు కూడా ఈ గోపికలంతటి తీవ్ర
. కలవారే. కృష్ణుడు ఈ రెండు విధాల వారికీ ప్రభువు. పాల్గొననివారిపై
 ఆయనకు ప్రేమాభిమానాలున్నాయి. కేవలం రాసక్రీడలోని గోపికలకు
మే ఆయన ప్రభువు కాడు. వ్రజమందలి గోపికలందరికీ ప్రభువే. అందుకే
క్రీడలోపాల్గొనని రాధ దగ్గరినుండి వచ్చిన దూతికకు ఎదురేగడములో
మీద ప్రేమ ఆయనకున్నదని చెప్పబడినది. భగవంతుడికి జీవులపై ఉండే
మే ఇది.

స్వామికి రాధా విరహాన్ని దూతి వివరంగా విన్నవించుకుంటుంది.
రాధా విరహంలో కూడా అలౌకికమైన భగవద్భావన వ్యాపించి ఉంటుంది.
కు....

"దయ చేయంగదె నందగోపకుల రాధాకృష్ణ యంచున్ సదా
ప్రియతాత్మం జపియించుచున్న యది బాష్పప్లుష్ట నేత్రద్వయిన్
నయనంబందున నంటుకొన్న యది కార్శ్యంబంది యేకయ్యె న
య్యయొ ప్రాభాతిక చంద్రరేఖవలెఁ గృష్ణా పల్లవీ పల్లవా!"

అని అంటుంది. రాధాకృష్ణ అనటంలో, రాధాకృష్ణుల అవిభాజ్యత్వం వ్యక్తమౌతుంది. కృష్ణు డెప్పుడూ రాధా సహితుడే. ప్రస్తుత వియోగము ఆభాస మాత్రమే కాని యథార్థము కాదు అని తాత్పర్యము. ఈ దూతిక వాక్యంతో రెండవ ఖండం పూర్తవుతుంది.

కృష్ణుని దగ్గరనుంచి దూతిక తిరిగి రాధ వద్దకు రావడంతో మూడవ భాగం ఆరంభమవుతుంది.

''రోషము గాటుపడ్డగ తిరూక్షదృగంచల'' అయిన దూతిక రాధ వద్దకు రాగానే ఆమె ఏదో శుభవార్త తెచ్చిందని సంతోషపడుతూ ఆమెకు ఎదురై కవుగలించుకొని రాధ—

''నా సందేశము తా నెఱింగికొనెనా? నా మాట లాలించెనా?
రాసక్రీడలు మానెనా? యిచటికిన్ రాఁగా దలంపూనెనా?
గోసంత్రాణ సుశీలుఁడచ్యుతుఁడు నాకుం బ్రాణ బంధుండు నే
నా సంకర్షణదేవు ప్రాణములకున్ బ్రాణంబనే నెచ్చెలీ!''

అంటూ ఎంతో ఆత్రంగా అడుగుతుంది. కాని దూతిక—

"మార ధనుర్ద్వయంబువలె మండలబద్ధ సహస్రషోడశా
భీరకులై కహోయన విభీత మృగీసమలోచనాదృగం
భోరుహచంచలా సహిత మోహనతోయదమూర్తి వంశగ
ర్జారవశీలికిన్ మనము జ్ఞాపకమా! యదువంశ మౌళికిన్''

అంటుంది.

రాసకేళిలో గోపికలందరూ ఒక వలయంగా ఏర్పడ్డారు. ఆ వలయం మన్మథుని రెండు ధనుస్సులు ఎదురెదురుగా కూర్చినట్లున్నాయి అనడం సందర్భానికి అనుగుణమయిన ఒక గొప్ప భావన. చుట్టూ గోపికలున్నారు, మధ్యలో కృష్ణు డున్నాడు. ఆ గోపికలందరూ ఏడాది వయస్సు నిండిన లేడి

యొక్క కన్నుల వంటి కన్నులు గలవారు. వయసు పెరిగిన లేళ్ళ కన్నుల కన్న ఏడాది లేళ్ళ కళ్ళు ఎంతో అందమైనవి.22 ఆ కళ్ళతో వారు కృష్ణుని చూస్తున్నారు. కృష్ణుడు నీలిమబ్బు. ఆయన మీద ప్రసరించే గోపికల చూపులు మెరుపులు. మెరుపులతో ఆ మబ్బు గర్జాశీలమైనది. ఇక్కడి ఈ పోలికలన్నీ భావనలో ఎంతో మాధుర్యాన్ని కలిగిస్తాయి. ఈ మాధుర్యము రాధను ఉత్తేజ పరచింది. తానక్కడ లేదు. కృష్ణుడు తన దగ్గరకు వస్తాడని ఆశిస్తే, అదీ జరుగలేదు దానితో తన ఆశాలత తెగిపోయిందనుకుంటూ ఆ కృష్ణుని స్మరిస్తూనే, కృష్ణుని రాసకేళీ విలాసాన్ని మరింత వివరించమని దూతికను కోరుతుంది. ఆ దూతిక చేసిన రాసక్రీడా వర్ణన ప్రకృతి జీవులు భగవద్భావముతో ఎంతగా పరవశులై పోయినారనేది చిత్రిస్తుంది.

> "ప్రాభాతంబుజశోణపత్ర సమనేత్ర ద్వంద్వమై యొప్పు ప్ర
> త్యాభీరిద్వయమధ్య కల్పిత వినూత్నాంభోదమాలాలస
> చ్ఛోభామూర్తిగ దివ్యషోడశ సహస్రోఢాంగనా పారిహా
> ర్యాభోగంబున బాలకృష్ణసుషిరంబామ్నా యముల్ర్మోసెడున్."

ఆ ఆమ్నాయ విశ్వగానలహరిని బృందావనదేవత ప్రతిధ్వనిస్తున్నది. ఆచార్య స్థానీయురాలైన దూతిక ఆమెలో విరహ భావాన్ని తీవ్రతరం చేసింది. ఈ విధముగా భగవన్మయత్వాన్ని విని, అది తనకు లభ్యం కాలేదన్న తీవ్ర దుఃఖంతో రాధ మూర్ఛపోతుంది.

శృంగార చిత్రణలో దశావస్థలు అలంకార శాస్త్రంలో చెప్పబడ్డాయి వాటిలో చివరిది మృతి. కాని, మృతిని చిత్రించటం అమంగళం. మృతి పొందితే కథే లేదు. అందుకని కవులు మృతివంటి మూర్ఛావస్థను వర్ణిస్తారు. అంటే, నాయిక నాయకుని కొరకు - జీవుడు పరమేశ్వరుని కొరకు - తమ తీవ్రతరమైన తపన వల్ల మృత్యువుతో సమానమైన ఈ దశకు చేరుకుంటాడు. ఇంతకు మించిన మరొక దశ ఉండదు.

ఈ దశలో రాధ దగ్గరకు శ్రీకృష్ణుడు రావడంతో నాలుగవ భాగం మొదలవుతుంది.

"ఆ సాయంతనమే కిశోరహరి తానై రాధికాదేవి చిం
తాసౌధంబున కేగి కాల్నడ దరిద్రంబైన ద్వాశ్శోభకా
యాసంబై త్వరమాణ చిత్తుఁడయి సౌధాంతః ప్రదేశంబునం
దాశోకాంబుధిమగ్న రాధఁగని గాద్గద్యంబు దీపింపఁగా!"

రాధా అని పిలుస్తాడు. రాధాదేవి యొక్క దశ ఆయనలో ఏ విధమైన కదలికను కదలించిందో అది గాద్గద్యం అన్న మాటతో స్పష్టపడుతుంది. శ్రీకృష్ణుని ఈ పిలుపు మూర్ఛాగ్రస్తురాలైన రాధకు ప్రాణాధారంబుగ విన వస్తుంది. ఆమె తలెత్తి "హృద్బాధానూచి వికంపితాంగుని గనె న్బాష్ప ప్లవన్నేత్రునిన్." ఇక్కడ రాధాకృష్ణులు ఇద్దరు కూడా దాదాపు ఒకరిని గూర్చిఒకరు ఒకే దశకు చెందిన భావముతో ఉన్నారు. అందుకే—

"చూచిన యంతలోన మధుసూదనులోచనముల్ స్రవన్నిరం
తాచిత బాష్పవారి కలనంబున రాధకనుల్ స్రవన్నిరం
తాచిత బాష్పవారి కలనమ్మున వారి యుగాంతరంబునన్
జూచిన చూపులై కనులు సుందరమీనతఁ బొందె సర్వదా."

ఇక్కడ శ్రీకృష్ణుని కన్నులు, రాధ కన్నులు "స్రవన్నిరంతాచిత బాష్పవారికలవి". ఇద్దరియందు ఈ దశయొక్క సమానత్వాన్ని వ్యక్తం చేయడంకొరకు, ఇద్దరి విషయంలో "స్రవన్నిరంత...." అనేది పునరుక్తము చేయబడినది. ఇద్దరు కౌగలించుకున్నారు. ఇంత సుదీర్ఘమైన వియోగ బాధ క్షణంలో తీరిపోయింది. ఫలసిద్ధి కలిగినపుడు ఆ సిద్ధికోసము పడ్డ అనేక కష్టాలు గుర్తు రాకపోవటం చాలా సహజం.[23]

"ఒక రెండు చక్రవాకము
లొక రెండు చకోర పక్షులొక రెండు మయూ
రకములు రెండు బలాకలు
ముకురానన వృష్ణి చంద్రముఁడుగా నయ్యెన్."

దీనితో జీవేశ్వర సమాగమము - రాధాకృష్ణ సమాగమము చిత్రితమైనది. ఇక్కడితో ఈ కావ్యము పూర్తి కావలసిందే. కాని, దీనికి మరొక భాగాన్ని సత్యనారాయణగారు చేర్చారు

భగవంతుడు భక్తునితో కలిసిన తరువాత ఆ భక్తునికి తాను ఒక ప్రియుడుగా సేవ అందిస్తాడు. మధురభక్తి లోని పరాకాష్ఠ దశ యిది. భగవంతుని విషయంలో జీవుని తపనకు భగవల్లాభమువల్ల ఉపశాంతి ఉంటుంది.

రాధకు శృంగార మార్గాన కృష్ణుడు పరిచర్య చేయటం, ఆమెను అనునయించటం మొదలైన మాధుర్యాంశాలు ఈ భాగంలో చిత్రించబడ్డాయి. ఈ భాగానికి, కావ్యానికీ కూడా సమాపక పద్యం—.

"నీ కరముల్ మదీయభుజనిష్ఠితముల్ మఱి నీ తనూలతన్
నా కరముల్ కడుంగడు పెనంబడియున్నవి రెండు మేనులున్
మోకలవోలె నంటుకొనిపోయిన వో ప్రియురాల! నేఁటి యీ
చీఁకటిలోన నీ మనల చెల్విది నా యెదలోనఁ జొచ్చెడున్"

"ఈ మనల చెల్విది నా ఎదలోన జొచ్చెడున్" అంటాడు. మన అంటే నీవు, నేను - ఈ ఇద్దరి సంపుటి - ఏకీభావము. ఇది చివరకు స్వామి యెదలో ప్రవేశించింది. అంటే, స్వామి, జీవుడు అనే విభేదం పోయింది. దానితో సాయుజ్యలక్షణం వ్యక్తమౌతుంది.

## శ్రీకృష్ణదేవుని నిర్వేదము :

శృంగారవీథి సంకలనములో రెండవ కావ్యము శ్రీకృష్ణదేవుని నిర్వేదము. ఈ కావ్యము ఏడు ఖండాలుగా రచింపబడినది. ఇందులో యథార్థంగా కథ అని చెప్పుకోదగిన వస్తువేదీలేదు. కాని, ఆద్యంతము ఒక విధమైన అంతః సంఘర్షణ ఈ కావ్యంలో వ్యాపించి ఉంటుంది. ఆ ఘర్షణ యొక్క ఉపశమనమే కావ్యానికి సమాప్తి. ఈ సంఘర్షణ తనకు బాహిరమైన మరొకదానితో కాక తనతో తనకే సంఘర్షణ. అంటే, తనలోని ఒక తీవ్ర భావానికి, తన మౌలిక లక్షణానికి సాగిన సంఘర్షణ అభివ్యక్తం కావడానికి ఆలంబనగా ఎందరో కొందరు వ్యక్తులు బాహిరంగా కనిపించవచ్చు గాని వారికి ప్రాధాన్యంలేదు. వారు ఆ ఘర్షణ సాగుతున్న విధానానికి సంబంధించి వేరు వేరు రకాల అభివ్యక్తులు మాత్రమే. వారందరూ ఈ సంఘర్షణాగ్నిని ప్రజ్వలింపచేసే సమిధలవంటివారు.

ఒక విధంగా ఉద్దీపన విభావాలని అనవచ్చును. ఈ కావ్యంలో బాహిరమైన ప్రకృతి అందులోని వివిధ అంశాలు ఎక్కడా ప్రస్తావించబడవు. అందువల్ల మలయానిల చంద్రాదులు కాక వాటి స్థానంలో వ్యక్తులే ఉద్దీపన విభావాలుగా ప్రవర్తిస్తారు. అంటే, ఈ వ్యక్తులందరూ ప్రకృతిలోని ఏదో కథ సాగినట్లు "ఆభాస" మాత్రమే. ఆభాసించేది యధార్థము కాదు. యధార్థమైన దానికి "ఆభాస" లక్షణముండదు అందువల్ల ఈ కావ్యంలో కథా లక్షణం ఉన్నది అనుకొంటే ఉన్నట్లుగానే అనిపిస్తుంది. లేదనుకుంటే లేనట్లు అనిపిస్తుంది. ఈ వస్తు స్వభావము మీదనే కావ్యమంతా ప్రవర్తిస్తుంది. ఈ విధంగా "ఉన్నదీ లేదు" అనే రెండు లక్షణాలు కలది కేవలం "మాయ" మాత్రమే.

శ్రీ శంకర భగవత్పాదులు "మాయ"ను నిర్వచిస్తూ అది "సదసత్ అనిర్వచనీయ" అన్నారు. అంటే సత్ అని కాని, అసత్ అనికాని నిర్వచించ డానికి వీలులేనిదని అని అర్థము. దీనికి రజ్జు సర్పవిషయాన్ని వేదాంతులు ప్రసిద్ధంగా ఉదాహరిస్తారు. చీకటిలో రజ్జువును, అంటే తాడును స్పృశించినంతలో పాము అనే భావం కలుగవచ్చును. ఆ భావం కలిగినంతలోనే పామును స్పృశించి నందువల్ల కలుగవలసిన మనశ్శరీర వికారాలన్నీ కలుగుతాయి. కాని, వెలుగు వచ్చి అది తాడు అని తెలిసినంతలోనే ఈ వికారాలన్నీ లేకుండా పోతాయి. ఈ సర్పత్వం యొక్క లక్షణమేమిటి? అది ఉన్నదా - లేదా? అంటే తెలియక ముందు ఉన్నది, తెలిసిన తర్వాతలేదు. అందువల్ల ఇది నిజంగా ఉన్నదని కాని, నిజంగా లేదని కాని చెప్పడానికి వీలుకాని అంశము. సామాన్యముగా లోకములో తెలిసినప్పుడు ఉండటం, తెలియనప్పుడు లేకపోవటం అనేది సహజం. ఒకప్పుడు మన ప్రక్కనో, వెనుకనో ఉన్న వస్తువును లేదా వ్యక్తిని మనం చూడని దశలో వారికి సంబంధించిన జ్ఞానం మనకు లేదు. అందువల్ల ఆ వస్తువుకాని, వ్యక్తి కాని లేనట్టుగానే మన ప్రవర్తన సాగుతుంది. కాని, మనం చూసినంతలో ఆ వస్తువు లేదా వ్యక్తి కనిపిస్తాడు. అప్పుడు వారున్నట్టుగా మన ప్రవర్తన సాగుతుంది. తెలిసినప్పుడు "ఉనికి" ఉన్నది. తెలియనప్పుడు లేదు. అంటే ఈ ఉండటం, లేకపోవటం అనేది జ్ఞానం మీద ఆధారపడి ఉన్నది. ఈ కారణం వల్లనే జ్ఞానం వల్ల "మాయ" తొలగుతుందని "జ్ఞానాన్ మోక్షః" అని చెప్పబడుతుంది.

ఈ "మాయ" అనేది అద్వైతానికి ప్రబలమైన భూమిక. ఈ మౌలికమైన విషయాన్ని వస్తువుగా తీసుకొని ఘర్షణను, వేదనను భూమికగా చేసుకొని ఒక కావ్యాన్ని రచించడమనేది సాహిత్యంలో ఒక అపూర్వమైన విషయం. ఏ సాహిత్యంలోనైనా "శ్రీకృష్ణదేవుని నిర్వేదము" వంటి కావ్యము అది ఒక్కటి మాత్రమే.

ఏ తాత్త్వికమైన విషయమైనా కూడా శాస్త్ర విషయమే అవుతుంది తప్ప కావ్య విషయము కాదు. శాస్త్రీయమైన విషయానికి శాస్త్రంలో విపులమైన చర్చలు, ప్రతిపాదనలు, వాదప్రతివాదాలు, ఖండన మండనలూ, సిద్ధాంతీకరణలూ మొదలైన అనేకాంశాలు సుదీర్ఘంగా అవసరమౌతాయి. ఆ విధంగా శాస్త్రం దానంతట అది తార్కికమైన ఓ ప్రత్యేక మార్గం. కాని, సాహిత్యంలో రస భావాలకు ప్రాధాన్యం. ఇక్కడ చర్చలు మొదలైనవి ఇముడవు. ఈ రస భావ పరివేషంలో శాస్త్రీయాంశం కలగలసిపోయి పాఠకుల హృదయాలను రంజించినప్పుడే అది వాస్తవానికి కావ్యమౌతుంది. సామాన్యంగా రకరకాలైన శాస్త్రీయాంశాలు ఏ వర్ణనలోనో, ఏ ఉపమానాది విధానాలుగానో కావ్యాల్లో వ్యక్తీకరించబడుతుంటాయి. ఉదాహరణకు—

"లేని వున్నట్లుగాఁ గానిపించుట కెండమావులు తార్కాణ మలయఁజేసె
తెలివివెల్గున మాయాతాలఁగు కంటకుకెండకెండ సరస్సు సాదృశ్యమిచ్చె
పైని పటారమ్ము లోన లొటారమ్ము మేనంచు రూపించె మేడిపండు
ప్రాణానికి విరోధి ప్రాణమ్మె యని వడగాలిఁ గీడ్వడిన జనాళి తెలిపె
నటఁదరంతర ప్రతిపత్తియందు జీవుఁడట్లె సంపరిష్వక్తుడై యరుగునంచు
ధరణికెరియలు నీటియావిరులు భావి సస్య సంస్కార గూఢ
బీజములు నెఱపె."[24]

ఇక్కడ గ్రీష్మ వర్ణనలో సహజమైన అంశాలు, శాస్త్రీయమైన అంశాలు కలగలసి పోయినవి. లేనిజలాన్ని ఎండమావులు ఉన్నట్టుగా ఆభాసింప చేస్తాయి. "మాయ" జ్ఞానం వల్ల తొలగిపోతుంది. ఇటువంటి ఈ అంశాలన్నీ గ్రీష్మ వర్ణనలో కలసిపోయినాయి మహాకావ్యాలన్నింటిలో శాస్త్రీయాంశాలు అలంకార రూపంగానో, ప్రకృతి వర్ణన రూపంగానో, ఉదాహరణ ప్రాయంగానో కనిపిస్తాయి.[24(a)] అక్కడ వాటిని వివరించటం ప్రారంభిస్తే, కావ్యత్వం

అప్రధానమై, శాస్త్రత్వం ప్రధానమౌతుంది. ఒక్కొక్కప్పుడు మహాకావ్యాల్లో ఇట్లాంటి వివరణలకు అవసరం ఏర్పడవచ్చు. అప్పుడు ఆ కావ్యంలో అది అంతర్భాగంగానో - వస్తువులో భాగంగానో సాగుతుంది. చిన్న కావ్యాలలో ఈ వివరణకి అవకాశం తక్కువ. వివరించకుండానే మనసుకు అభ్యసింప చేసేట్లు రచన సాగుతుంది. శాస్త్రీయమైన మాయా విషయాన్ని కావ్య వస్తువుగా చేసి, శృంగారాదులను అభ్యసింపచేస్తూ సృష్టింపబడిన ఒక అద్భుత కావ్యం "శ్రీకృష్ణదేవుని నిర్వేదము."

నిర్వేదము అనేదానికి రోత, స్వావమానము, తననుతాను నిందించు కొనుట, పరమవైరాగ్యం, దుఃఖం అని సూర్యరాయాంధ్ర నిఘంటువు అర్థాలను చెప్పుతుంది. వేదాంత శాస్త్రంలో ప్రసిద్ధమైన ఈ నిర్వేదం అలంకార శాస్త్రంలోనూ కనిపించటం ఒక విచిత్రం. అలంకార శాస్త్రమందు "నిర్వేద" మనేది ఒక "భావము" అని చెప్పబడింది. భరతుడు రస నిష్పత్తిని గూర్చి "విభావానుభావ, వ్యభిచారిభావ, సంయోగాత్ రసనిష్పత్తిః" అని సూత్రీక రించాడు. ఇందులో వ్యభిచారి భావ వర్గములో మొట్టమొదట చెప్పబడినది నిర్వేదం. భరతుడు "నిర్వేదము"తోనే వ్యభిచారి భావాలను పేర్కొనటం ప్రారంభించాడు. వ్యభిచారి అనగా విశేషముగా రసానికి అభిముఖంగా చరించేది అని అలంకార శాస్త్రము చెప్పుతుంది.[25] సంచారి భావాలు స్థిరమైన భావాలు కావు. వివిధస్థాయి భావాలకు వివిధ సందర్భాలను అనుసరించి ఇవి వస్తుంటాయి తప్ప ఏ ఒక్క దానికి మాత్రమో సంబంధించినవి కావు. వ్యభిచారి భావాలకే సంచారి భావాలని కూడా మరొక పేరు.

అలంకార శాస్త్రంలో నిర్వేద మనగా దుఃఖం, అసూయ, పదార్థముల యదార్థజ్ఞానము మున్నగు వానివల్ల కలుగు నిష్ఫలత్వబుద్ధి. ఈ నిర్వేదమున చింతకన్నీను నిట్టూర్పులు అనే అనుభావాలు పొడ సూపును అని అలంకార శాస్త్ర గ్రంథంలో వివరించబడినది.[26] ఈ నిర్వేద లక్షణములలో చెప్పబడిన దుఃఖము అనుభావంగా చెప్పబడిన చింత "శ్రీకృష్ణదేవుని నిర్వేదము" అన్న ఈ కావ్యంలో ప్రాధాన్యం వహిస్తున్నది. విషయముక్త వినాశముతో స్వస్వరూప విజ్ఞానముతో కావ్యము పూర్తి అవుతుంది.

ఈ కావ్యము యొక్క చిట్టచివరి పద్యమిది—

"యదువుల యందుఁ జుట్టము లతాంగుల యందున భర్త ద్వారకా
స్పదులగువారికిం బ్రభువు భక్తుల పాలిఁటి కామధేను వా
యదుకులమౌళి యేది యగు? నన్నియునౌ; మఱియేదికాఁడు? నె
య్యదియునుగాఁడు; తత్ప్రభుదృగంతపువెన్నెల సర్వమైచనన్."

శ్రీకృష్ణుడు యాదవులు మొదలైన వారి విషయంలో ఏ విధముగా ప్రవర్తిస్తున్నాడో ఈ పద్యంతో చెప్పబడింది. ఇంతమందికి ఇన్ని విధాలుగా అనిపిస్తున్న కృష్ణుడు మౌలికంగా ఎవరు? ఏమౌతాడు? అన్న ప్రశ్నకు సమాధానమా అన్నట్టు "యదుకుల మౌళి ఏదియగు? నన్నియునౌ; మరియేది కాడు నెయ్యదియును కాడు" అని చెప్పబడింది అన్నీ ఔతాడు. ఏదీ కూడాకాదు. అన్నీ అయి ఏదీకాక పోవటమనేది ఒక విచిత్రమైన వైరుధ్యం ఇది మాయా లక్షణము. ఈ మాయ తొలగిన తరువాత యధార్థమైనది "తత్ప్రభుదృగంతపు వెన్నెల" మాత్రమే. వెన్నెల తెల్లనిది. శుద్ధ సత్వానికి ప్రతీక. శుద్ధ సత్వ రూపమైన పరబ్రహ్మము ఎన్నెన్నో విధాలుగ ప్రవర్తిస్తున్నది. ''మాయా'' తీతమైనది పరమేశ్వర తత్త్వము. రామచంద్రుడిని "మాయా మానుష విగ్రహుడని," శ్రీకృష్ణుని ''లీలామానుష విగ్రహుడని'' తాత్త్వికులు వ్యవహరించటం సుప్రసిద్ధం. రామావతారంలో శ్రీరామచంద్రుడు అన్ని సందర్భాల్లోను మహామానవుడిగానే కనిపించినాడు తప్ప, అక్కడ పరమేశ్వర తత్వము ప్రత్యక్షంగా అభివ్యక్తంకాదు. అనగా, శ్రీరామ చంద్రుడు మాయోపహితుడు అయిన పరమేశ్వరుడని అర్థము. శ్రీకృష్ణావతారములో శ్రీకృష్ణుడు మాయోపహితుడుగానూ, మాయాపహితుడుగాను ప్రవర్తించాడు. అందువల్ల ఆయన లీలామానుషుడు. మాయతో ఉపహితత్వము, మాయా రాహిత్యం రెండంశాలు దర్శించటానికి అనుకూలమైన అవతారము శ్రీకృష్ణుడు. అందువల్ల ఈ కావ్యము శ్రీకృష్ణుని ఆశ్రయించింది. మాయోపహితుడైన శ్రీకృష్ణునితో ప్రారంభమై మాయాముక్తకమైన పరమేశ్వర తత్వముతో ఈ కావ్యము పూర్తవుతుంది.

శ్రీకృష్ణదేవుని నిర్వేదము లోని దేవపదము ఈ పరబ్రహ్మతత్వానికి సూచన. శ్రీపదము శక్తిమత్వానికి సూచన ఈ కావ్యములోని మొదటి పద్యము ఇది:

"నానా కామిను లేగుదెంచి ప్రభువా! నా పారిజాతంబ! నా
ప్రాణప్రాణమ! నా సమస్తమ! యటం చర్చింపఁగాఁ బ్రాణము
ల్మానంబుల్ హరియాత్మతృప్తి కనఁడే మాయా సమానీతమో
కానీ యాశయొకండు లోఁగలఁచి హృత్కందంబు వేఁగించఁగా."

మాయా సమానీతమైన ఏదో ఒక ఆశ శ్రీకృష్ణుని హృదయ మూలాన్ని కదిలించివేసింది ఏ మాయా సమానీతమో అన్నది సామాన్యముగా కారణం తెలియని విషయాన్ని గురించి లోకంలో వ్యవహరించే ఒకానొక విధానం. 'ఏ మాయ కమ్మిందో కాని, ఇంతవరకు ఏమి మాయ చేసాడో కాని, అది ఏమి మాయో కాని....' అంటూ వ్యవహరించడం లోకంలో ప్రసిద్ధం. శ్రీకృష్ణుడు తెరచిన నోటిలో బ్రహ్మాండాన్ని దర్శించిన యశోద—

'కలయో వైష్ణవ మాయయో యితర సంకల్పార్థమో సత్యమో
తలపన్నేరకయున్న దాననో యశోదాదేవిఁగానో పర
స్థలమో బాలకుఁడెంత యీతని ముఖస్థంబై యజాండంబుప్ర
జ్వలమై యుండుటకేమి హేతువామహాశ్చర్యంబు చింతింపగన్."[27]

అని ఆశ్చర్యపోతుంది. వేదాంతులు మాయా విషయంలో కలను (స్వప్నాన్ని) ప్రస్తావించటం ఈ సందర్భంలో గుర్తు చేసుకోవచ్చు. శాస్త్రీయమైన ఈ మాయా పదానికి శాస్త్రీయ-వ్యవహారార్థాలు రెండు. ఇక్కడ మాయా పదానికి అనువర్తిస్తాయి. సామాన్య ధోరణిలో ఈ కృష్ణుడికి కలిగిన ఈ ఆశ ఏ మాయయో అనిపిస్తుంది. కాని, కావ్య వస్తువు దృష్ట్యా ఉపహితమైన మాయ వల్ల కలిగిన ఆశ అని స్ఫురిస్తుంది. మాయా సమానీతమైనది కాబట్టి ఈ ఆశ హృదయమూలాన్ని కదిలించివేసింది.

ఈ పద్యములోనే "హరి ఆత్మతృప్తి కనడు" అని చెప్పబడింది తృప్తి అనేది ఆశ నశించిన తర్వాత కలిగేదే తప్ప, ఆశ ఉన్నంతసేపు తృప్తి ఉండదు. ఈ ఆశ మాయా సమానీతమైనప్పుడు తృప్తి ప్రసక్తే ఉండదు. కావ్యంలో ఈ ఆశ కామతృష్ణగా చిత్రింపబడింది. కామమే సర్వసృష్టికి మూలం.

"సోఽకామయత ప్రజాయే యేతి"

అని శృతి వాక్యం. అనేక విధాలుగా తాను జన్మించాలని, లేదా పరిణమించాలని పరమేశ్వరుడు కామించాడు, కోరుకున్నాడు. ఈ కోరుకోవటంలోనే "మాయా" లక్షణం వ్యాపించింది.

ఇక్కడ చెప్పబడ్డ కామము-కోరిక బహుత్వంగా పరిణమించడానికి సంబంధించింది. ఈ పరిణమించిన తర్వాత స్త్రీ, పురుషుల మధ్య సంయోగ సంబంధానికి సూచనగా "కామము" వ్యవహారంలోకి వచ్చింది ఈ స్త్రీ - పురుష సంయోగమువల్లనే సృష్టి విస్తరిస్తున్నది. ఈ సృష్టి అంతా "స్త్రీపురుష సంయోగోద్భవ"మని పరమేశ్వర తత్వాన్ని త్రివిధ స్త్రీ పురుష యుగ్మాలుగా నన్నయ గారు దర్శించినారు.[28] ఈ కామలక్షణం వల్ల శృంగారాభాస.

శ్రీకృష్ణుడికి ఎనమండుగురు భార్యలు. వీరేకాక మరికొందరు కూడా అతనికి ప్రియురాండ్రు. వారందరి విషయంలో ఆయనకు కామముంది. కాని, ఏ ఒక్కరి వలన కూడా ఇది తృప్తి కలగడం లేదు. రుక్మిణితో అనుభవం పొందుతున్నప్పుడు సత్యభామ మీదికి, ఆమెతో ఉన్నప్పుడు జాంబవతిమీదికి.. ఇట్లా ఒకరి మీది నుండి ఒకరి మీదికి ఆయన వాంఛ కప్పదాట్లు వేస్తున్నది[29]

"అల్ల విదర్భ రాజతనయా పరిభోగము వేళ భామపై
నుల్లమువెట్టు, భామమఘవోపల కేళి గృహాంతకేళిలో
భల్లుకరాజు కూఁతుపయిఁ బాఱ మనం బట మిత్రవిందపైఁ
జెల్లును గోర్కి, లక్షణనుచేరు నటన్ మఱి యందు నిల్వదున్."

"పూనిక నష్టభార్యలను బొందెడువేళ మనస్సు రాధికా
ధీనముగా జరించు గుఱుతింపఁగ రాధికమీఁద నిల్వకే
మానా వ్రజాంగనాతనువులందుఁ జలించుఁ జలించి కుబ్జపై
నూనును గోర్కి- యచ్చటను నుండక లోగుడు సుఖ్య వొందెడున్."

ఆ వాంఛ ఎక్కడ ఆగిపోవునదో అంటే తృప్తి పొందడం లేదో, తనలో తానే గుడుసుళ్ళు పడుతున్నది. అంటే - భార్యలు, ప్రియురాండ్రు ఉన్నప్పుడు ఈ వాంఛకు లక్ష్యమయిన విషయమున్నది. కాబట్టి, వారిమీద ప్రసరిస్తున్నది. ఈ అందరిని దాటిన తరువాత లక్ష్యమేదీ లేకపోవడం వలన తనలో తానే గుడుసుళ్ళు తిరుగుతుంది. ఈ విధంగా ప్రభునాత్మ తృప్తి యనిపించదు, స్త్రీ విషయంబునందు. ఈ స్త్రీ అనేది ఇక్కడ రుక్మిణి మొదలైనవారిని సూచిస్తూనే ప్రకృతిని కూడా సూచిస్తున్నది ప్రకృతి పరమేశ్వరుల మధ్య స్త్రీ పురుషుల సంబంధం చెప్పడం ప్రసిద్ధమే. రుక్మిణి మొదలైన పేర్లను చెప్పక స్త్రీ అని జాతి వాచకాన్ని ఉపయోగించడం వలన ఈ ప్రాకృతికమైన సర్వస్త్రీ సంబంధం లోను తృప్తి కలుగడం లేదని తాత్పర్యం. ఈ ప్రకృతి స్వభావం నిత్య పరిణామం. అందువల్లనే "ఈ తృష్ణా పరివాహబిందువులుగా నెన్నేని స్త్రీ సృష్టులై చేతోవీధి స్థితిన్ లయంబుగను, హృచ్చింతానిరంతోహ బాధా తీవ్రంబయి యేచు స్వామి హృదిన్ ......"ఆయనలోని ఈ కామము ఆరని తృష్ణగా విజృంభించి స్త్రీ సృష్టికి సమస్తాన్ని "చేతో వీధులో స్థితికి లయాన్ని" పొందించు కొంటుంది. అయినా, ఆయనకు తృప్తి లేదు. నిరంతరమైన ఊహ బాధా తీవ్రముగా ఈ చింత ఆయన హృదయాన్ని కలవరపెడుతున్నది. బాధిస్తున్నది. ఈ బాధలోనే సుఖభ్రాంతి కూడా ఉన్నది. అందుకే "తద్బాధా సుఖ భ్రాంతిలోఁ జేతో మూర్తులతో రమించు హరి హృచ్చితా ప్రియావేగుడై" అనగా మనో మూర్తులతో రమించడం ఆరంభమైంది.

ఈ విధంగా మాయాయుతమైన ఆశాస్వరూపమైన తృష్ణావేగాన్ని, తీవ్రతను ఈ కావ్యంలోని మొదటి ఖండం అతిలోకంగా చిత్రిస్తుంది.

ఈ కావ్య పద్ధతిలో కామం శృంగార రేఖలతో ఆభాసిస్తుంది. ఆభాసిస్తుందే కాని శృంగారం కాదు. శృంగారంలో "కామతృష్ణ"కు స్థానం లేదు. కామస్పర్శే ఉంటుంది తప్ప కామతృష్ణ ఉండదు. ఇక్కడ స్వామిది కామతృష్ణ. అందువల్ల శృంగారాభాస. స్వామి కామతృప్తికై రుక్మిణీ మొదలైన వారు ఎన్నో విధాలుగా ప్రయత్నిస్తారు. ఒక్కొక్కరి ప్రయత్నం ఒక్కొక్క ఖండంగా చిత్రించబడుతుంది. శ్రీకృష్ణుని అష్టభార్యలలో రుక్మిణి, సత్యభామలు ప్రధాన వ్యక్తులు. వీరిద్దరి ప్రయత్నము రెండు ఖండాలు కాగా, మిగిలిన ఆరుగురి

ప్రయత్నం మొత్తముగా ఒక ఖండం. ఆ తరువాత రాధిక, ఆపైన కుబ్జ కొక ఒక ఖండం. ఈ విధంగా అయిదు ఖండాలు. ఈ అయిదు ఖండాల చిత్రణలో పంచ భూతాలను వ్యక్తీకరించటం కావ్యశిల్పము. రుక్మిణి ఆకాశానికి, సత్యభామ తేజస్సుకి, ఆరుగురు భార్యలు వాయువుకు, రాధ జలానికి, కుబ్జ పృథ్వికి ప్రతీక లుగా ఈ ఖండాల్లో చిత్రింపబడతారు. ఈ క్రమంలో చిన్న వ్యత్యాసము కనిపిస్తుంది. ఆకాశము నుండి వాయువు, వాయువు నుంచి అగ్ని (తేజస్సు), అగ్ని నుంచి జలము, జలము నుంచి పృథ్వి - ఇది క్రమం, ఇది అవరోహణ క్రమము. ఇందులో ఆకాశం తరువాత వాయువు చెప్పబడవలసింది. కాని, పై ఖండాలలో తేజస్సు చెప్పబడింది. ఇది ఒక అతిక్రమణ. అయితే, సత్యభామ శ్యమంతకమణి సహితంగా శ్రీకృష్ణునికి లభించింది. శ్యమంతకమణి అమిత తేజస్సునకు మూలమయిన సూర్యునికి ప్రతీక. ఆ విధముగా సత్యభామ తేజస్సుకు ప్రతీకగా ఇక్కడ చెప్పబడింది. అష్టభార్యాక్రమంలో రుక్మిణి తర్వాత స్థానం సత్యభామది మాత్రమే. సూర్యుడు ద్యుమణి గదా! అందువల్ల ఆకాశం వెనువెంటనే సూర్యప్రతీక శ్యమంతక లక్షిత అయిన సత్యభామ రావలసివచ్చిందని కూడా భావించవచ్చు. రుక్మిణి ఆకాశ స్థానీయురాలు కాబట్టి సత్యభామ తేజః స్థానీయు రాలు. ఇందువల్ల అసాధారణ క్రమాతిక్రమణ ఇక్కడ వచ్చినట్టుగా భావించ వచ్చును. రుక్మిణీ సత్యభామాదులతో ప్రతీకలుగా చిత్రించే ఈ ఖండాలలో ఆకాశాదుల లక్షణాలు ఆయా వ్యక్తుల స్వభావపు వృత్తులుగా వ్యక్తం కావడం, దానికనుగుణంగానే శ్రీకృష్ణుడు ప్రవర్తించటం ఆశ్చర్యకరంగా చిత్రించబడినది.

ఈ ఖండాలలో ఆయా స్త్రీలద్వారా శ్రీకృష్ణుని పూర్వ పూర్వావతార స్ఫురణలు కూడా కలిగించబడడం పరమేశ్వర తత్త్వస్ఫురణకు అన్యము కాదన్నట్లుగా దోహదం కలిగించడం గమనించదగిన విశేషం.

ఈ సృష్టి సర్వము పంచభూతాత్మకమయినది. ఈ వివిధ వ్యక్తులద్వారా పంచభూతాత్మకమైన ప్రపంచము విడివిడిగా స్వామి అనుభవంలోనికి వస్తున్నది. కాని, ఆ అనుభవంలో ఏదో ఒక లోపం, ఏదో ఒక తృప్తి భాసిస్తూనే ఉన్నది. ఈ విషయం ఆయా ఖండాల చివర్లలో వ్యక్తం చేయబడుతుంది. ఈ అతృప్తి కారణంగా ఇందరి ప్రయత్నాలు కూడా స్వామి విషయంలో వ్యర్థమవు తున్నాయి. అనగా, సృష్టి ముక్కలు ముక్కలై, ఆత్మసౌఖ్య విషయంలో నిష్ఫ

మవుతున్నది. ఈ రుక్మిణి, సత్యభామ మొదలయిన వారందరూ కూడా స్వామి కోరితే వచ్చినవారు కాదు. వీరంతా తాముగా ఆయన దగ్గరకు వెళ్ళినవారే తప్ప, ఆయన వారి దగ్గరకు రాలేదు. ఈ విషయం కావ్యం మొదటి పద్యంలోను, ఇతర ఖండాలలోను స్పష్టమే. కాని, చివరి ఖండంలో ఈ ఇందరు కాక మరొక విచిత్రమైన స్త్రీమూర్తి వ్యక్తమవుతుంది. స్వామి కన్నులలో ఒకానొక నీలరేఖ ప్రసరిస్తుంది. ఆ "కనుకొనలు శరీర వాంఛా మలినంబులై సద్వ్యతిరిక్తములై స్త్రీ మిలనాభిలాష(లో) గడుదీవ్రములై కొనసాగుతున్న" దశయొక్క చిత్రణతో ఏడవ ఖండం మొదలవుతుంది. ఆ కన్నులు "తరుణి గవేషణా అనిశితంబులు." అందువల్ల_

"తన విహరించుఁ బూవని లతాలి లతాంగులుగాఁగ నౌదురో
తన మనుచున్న లేఁటివనితల్ హరిణాక్షలు గాఁగ వత్తురో
తన వినుచున్న కోకిలలు తాము పికీగళలై వరింతురో
తన కను చక్రవాకములు తామయి కోకకుచల్ గమింతురో!"

"చిగురుల సందులన్ వలపుచేడెలనే వెదకున్ బ్రసూనప
త్రగమకరందబిందువుల రామలనే వెదకున్ నవానిల
ప్రగుణ తరంగ వీధికల భామలనే వెదకున్ దివాకరా
నుగ కిరణావళు ల్నడుమనున్ హరిణాక్షులకోసమే కనున్."

ఆయన కన్నులు "క్రూరమృగేక్షణ వ్యథా జనన విదూషితంబులయి" సాగినంతలో ఏ పెనుమాయగానో సాగి వచ్చిన స్త్రీని చూచి___

"రావే! యెచ్చటిదానవే? ననుఁ బరీరంభంబునన్ బట్టవే
యో వేళ ప్రవిలగ్న మృత్యులతికా! ప్రోతాసిదృఙ్మాలికా!
యో వేణీగత తేలిహాన! విషకుల్యోద్దామలావణ్య! నా
జీవంబుల్ శవదీయ పాదములకున్ జేర్తున్ గటాక్షింపవే!"

అని అంటూ ఆమెను కౌగిటికి పిలుస్తాడు మొదటి పద్యంలో ఏ పెనుమాయయో గాని ఒక స్త్రీ ఆవిర్భవించినట్లు ఒక స్ఫురణ. అయితే, ఆ స్వరూపము పంచ భూతాలు మొత్తముగా కలసి రూపొందినట్లుగా గుర్తుపట్టవచ్చును.

"అప్పుడు స్వామి కట్టెదుర నంబర మగ్ని మహా నిలంబు ఘో
రాప్పులు క్లిష్టకానన మహామృగశైల విచిత్ర రూపమై
యొప్పుగ మధ్యమున్ మొగము చూచిన యానము నైగనిగ్యమున్
గొప్పును నేత్రముల్ కుచము గొప్పయు స్వామియు చూచి చూచున్."

ఈ సమష్టి ఆయన వాంఛకు తట్టుకోగలదన్నట్టుగా అనిపించి, ఆమెను రావే అంటూ ఆహ్వానిస్తాడు. ఆమె రుక్మిణి మొదలైన వారిలో ఎవరూ కాదు, ఆమె ఎవరో తెలియదు. ఆమె మృత్యులత వలె ఉన్నది. ఆమె చూపులు పదును బెట్టిన కత్తులవలె ఉన్నవి ఆమె జడలో పాము విచ్చుకున్నది. ఆమె లావణ్యము విషపు కాల్వలా అనిపించింది. ఇక్కడి సంబోధనలలో వ్యక్తమైన ఈ ఉపమానములన్నీ మాయవల్ల కలిగే భ్రాంతియొక్క తీవ్రతకు పరాకాష్ఠదశను సూచిస్తున్నాయి. తనను కటాక్షించమని ఆమె ముందు ప్రాధేయపడుతాడు. ఆమెను కౌగిలించుకుంటాడు. ఆమె కూడా లొంగిపోయింది. మరి ఆమె స్వామికి పరతంత్రురాలా! స్వామి ఆమెకు పరతంత్రుడా! ఆయన ప్రాధేయపడడం, ఈమె లొంగటం ఈ రెంటితో - ఇద్దరు పరస్పరం పరతంత్రులుగానే అనిపిస్తారు. రుక్మిణి మొదలైన వారితో కలిసినప్పటి స్థితికి, ఈమెలో కలసినప్పటి స్థితికి సంబంధం లేదు. "ఈ నెలతతో పొందులో వినష్ట ప్రచేతనుడై, దురాత్ముడై" ఆయన ప్రవర్తిస్తాడు. మనస్సులు లేని దేహాలు మాత్రమే లైంగిక శక్తిచేత పెనవేసుకొని "కాఠినుములు" రెండు కూడినట్లుగా వారి సంయోగము పంచ భూతములను పట్టని విధముగా అసహ్యమై సాగుతుంది. తొలిగా ఆభాసించిన శృంగార రేఖ ఈ దశలో బీభత్స దృశ్యంగా పరిణమిస్తుంది.

ఇప్పటిదాకా ఆమె ఎవరో తెలుసుకోవాలనే ఊహ ఆయనకు లేనే లేదు. ఈ క్రియాకలాపము చివరలో తన "దశనలీలా క్లిశ్యమానాధర" అయిన ఆమెను "రత ప్లుష్టవేళ" "నీ పేరేదియ"ని అడుగుతాడు ఆమె "మాయలాడ

అనబోయినదో, సగమన్న దందులో బలమగుపంటి నొక్కులకు బాధను పొందిన దేమో!'' లౌకికంగా మాయలాడు అంటే, మాయలు మోసాలు చేసేవాడని తాత్పర్యము. ప్రేమతో కూడా ప్రియుడిని ''మాయలాడ'' అనటం శృంగారంలో ఒక లీలా విలాసం ఈ విలాసం ప్రియుడిని సాధారణంగా మరింత లొంగ దీసుకుంటుంది. ముగ్ధుడిని చేస్తుంది. ఇక్కడ ఆమె మాయలాడ అనబోయి సగమే అన్నది. చివరి అక్షరాలు పంటి నొక్కుళ్ళతో పెదవికి కలిగిన బాధవల్ల స్పష్టంగా అనలేక పోవచ్చును. ఆ తరువాత అనికూడా ఉండవచ్చు. కాని, స్వామికి వినిపించింది ''మాయ'' అని మాత్రమే "అంతలో—

దెలిసెను దేవదేవుడును, దిగ్గన లేచి మఱీవుమాయవా!
తెలిసిన దెంత చేసితివి ధీపరివంచన కేళికాకృతీ!''

అని అంటాడు, అంటే స్వామికి తనను వంచించినది "మాయ" అనే జ్ఞానము కలుగుతుంది. అందుకే మొదటిసారిగా ఇక్కడ స్వామిని గూర్చి "దేవదేవుడు" అని ప్రయోగించబడినది దేవ శబ్దము దివ్ అను ధాతువునుండి ఏర్పడ్డది. ఆ ధాతువుకి వెలుగు, ప్రకాశము అని అర్థము జ్ఞానానికి, వెలుగుకి అభేద ప్రతిపత్తి. ఈ జ్ఞానం కలిగినంతలో "నీవు మాయవా! తెలిసిన దెంత చేసితివిధీ పరివంచనకేళికాకృతీ!"—

"అను జగదీశనేత్రముల నాడిరి చంద్రుడు సూర్యుడున్ వినూ
తనముగ ఫాలభాగమున తానొక నేత్రము తోచి దానివె
ల్గునను నీయయ్యెంబో వెలికిపోనికిఁ గొమ్మలు వ్రేళ్ళుచాచి యుం
డిన యొక పెద్దమద్దివలె నిక్కిన మోహపు వ్యూహమంతయున్."

ఆయన కన్నులలో సూర్యచంద్రులు ఆడినారు ఫాలభాగంలో కన్ను తెరచుకుంది. అది మూడవ కన్ను. అగ్ని స్వరూపం సూర్య చంద్ర అగ్నులు ముగ్గురూ తేజోరూపులే. కాని, సూర్యకాంతి జీవనానికి, చంద్రకాంతి తాపోపశమనానికి, అగ్ని భస్మీకరణానికి ప్రతీకలు అగ్ని స్వరూపమైన మూడవ కంటి వెలుగులో నుసి అయినది అని చెప్పడం వల్ల, ఆ వెలుగు జ్ఞానము అని, జ్ఞానము వల్ల మాయ నశించిందని ప్రతీకాత్మకంగా చెప్పబడింది.

ఈ సందర్భంలో కుమార సంభవములోని మన్మథ దహనము స్ఫురిస్తుంది. శివునిలో కలిగిన కామభావనను మూడవ కంటి వెలుగుతో మన్మథుడిని దగ్ధం[30] చేయటంగా ప్రతీకాత్మకమైన ఆ గాథ సాగుతుంది ఆ సాగిన తీరు వేరు. ఇక్కడి చిత్రణ తీరు వేరు కాని, మౌలికాంశమైన కామదహన ఉభయత్రా సమానం.[31]

ఈ విధంగా తాత్త్వికమైన మాయను తీసుకొని దానికి కామతృష్ణా రూపాన్ని కల్పించి - అష్టభార్యలు, రాధ కుబ్జలను ప్రవేశపెట్టి, కామప్రసక్తితో శృంగారమన్న భ్రాంతి కలిగే విధంగా ఈ కావ్యంలో రూపు దిద్దబడింది. ఈ కామము శృంగార "రసాని"కి సంబంధించిన కామము కాదు. రౌద్ర బీభత్స జుగుప్సాదులయిన శృంగార వ్యతిరేకాంశాలు మాయాసంయోగ చిత్రణ సన్నివేశములో వ్యక్తమౌతాయి. ఈ విరుద్ధ భావ సన్నివేశము నిర్వేద భావము యొక్క తీవ్రతకు దోహదమవుతాయి. వాటి ఉపశమనముతో శాంతభావం ప్రసన్నమవుతుంది. ఏడవ ఖండంలో చిత్రింపబడిన తట్టుకోలేని ఈ తీవ్రత నుండి ''మోహపు వ్యూహము'' మూడవకంటివెలుగులో నుశిరావటంతో బయట పడి మనస్సు శాంతమవుతుంది.

## ప్రాతఃస్స్తవము :

శృంగార వీథి, శ్రీకృష్ణ దేవుని నిర్వేదము తరువాత ఈ సంకలనంలోని కావ్యం "ప్రాతఃస్స్తవము", ప్రాతఃకాలములో భగవంతుని స్తోత్రం చేయడం అనగా పొగడటం ఈ కావ్యంలోని విషయమని శీర్షికనుబట్టి స్ఫురిస్తుంది. ఈ దృష్టితో దీన్ని ఒక స్తుతికావ్యమనవచ్చు. దధివామన స్తోత్రం మొదలైన అనేక స్తోత్రాలు ప్రాతఃకాలంలో స్మరించుకోదగినవి ఎన్నో ప్రసిద్ధంగా ఉన్నాయి కాని, వాటి తీరుకి ఈ ప్రాతఃస్స్తవం విధానానికి సంబంధము లేదు.

సామాన్యంగా స్తుతి లేదా స్తోత్ర రచనలలో కథా వస్తువు ఉండదు. భగవంతుని వివిధ కళ్యాణ గుణాల అనుసంధానమే ఇందులో ఉంటుంది. భగవంతుని వివిధ అవతారాలలోని కొన్ని కొన్ని ఆర్తత్రాణ పరాయణత్వానికి చెందిన కథాంశాల ప్రస్తావన, సూచన అక్కడక్కడ ఉండవచ్చు. సంస్కృతంలోని వివిధ స్తోత్రాలలో, తెలుగులోని అనేక భక్తి శతకాలలో ఈ విషయాలను గమనించవచ్చు. భక్తి శతకాలన్నీ ఒక విధంగా స్తోత్ర కావ్యాలని చెప్పవచ్చును.

లౌకికంగా స్తోత్రం అన్నదానికి, భగవద్ విషయానికి సంబంధించి స్తోత్రం అనేదానికి చాలా తేడా ఉన్నది. ఈ అంశాన్ని కూరనాథులు ఈ క్రింది విధంగా ప్రస్తావించారు—

"స్తోత్రం నామ కిమామనంతి కవయః యద్యన్యదీయాన్ గుణాన్
అన్యత్రత్వం సతోఽధిరోవ్య ఫణితిః సాతర్హి వంధ్యాత్వయి
సమ్యక్ సత్యగుణాభివర్ణనమథో బ్రూయుఃకథంతాదృశీ
వాగ్ వాచస్పతినాఽపిశక్య రచనా త్వత్ సద్ గుణార్ణోనిధౌ"

—శ్రీ స్తవము.

స్తోత్రం అంటే లౌకిక వ్యక్తుల విషయంలో సాగే విధానము ఇందులో ప్రస్తావించబడింది. లౌకిక వ్యక్తులను స్తుతించేటప్పుడు అన్యదీయ గుణాలను ఆ గుణములు లేని వ్యక్తికి ఆపాదించి చెప్పడం స్తోత్రం అని కవులు భావిస్తారు. అటే స్తోత్రమైనట్లైతే భగవంతుని విషయంలో ఇది కుదరదు. భగవంతునియందు లేని గుణాలను భగవంతునియందు ఆరోపించడమనేదే ఉండదు భగవంతుడు "అఖిల హేయ ప్రత్యనీక కళ్యాణ గుణ పరిపూర్ణుడు." అందువల్ల భగవంతుని గుణాలను చెప్పినప్పుడు అది యధార్థమే అవుతుంది తప్ప, లౌకిక విషయంలో వలె పొగడ్త అనిపించుకోదు. భగవత్ విషయంలో "భగవత్ గుణానుభవం సంకీర్తనం" మొదలైనవి మాత్రమే స్తోత్రమని చెప్పవలసి ఉంటుంది. శ్రవణం, కీర్తనం, స్మరణం అనేవి నవవిధ భక్తులలోనివి. భగవంతుని గుణాలను పెద్దల ద్వారా వినటం, వాటిని కీర్తించటం, వాటిని స్మరించటం అంతా స్తోత్రంగానే భావింపవలసి ఉంటుంది.

"కళ్యాణాత్మకమైన విష్ణుకథలాకర్ణింపుచున్ ముక్తవై
కల్యాందెవ్వడు తృప్తుడౌ, నవివినంగాఁగ్రొత్తకాయండుసా
కల్యం బెవ్వడు భూసురోత్తమ! యెఱుంగంబల్కవే రుక్మిణీ
కళ్యాణంబు వినంగ నాకు మదిలోఁగౌతూహలంబయ్యెడిన్"32

అంటారు పోతనగారు. కళ్యాణగుణాత్మకమైన విష్ణుకథల శ్రవణం ఎప్పటి కప్పుడు క్రొత్తగానే ఉంటుంది. దానివల్ల మనస్సుకి తృప్తి, ప్రశాంతి, సద్భావన ఏర్పడుతాయి. అందువల్ల భగవద్ గుణాను సంధానం, భగవత్ చేష్టానుభవం, అనుభవాన్ని వ్యక్తీకరించడం కూడా స్తోత్రవిధానానికి చెందినదే.

ప్రసిద్ధాలంకారికుడైన విశ్వనాథుడు నవరసాలను గూర్చి చెప్పి, చివరకు "అథమునీంద్ర సమ్మతోవత్సలః" - భరతమునికి సమ్మతమైన వత్సలరసము అంటూ వత్సల రసాన్ని పదవ రసంగా ప్రతిపాదించారు.

"స్ఫుటం చమత్కారి తయా వత్సలంచ రసంవిదుః
స్థాయీ వత్సలతా స్నేహః పుత్రాద్యాలంబనంమతః"___33

స్పష్టమైన చమత్కారము కలిగించేది కాబట్టి వత్సలమును కూడా రసము అని పెద్ద లంగీకరించారు. దీనికి వాత్సల్య ప్రేమ స్థాయీభావం. పుత్రాదులు ఆలంబన విభావం అని వివరించాడు. అట్లాగే అనుభావాదులను, సంచారీ భావాలను కూడా చెప్పినాడు.34 భక్తిని రసంగా అంగీకరించని విశ్వనాథుడు వత్సల రసాన్ని ప్రతిపాదించటం చిత్రంగానే ఉంటుంది. ఈ వత్సల రసాన్ని మిగిలిన అలంకారికులు ఎవరూ అంగీకరించ లేదు. రతి భావంలోనే దీన్ని అంతర్భవింప చేశారు. వీరందరూ వాత్సల్యాన్ని రసంగా అంగీకరించకపోయినా అది ఒక బలిష్ఠమైన ప్రేమ భావంగా గుర్తించినారు. విశ్వనాథుని ఈ వత్సల రసం లౌకికమైనది. కాని, ఇదే భావాన్ని భగవంతునికి అనుసంధించి భక్తిలో ఒక భేదంగా రూపగోస్వామి చేర్చినాడు. భక్తికి సంబంధించిన రతి భావం లేదా ప్రేమకు ఆలంబనం భగవంతుడు ఒక్కడే అందువల్ల ఇతరాలంకారికులు వత్సల రసాన్ని రతిభావంలో అంతర్భవింపజేసినట్లుగా రూపగోస్వామి భక్తిలో అంతర్భవింప చేశాడు. లోకంలో రతి వాత్సల్యాది భావాలకు ఆలంబన విభావాలు వేరు వేరుగా ఉంటాయి. అందువల్ల కొన్ని కొన్ని సందర్భాల్లో ఆయా భావాలు పరిపుష్టం కాకపోవచ్చు. అందువల్ల ఇవన్నీ కూడా భక్తి పరివేషంలో రసత్వాన్ని పొందుతున్నాయి. అందుకే రూపగోస్వామి భక్తిని శాంత, ప్రీతి మొదలైన విధంగా ప్రతిపాదించినాడు. కాబట్టి, వాత్సల్యం భక్తి మార్గంలో రసంగానే అంగీకరింపబడినది.

భగవంతుని సేవించడంలో ఆయా జీవుల సంస్కారాన్నిబట్టి అనేక రకాలైన విధానాలు అవలంబించబడుతున్నాయి. జీవుడు ఈ లోకంలో ఉండటం వల్ల అతడికి అనేక విధాలైన సామాజిక, కౌటుంబిక సంబంధాలు ఏర్పడుతున్నాయి. ఈ సంబంధాలన్నీ భగవత్పరంగా అన్వయించుకొని ఆయావ్యక్తులు

భగవత్సేవలో ప్రవర్తించవచ్చు. ఈ సమస్త సంబంధాలు లౌకికంగా కన్నా భగవంతుని విషయంలోనే సమగ్రంగా సఫలమవుతున్నాయని అనేక భక్తుల జీవితాలలో గమనించవచ్చు. భగవంతుడిని ప్రభువుగా, స్నేహితుడుగా, భర్తగా, సుతుడుగా-ఇట్లా ఎన్నో విధాలుగా భావించి, భక్తులు తమ ఆర్తిని, ఆప్యాయతను అనుభవపూర్వకంగా వ్యక్తీకరించుకుంటారు. ఈ విధమైన వివిధ వ్యక్తీకరణలు ఆధారంగానే భక్తిని రసంగా ప్రతిష్ఠాపించిన ఆలంకారికులు భక్తి వైవిధ్యాన్ని సమీకరించి ప్రతిపాదించారు. భక్తిరసామృతసింధువులో శ్రీ రూప గోస్వామి ముఖ్య భక్తిరసాలుగా అయిదింటిని ప్రతిపాదించడంలో ఈ వివిధ సంబంధాలు, మనోదశల సమీకరణను గుర్తించవచ్చు. శాంత, ప్రీతి, ప్రేయస్, వత్సల, మధుర అనేవి శ్రీ రూప గోస్వామి ప్రతిపాదించిన అయిదు విధాల ముఖ్యభక్తులు. వీటిలో మొదటిది ఒకానొక మనోదశ మీద, చివరి నాలుగు మానవీయ సంబంధాల మీద ఆధారపడ్డవి. ఈ నాలుగూ ప్రేమ యొక్క క్రమోన్నత వికాస దశలను సూచిస్తున్నాయి. వీటిలో వత్సలభక్తి ఒకటి. మొదటి శాంతము స్వతంత్రంగాను, ఈ అన్నింటికి అంతర్వ్యాహినిగాను ఉంటుంది.

భక్తి సాహిత్యంలో వాత్సల్య భక్తికి సంబంధించిన రచనలు విరివిగానే కనిపిస్తాయి. సంస్కృత హరివంశ, భాగవతాదుల నాటి నుంచే ఈ విధమైన రచన మనకు లభిస్తుంది. కృష్ణ కర్ణామృతం వంటి ముక్తక కావ్యాలలో వాత్సల్యానికి సంబంధించిన మధురాతి మధురమైన పద్యాలు ఎన్నెన్నో కనిపిస్తాయి. అటు తమిళ సాహిత్యంలో "పెరియాళ్వారు" మొదలైనవారు రచించిన "తిరుమొళి" మొదలైన కావ్యాలలో ఈ వాత్సల్యం యొక్క అద్భుతమైన వ్యాప్తిని చూడవచ్చు. తెలుగులో ఈ విధమైన రచన తొలిసారిగా "బసవపురాణం"లో కనిపిస్తుంది. బెజ్జ మహాదేవి కథ ఇందుకు ఉదాహరణ. పరమేశ్వరుని పసిపాపగా భావించి బెజ్జ మహాదేవి శివుని శిశుత్వాన్ని తల్లిగా సేవిస్తుంది. అన్నమాచార్య సాహిత్యంలో ''ముద్దుగారే యశోద ముంగిట ముత్యము వీడు'' మొదలైన అనేక కీర్తనలలో ఈ వాత్సల్య భావాన్ని చూడవచ్చు. పోతనగారి భాగవతంలో దశమస్కంధం లోని కృష్ణ బాల్యలీలలో ఈ వాత్సల్య భావం వాగులై వరదలై పొంగులు వారింది. అటు హిందీ సాహిత్యంలోనూ సూరదాసు మొదలైన మహాభక్తుల రచనల్లో కూడా ఈ వాత్యల్య భావం యొక్క మాధుర్యం అనుభవంలోకి

వస్తుంది. కేవలం ఈ భాషలలోనే కాదు- అన్ని భాషా సాహిత్యాలలోను వాత్సల్య విషయం ప్రముఖంగానే ఉంది. మాతృప్రేమ అనేది సర్వజీవ సహజమైంది. దానికి జాతి భాషాదుల పరిమితులు లేవు. కాగా, ఈ అత్యంత సహజమూ, మధురమూ అయిన వాత్సల్య భావమే ప్రాతఃస్స్రవకావ్యానికి విషయం.

పెద్దలకు పిల్లల యందుండే ప్రేమ భావాన్ని వాత్సల్య మంటారు. గురువులు, తండ్రి మొదలైన వారికి పిల్లల యందుండే ప్రేమ భావం వాస్తవానికి వాత్సల్యమే అయినా, తల్లికి పిల్లల యందుండే వాత్సల్యం మిగతా వారిలోని వాత్సల్యం కన్నా ఎంతో లోతైంది, ఎంతో విస్తృతమైంది, ఎంతో మధుర మైంది.[35] అందుకే వాత్సల్య భావానికి సంబంధించిన విస్తృతమైన సాహిత్యంలో మాతా శిశుసంబంధమే తొంబయి తొమ్మిది వంతులు భూమిక.

భగవద్విషయమైన ఈ వాత్సల్య భావం ప్రధానంగా యశోదా కృష్ణులకు మాత్రమే అధికంగా సంబంధించి ఉండడం కూడా వాత్సల్య సాహిత్యంలో గుర్తించవలసిన మరొక అంశము. యశోద కృష్ణుని కన్నతల్లి కాదు. ఆయన కన్న తల్లి దేవకి. కాని, దేవకికి కృష్ణుని బాల్యాన్ని అనుభవించే అదృష్టం లేక పోయింది. యశోదకు అది లభించింది. వాత్సల్య భావంలో ఉండే మాధుర్యం పిల్లల బాల్యదశలో వ్యక్తమైనంతగా, అనుభవమైనంతగా ఆ పిల్లలు పెరిగి పెద్ద వారైన తరువాత అనుభవములోకి రాదు. అందుకే, వాత్సల్య చిత్రణ పిల్లల బాల్యదశకు మాత్రమే సంబంధించి సాగుతుంది. శ్రీకృష్ణుని బాల్యాన్ని పూర్తిగా అనుభవించినది యశోద. కృష్ణుని బాల్యచేష్టలను ఆమె అనేకానేక విధాలుగా అనుభవించింది. కృష్ణుడు కూడా ఆమె విషయంలో అట్లాగే ప్రవర్తిస్తాడు. యశోదా వాత్సల్యానికి కృష్ణుడు ఆలంబనం. కవి యశోదగా ఈ ప్రాతఃస్స్రవ కావ్యం ప్రవర్తించింది. ఒక విధంగా ఇది ఆత్మాశ్రయ కావ్యం. యశోద శ్రీకృష్ణుని ప్రాతఃకాలంలో మేల్కొల్పటం ఈ కావ్యంలోని మౌలిక వస్తువు.

ఈ మేలుకొలుపు అనే భావము తొలిసారిగా మనకు రామాయణంలో కనిపిస్తుంది. శ్రీరామచంద్రుని లక్ష్మణ సహితంగా తీసుకొని వెళ్ళిన విశ్వామిత్రుడు సరయూనది దక్షిణ తీరంలో మజిలీ చేసి, రాత్రి గడపి తెల్లవారి శ్రీరామచంద్రుని మేలుకొలుపుతున్న ఈ క్రింది శ్లోకం సుప్రసిద్ధం.

"కౌసల్యా సుప్రజారామ! పూర్వా సంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవమాహ్నికమ్."[36]

విశ్వామిత్రునికి శ్రీరామచంద్రుని యందు పుత్ర వాత్సల్యం. దానితోపాటు తాను గురువుగా శ్రీరాముని అనుశాసించవలసిన అవసరం కూడా ఉంది. పితృ వాత్సల్యంలో సాధారణంగా వాత్సల్య-అనుశాసన భావాలు కలగలసి ఉంటాయి. విశ్వామిత్రుని మేలుకొలుపులో ఈ రెండంశాలు కనిపిస్తాయి. "ఓ కౌసల్యా సంతానమైన రామా! తెల్లవారింది. ఓయీ నరశ్రేష్ఠుడా! దైవికమయిన దైనిక కృత్యాలను నిర్వహించుటకు లే" అని విశ్వామిత్రుడు రామచంద్రుని మేలు కొల్పుతున్నాడు.

రామచంద్రుని దశరథ సంతానమని సంబోధించవచ్చును. కాని, కౌసల్యా సంతాన మనుటలో మాతృభావానికున్న గాఢత్వం ఇక్కడ స్పష్టమవుతుంది. దైవిక, దైనిక కృత్యాల ప్రస్తావనలో అనుశాసనం కూడా ఉంది, రామాయణా నంతరకాలాన మేలుకొలుపుగా వచ్చిన రచనలన్నిటికి ఈ శ్లోకమే మార్గ దర్శకం. "మార్గదర్శీ మహర్షిః."

ప్రాతఃకాలంలో భగవంతుడిని మేలుకొలుపుతున్నట్లుగా ఉండే రచనలను "సుప్రభాతం" అని వ్యవహరించటం సర్వసాధారణంగా కనిపిస్తుంది. విశ్వామిత్రుడు మరొక చోట రామచంద్రుని మేలుకొలుపుతూ—

"సుప్రభాతా నిశారామా! పూర్వా సంధ్యా ప్రవర్తతే।
ఉత్తిష్ఠోత్తిష్ఠ భద్రంతే గమనాయాభిరోచయ॥"[37]

అంటాడు. ఇక్కడ "సుప్రభాత" అనే పదం మేలుకొలుపు కావ్యాలకి సుప్రభాతమనే పేరు రావడానికి కారణం కావచ్చు. ఈ మేలుకొలుపటమే విషయంగా గల ప్రస్తుత రచన ప్రాతః స్తవంగా వ్యవహరించబడింది. ఇందులో యశోద కృష్ణుని మేలుకొలుపుతూ, తల్లిగా కృష్ణుని వివిధ గుణాలను చేష్టలను కూడా స్మరిస్తూ, అనుభవిస్తూ ఉంటుంది. కావ్యం మొత్తం యశోదాదేవి మాటలు గానే సాగుతుంది.

ప్రాతఃస్తవంలో ఈ యశోద మేలుకొలుపే విధానం, మాట్లాడే తీరు, వ్యక్తంచేసే వివిధ భావాలు అచ్చంగా ఒక తెలుగు తల్లి తన కొడుకును మేలు కొలుపుతున్నట్టుగానే ఉంటుంది. తెలుగు దేశీయ వాతావరణం పలుకుబడి సమృద్ధిగా కనిపిస్తుంది. ఈ మేలుకొలుపుతూ మాట్లాడటంలోనే శ్రీకృష్ణునికి సంబంధించిన లౌకిక అలౌకిక విషయాలు విచిత్రంగా ఆ తల్లి వాత్సల్యంలో కలగలసిపోతాయి.

వత్సల రసానికి విశ్వనాథుడు చెప్పిన అనుభావ, సంచారభావాల స్ఫూర్తి ప్రాతఃస్తవంలో మనకు లభిస్తుంది. స్పర్శచుంబనాదులు అనుభావాలని, అనిష్ట శంకాహర్షాదులు సంచారీభావాలని ఆయన అన్నాడు. ఈ చెప్పినవి సూచనా మాత్రాలే. వీటినిమించికూడా ప్రాతఃస్తవంలో అనుభావాలు చిత్రించబడ్డాయి.

ఆ కృష్ణుడు అమాయకుడు, దుందుడుకు, వయసుకు మించిన చేష్టలు చేసేవాడు. ఆయనలో చిలిపితనానికి అంతం లేదు. ఇవన్నీ యశోద మాటలలో వ్యక్తమౌతుంటాయి. ప్రతి తల్లి తన కొడుకును గూర్చి చాలా గొప్పగా భావిస్తూ ఉండటం సహజం. వాడు జీవితంలో ఎంతో గొప్పవాడు కాబోతాడని, అలా అయినప్పటి సంతోషాన్ని ఈ దశలోనే తల్లి భావించుకుంటూ వ్యక్తంచేస్తూ ఆనందపడుతుంది. ఈ తల్లి భావనలన్నీ ఆ పిల్లల జీవితంలో నిజం కావచ్చు, కాకపోవచ్చు. ఈ కావటం, కాకపోవటంలో కూడా ఎన్నెన్నో తేడాలు ఉండ వచ్చును. కాని, భగవంతుని విషయంలో ఏది భావించినా అది యదార్థమే అవు తుంది.

సామాన్యంగా తల్లి కొడుకును "పైడిఖిల్లా", "బంగారు కొండా" అంటూ ముద్దాడుతుంది. ఇక్కడ 'బంగారు కొండ' వంటి మాటలు ఆమె ప్రేమాతి శయాన్ని సూచిస్తాయే తప్ప యదార్థం కావు. కాని, భగవంతుని విషయంలో అది యదార్థం. ఆయన హిరణ్యగర్భుడు, హిరణ్యశ్మశ్రువు, హిరణ్యనేత్రుడు ............యశోద కృష్ణుని 'పైడిఖిల్లా' అనటం వాత్సల్యం కావటమేకాక యదార్థం కూడా. అట్లాగే లౌకికంగా పిల్లలను వివిధ అవతారమూర్తులుగా "కన్నా!" ఇత్యాదిగా సంబోధించవచ్చును. కాని, కృష్ణుని విషయంలోమాత్రమే ఇవి అన్నీ యదార్థమైనవి. "ముకుందా, రమావల్లభా........" మొదలైన సంబోధన లన్నీ యదార్థమే.

యశోద విషయం విచిత్రమైంది. ఆమెకు అంతలోనే శ్రీకృష్ణునియందు భగవద్భావన, అంతలోనే తన చేతులలో పెరిగే పసిపాప-ఈ రెండు భావాలూ చిత్రవిచిత్రంగా ఆమె మాటల్లో వ్యక్తమవుతుంటాయి.

"ఎవడురా వాఁడు మొన్నదానేమొ వచ్చి
యయ్యె యవతార పురుషుఁ డటంచుఁ జెప్పె,
నిపుడు వచ్చినఁ తెలియుఁగదే నిశాప్ర
శయ శిశున్ నిన్నెఱుంగువేళకును లేఁడు."

ఈ మాటల్లో కృష్ణుని గూర్చి అంతరాంతరాల్లో ఉండే భగవద్భావన ప్రత్యక్షమయిన శ్రీకృష్ణుని చిలిపిచేష్టల్లో ఇమిడిపోవటం గుర్తించదగింది. కృష్ణుడు అవతారపురుషుడు కావడం యదార్థమే. "నిశాప్రశయ శిశువు" కావడం కూడా యదార్థమే. ఈ రెండంశాలు ఇక్కడ వాత్సల్యపూరితమైన వెక్కిరింపుగా, పరిహాసంగా వ్యక్తమైనాయి.

"అచ్చపువేల్పుబువ్వ బుడగై తరఁగై గరుడాశువారిపై
వచ్చెడు చిట్టికోసమని, వాఁకిట నున్నది యెవ్వ రోయి వేఁ
బుచ్చుకొనుండు దానిఁ జిఱుపొంగుల నవ్వుల కన్నుదమ్ములన్
విచ్చుచునున్నవాఁడు యదువీరుఁడు బుగ్గగులాబిమొగ్గగాన్.

ఇందులో శ్రీకృష్ణుడు విష్ణువు యొక్క అవతారమనే భావం కృష్ణుని బులిపించటం అనే భావముతో కలగలసిపోయినయి.

"ఇంక నిద్దురలేవ పీవెట్లు కాని
నెలల తరబడి నీ బిడ్డ నిద్రపోవు
నుర్వియెల్ల జాతుర్మాస్య లుండవచ్చు
నని జగంబునఁ జాటింతునయ్య! కొడుక!"

విష్ణువు నాలుగు మాసాలు నిద్రలో ఉంటాడని, అప్పుడు భక్తులు చాతుర్మాస్యవ్రతం పాటిస్తారని ప్రసిద్ధం. ఇక్కడ కృష్ణుడు చాలాసేపు నిద్ర పోతున్నాడు, ఇంకా నిద్ర లేవడం లేదనే భావాన్ని "చాతుర్మాస్యాల"కు కూర్చ డంలో లౌకిక అలౌకిక భావాలకు మిశ్రణం కనిపిస్తుంది. ఇక్కడి ఈ పద్యాల్లో గర్వం అనే అనుభవం వ్యంగ్యంగా స్ఫురిస్తుంది.

ప్రాతఃస్స్రవములో కనిపించే మరొక విశిష్ట లక్షణం మొత్తము స్తవము ఏకపాత్రాభినయముగానే సాగటం. అంతా యశోదాదేవి మాట్లాడడం తప్ప, శ్రీకృష్ణుని మాటలేమీ లేవు. ఇట్లాంటి సందర్భంలో ఉండవు కూడా. కాని ఆయన చేష్టలున్నాయి. ఈ చేష్టలన్నీ ఉద్దీపన విభావాలు.

ఆ చేష్టలన్నీ యశోదాదేవి మాటల ద్వారానే మనకు స్పష్టపడుతుంటాయి

"పొలపొల కన్ను విప్పి మఱి మూసెదు చిట్టికి నిక్కమాడు, చ
క్కిలిగిలి యున్నదా? కలదు, కేలును జంకకు హత్తుకొందు న
వ్వుల చిఱువెల్గులోఁ బెదవి పొందె నుషోనవరేఖ తిర్గి య
వ్వలి మొగమై ముడుంచుకొని పండెద, వల్లరికాదులెమ్ముర!"

అంటున్నప్పుడు యశోద కృష్ణుని లేపడానికి చక్కిలిగింత పెట్టడం, దాన్నించి తప్పించుకోవడానికి కృష్ణుడు చేతిని చంకకు హత్తుకోవడం, ముఖం ప్రక్కకు తిప్పుకోవడం, మరింత ముడుచుకొని పడుకోవటం వంటి వివిధ చేష్టలు వ్యక్తమౌతుంటాయి. ఇవన్నీ శైశవ సహజమయిన చేష్టలే. ఇక్కడ స్పర్శ అనే భావము వ్యంజితమవుతున్నది యశోద మాటల్లో కృష్ణుడే కాక కృష్ణుని సావాస గాండ్రు, వారితో కలిసి వ్రేపల్లెలో కృష్ణుడు చేసే రకరకాల 'అఘాయిత్యాలు' కూడా వ్యక్తమౌతుంటాయి.

గొల్లల గూడెముల్ తడక కొంపలు తల్పులు లేవు నీవు వ్రే
పల్లెకు మేటివైతి వొక పాతిక క్రోఁతులు నీకుఁదోడు మీ
రెల్లరు నుట్ల కెక్కుపని కేమొ హుజూర్సరదారులైరి యీ
పిల్లలతోడ నింకఁ గనుపింపుమ యింకొక మాఱు చెప్పెదన్."

అంటుంది యశోద. ఈ అనటంలో వాత్సల్య పూరితమైన చిరుకోపం ప్రదర్శింప బడుతున్నది. ఈ విధమైన రచనా విధానం "భాణం" అనే ఒకానొక రూపక భేదానికి చెందిన తీరులో సాగుతుంది.

ప్రాతఃస్మరణముతో సంబోధనలు కూడా చిత్రవిచిత్రంగా ఉంటాయి.

| | |
|---|---|
| 1 వ పద్యము | చిట్టి నా తండ్రి! |
| 2 వ పద్యము | పద్మనాభ! |
| 4 వ పద్యము | యదూత్తంస! |
| | యశోదాత్మజా! |
| 5 వ పద్యము | చిట్టికి |
| 9 వ పద్యము | యశోదాశిశూ! |
| | విచిత్ర శిశువా! |
| | పైడిఖిల్లావు |
| | యదుకుల స్వామీ! |
| | రమావల్లభా! |
| 10 వ పద్యము | ఋచ్చితండ్రి, సుందరాంగ! |
| 11 వ పద్యము | యదువీరుడు |
| 14 వ పద్యము | యదూద్వహా! |
| 15 వ పద్యము | యదువంశమండనా! |
| 16 వ పద్యము | పసిదొంగ |
| | యదువృద్ధలోచన మణిచ్ఛ విభూత శరీర వల్లరీ! |
| 18 వ పద్యము | కొడుక |
| 19 వ పద్యము | ప్రభూ! |
| 20 వ పద్యము | ముకుంద |
| 21 వ పద్యము | నందార్భకా! |
| 26 వ పద్యము | నవనీత లుబ్ధుడా! |
| 30 వ పద్యము | స్వామీ! |
| 32 వ పద్యము | రంగ మార్తాండ! |
| | నటోత్తంస! |
| | సామి |
| 33 వ పద్యము | మాంధాత |
| 34 వ పద్యము | శిశూ! |
| 35 వ పద్యము | బంగారు నాన్న! |
| | యాదవ వంశ దీపమణి |
| | వేల్పుదొర |
| 43 వ పద్యము | యశోదమ్మ కొడుకు |

యశోద కృష్ణుడిని "యశోదాత్మజా!" అని సంబోధిస్తున్నది. తన కొడుకు కావడం, తాను చెప్పినట్లు చేస్తాడనే భావం, వాడు తన కొడుకు కావడం వల్ల కలిగిన ఒక మాధుర్యభావం కలగలసి వ్యక్తమౌతుంటాయి. "నందార్భకా", "యదువృద్ధలోచన మణిచ్ఛవి భూత శరీర వల్లరీ", "యదూద్వహా", "యదువంశ మండనా", "నవనీతలుబ్ధుడా", "విచిత్రశిశువా", "పసిదొంగా", "నటోత్తంస" మొదలైన రకరకాల సంబోధనలు కృష్ణునికి సంబంధించి అనేక విధాలైన భావాలను వ్యక్తీకరిస్తాయి. కొడుకును ఆ తల్లి బుజ్జగిస్తుంది. కోప్పడుతుంది. సముదాయిస్తుంది. విసుక్కుంటుంది. కన్నీరుపెట్టుకుంటుంది. ఆప్యాయతను వ్యక్తీకరిస్తుంది. ఈ వివిధాంశాలు వాత్సల్యంలోని మాధుర్య భావానుభవాన్ని కలిగిస్తాయి. కృష్ణుని నిద్రనుంచి లెమ్మనడంతో ఆరంభమయ్యే ఈ కావ్యం, కృష్ణుడు కాళ్ళ గజ్జెలు ఘల్లు ఘల్లుమనగా లేచి గంతులు వేస్తూ ఉండటంతో సమాప్తమవుతుంది.

"కుణు కుణు కుణు కుణుక్వణనమ్ము బొనరింపc
గవ్వించు బంగరు మువ్వలగమి
కిణకిణ కిణకిణస్వనములు వెలయింప
జిలుగురత్నాల గజ్జియలపేట
ఘణ ఘణ ఘణ ఘణధ్వనులు పంచారింప
నెఱి నగిషీల యందియల జంట
ధణ ధణ ధణ ధణ ధ్వానమ్ము లొలయింపc
గలుపు కేల్జత హొన్ను గంటల సడి
యదుకులోద్యాన కేకి నాట్యమ్ము చేసె
నందగర్భ సరోహంస నడలు నెఱపె
నెమ్మి నాట్యమాడెను యశోదమ్మ కొడుకు
అంచనడకలు నడిచెc గ్రిష్ణమ్మగారు."

యశోద మాటలుగా లేని పద్యమిదొక్కటే. యశోదలోని వాత్సల్యభావానికంతటికిని రూపుగట్టిన ఫలం ఈ పద్యంలో చిత్రింపబడినది.

భగవచ్చేష్టా గుణానుభవమే ఈ వాత్సల్య మధుర భావానికి వస్తువు. విశ్వనాథలోని మాతృ భావానికి[39] ఈ కావ్యము సముజ్జ్వల ప్రతీక.[40]

## వేణువు - బ్రహ్మగీతము :

"అస్తి స్వస్తరుణీకరాగ్ర విగళత్కల్పప్రసూనాప్లుతం
వస్తు ప్రస్తుతవేణు నాదలహరీనిర్వాణ నిర్వ్యాకులమ్।
స్రస్తస్రస్త నిరుద్ధనీవివిల సద్గోపీ సహస్రావృతం
హస్తన్యస్త నతాపవర్గమఖిలోదారం కిశోరాకృతిః॥"41

ఇది లీలాశుకుడు కృష్ణ కర్ణామృత కావ్యాన్ని ఆరంభించిన పద్యం. ఇందులో కిశోరాకృతియైన ఒక వస్తువు వర్ణనీయాంశం. ఈ వస్తువు లౌకికమైన వస్తువు కాదు. పరవస్తువు - అనగా పరబ్రహ్మం లేదా పరతత్వం. ఆ తత్వము ఒక కిశోరాకృతిగా వ్యక్తమైంది. అంటే- లౌకికరూపాన్ని పొందింది. ఆ పర తత్వం లౌకికంగా అనేక అవతారాలుగా లోకంలో ప్రవర్తించింది. మరి ఈ కిశోరాకృతి దేనికి సంబంధించింది? కిశోరాకృతియైన వస్తువని మాత్రమే చెప్పబడింది. ఆ వస్తువు దేవతాస్త్రీల చేతుల నుండి జారుతున్న పారిజాత కుసుమాలతో అప్లుతమైంది. ఇది ఆ వస్తువు యొక్క దివ్యత్వాన్ని సూచిస్తున్నది.

రెండవ పాదంలో చెప్పబడిన అంశం అవతార సూచకమైంది. పొగడబడిన వేణువు యొక్క నాదప్రవాహంవల్ల కలిగే నిర్వ్యాకులమైన ఆనందము మాటిమాటికి విడిపోతున్న పోక ముడులను బిగించుకుంటున్న వేలకొలది గోపికలతో ఈ కిశోరాకృతి చుట్టుకొనబడి ఉన్నది. ఈ వేణునాదము, గోపికలవల్ల ఆ కిశోరాకృతి బాలకృష్ణ స్వరూపమని సూచింపబడుతున్నది. ఈ సూచనకు మొట్టమొదట చెప్పబడిన అంశం వేణువు. వేణునాదముతో ఆకర్షింపబడిన స్త్రీలు రెండవ అంశం. దీన్నిబట్టి వేణువు శ్రీకృష్ణుని ప్రతీకగా భావించబడినట్లు స్పష్టమవుతుంది. భగవంతుని మోక్షార్థులైన జీవులు ఆశ్రయిస్తారు. మోక్షప్రదాత పరమేశ్వరుడు. ఈ మోక్షం పరమేశ్వరుని చేతిలో ఉన్నది. ఈ అంశమే నాలుగవ పాదంలో చెప్పబడింది. ఈ విధంగా వేణువును లీలాశుకుడు కృష్ణునికి ప్రతీకగా ఈ కావ్యంలో అనేక సందర్భాల్లో వ్యక్తీకరిస్తాడు. వేణువు కృష్ణత్వానికి సంకేతంగా కూడా చెప్పబడింది. కృష్ణుడనగానే స్ఫురించే అంశాల్లో మొదటిది వేణువు. ఆ తర్వాతది నెమలి పింఛం. ఈ రెండే కృష్ణత్వాన్ని సూచించే మౌలికాంశాలు. నెమలి పింఛం సౌందర్యధాళధళ్యానికి సూచన. కాగా, వేణువు కృష్ణత్వానికి సూచన. లీలాశుకుడు ఒకచోట సీతాపతిని సంబోధిస్తూ—

"విహాయ కోదణ్డ శరౌ ముహూర్తం
గృహాణ పాణౌమణి చారువేణుమ్
మాయూర బర్హంచ నిజోత్తమాఙ్గే
సీతాపతే త్వాం ప్రణమామి పశ్చాత్"

—కృష్ణకర్ణామృతము

అని అంటాడు. శ్రీరామచంద్రత్వానికి ధనుస్సు ప్రతీక. రామాయణ కల్పవృక్షం అవతార ఖండంలో ఈ అంశం స్పష్టపడుతుంది. దశరథుని యజ్ఞ హవిస్సును స్వీకరించేందుకు దేవతలందరూ వచ్చినారు. అప్పుడు విష్ణువు కూడా వచ్చినాడు. ఈ రావటాన్ని చెప్పడంతో ఆ ఖండం ప్రారంభమవుతుంది. ధనుస్సును ధరించి వచ్చినట్టుగా చెప్పబడుతుంది ఈ ధనుర్విషయం మూడు పద్యాలలో చిత్రించ బడింది.

"తనకాప్పు దనుజకామినుల దాపటి చెంప
కునుదాచి కొనుముంత కొప్పులయ
దనత్రాడు దితిజకాంతల దిస్సతొమ్ముల(
దనుకొప్పు పుస్తెల త్రాడులందు
దనదైన నడుము దైత్యకు లాంగ నాస్పష్ట
నాభిపల్వలములౌ నడుములందు
దనలక్ష్యమసురనందనవధూనిస్త్రపా
సంధాన వర్మ లక్ష్యంబులందు(
మూర్తి మన్మత్సరత్వముల్ మొనసియుండు
నేమహా కార్ముకంబున స్వామిచేత(
దెరల నింద్రావరాజు( దరుదెంచె స్వభువు
పత్రికతుహవిస్సులో( దనవంతు కొఱకు."[42]

"కౌమోదకీ నందక సుదర్శనాయుధ
మ్ములు పనిదీర్చును ముందెపోయి
చిటికి మాటికి శ్రీవరారోహని
విష్టచిత్తుడు తన్ను(బిల్వ(బో(డు
అల్పదానవులు మున్నర్థించినట్టి వ

రంబులు తనదాక ప్రాకలేదు
తానన్న నితరాయుధములు చాలని యవ
సరములకగు మహాసత్వశాలి
మించిపోయిన రోష్టుకల్పించెనెవడు
స్వామికని యల్లెత్రాటవంచనిది కూడ
ఖంగు ఖంగున మ్రోగుచుఁ గదలివచ్చె
స్వామి భుజలంబ మానమై శార్ఙ్గధనువు.''43

''నాభి సంస్థములు ప్రాణములింకనాడు నే
యల్పదైత్యులకు దీర్ఘాయువులకు
గళ సీమలకుఁ బైని గంఠముల్ నిలుచునే
చండాసురులకుఁ బాషండులకును
ఒకఁడొక్కఁడూది బాహువులింకఁ జెలగునే
విద్రాశరులకు దోర్వీర్యులకును
స్వఃకామినులఁ జెఱపట్టుటల్ సాఁగునే
చెడిపెరక్కసుల కశ్ఛంఖలులకు
ప్రభు మహాయుధమూలవిరాట్టు కదలి
కూడి పెజయేందిరోగ్ర భ్రూకుటి యనంగ
విధృతమైలస్తకంబున వెడలివచ్చె
స్వామి భుజలంబమానమై శార్ఙ్గధనువు.''43

రామ గాథలో విష్ణువు యొక్క మిగిలిన ఆయుధాలకు ప్రాధాన్యం లేదు. ఒక ధనుస్సుకు మాత్రమే ఉన్నది. అందువల్లనే ఈ పద్యాలలో రకరకాలుగా ధనుస్సును గూర్చి చెప్పబడింది. స్వామితో నిత్యసంబంధం చిత్రింపబడినది,

"తన బహుకల్ప నిత్యమగు తాపసిరూపున వచ్చియున్న శా
ర్ఙ్గిని తొలి వెల్గు బొడ్డు బదరీవనిలో ముదిచెట్టు క్రిందప
చ్చని వెలుగొందు వచ్చుటను శార్ఙ్గ ధనుశ్చటులోగ్ర శృంగగుం
ఫనములు లేనిచో గుఱుతు పట్టియయుండరు సర్వదేవతల్.''43

ధనుస్సు లేకపోతే దేవతలు ఆ స్వామిని, స్వామిగా గుర్తుపట్టలేకపోయేవారట! ఈ విధంగా స్వామిని గుర్తు పట్టడానికి చిహ్నంగా చెప్పబడిన ధనుస్సు ఆవతార మూర్తియైన రామచంద్రునికి గూడా చిహ్నము. అందుకే లీలాశుకుడు ఆవిధంగా అన్నాడు 'ఆ కోదండశరములను క్షణకాలం వదిలిపెట్టి, చేతిలో వేణువును, తలపై నెమలి పింఛమును ధరిస్తే నీకు నమస్కరిస్తాను' అంటాడు లీలాశుకుడు. రామునికి ధనుర్బాణాలవలె వేణువుతో శ్రీకృష్ణునికి అవినాభావ సంబంధం ఉన్నది. అభేద సంబంధం ఉన్నది. అందుకే కృష్ణ భక్తిమార్గంలో వేణువుకు ఇంత ప్రాధాన్యము.

కృష్ణభక్తులు ఏవో మణిభూషణాలవంటి అలంకారాలలో ఒకటిగా వేణువును భావించరు. అదికూడా శ్రీకృష్ణుని నిరంతరం సేవిస్తున్న ఒక ఉత్తమ జీవిగా భావిస్తారు. ఆ వేణువుతో తమను పోల్చుకొని లేదా తమకన్న పరమేశ్వరునికి అత్యంత సన్నిహితమైన జీవిగా భావించుకుంటారు, అసూయపడతారు, ఆశ్చర్య పడతారు, ప్రార్థిస్తారు. భాగవతంలో వేణువును గూర్చి గోపికలు తమలో తాము భావించుకున్న ఘట్టాన్ని పోతనగారు అద్భుతంగా చిత్రించారు. మూలంకన్న పోతనగారి భాగవతంలో ఈ ఘట్టం మరింత విస్తరించింది.[44] ఒక గోపిక మరొక గోపికతో-

"ఒనరన్ వ్రేతలకించుకేనియును లేకుండంగ గోపాల కృ
ష్ణుని కెమ్మోవిసుధా రసంబుఁ గొనుచున్ జోద్యంబుగా మ్రోయుచున్
దన పర్వంబులు నేత్ర పర్వములుగా దర్పించెఁ బూర్వంబునన్
వనితా! యెట్టి తపంబు చేసెనొకొయీ వంశంబు వంశంబులోన్"[45]

అని అంటుంది. ఈ గోపికలందరు శ్రీకృష్ణుని అధర సుధాపానం చేయాలని ఎంతగానో ఆశపడుతున్నారు. ఎప్పుడో తమకు అవకాశం కలుగుతుందని అనుకుంటున్నారు. తీరా తమకు అవకాశం కలిగేటప్పటికి ఆ సుధారసం ఉంటుందా అక్కడ? గోపికల కోసమని ఏ మాత్రం మిగుల్చకుండా ఈ వేణువే ఆస్వాదిస్తున్నది. ఆ ఆస్వాద పారవశ్యంలో మధురంగా ధ్వనిస్తున్నది. ఈ ధ్వనిని శృంగార సందర్భంలో "మణితం" అంటారు. కళాపూర్ణోదయములో బ్రహ్మ సరస్వతీ దేవి అధరాన్ని ఆస్వాదించినప్పుడు సరస్వతి నుండి ఉదయించిన ఈ

"మణిత" ధ్వనినే వారి పెంపుడు చిలుక అభ్యసిస్తుంది. ఇక్కడ కృష్ణునికి మురళి ఎట్టిదో, అక్కడ బ్రహ్మకు సరస్వతి అట్టిది. సరస్వతి వాగ్రూపం, ధ్వని రూపం. వేణువు పరమేశ్వరుని యొక్క ఉచ్ఛ్వాస నిశ్వాసాలవల్ల మోగుతున్నది. వేదాలు పరమేశ్వరుని ఉచ్ఛ్వాసాలుగా చెప్పబడుతున్నవి ఈ అంశాన్ని ఇక్కడ అన్వయించుకుంటే వేణునాదం వేదనాదమవుతున్నది 46 అందువల్లనే జ్ఞానమయ మయిన ఈ వేణువును ఒక ఉత్తమ జీవిగా భావించటానికి అవకాశం కలిగి స్తున్నది. లీలాశుకుడు —

"అయి మురళి! ముకున్దస్మేరవక్త్రారవిన్ద
శ్వసన మధుర సజ్ఞే। త్వాం ప్రణమ్యాద్య యాచే
అధరమణి సమీపం ప్రాప్తవత్యాం భవత్యాం
కథయరహసి కర్ణే మద్దశాం నన్దసూనోః॥47

అని అంటాడు తాను భగవంతుని విషయంలో ఎంతో ఆర్తి పొందుతున్నాడు. తన ఆర్తి స్వామికి తెలిసిందో, లేదో; ఎవరైనా చెప్పితే బాగుంటుందేమో అన్న తాత్పర్యంతో ముకుందుని వికసించిన ముఖారవిందము యొక్క శ్వసనమాదుర్య రసమెరిగిన వేణువును ఆ స్వామి అధరమణి సమీపమందున్నప్పుడు నా దశను ఆయనకు విన్నవించుమని నమస్కరించి యాచిస్తాడు. ఇక్కడ "శ్వసన మధు రసజ్ఞ" అనేది కూడా వేద ప్రదిపాదిత పరతత్వానుభవానందం పొందటాన్ని సూచిస్తుంది ఆ మురళి అని లీలాశుకుడి తాత్పర్యము.

"అపి జనుషి పరస్మిన్నాత్తపుణ్యోభవేయం
తట భువి యమునాయాస్తాదృశో వంశనాళః
అను భవతి యఏషశ్శ్రీమదాభీర సూనో
రధర మణి సమీపన్యాసధన్యామవస్థామ్." 48

యమునా తీరమందు బుట్టిన యీ వంశనాళము కృష్ణుని కెమ్మోవి పొంతంజేరి కృతార్థత్వము నొందినది. నేనును అట్టి పుణ్యము చేసికొని మరియొక జన్మమందైనను ఆ యమునా నది తీరమున ఒక వేణువుగా జన్మించాలని అంటారు.

కృష్ణ భక్తులందరూ వేణువుకి ఇంత ప్రాధాన్యాన్ని ఇవ్వటానికి కారణం వేణువునుండి ప్రవహించే నాదస్రోతస్సు. ఆ నాదం వేద స్వరూపం, ఆ నాదం

ప్రణవ స్వరూపం. భగవంతుడు ప్రణవ స్వరూపుడు. "గిరామస్మ్యేకమక్షరం...." అని భగవద్గీత వాక్యం. వాక్కులతో తాను ఏకాక్షరము అని భగవద్వాక్యం. ఇక్కడ ఏకాక్షరమంటే ప్రణవమని గీతా వ్యాఖ్యాతలందరూ వ్యాఖ్యానించారు.49 ఈ విధంగా ప్రణవస్థానం, పరబ్రహ్మ స్థానమూ అయిన వేణువు కృష్ణభక్తి మార్గంలో అత్యంత ప్రాధాన్యం పొందింది.

శృంగార వీధిలో బ్రహ్మగీతము ప్రధానంగా ఈ వేణువుకు సంబంధించింది.

''.......వేణువు నందు బ్రహ్మగీత గాంధర్వ గీతంబు పరగజేసె చతుర నటమూర్తి గోపాల చక్రవర్తి ...''50 అని అన్నారు పోతనగారు. అంతేగాదు—

''రావే సుందరి! యేమెబోడి! వినవే రాజీవనేత్రుండు బృం
దావీధిన్ దగవేణువూదు చు లసత్సన్యాసతాస్యంబుతో?
భ్రూ విన్యాసము లంగుళీక్రమములంబొల్పార షడ్జంబుగా
గావించెన్ నటుభంగి బ్రహ్మమగు దద్గాంధర్వ సంగీతమున్''51

అని అన్నారు. ఈ గాంధర్వ సంగీతం లేదా ఈ గాంధర్వగీతం బ్రహ్మము. బ్రహ్మమునకు, గీతికి ఇక్కడ అభేదం. ఈ బ్రహ్మ గాంధర్వ గీతము చెవి పడగానే సర్వచరాచర ప్రకృతి ఎంత ముగ్ధమై పోయిందో భాగవతంలో అద్భుతంగా చిత్రించబడింది. లీలాశుకుడు ఆ గీతం చెవినబడిన గోపికలను గూర్చి—

''యద్వేణుశ్రేణి రూపస్థిత సుషిరముఖోద్గీర్ణ నాద ప్రభిన్నా
ఏవాక్ష్యస్తత్క్షణేన త్రుటిత నిజ పతి ప్రేమబన్ధా బభూవుః
అస్త వ్యస్తాల కాన్తాః స్ఫురదధర కుచద్వన్ద్వనాభి ప్రదేశాః
కామావేశ ప్రకర్ష ప్రకటిత పులకాః పాతు పీతామ్బరోనః''52

అంటాడు. ఈ వేణుగానం చెవిన పడగానే బద్ధులైన జీవుల బంధాలన్నీ తెగిపోతున్నాయి. జీవులందరు బంధముక్తులై పరమేశ్వరుని చేరుకుంటున్నారు. ఇదే అంశం గోపికలు ప్రతీకగా పై పద్యంలో చిత్రింపబడింది. ఈ వేణురవంతో గోపికలు ప్రభిన్నులై పోతున్నారట నిజపతి ప్రేమ బంధాలన్నీ తెగిపోతున్నాయి. అంటే కౌటుంబిక సంబంధాలన్నీ విడిపోయి, వారు పరమేశ్వరుడియందు లగ్న మనస్కులవుతున్నారని తాత్పర్యం. పరమేశ్వరుని చేరుకుంటున్న దశలో వాటి

ఆరాటం ఉత్తరార్ధంలో చిత్రించబడింది. ఈ విధంగానే వేణువును అనేకమంది భక్తులు, అనేక విధాలుగా కీర్తించినారు.

శృంగార వీధిలో వేణువు గురించి ఒక ఖండిక, వేణుతత్వాన్ని గురించి రెండు ఖండికలు ఉన్నాయి. సామివేణువు అనేది ఒక విచిత్రమైన ముగ్ధత్వం కల గోపిక శ్రీకృష్ణునితో పలికినట్లుగా రచింపబడింది. ఈ కృష్ణునితో సంభాషణ మానసిక స్థాయిలో సాగింది. శ్రీకృష్ణుని వేణువు మధురనాదాలు ఆమెకు విని పించినంతలో వినిపించిన ఆ ధ్వని మాత్రమే కాక ఆ వేణువును ఊదుతున్నప్పుడు కృష్ణదేవుని ముఖంలో కదలికలు నాదము ననుసరించిన చూపులను ప్రసరింప చేసే కంటి కదలికలు ఆమెకు కనిపిస్తున్నాయి.

"ఓయి! సామి! నీ సామివేణూదు మధురి
తారవము లిందు వినవచ్చెనయ్య! వాని
వెంట నీ కను బొమపంక్తి విచలితాధ
రప్రకంపమ్ము నాకేకర ప్రసారి
తాక్షమును యథాదృష్టము లట్లు తోచె
ఈ తడవ - మున్ను తెలిసెనులే - గృహమ్ము
కదలఁజాలను - నీ మోసగానితనము,
సామి! నీ సామివేణునిస్వాన మరఁటి
బోదెలంబోని నా తొడల్ పొదలికొంచు
కలమ వెన్నులబోని జంఘలను గదిపి
తీసికొనిపోవునా యేని తీసికొంచుఁ
బోవసీ! నేను మాత్రము బుద్ధిపూర్వ
కముగ మా యింటి పట్టును గదలిరాను." —సామివేణువు

అంటే- ఆ నాదము కృష్ణుని ముఖ విలాసాన్ని మనసుకు రూపు కట్టిస్తున్న దని తాత్పర్యం. ఆ నాదం గోపిక కాళ్ళను కదిలింపచేసి కృష్ణుని సన్నిధికి తీసుకపోతే పోవచ్చునేమో కాని, తాను మాత్రం బుద్ధిపూర్వకంగా ఇంటిపట్టును వదలి కదలిరాను అంటుంది. ఆ నాదం విని గోపిక కృష్ణుని దగ్గరకు వెడుతూనే ఉంది. బుద్ధిపూర్వకంగా మాత్రం పోనంటుంది. ఆ నాదం ఆమెను పరవశురాలిని చేస్తున్నది. అది ఆనందం యొక్క శక్తి.

సామివేణువు లోని ఈ భావమే మరొక విధంగా ' అంతఃస్స్పృహ'లో వ్యక్తమవుతుంది.

"నీ మురళిమనోజ్ఞామృత నిస్వనంబు
వినుచు నీ మోమునందు నిల్పితిని జూపు
ఆ వదన సీమ వేణుగీతానురూప
మైన చలనంబు లందున లీనమైతి

బొమలకదలిక తారకాభ్రమణ రేఖ
అధర సంచాలనమ్ము నేత్రార్థమీల
నమ్ము వీనిలో నేను తైన్యమ్ము పొంది
నిన్ను సుందరమూర్తిగా నెన్నుకొంటి

లేఁత బాహుల నినుఁ గౌగలించుకొనఁగ
నాకు మిక్కిలి కోరియున్నదిర నాథ!
అనుచు నిను గోర నెంతు లజ్జాతిభార
కలుషమై కుంచుకొనుచు నా పలుకు సతము."

సామివేణువు లో వేణునాదము పరమేశ్వరుని విలాసాన్ని సాక్షాత్కరింప చేయగా ఇందులో "వేణుగీతానురూపమైన చలనంబులందు" గోపిక లీనము కావడాన్ని చిత్రిస్తుంది రెండు ఖండికలు కూడా నాదశక్తిని, నాదబ్రహ్మము కలిగించే పారవశ్యాన్ని చిత్రిస్తున్నవి.

ఈ విధంగా వివిధభావాలను అనుభావాలను కలిగించే వేణునాదాన్ని సత్యనారాయణగారు నాదబ్రహ్మముగా బ్రహ్మగీతంగా భావించారు. ఆ భావనయే "బ్రహ్మ గీతము" ఖండికలో చిత్రింపబడింది. పోతనగారు "బ్రహ్మగాంధర్వ గీతము" అన్న పదబంధము ఈ "బ్రహ్మగీతము" అన్న పదబంధానికి మౌలిక ప్రేరణగా స్ఫురిస్తుంది. పోతనగారి పద బంధంలోని "గాంధర్వ" పదము, ఆ తర్వాత ఉన్న "గీత" పదము వల్ల అనవసరమనిపిస్తుంది బ్రహ్మ గీతము అనటం వల్ల బ్రహ్మమునకు, గీతానికి - నాదానికి అభేద భావం స్పష్టంగా వ్యక్తమౌతుంది. బ్రహ్మగీతం చెవినపడగానే గోపికలలో కలిగిన సంచలనం దాని పరిణామం

ఈ ఖండికలో చిత్రింపబడింది. బ్రహ్మగీతం చెవిని పడగానే గోపికలకు స్మృతి పోయింది. ఈ అంశం ఇంతకు ముందటి "'సామి వేణువు"లో చెప్పిన అంశంతో సమన్వయించుకోవచ్చును. లీలాశుకుడు "త్రుటిత నిజపతి ప్రేమ బంధాః" అని మాత్రమే గోపికలను గూర్చి అన్నాడు. గోపికల బంధాలు తెగిపోయినవి. 'బ్రహ్మగీతం'లో ఇదే అంశం మరొకవిధముగా చెప్పబడినది. గోపికలు శ్రీకృష్ణుని దగ్గరకు వచ్చేటప్పటికి వారి ఇళ్ళు, వాకిళ్ళు, వారి సంతానం, భర్తలు వారి ఎద బాటుకి ఏమైపోయినారో - అంటే గోపికలకు బంధములనేవే లేవు. వారికి బంధాలుగా ఉండదగినవారే వారి నుండి విడిపోయినారు. కృష్ణుడు తన వేణునాదంతో గోపికల "పురానుగత సందుల"ను బ్రద్దలు చేసినాడు. కేవలం ఈ జన్మకు సంబంధించిన బంధాలు మాత్రమేకాదు. ఇవి పూర్వజన్మలనుంచి అనుసరించి వస్తున్న బంధాలు. వీటికి బలమెక్కువ కాని వేణునాదం వాటిని బలహీనపరచింది.

"మధురమురా! మురాసురవిమర్దన! నీదగు బ్రహ్మగీతి నీ
యధరమురా! పురాకృత మహో సుకృతంబు గడించుకొన్న దీ
శ్లథనవమేఖలల్ వ్రజవిలాసిను లంబుధరాకృతి న్నినుం
బృథివికి శంపలై డిగి వరింపఁగ వచ్చిరిరా వ్రజేశ్వరా!"

ఇది బ్రహ్మగీతి; మధురము. ఆ గీతం పెదవినుండి ప్రవహిస్తున్నది. ఆ పెదవి గొప్ప సుకృతం చేసుకొన్నది. కృష్ణుడు మబ్బువంటివాడు. ఆయనలో మెరిసే మెరపులు ఈ జీవులు. మెరపులు మబ్బుకంటే భిన్నం కావు. మబ్బులోని భాగాలే. మబ్బు నేలకు కృష్ణుడుగా అవతరించినప్పుడు ఆ మెరుపులు గోపికలుగా అవతరించారు జీవులందరూ పరమేశ్వరుని వివిధ రేఖలే అని తాత్పర్యం. కాని, లౌకిక సంబంధాలవల్ల మాటిమాటికి మోహం కలుగుతుంది. ఈ మోహం వేణునాదంవల్ల విచ్ఛిన్నమవుతుంది. కాని, గోపికలుగా, కృష్ణుడుగా ఉన్నప్పుడు లౌకికమైన క్రియాచరణ తప్పదు. అందుకే గోపికలు పరమేశ్వరుని గురించి పరుగెత్తటం చిత్రింపబడుతుంది. ఈ జీవులెప్పుడైనాసరే పరమేశ్వరుడియందు లీనం కావలిసినవారే.

"ఈ రసనిమ్నగల్ పరువులెత్తి కళిందసుతా సమీపకాం
తారమునందుఁ బాయలయి త్రాచుల పోలికలఁ బ్రాఁకుచున్ ఫణా
వారము లెత్తుచుం గొలువ వచ్చెడుఁ జిత్రముగా రసార్ద్రభా:
పూరమయాకృతుల్ భువనముగ్ధ కిశోరుని నందనందనున్."

గోపికలందరూ రస ప్రవాహములైనప్పుడు భువన ముగ్ధ కిశోరుడైన నందనంద నుడు సముద్రుడు. రసభావాకృతులై పరమేశ్వరుని పొందటం ఈ ఖండంలో చిత్రింపబడింది. ఈ చిత్రణకంతకు మూలం వేణువు "బ్రహ్మ గీతము." అవ్యక్త మైన పరబ్రహ్మము వేణువు ద్వారా వ్యక్తమవుతున్నది. పరమేశ్వరుని నాద స్వరూపం అవిష్కృతం కావటానికి వేణువు మూలం. ఇది వేణువు యొక్క ప్రాధాన్యము.

## రాధిక :

శృంగారవీధి సంకలనంలో 'రాధిక' అన్న శీర్షికతో మూడు ఖండికలు, రాధిక స్వప్నము అని ఒకటి-మొత్తం నాలుగు ఖండికలున్నాయి. తరువాతి ప్రచురణలలో 'రాధిక' శీర్షికతో ఉన్న మూడింటిలో రెండున్నాయి. ఇటీవలి ప్రచురణలో ఒకటి మాత్రమే ఉన్నది. ఈ మూడింటిలో మొదటిది వృత్త పద్య మయం, రెండవది గీత పద్యమయం, మూడవది భావకవితా కాలంలో రచించిన భావగద్య. ఈ భావగద్య ఇటీవల ప్రచురితమైన "శృంగార వీధి"లో కనిపిం చదు. నడిమి ప్రచురణలలో గీత పద్యమయమైన ఖండికే తప్ప వృత్తపద్య ఖండిక కనిపించదు. ఈ ఖండికలలో మొదటిది - వృత్త పద్యమయమైన ఖండిక కృష్ణునికి రాధికా స్థితిని విన్నవిస్తున్నట్లుగా కనిపిస్తుంది. శృంగార వీధి కావ్యంలో దూతిక కృష్ణునితో రాధిక అనుభవించే విరహాన్ని చెప్పిన తీరుకు దగ్గరగా ఉన్నది. ఈ పద్యాలు అక్కడి విన్నపంలో ఇమిడిపోయేట్టుగా ఉన్నాయి. కాని, అక్కడ ఇవి లేవు. మిగిలిన రెండు ఖండికలు రాధిక కృష్ణుని గూర్చి చేసిన భావనను వ్యక్తం చేస్తాయి.

'శృంగార వీధి' కావ్యంలో కూడా రాధ శ్రీకృష్ణుని గూర్చి భావించిన సన్నివేశం ఉన్నదికాని వాటిలో ఈ పద్యాలు ఇముడవు. భావగద్య ఇముడటానికే వీలులేదు ఈ స్థితినిబట్టి ఈ ఖండికలన్నీ శృంగారవీధి కావ్యానికి పూర్వమే రచింపబడ్డట్టుగా చెప్పవచ్చు. ఈ ఖండికలు పరిష్కృత రూపంలో విస్తరించి శృంగార వీధి కావ్యంగా పరిణమించినా యనవచ్చు. అయినా, మొదటి ముద్రణలో చేరినా కూడా తరువాతి ముద్రణలలో క్రమక్రమంగా అవి తొలగించబడి ఉంటాయి. మొదటి ఖండికలో రాధికా విరహదశ. రెండవ దానిలో రాధిక తాను శ్రీకృష్ణునిలో లీనం కావాలని ఆకాంక్షించడం వస్తువు. మూడవ ఖండిక భావ గద్య. ఎదుట నిలిచిన శ్రీకృష్ణునితో తన ప్రేమ తీరును రాధిక చెప్పినట్లుగా ఉంటుంది.

> ''నీవు నా దగ్గర లేనప్పుడు నా మనస్సు మిక్కిలి పరితపిస్తోంది. నా గుండె బ్రద్దలై పోతుంది కూడాను కాని నిన్ను చూస్తానా - నీకోసం నేనంత పరితపించినట్టే వుండదోయి నాకు మరి-'

అంటుంది. ఇది సంయోగ శృంగారములోని దశ. కృష్ణుడు తనకు కనిపించినప్పుడు తాను పరవశురాలవుతుంది.

> ''నీకు నమస్కారం చెయ్యాలని నాకుండదని నాకు తెలుసు, నీకు నమస్కారం చెయ్యాలని నేననుకోనూను. కాని, నీ స్నిగ్ధ మంజుల ప్రణయ గంభీరరూపం ఎదురు కాకుండా కనబడుతుందా? నా చేతు లప్రయత్నంగా రెంటూ కలుసుకుంటున్నయ్యోయి!

అనటంలో ఈ విషయం వ్యక్తమవుతుంది.

ఈ భావ గద్యలోని రాధిక తీరు శృంగారవీధిలో రాధకన్న భిన్నమయింది. అక్కడ రాధాకృష్ణుల సంబంధం వైవాహికమైనదా - కాదా? అన్న ప్రశ్నకాని, ఊహకాని కలుగనే కలుగదు. కాని ఈ గద్యలో-

> "నీకు నేను అంకుటాలునని లోకం చెప్పుకుంటుంది. అంచేత ఇక నీవు కనబడితే నీతో మాట్లాడనని నిశ్చయం చేసుకుంటాన్నానోయి-"

అని రాధిక అంటుంది. ఈ మాటలవల్ల రాధాకృష్ణ సంబంధం వైవాహికేతర సంబంధమవి స్పష్టమవుతుంది. ఈ రెండు వాక్యాలు లేకపోతే శృంగారవీధి కావ్య సందర్భంలోవలెనే ఇక్కడ కూడా రాధాకృష్ణ సంబంధాన్నిగూర్చి ప్రశ్న ఉత్పన్న మయ్యేదే కాదు భావకవితా యుగంలో స్వేచ్ఛా ప్రణయ లక్షణం కూడా ఒక పొంగుగా కనిపిస్తుంది. ఈ భావగద్యపై దాని ప్రభావం ఉందనవచ్చు. కాని, లోకంలో రాధాకృష్ణ సంబంధాన్ని గూర్చి వైవాహికేతరంగా కూడా భావించటం ప్రచారంలో ఉన్నది. ఆ అంశాన్ని ఈ భావగద్యలో చిత్రించినట్లుగా కూడా భావించవచ్చు.

"అంకుటాలునని లోకం చెప్పుకుంటూంది...." అన్న మాట ఈ అంశాన్ని స్ఫురింపచేస్తుంది. లోకం అట్లా చెప్పుకుంటున్నదే కాని, అది యదార్థం కాదు. ఒక విధంగా గోపికాకృష్ణుల విషయం కూడా ఇట్లాంటిదే. అక్కడి శృంగారం లౌకిక శృంగారం కాదు. ఇక్కడిదీ కాదు. లోకం చెప్పుకుంటున్నదే తప్ప తాను "అంకుటాలును" కానని రాధ అభిప్రాయం.

"ఓయి నాథుడా! నీ ఎడల నా మనస్సే నిత్యాశంకిగాని, నీ ప్రణయ కుసుమము నా ఎడలన నార్తవ మోయి, నీ ప్రేమవాహిని నాయందు అనావర్త మోయి...."

అంటుంది రాధ. రాధ శ్రీకృష్ణుని నాథుడుగానే స్వీకరించింది. శ్రీకృష్ణుని గూర్చి ఆమె శంక మనోదశకు మాత్రమే సంభవించింది. ప్రణయం మాత్రం ఆ దశను దాటి ప్రవర్తించేది అందువల్లనే అది అనార్తవం. అనార్తవమంటే ఋతువుకు చెందనిదని అర్థము. ఋతువు మారగానే పూవు వాడిపోతుంది. కాల ప్రభావం పూవుపై ఉంటుంది. కాని, ఈ ప్రణయ కుసుమం కాలాన్ని అతిక్ర మించింది. కాలానికి అతీతమయినది, ఈ ప్రణయం ఒక ప్రవాహం కూడా. ఈ ప్రవాహం అనావర్తం - సుడులు లేనిదని అర్థం. ప్రశాంత గంభీరంగా ఇది ప్రవహిస్తూంటుంది. లౌకిక, శారీరక సంబంధంలో ఉండే ఉద్వేగ ఆవేగాదులు ఉండవు. అందువల్ల ఈ ప్రణయం లౌకికమైన ఆలోచనలకు కాని, లౌకికమైన విధానాలకు గాని చెందింది కాక దానికి అతీతమైనదని భగవద్గతమైన ప్రణయం ఇక్కడ సూచింపబడుతుంది. "అంకుటాలు" అనటం లౌకిక దృష్టి మాత్రమే. పారమార్థికంగా భగవద్భక్త సంబంధమిది.

"నీవు గడప ముందుకు వస్తే నీ నవ మృణాళనాళ సుకుమార పాదాలు కఠినమైన నా గడపదాకి నొచ్చుతయేమోనని, నా కుచసీమపైమోపి పైట కొంగుతో అద్దుతున్నానోయి"

అనటం భగవంతుని యందలి ప్రియ భావనను ఉదాత్త స్థాయిలో వ్యక్తీకరిస్తున్నది. అట్లాగే—

"వెన్న, పాలు, పెరుగు తాగి ఊరటిల్లిన బుగ్గలతో ఈ తడవ మా దొడ్డి వాకిలి తీసి తొంగి చూశావా, చిగురాకుల వంటి నీ బుగ్గలు నా చేతులు తాకి కంది, పోతయేమోనోయి, చెబుతున్నానుగా...."

అనటం ప్రణయోక్తి మాధుర్యాన్ని వ్యక్తీకరిస్తున్నది. ఈ విధంగా ఈ భావగద్యం, ఇందులో విషయం కూడా ప్రయోగాత్మకంగానే సాగింది. ఈ తీరు సత్యనారాయణగారి రచనలలో మరెక్కడా లేకపోవడం వల్ల భావ కవితా యుగానికి చెందిన ఒక ప్రయోగంగా మాత్రమే చెప్పబడుతున్నది.

"రాధిక" ఖండికల్లో నాలుగవదైన "రాధికా స్వప్నము" ఒక విలక్షణమైన ఖండిక. శృంగార వీధి కావ్యంలో కృష్ణునికి రాధా విరహాన్ని "దూతిక" విన్న వించే సందర్భములో ఈ క్రింది పద్యం గమనించదగింది:

"దోసిలి యొగ్గి చందనముతోడ మనోభవ బాణపాతసం
త్రాస కుచాగ్రభాగములఁ దావక మంగళ పాద చిహ్నముల్
వ్రాసి మనోజభూత మని రక్షలు కట్టి తమాల పర్ణముల్
దూసి లతాంగి దేహ శిఖి ధూపము వేసినదోయి మాధవా!"

ఇందులో శ్రీకృష్ణుని పాద చిహ్నాలను రాధికా కుచాగ్ర భాగముల మీద చిత్రీకరించడం విరహ వేదనను నివారించేందు కన్నట్లుగా చెప్పబడింది. ఈ అంశమే మరొక విధంగా "రాధ స్వప్నము" ఖండికకు మూలంగా కనిపిస్తుంది.

"ఓ చెలి! రాత్రి నేను గల యొక్కటి గంటిని, దానిలోఁ జిరం
టీ చతురాంగజుండు మననెయ్యఁపుఁబోవు, యశోద కన్నవాఁ
డాచరణం బొనర్చె నొక యద్భుత మస్మదురోజముల్ మృదు
శ్రీ చరణాంకితంబులుగ నృత్యము చేసె, సకింకిణీ ధ్వనిన్."

ఆమె హృదయములో స్వామి సర్వదా సంచరిస్తూనే ఉన్నాడు. శరీర మంతా పులకల పంట పండింది. "అది యొక మాయగా హృదయమందున స్వామి నటించుచుండెనన్నది తెలియంగవచ్చునయినన్, పతిరూపము గానుపించదా, పదములు కానిపించు" అనటంలో ఆమె చిత్తము స్వామి పాద సంలగ్న మైందని స్పష్టం తాను నిద్రపోతున్నాననే జ్ఞానం, మేలుకొన్నాననే జ్ఞానం - ఆమెకు ఈ రెండూ ఒకే సమయంలో ప్రవర్తిస్తున్నాయి. ఇది ఒక వ్యక్తావ్యక్త దశ. చేతన, అవచేతనల నడిమి దశ. ఈ దశలో తన కుచములపై స్వామి పాద తాండవాన్ని రాధ అనుభవిస్తున్నది. స్వామి యొక్క "విచిత్ర రేఖా నటనాభిరామ పదకంజములన్ గుచసీమ కాంతి పాథోనిధి, మెట్ట తామరల తొడి గిరిద్వయి"వలె ఆమె కనిపించింది తానొక కాంతి ప్రవాహం. పరమేశ్వరానుభవం ఆమెకు ఆ విధమైన స్థితి కల్పించింది. "నాకిపుడింత సిగ్గునగు నాథుని యా పసికాలు నొచ్చునో నాక సుఖానుభూతిఁబడి నాయెద పుల్కలు క్రమ్మ...." అంటుంది రాధ. మాతృభావనలో శిశువును ఎత్తుకొన్నప్పుడు ఆ శిశు పాదములు స్తనములను స్పృశించటం ఒక విధమైన అనుభూతి, ఒక మధురమైన సన్నివేశం. రాధలోని మాతృత్వభావం, పరమేశ్వర భావంతో విలీనమయిపోయినది " నాథ హేతువగు నా సుఖ మాతనికన్న నిష్టమై"నది, "వ్రాలిన నాథుపాదనఖబంధుర దీప్తిఁగుచద్వయంబు దీపాలిడికొన్న దేవళముపైని విమానములట్లు"గా ఉన్నాయి. ఆమె శరీరమే ఒక దేవాలయం. ఆ శిశుమూర్తిని తన "సేవాల సహస్రముల్ మొగుడనాతనివెన్క నటత్పయోధరాందోళిత మూర్తికిన్ మకరతోరణ వైఖరి తాల్చినది", "ఆ లలితంబు, తౌనడుగులందముదెచ్చెనొ మున్నెఱుంగఁగా జాలను వాని యందము కుచద్వయి స్త్రీతరమైన మోహమై కేల గదించికౌఁగిట లగించఁగ నేనె తలంతు" అంటుంది.

రాధ తన స్వప్నాన్ని తన స్నేహితురాలికి వర్ణించి చెప్పినట్లుగా ఉంటుంది. ఈ స్వప్న ఖండిక మొత్తం వ్యక్తావ్యక్త లౌకిక భావాల సంక్లిష్ట మయిన విలక్షణమైన అనుభవాన్ని చిత్రిస్తుంది. నాథత్వ, శిశుత్వాలు స్త్రీ జీవితంలో అత్యంత ఘనిష్ఠమైన సంబంధాలు. ఈ రెండు సంబంధాలను భిన్న భిన్నంగా కాకుండా, ఏక కాలంలో పరమేశ్వర భావమయంగా అనుభవం పొందటం రాధ యొక్క అతి పవిత్రమైన, ఉదాత్తమైన మానసిక దశకు ప్రతీక. వ్యక్తావ్యక్త దశలోను ఈ విచిత్ర భావ సమ్మిశ్రణం వ్యక్త దశలోనికి

వచ్చేటప్పటికి కేవలం భావనామయమైన స్మృతిగా నిల్చింది. ఈ అంశం ఈ ఖండికలోని చివరి పద్యంలో వ్యక్తమవుతుంది.

"నిదురను మేలుకొంటినని నిశ్చయమైనది, యద్ది స్వప్నమ
న్నది నిజమైన, దింకనయినన్ బులకించుటయైన నా యెదన్
గదలుచు నున్నయట్లు పనికాళులు దోచెడి, మేలుకొన్న నా
యెద యిది మేలుకొన్న దనుటే నిజమా! కలయే యిదా చెలీ!"

మధుర భక్తిలోని కాంతా వాత్సల్య భావాలు ఏకంగా ఒదిగిపోవడం ఈ ఖండికలోని విశిష్టత.

## యమునా నది :

శ్రీకృష్ణుని శైశవ క్రీడల సందర్భంగా యమునా నదికి విశిష్ట స్థానముంది. శ్రీకృష్ణుడు వ్రేపల్లెకు రావటమే "యమునా నది"లో నుండి వచ్చినాడు. ఆ తరువాత శ్రీకృష్ణుని బాల్య క్రీడలన్నీ యమునా తీరంలోనే సాగినవి. గోపకులకు శ్రీకృష్ణునికి యమునయే విహార స్థలం. ఆ యమునానది సూర్యకన్య. శ్రీమన్నారాయణుడు 'సవితృ మండల మధ్యవర్తి.' నారాయణుడు కృష్ణుడుగా అవతరించగా, సూర్యకన్య యమునానదిగా ప్రవహించింది. కృష్ణభక్తిలో యమున కేవలం ఒక జలప్రవాహం కాదు. ఆవిడ యశోదవంటి భక్తురాలు. దేవకీ గర్భం నుండి అవతరించిన శ్రీకృష్ణుడు వెనువెంటనే యమునా నది గర్భంలో ప్రవేశించాడు. వసుదేవుడు శ్రీకృష్ణ శిశువును తలదాల్చి యమునా నది దాటుతున్నప్పుడు, ఆ దాటుతున్నంతసేపు ఆ శ్రీకృష్ణుడు యమునా గర్భస్థ శిశువు. ఆ తరువాతనే యశోద ఒడిలోని శిశువు. అందువల్ల శ్రీకృష్ణునికి ఒక విధంగా యమున మాతృస్థానీయురాలు. అడుగడుగునా శ్రీకృష్ణుని విషయంలో ఆమె మాతృభావన చేసింది. ఈ సంకలనంలోని "యమునానది" ఖండికలో ఆమెలోని మాతృభావన మధురంగా చిత్రించబడింది.

కృష్ణుడు జన్మించగానే మాట ప్రకారం, వసుదేవుడు కంసునికి అప్పగిస్తాడు. అప్పుడా జగదేకనాథ శిశువు 'ఏమైపోవునో'' అని యమునానది ''ఆవర్తకల్లోలి తామ్మయ సంరంభము పొంది'' నదట (అప్ + మయ -

అమ్మయ - జలమయ). వసుదేవుడు ఆ కృష్ణ శిశువును యమునను దాటిస్తున్న ప్పుడు ఆమె ఏ మాత్రమూ వారికి బాధ కలుగకుండా ''శాంత మధురాకృతి'' అయిందట. యమునా తరంగాల మీద ''ఆ హరి డింభమూర్తికిన్ ప్రళయ పయస్సముద్ర వటపత్ర శయానత'' మరల అబ్బినదట! ఈ విధంగా యమునా నదీ వైభవ చిత్రణగల ఈ ఖండికలో చివరి పద్యమిది-

''ఆ నీ గర్భ వినిస్సృతాంబువులలో నానందవీణారవ
శ్రీ నృత్య స్వనమో త్రయీ నినదమో చిల్లక్ష్మి మంజీరఘం
టానాదంబులొ వేణునిస్వనములో న్యగ్రోధ పాలాశ శ
య్యానిద్రా లయబాలు నిశ్వసితమో యారావముల్ తోచెడిన్.''

యమునానదిలో నుండి విచిత్రమైన ధ్వనులు వస్తున్నాయి. అవి తరంగ ధ్వనులు కాని ఆనందవీణా రవస్వనమో, వేదనాదమో, జ్ఞానలక్ష్మి పాదమంజీర నాదమో అనిపించిందట. చివరకు వేణు నిస్వనంలాగా అనిపించింది. శ్రీకృష్ణుని బాల్య మంతా వేణునాదమే. ఆ వేణునాదం బ్రహ్మగీతం వంటిది. ''న్యగ్రోధ పాలాశ శయ్యా నిద్రా లయబాలు నిశ్వసితమో''అంటే-పరమేశ్వరుని ఉచ్ఛ్వాస, నిశ్వాస స్వరూపం. వేదము పరమేశ్వరుని ఉచ్ఛ్వాస, నిశ్వాసాలు అనే విషయం ఇక్కడ అనుసంధించుకుంటే వేణునాదం యొక్క ప్రాధాన్యం స్పష్టపడుతుంది. యమునా నది ప్రవాహనాదానికీ, వేణునాదానికీ అభేద ప్రతిపత్తి చెప్పడం - యమునానది యొక్క వైభవాన్ని ఎంతగానో ఉదాత్తీకరిస్తున్నది.

## సాక్షాత్కారము :

"సాక్షాత్కారము" తొమ్మిది పద్యాల ఖండిక. పద్యాలు తొమ్మిదే కావచ్చు కాని, ఈ ఖండిక మౌలికమైన కొన్ని అంశాలను విశ్లేషిస్తున్నది. ఈ విశ్లేషణ ఒక గోపిక భావన కావచ్చు లేదా కవి భావన కూడా కావచ్చు. ఏ భావన అయినా చిత్రించబడిన మౌలికాంశాలలో తేడా ఏమీ కలుగదు. ఈ ఖండిక చిత్రించే మౌలికాంశం జీవుని వేదన. దీనికి సజాతీయమైన భావన అభిజ్ఞాన శాకుంతలంలోని కాళిదాస మహాకవి ఈ విధంగా వ్యక్తీకరించాడు:

"రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్యశబ్దాన్
పర్యుత్సుకో భవతి యత్సు ఖితోఽపి జంతుః
తచ్చేత సాస్మర తినూనమబోధపూర్వం
భావ స్థిరాణి జన నాంతర సౌహృదాని."

వ్యక్తి బాహిరమైన పరిస్థితులలో సుఖితుడుగానే సుఖాన్ని అనుభవిస్తున్న వాడుగానే ఉండవచ్చు కాని, రమ్యములైన దృశ్యాలను చూస్తున్నప్పుడు, మధురములైన శబ్దాలను వింటున్నప్పుడు ఎందుకో - కారణం తెలియకుండానే పర్యుత్సుకుడు అవుతున్నాడు. ఈ పర్యుత్సుకత్వానికి వ్యక్తి స్థాయిలో - మానసిక స్థాయిలో కారణమేదీ కన్పించదు చేతస్సు అబోధ పూర్వమైన, భావ స్థిరాలైన జననాంతర సౌహృదాలను స్మరించటం కారణం కావచ్చు. కాని, స్మరించటమనేది పూర్వం అనుభవించిన, లేదా తెలిసిన విషయానికి సంబంధించి మాత్రమే జరుగుతుంది. తెలియని దానిని గూర్చి, అనుభవించని దానిని గూర్చి స్మరించటమనేది కుదరదు. ప్రస్తుతాంశం అంతకు పూర్వం తెలిసిన అంశాన్ని స్మరింపచేయటానికి ఒకానొక క్రమ స్ఫూర్తి ఉంటుంది. ఇక్కడ అట్లాంటిదేమీ లేదు. కాబట్టి ఇక్కడ అనుభవించే "పర్యుత్సుకత్వం" ఒక విచిత్రమైన అనుభూతి.

చేతస్సంటే చిత్తం. అంతఃకరణం అనేదాన్ని నాలుగుభాగాలుగా గుర్తిస్తారు. అవి మనస్సు, బుద్ధి, అహంకారము, చిత్తము. అంతఃకరణం ఈ నాలుగువిధాలుగా ప్రవర్తిస్తుంది. "అంతఃకరణ ప్రవృత్తులలో సూక్ష్మ తమమైన ప్రవృత్తి చిత్తము. స్థూలతమమైన ప్రవృత్తి మనస్సు. బాహిరమైన జగత్ప్రవృత్తి యంతయు నీ మనస్సుతో చేయబడుచుండును. అంతఃకరణము యొక్క బహిః ప్రసరణము మనస్సనియు అంతః ప్రసరణము చిత్తము అనియు చెప్పుకొనవచ్చును."53 చిత్తము స్మరించుచున్నదంటే అంతరికమైన విషయాన్నే అనుభవిస్తున్నదని తాత్పర్యం. బాహిరమైన దృశ్యాలు, శబ్దాలు అంతరికమైన ఆ విషయానికి ప్రేరకాలు లేదా వ్యంజకాలు మాత్రమే అవుతాయి. మరి అంతరికమైన విషయాలు ఇక్కడ భావస్థిరమైన జననాంతర సౌహృదాలుగా చెప్పబడ్డాయి. ఈ సౌహృదాల సంస్కారము భావస్థిరమై ఉంటుంది. "భావమనగా జీవ సంపుటి అని అర్థము. అంతఃకరణమునకు ఏ విధమైన ప్రచారము లేని స్థితి భావమనబడును. అందుచేత, భావమనగా జీవుని స్వరూపమని అర్థము "54 భావస్థిరములంటే జీవుని యందు సంస్కార

భూతంగా ఉన్న అంశాలని స్పష్టపడుతున్నవి. ఇవి జీవునికి అనేక పూర్వజన్మల నుండి సంక్రమించినవి. పర్యుత్సుకత్వమంటే ఈ విధమైన సంస్కారాలద్వారా జీవుడు స్వస్వరూపావగతిని పొందడం. ఇదే జీవుని వేదన ఇది సుఖం కాదు, దుఃఖంకాదు. సుఖదుఃఖాలనేవి లౌకికమైన విషయాలు. సుఖితః - సుఖము పొందినవాడు అన్నప్పుడు చెప్పిన సుఖం కూడా బాహిరమైనదే. బాహిరస్థితిని బట్టి చూస్తే సుఖమనిపించే అంశం చిత్త ప్రవృత్తికి సంబంధించింది కాదు. బహిరంశాలు ఆ చిత్త ప్రవృత్తికి ప్రేరకాలు మాత్రమే ఈ విధమైన పర్యుత్సుకత్వంతో జీవుడు వేదనానుభవాన్ని పొందుతున్నట్టుగా కాళిదాసు ప్రతిపాదించినాడు. ఈ ప్రతిపాదన భూమికగా "సాక్షాత్కారము" ఖండికలో విషయాన్ని విశ్లేషించుకోవలసి ఉంటుంది.

ఈ ఖండికలోని తొలి పద్యమిది—

"ఈ యనిలాధ్వమెల్ల నినదించెను మువ్వల మ్రోఁత దూరమై
పోయిన గోతతిన్ బిలుచుపోలిక నేదొ విని స్వనించెడున్
రాయిడి పొందుచున్ దలఁచరాక వగర్చి పురానుభూతముల్
తీయని భావముల్ స్మృతికిఁ దెచ్చుకొనన్ వలవంతఁ గుందెదన్."

అనిలాధ్వమంటే ఆకాశం అకాశం శబ్దగుణకం ఒక ధ్వనిని ఈ ఆకాశము నినదిస్తున్నది. ఆ ధ్వని మువ్వలమ్రోతగా అనిపిస్తున్నది. అది దూరంగా పోయిన గోతతిని పిలుస్తున్నట్లుగా ఏదో "వినిస్వని"స్తున్నది. దానితో రాపిడి పొంది ఆలోచించరాక వగర్పు పొంది పూర్వము అనుభవించిన తీయని భావాలను స్మృతికి తెచ్చుకోవడం కొరకు 'వలవంత' విరహముతో కుంది పోతున్నాను.

ఈ పద్యము మొత్తం ఒక స్పష్టా స్పష్టమైన అంశాన్ని చిత్రిస్తుంది. ఈ మువ్వల మ్రోత ఎవరిది? అది తెలియదు. ఈ ఖండిక మొత్తం అంతా చదివితే కృష్ణుని పాదాలకు కట్టిన మువ్వలని భావించే వీలు కలుగుతుంది. కృష్ణుడు విష్ణువే. ఆకాశము విష్ణు స్వరూపం. పరబ్రహ్మము. అది మువ్వల మ్రోతగా ఉన్నదంటే నాదబ్రహ్మముగా ఉన్నది. గోతతి అంటే గోవుల సమూహము అని స్థూలమైన అర్థము. వాక్కు అని కూడా గోశబ్దానికి అర్థం. ఈ కవి

యొక్క వాక్కులు పరబ్రహ్మతత్వానికి దూరమై పోతున్నాయి అట్లాంటి వాక్కులను మూలభూతమైన నాదం పిలుస్తున్నట్లుగా అనిపిస్తున్నది. "వినిస్వనించు" టలో తాత్పర్యమే ఇది. రాయిడి పొందుతున్నది తాను అంటే తన చిత్తము, తియ్యని భావములు పురానుభూతములు కాబట్టి స్మృతికి తెచ్చుకోవచ్చు. ఈ తియ్యని భావమేమిటి? వ్యష్టి చైతన్యం బృహత్ చైతన్యంతో అనుబంధింపబడి ఉన్నప్పుడు పొందిన భావం. అది అనేక కారణాల చేత అజ్ఞాతంగానే ఉండి పోయింది. ఒక క్రమ పద్ధతిలో దానిని స్మరించుకోవటానికి చేసే ప్రయత్నమే "వలవంత." ఒక గోపిక కావచ్చు, ఒక కవి కావచ్చు. అచ్చమైన స్థితిలో వారు ఈ విధమైన పరమేశ్వర విరహాన్ని - జీవుని వేదనను అనుభవిస్తూ ఉంటారు. ఈ అనుభవించటంలోని వివిధ దశలను ఈ ఖండికలోని తరువాతి సీస పద్యం చిత్రిస్తున్నది.

"ఒకసారి నాలోననూహించి యేమియో
స్త్రీవోలె సిగ్గు పొందెదను నేను
ఒకసారి యెదపొంగి యూంగించి కవివోలె
మృదుకంఠమెత్తి పాడెదను నేను
ఒకసారి హృదయమూరకబాధపడి కంటి
తుదలందు నీరు జార్చెదను నేను
ఒకసారి వీతహేతుకముగా సౌఖ్యమ్ము
విరిసిపడ్డట్లు నవ్వెదను నేను
ఏ మహాభావమో వచ్చి హృదయ మావ
రించి నా సందులను గదలించివైచు
ఆ మహాభావ మరిసెద నన్నకొలంది
నా విలోచన పథ మెల్ల నల్లనయ్యె."

తనను ఆవరిస్తున్న అజ్ఞాతమైన మహాభావాన్ని తెలుసుకోవడం కొరకు సాగుతున్న ప్రయత్నంలో "అనవసరమ్ముగా హృదయమంతయు నంచలనమ్ము పొంది కన్గొనలను బాష్పముల్ తరుముకొంచు ప్రవాహము కట్టి వచ్చు"ను. ఏ ధ్వని వినిపించినా కూడా అది తన తాపాన్ని తీర్చగలదేమోనని దాని కోసం ప్రయత్నం సాగుతుంది.

ఈ అంతస్తాపము ఒక దృశ్యాన్ని చిత్రించుకోవడానికి ప్రయత్నిస్తుంది ఈ చిత్రించుకోవడం మానసిక స్థాయిలో సాగుతుంది, ఒక చిన్న చెట్టు. దాని ప్రక్కన ఆవుల గుంపు, దానికి దగ్గరలో ఒక నల్లని పెద్ద కాల్వ ప్రవహించడం ఈ మానసిక చిత్రాన్ని చిత్ర స్థాయిలో స్థిరత్వాన్ని సంపాదించేందుకు ఆ ప్రయత్నం వికటితమై శూన్యత్వమే కలుగుతుంది. ఇదంతా వాగ్రూపంలో బయటకు రావాలని ఎంతగానో ప్రయత్నిస్తుంటుంది. ఆ ప్రయత్న వేగానికి "తను వెల్లడించికిపోయె, నా హృదయ మనంత వేగమున ఇట్టటు కొనందొడంగెడున్."

ఈ విచిత్రమైన స్థితి గిరికుమారుని ప్రేమగీతాలు తొలి ఖండంలో ఈ విధముగా చిత్రించబడినది:

"అస్మదీయ కంఠమునయందాడుచుండెఁ
నొక యేదో గీతి బయటికి నుబికి రాదు
చొచ్చుకొని లోనికిం బోదు వచ్చిపోయె
నా హృదయ మీ మహా ప్రయత్నమ్మునందు."

"విఫలిత పునః పునః కృత వివిధ యత్న
భావిత ప్రచండ బాధా తథావిదారి
తాస్మదీయ హృదంతరంబందుఁ దోచె
స్ఫురిత సంఫుల్ల నవ జపాశోణ సంధ్య"

"ఈ మహా సంధ్యలో శారదా మయూరి
రమ్య కింకిణీ కిణీ కిణీ రణసపాద
మంజుల విలాస నృత్య సామ్రాజ్యలక్ష్మి
యగుచుఁ గచ్ఛపీ మృదుగీతులనుసరించు."[55]

తన కంఠములో ఏదో ఒకటి ఆడుతున్నది. అది ఒక గీతి. అది లోనికి పోక, బయటకు రాక బాధిస్తున్నది. దాన్ని బయటకు రప్పించే ప్రయత్నంలో మాటి మాటికి విఫలమవుతున్న ప్రయత్నంలో పగిలిపోయిన హృదయంలో ఒక జపాశోణ సంధ్య-జపాకుసుమమువలె ఎరుపైన సంధ్యాకాంతి విచ్చుకున్నది. ఆ 'మహాసంధ్య'లో సరస్వతీదేవి వాహనమైన నెమలి పాద కింకిణీ ధ్వని, ఆమె

పినాదాన్ని అనుసరిస్తూ వ్యక్తమయినది. ఈ 'జపాశోణ సంధ్య' ఏమిటి? అంబికా తనుకాంతి ప్రసారం.

"కపీన్ద్రాణాంచేతః కమలవన బాలాతపరుచిం
భజన్తే యేసన్తః కతి చిదగుణామేవ భవతీమ్
విరించి ప్రేయ స్యాస్తరుణ తర శృఙ్గారలహరీ
గభీరాభిర్వాగ్భి ర్విదధతి సతాం రంజనమమీ."56

అరుణరూపిణి యగు తల్లి తనుకాంతి ప్రసారమున కవికి వాక్కుగా ఆవిష్కృత మైనది.

ఇక్కడ గీతికగా చెప్పబడిన విషయము "సాక్షాత్కారము"లో ఒక పద్యంగా చెప్పబడినది చిత్తంలోని అంశాన్ని మానసిక స్థాయికి తెచ్చినప్పుడు "ఈ వృక్షాగ్రములన్ సదాకృతులు కావే సాకృతుల్ కావు." నిరాకృతులు అనగా ఆకారము లేనివి. ఆకారము లేనివీకావు, ఉన్నవీ కావు. దీనిద్వారా స్పష్టాస్పష్టమైన ఒక లక్షణం స్ఫురిస్తున్నది. ఇట్లాంటి స్ఫూర్తినుండి "ఏదో నీల దివాలలో మెరుగులే హేలాచలద్రేఖలై, ప్రోదింగట్టెడు మొల్కయై త్రిజగతీ పుణ్యంబు సాకారమై''నది. దానితో శరీరంలో అంతులేని కంపం కలిగి స్వమత్వం వచ్చింది. ఈ కంపం అలంకారిక పరిభాషలో ఒక సంచారీ భావం. సాకారమైన "త్రిజగతీపుణ్యం" శ్రీకృష్ణుడు. కాని, శ్రీకృష్ణుడన్న మాట ఇక్కడ స్పష్టంగా చెప్పబడలేదు. క్రింది విధంగా స్ఫురింప చేయబడింది:

"ఏడెవఁడో కుమారకుఁడు వేదపుఁ గ్రొంజివురుల్ వలించి యే
వాడిమిలేని నా హృదయమున్ దనవైపున కాకృషించుచు
న్నాఁడు శిరస్తటీచలిత నవ్యమయూర విలాసబర్హస
మ్మోదభిరమ్యమూర్తుఁడు సరాగవిలోచన మందహాసుఁడున్.''

ఈ కుర్రవాడు ఎవరో తెలియదు. వేదపుక్రొంజివురుల్ - ఉప నిషద్వా క్యాలను వలించినట్లుగా ఉన్నాడు. తల మీది నెమలి పింఛం, కన్నులలో రాగ సహితమైన మందహాసం - దానితో ఏ పోడిమలేని హృదయాన్ని తనవైపు 'ఆకృ షించుచున్నాడు' - ఆకర్షించుచున్నాడు. కృష్ణ శబ్దము కృషి ధాతువు నుండి

రూపొందింది. కృషించువాడు అని అర్థము. తొలి పద్యంలో ''గోతతిని పిల్చుట" అనే అంశాన్ని ఇక్కడ అనుసంధించుకుంటే శ్రీకృష్ణుడు తన వాక్సమాజాన్ని తన వైపునకు ఆకృషిస్తున్నాడు అని స్పష్టపడుతుంది. శ్రీకృష్ణుడు నాద బ్రహ్మము. వేణువు శ్రీకృష్ణునికి ప్రతీక కావటం ఈ కారణంగానే.

ఈ విధంగా సాక్షాత్కారమనే ఖండిక గోపికా రూపమైన కవియొక్క వేదనను, తద్వారా కలిగిన పరబ్రహ్మ సాక్షాత్కారాన్ని, ఆ సాక్షాత్కారం శబ్దమయమైన కావ్యంగా ఆవిష్కృతం కావటాన్ని చిత్రిస్తున్నది. ఒక కావ్యం, లేదా కవిత ఆవిష్కృతం కావడానికి, లేదా ఒక భక్తుడిలో, భాగవతరూపం ఆవిష్కృతం కావడానికి పూర్వం సాగే తీవ్ర వేదనా స్వరూపం ఈ ఖండికలో చిత్రించబడింది.

## సంకలనాకలనము :

శృంగార వీధి సంకలనంలోని కావ్యాలను, ఖండికలను అనుశీలించటం ద్వారా భావకవితా యుగంలో సత్యనారాయణగారు శృంగారమనే అంశాన్ని ఎంత ఉన్నత స్థాయిలోనికి తీసుకువెళ్ళారో స్పష్టపడుతుంది. ఆద్యంతమూ రాధికపరంగా కాని, వేణుపరంగా కాని, యశోదాపరంగా కాని వ్యక్తమయిన దంతా భగవద్విషయంలో జీవుని తపన, వేదన, ఉపాసనా విధానం వంటి అంశాలే ప్రాధాన్యం వహిస్తున్నాయి శృంగారమనేది ఈ అన్నింటికి బహిరావరణగా చిత్రించబడినది. ఈ వేదన మనోభూమికలపై శృంగారంగా వ్యక్తమవుతూనే, చిత్తభూమికలపై పరమేశ్వర విరహంగా వ్యక్తం కావడం ఈ సంకలనంలో ఆద్యంతమూ సహృదయులకు స్పష్టపడుతున్నది.

## పాదసూచికలు :

1. ప్రణాళిక కాగితం యొక్క జిరాక్స్ ప్రతి అనుబంధంగా చేర్చబడింది.
2. "ఖండకావ్యమ్ భవేత్। కావ్య స్యైక దేశానుసారిచ॥"
   "యధామేఘదూతాది" - విశ్వనాథుని సాహిత్య దర్పణమ్ - పరిచ్ఛేదము 6 - కారిక 329.
3. "కవి కర్మ కావ్యమ్."

4. దండి 'కావ్యాదర్శః.'

5. పైదే. - "ఇతిహాస కథోద్భూతమితరద్వాసదాశ్రయమ్ చతుర్వర్గ ఫలాయత్తం చతురోదాత్త నాయకం" - 25.

6. (అ) ముక్తకము - క్రియా సమాప్తికై పద్యాంతరముతో నెట్టి సంబంధము లేక రసభావాదులు గల యేక పద్యము.

(ఆ) యుగ్మకము - క్రియా సమాప్తికై పరస్పర సంబంధము గల పద్యముల జంట.

(ఇ) సందానికతము- క్రియా సమాప్తికై పరస్పరాపేక్షగల మూడు పద్యముల సమూహము.

(ఈ) కలాపకము - క్రియా సమాప్తికై పరస్పరాపేక్షగల నాలుగు పద్యముల మొత్తము.

(ఉ) కులకము - క్రియా సమాప్తికై పరస్పరాపేక్ష గల యైదు పద్యముల మొత్తము.

(కావ్యాలంకార సంగ్రహము పుట 261 - సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి.)

7. తెలుగులో కవితా విప్లవాల స్వరూపము - వెల్చేరు నారాయణరావు (1978)

8. విమర్శిని 1 -

9. రాధాకృష్ణులకు సంబంధించి అనేక గ్రంథాలు వివిధ భాషలలో వెలువడ్డాయి. బహు ముఖాలుగా రాధాతత్త్వం చిత్రింపబడింది. ఇక్కడ రాధాకృష్ణ విషయము ప్రాస్తావికముగా రేఖామాత్రముగా పరిచయం చేయబడింది.

10. సంస్కృత భాగవతము - 10 వ స్కంధము - 30 వ అధ్యాయము - 28 వ శ్లోకం.

11. ఆంధ్ర మహా భాగవతము - 7 వ స్కంధము - 1 వ అధ్యాయము - 18.

12. ఆంధ్ర మహా భాగవతము - 10 వ స్కంధము - 31 వ అధ్యాయము - 1042.

13. పూరీలోని జగన్నాథస్వామి ఆలయంలో ప్రతాపరుద్ర మహారాజు ఆజ్ఞ ననుసరించి వ్రాయబడిన క్రీ॥శ॥ 1499 నాటి ఒక ఒరియా శాసనం వలన ఆనాటి నుంచి ఆ ఆలయంలో నృత్యగానాదులు నిర్వర్తించే దేవ దాసీలు గీత గోవింద కావ్యం నుంచి తప్ప మరే కావ్యంలోని పాటలను, శ్లోకాలను ఉపయోగించరాదని నిషేధించబడినది. (చూ. మన్మోహన చక్రవర్తి వ్యాసం-"ది జర్నల్ ఆఫ్ ఏషియాటిక్ సొసైటీ ఆఫ్ బెంగాల్" వాల్యూమ్ 62, 1893 పుటలు 96, 97). మధ్యయుగ భారతదేశంలో అప్రభంశ, తొలి హిందీ (Early Hindi) చిత్రలేఖనం (దానినే ప్రాచీన గుజరాత్. లేక తొలి రాజపుత్ర చిత్రలేఖనం అని కూడా అంటారు) లోనూ రాజస్థాన్, బుందేల్ ఖండ్, బసోహ్లీ, చాంబా, కాంగ్రా చిత్రకళలలోను, బెంగాల్, అస్సాం, ఒరిస్సా, తెలుగు దేశా లలో స్థానిక చిత్ర కళా రీతులలోనూ ''గీత గోవిందం'' వహించిన స్థానం గణనీయమైనది - జయదేవుడు - సునీతి కుమార్ చటర్జీ (ఇంగ్లీషు మూలం) - బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు, 1988, పుట, 42.

14. భీమ ఖండము - 1 - 3.

15. ఆధునికాంధ్ర కవిత్వము 1989 డా॥ సి. నారాయణరెడ్డి, పుట 441.

16 -పైదే-

17. ''శ్రీ జయదేవ కవి - అష్టపదులు'' వ్యాసం - శ్రీమాన్ వింజమూరి వరాహ నరసింహాచార్యులుగారు, సంగీత విద్వాన్, కాకినాడ ఆంధ్ర పరిషత్పత్రిక - కాకినాడ సంపుటి 26 - 1937 డిసెంబరు - 1938 జనవరి.

18. గీత గోవింద కావ్యమ్ - డా. దాశరథి (వ్యాఖ్య) 1987.

19. భక్తిరసవాదం (వ్యాసం) - తుమ్మపూడి కోటేశ్వరరావు (పోతన పంచ శతిస్మారిక - 1982).

20. వేయి పడగలు - విశ్వనాథ సత్యనారాయణ (1986) పుట 84, 166.

21. "నాహం వసామివైకుంఠే నయోగి హృదయేషువా
మద్భక్తా యత్ర గాయంతి తత్ర తిష్ఠామినారద!" అన్నాడు భగవంతుడు.

22. "కనకమహీధరేంద్రు నలికస్థిత పర్వతరాజపట్టబం
ధనమును బోని కోటయు, ఘనంబగు తన్మకుటంబు కైవడిం
దనరెడు వైజయంతమును, దవ్వులఁ గానఁగవచ్చెఁ జూచి తే
యనిమిష రాజధాని యిది హాయనమాత్ర కురంగలోచనా!"
— పారిజాతాపహరణము (ఆశ్వాసము - 2, పద్యం - 97).

23. "అన్వాయ సా నియమజం క్లమ ముత్య సర్వ
క్లేశఃఫలేన పునర్నవతాం విధత్తే॥" (5.86)
"కుమార సంభవము" - నన్నెచోడుడు.
(పరమేశ్వర సాక్షాత్కారం కలుగగానే పార్వతీదేవి తపఃక్లేశాన్ని మరచిపోయింది. తపఃఫలము లభించగానే పునర్నవత్వము పొందినది)

24. శ్రీమద్రామయణ కల్పవృక్షము- బాలకాండము - కళ్యాణ ఖండము- 190.

24.(ఎ) తాత్త్వక విషయం లేదా చర్చ కథలోని భాగమే అయేట్టయితే, దాన్ని చిత్రించే తీరు వేరు ఆముక్త మాల్యద, కవి కర్ణరసాయం మొదలయిన కావ్యాలలో ఈ తీరు లెన్నులు చూడవచ్చు.

25. 'నిరుపమదుః ఖేర్ష్యాదులు। నిరతము జనియించు నరతి నిర్వేదమగున్' - కావ్యాలంకార సంగ్రహము 3 - 50.
నిర్వేదమన నీచులకు, ఆక్రోశన, అధిక్షేప, తాడన దార్రిద్య, ఇష్ట విరహ పద సంపద్దర్శనాదుల చేతను, ఉత్తములకు చిర తిరస్కారాదుల వలనను బుట్టిన విషయద్వేష నామాంతరము గల చిత్తవృత్తి. ఇది కలిగినప్పుడు రోదనము, దీర్ఘ నిశ్వాము (నిట్టూర్పు), దీనముఖత్వము మొదలయినవి కలుగును.
"విశేషాధాభిముఖ్యేన చరణాత్ వ్యభిచారిణః
స్థాయి న్యున్మగ్న నిర్మగ్నాః"॥ సాహిత్యదర్పణము 3.140.

26. "తత్వజ్ఞానా పదీర్ష్యాదే నిర్నిద్వేదః, స్వావమునన్ దైన్య
చింతాశ్రు నిఃశ్వాసవైవర్ణ్యో చ్ఛ్వసితాదికృత్."
—సాహిత్య దర్పణమ్ 3.142.

27. ఆంధ్ర మహా భాగవతము 10.341.

28. ఆంధ్ర మహా భారతము - ఆదిపర్వము - అవతారిక - 1.

29. "సంకల్ప బీజము దిగివచ్చి జడప్రకృతిలో ఆనందమయ, విజ్ఞానమయ, మనోమయ కోశాల నుంచి జారి, ప్రాణమయ, భౌతిక పరిమితులలో సంచరించటం ఈ ఇతివృత్తం. ఆర్యమైన కామ స్వరూపం ఇది" - విశ్వనాథ మార్గము (1992) - కోవెల సుప్రసన్నాచార్యులు - పుట 78.

30. "అది శివత్వము. మన్మథుని దహించునది. అనగా సర్వ లౌకిక ప్రవృత్తులను నాశనమొనర్చునది. స్వామి యొక్క సర్వయోగ, లౌకిక సాధనా

మార్గములకు శివుని యాదర్శ ముపాదేయముగా హరివంశాదుల యందు క్తమైన మార్గము సత్యనారాయణగారు ప్రపంచించి వ్యాఖ్యానించి నారు. యోగదృష్టితో కాంచినపుడు ప్రాకృతిక లౌకిక మాయా స్పర్శ లేని కుండలినీ శక్తి యమృతత్వ కారణమనియు, అది శివ తత్వజ్ఞేయ మనియు ప్రసక్తార్థము" - ఆంధ్ర వాఙ్మయము కృష్ణ - కథ - డా॥ ధారా రామనాథశాస్త్రి - పుట 265 (1982).

31 శ్రీ సత్యనారాయణగారు ఈ కావ్యము తరువాత దాదాపు నాలుగు దశాబ్దాల అనంతరం రచించిన "తెఱచిరాజు" నవలలో ఈ కామదహనం కథానాయకుడైన సారథి పరంగా గొప్పగా చిత్రించబడింది.

32. ఆంధ్ర మహా భాగవతము - 10.1681.

33. సాహిత్య దర్పణం - తృతీయ పరిచ్ఛేదమ్ - 251 కారిక.

34. "ఉద్దీపనాని తచ్చేష్టాః విద్యా శౌర్య దయాదయః
ఆలింగనాంగ సంస్పర్శ శిరః చుంబన వీక్షణం
పులకానంద బాష్పాద్యాః అనుభావాః ప్రకీర్తితాః
సంచారిణోనిష్టశోకహర్ష గర్వాదయోమతాః
పద్మ గర్భచ్ఛ విర్వర్ణో దైవతం లోక మాతరః."
(పై రసాలకు ఉండెడి వర్ణమును, అధిదేవతలు ఇందులో చెప్పబడినవి.)
—సాహిత్య దర్పణమ్ - తృతీయ 252, 253, 254 కారికలు.)

35. "కుపుత్రో జాయేత క్వచిదపి, కుమాతా నభవతి."

36. రామాయణము (సంస్కృతము) - బాలకాండ - 23వ సర్గ.

37. రామాయణము (సంస్కృతము) - బాలకాండ - 35వ సర్గ.

38. భాణము ఏకపాత్రాభినయ రూపమైనది - "ఏకాంకః ఏకయే వాత్ర నిపుణః" అని సాహిత్య దర్పణము భాణ లక్షణము చెప్పింది.
—సాహిత్యదర్పణమ్ - 6.228.

39. ప్రాతఃస్తవ రచనకు ప్రేరణగా ఈ క్రింది రెండంశాలు చెప్పబడు తున్నాయి:

(అ) "విశ్వనాథ ప్రథమ కళత్ర మరణానంతరము తల్లి లేని పిల్లల పెంపకపు భారము నాయనమ్మ వహింపవలసివచ్చినది. విశేషించి యామెకు గారాలకూచియైన పెద్దమ్మాయి "స్వాహాదేవి"ని నిద్ర లేపుటకు అవ్వగారికి బ్రహ్మప్రళయమగుచుండెడిది. ఈ సంఘట నను పురస్కరించుకొని విశ్వనాథ మహాకవి హృదయము యశోదాకృత "ప్రాతఃస్తవము"గా రూపొందినది." - విశ్వనాథ శారద - తాటికొండ వేంకట కృష్ణయ్య - పుట 15-1981.

(ఆ) "విశ్వనాథవారి స్వగ్రామం నందమూరులో సంతాన వేణుగోపాల స్వామి ఆలయం ఉన్నది. ఆ స్వామిని హృదయస్థితుని చేసుకొని స్తానం వారి యశోద పాత్రను ధరించాలనే తన చిరకాలవాంఛను "ప్రాతఃస్తవ" రచన ద్వారా కవి సమ్రాట్టు తీర్చుకున్నారని అంటారు". - ముంగిట ముత్యం - సి వేదవతి - పుట. 322-198?.

40. "విశ్వనాథ మధ్యాక్కరలు"లలోని మున్నంగి శతకములోని మేల్కొలుపు పద్యాలు మూడు (85, 86, 87) ఈ సందర్భంలో స్మరించదగినవి.

41. కృష్ణ కర్ణామృతము - 1-2.

42. రామాయణ కల్పవృక్షము - బాలకాండ - అవతార ఖండము - 2.

43. రామాయణ కల్పవృక్షము - బాలకాండ - అవతార ఖండము - 3, 4, 5.

44. సంస్కృత భాగవతములో 9 శ్లోకాలలో ఉన్నది, తెలుగు భాగవతములో 27 వృత్త కంద పద్యాలలో విస్తరించింది. (సంస్కృత భాగవతమ్ - దశమస్కంధము - 29 వ అధ్యాయము. ఈ అధ్యాయం పేరే వేణు గీతము 7 నుండి 15) తెలుగులో దశమ స్కంధం పూర్వభాగము 771 నుండి 797 పద్యాలు.

45. ఆంధ్ర మహా భాగవతము - 10 - పూర్వ - 777.

46. "బాలకృష్ణ సుషిరం బామ్నాయంబు మోసెడున్."

47. కృష్ణ కర్ణామృతము - 2 - 11.

48. — పైదే — - 2 - 9.

49. (అ) "గిరాం వాచాం పర లక్షణానాం, ఏకం అక్షరం ఓకారః అస్మి"

- శాంకరభాష్యం.

(అ) అర్థాభిరాయనశ్శబ్దాః గిరః । తాసాం పరమక్షరం - ప్రణవః
అహంఅస్మి - రామానుజ భాష్యం.

(2) Om is the most sound. Symbol of Iswara. Constant uttarance of this mono Syllable is a sage means to reach Divinity. It is equivalent to Iswara - Swami Chidananda.

50. ఆంధ్ర మహా భాగవతము - 10 - పూర్వ - 767.

51. ఆంధ్ర మహా భాగవతము - 10 - పూర్వ - 770.

52. కృష్ణకర్ణామృతం 2 - 96.

53. శాకుంతలము యొక్క అభిజ్ఞానత - విశ్వనాథ. పుట 70.

54. జీవుని వేదన (కాళిదాసు) - దూళిపాళ శ్రీరామమూర్తి, జయంతి పత్రిక.

55. గిరికుమారుని ప్రేమగీతాలు - 1.

56. విశ్వనాథవారి ప్రణయదర్శనము - సాళ్వ కృష్ణమూర్తి, "భారతి" మే 1959 (పద్యం - సౌన్దర్యలహరి).

# మూడవ అధ్యాయము

# గోపికా భ్రమరగీతాగానము

## గోపికా, భ్రమర గీతాలు :

భారతీయ ఆధ్యాత్మిక జీవనంలో ప్రస్థాన త్రయానికి అత్యంత ప్రాధాన్య మున్నది. ఈ మూడింటిలో భగవద్గీత చరమ ప్రస్థానం. భారత యుద్ధారంభంలో శ్రీకృష్ణుడు అర్జునునికి యుద్ధోత్సాహం కలిగించేందుకు ప్రారంభమయిన ఉద్బోధ క్రమంగా మానవ జీవితంలో కర్మ, జ్ఞానభక్తి స్వరూపాల నిరూపణంతోను, కర్తవ్య నిర్దేశంతోను భగవద్గీత రూపొందింది. ఇక్కడ సాక్షాత్ భగవంతుడైన కృష్ణుడు ఉపదేష్ట. ఉపదేశింపబడేవాడు అర్జునుడు. భారతంలో కృష్ణుడు అనేక సందర్భాలలో అనేక విధాలుగా ప్రవర్తిస్తుంటాడు. కాని, భాగవతములోకృష్ణుడు కేవలముగా భక్తికి లక్ష్యమైనవాడు. భగవద్గీతలోని భక్తియోగం భాగవతములో అనుభవయోగముగా పరిణమించినట్టు కనిపిస్తున్నది. భక్తియొక్క వివిధ స్వరూ పాలను, భక్తులయొక్క రకరకాల ప్రవృత్తులను, భగవంతుని విషయంలో భక్తుల అనుకూలప్రతికూల ప్రవృత్తులు మొదలైనవి అనంత ముఖాలుగా ప్రదర్శించ బడ్డాయి. అయితే,సమగ్రమైన భక్తియొక్క అనుభవం దశమ స్కంధములో మనకు లభిస్తుంది. ఈ స్కంధములోని భక్తి అచ్చంగా ప్రేమ మయమైనది. ఈ ప్రేమకు సమగ్ర ప్రతీక గోపిక. భగవంతుని గూర్చి ఆవేదన, అన్వేషణ మొదలైనవన్నీ ఈ గోపికలో పరాకాష్ట దశకు చేరుకుంటాయి. వ్రేపల్లెలో ఉండే గోపికలందరి స్థితి దాదాపుగా ఇదే. వైయక్తిక సామూహిక ప్రవృత్తి అనుభవం ఈ గోపిక లలో కనిపిస్తుంది. ఏ గోపిక అనుభవం ఆ గోపికదే కాని, ఈ అనుభవం సమూహదశలో సంపాదింపబడుతున్నది. ఈ విధమైన విచిత్ర అనుభవానికి గోపికలు ప్రతీకలు. ఈ గోపికల పరమేశ్వర భావన, విరహ సాక్షాత్కారాదు లన్నీ భాగవతములో వేరు వేరు సందర్భాలలో చిత్రింపబడినా కూడ దశమ స్కంధం పూర్వభాగములోని 29 నుండి 33 వ అధ్యాయములు - అయిదు అధ్యా యాలలో క్రమానుస్యూతముగా చిత్రింపబడినది. గోపికల అనుభవం పరా

కాష్ఠ శ్రీకృష్ణునితో రాసక్రీడ. అందుకని ఈ అయిదు అధ్యాయాలు ఒక ప్రధాన ఘట్టంగా 'రాస పంచాధ్యాయి' అనే పేరుతో ప్రసిద్ధమైనవి.

భాగవతములో కూడా కొన్ని సన్నివేశాలు "గీత"లుగా వ్యవహరింపబడుతున్నాయి. వాటిలో సుప్రసిద్ధమయినవి గోపికా గీతలు, భ్రమర గీతలు, ఉద్ధవగీతలు.

ఉద్ధవ గీతలలో భగవద్గీతా లక్షణం కన్పిస్తుంది శ్రీకృష్ణుడు ఉద్ధవునికి ఉపదేశించిన అనేక విషయాలు ఉద్ధవ గీతలుగా చెప్పబడినవి. కాని, గోపికా గీతలు, భ్రమర గీతలు దానికంటే భిన్నమైనవి. వీటిలో భగవంతుడు మాట్లాడేది ఏమీలేదు. భగవద్విషయంగా గోపికల అనుభవ వ్యక్తీకరణ వీటిలో చిత్రింపబడినది. ఇవి భక్తుని వైపునుంచి సాగిన గీతలు. వీటిలో బోధవంటి శాస్త్రీయమైన విచారణకు కాక భక్తుల అనుభవ స్వరూపానికే ప్రాధాన్యం.

భాగవతములోని ఈ గోపికాగీతలు లేదా భ్రమరగీతలు సత్యనారాయణగారి కృష్ణ కావ్యాలలో రెండవ, మూడవ కావ్యాలు. కేవలం గోపికల మనో లక్షణం మాత్రమే వీటియందు ప్రాధాన్యం పొందింది. భాగవతములో గోపికా గీతలు కాని, భ్రమరగీతలు కాని విస్తృతమైన శ్రీకృష్ణ గాథా చిత్రణలో సన్నివేశాలు. వీటికి పూర్వాపర సన్నివేశాలు కూడా ఉంటాయి. ఆ కథా సన్నివేశాన్నిబట్టి గోపికలు అంటే, నంద వ్రజంలో ఉండే గోపికలు మాత్రమే. తదితర వ్యక్తులెవరూ అక్కడ గోపికలు కాదు. ఈ కాకపోవడానికి కారణం అక్కడ పూర్వోత్తర సన్నివేశాల క్రమమే. ఈ పూర్వోత్తర సన్నివేశాలనుండి విడిగా తీసి చూసినప్పుడు అక్కడి గోపికలు భక్తులకు ప్రతీకలు. ఏ కాలమునాటి, ఏ దేశములోని భక్తునికైనా ఈ గోపిక ప్రతీక కావచ్చు. సత్యనారాయణగారు ఈ పూర్వోత్తర సన్నివేశాలనుంచి విడదీసి ఆ భాగాల్ని చిత్రించారు. ఈ చిత్రణలో యమున మొదలైన భాగవతాంశాలు వ్యక్తమవుతున్నా కూడా, భాగవతములోని గోపికాగీతలకు భ్రమరగీతలకు సత్యనారాయణగారి కావ్యాలకు జన్యజనక సంబంధం ఏమీలేదు.

సత్యనారాయణగారు తానే ఒక గోపికగా శ్రీకృష్ణ విరహాన్ని అనుభవించినట్లుగా కనిపిస్తుంది. తమిళంలో గోదాదేవి, రాజస్థానంలోని మీరాదేవి

ఇట్లాంటివారే. వీరి కాలం శ్రీకృష్ణుని కాలములో ప్రవేశించి, ఆ అనుభవాన్ని వారు పొందారు. గోదాదేవి, మీరాదేవి ఇద్దరూ స్త్రీలే. ఈ స్త్రీలు కావడం మూలాన గోపికలతో తాదాత్మ్యం వారికి సులభంగా కలుగుతుంది. సత్య నారాయణగారి విషయం అట్లా కాదు. మధ్యన ఇంకొక మెట్టున్నది. దీన్ని అధిగమించి ఆయన ఆ తాదాత్మ్యమును పొందారు. భావనాదశలో తాను ఎట్లెట్లా మారుతానన్నది శృంగార వీధిలోని సాక్షాత్కార ఖండికలోని ఒక పద్యంలో వ్యక్తీకరించబడినది.

"ఒకసారి నాలోన నూహించి యేమియో
స్త్రీ వోలె సిగ్గు పొందెదను నేను" అని అంటారాయన.

"....ఏ మహా భావమో వచ్చి హృదయ మావ
రించి నా సంధులను గదిలించివైచు" అంటారు. భావనాదశలో లభించిన స్త్రీత్వము ఆయనకు గోపికలలో తాదాత్మ్యమును సాధించి పెట్టింది.

గోపికా గీతలు కావ్యములో చివర చివరకు వచ్చేటప్పటికి ఆ గోపిక సత్యనారాయణగారే అనే అంశము వ్యక్తీకరింపబడుతుంది.

"గుంపులుగాఁగ పోవఁగను గోపకులాంగనలందు లోపలన్
వెంపరలాడి దొంగగఁ బ్రవేశము నందితి స్వీకరింతువో
గుంపును గుంపుగాననుచు గొల్లవు వెర్రినటంచు లెక్కకుం
దింపకువే వికుంఠపురి తెర్వుము ద్వారము లాశ్రితావనా!"
(సాక్షాత్కార - 99 వ పద్యం)

ఈ పద్యంలో గోపికల గుంపులో తాను దొంగతనంగా ప్రవేశించినట్టు చెప్పుకున్నాడు. భాగవతములోని గోపికలెవరో స్పష్టమే. కాని, ఈ చేరినది కొత్త గోపిక. కృష్ణుడు ఈ తేడాను పాటించకుండా తనకు "వికుంఠపురి ద్వారమున్" తెరువాలని ప్రార్థన. ఈ దృష్టితో చూస్తే గోపికా గీతలు, భ్రమర గీతలులో సత్యనారాయణగారు చిత్రించింది గోపికల నెపంతో ఆత్మానుభవం మాత్రమే. ఈ అనుభవ చిత్రణ రెండు కావ్యాల్లోను రెండు మార్గాల్లో సాగింది. ఉభయ కావ్యాలలో కూడా చెప్పేవారు గోపికలే. భాగవతములో గోపికాగీతలకి, భ్రమర

గీతలకీ మధ్యన చాలా ఎడమున్నది. కృష్ణుడు అయిదేళ్ళ బాలుడుగా గోకులంలో చిత్రవిచిత్రమైన పనులతో భగవంతుడుగాను, పంచాబ్దంబుల మానవ బాలుడుగాను ప్రవర్తించిన సమయంలోనివి గోపికా గీతలు. కృష్ణుడు వ్రేపల్లెను విడిచి మధురానగరమునకు వెళ్ళిన తరువాత కొంత కాలానికి. అంటే కృష్ణుడు సంపూర్ణ యౌవన దశ పొందిన నాటికి సంబంధించినవి "భ్రమర గీతలు." మధురానగరములో నున్న కృష్ణుడు గోపికలను స్మరించి, తన విరహంలో వేగిపోతున్న గోపికలకు ఓదార్పుగా తాను మళ్ళీ వస్తాను అని ఉద్ధవుడి ద్వారా సందేశం పంపుతాడు. ఉద్ధవుడు గోపికల దగ్గరకు వచ్చినప్పుడు గోపికలు ఒక తుమ్మెద నెపంతో శ్రీకృష్ణుని గూర్చిన తమ విరహాన్ని వ్యక్తీకరిస్తారు. గోపికాగీతలలో నేరుగా భగవంతుని గూర్చి గోపికలు మాట్లాడినట్లు ఉంటుంది.

తత్కాలంలో శ్రీకృష్ణుడు అదృశ్యుడై ఉన్నా అతన్ని సంబోధిస్తూనే అయనను భావిస్తూనే "జయతితేఽధికం.... .." అంటూ మాట్లాడుతారు. భ్రమర గీతల్లో కృష్ణుడు ప్రత్యక్షంగా లేడు. ఈ ప్రత్యక్షంగా లేకపోవడం అనేది రెండు చోట్ల సమానమే అయినా మొదటి సందర్భంలో కృష్ణుడు ప్రత్యక్షంగా లేడు కాని, అదే ప్రాంతములో అదృశ్యముగా ఉన్నాడు. కాని, రెండవ సందర్భములో ఎక్కడో మధురానగరిలో ఉన్నాడు. అందువల్ల వారు ఆయన దూత అయిన ఉద్ధవునితోనే మాట్లాడవలసి వచ్చినది. కాని, తమనింత బాధ పెడుతున్న దూత కాబట్టి, అయనతో మాట్లాడటానికి, ఆయనతో తమ సొద వెళ్ళబోసుకోవడానికి ఇష్టం లేకపోయింది. అందుకని, ఒక భ్రమరం నెపంతో వారు కృష్ణుని ఉపాలంభించటానికి ఆరంభించారు. ఉపాలంభనగా ఆరంభమైన వీరి మాటలు క్రమంగా భగవద్విరహంలోని తమ దైన్యాన్ని వ్యక్తీకరించడంగా మారిపోయింది.

భాగవతములో గోపికా గీతలు కాని, భ్రమర గీతలు కాని ఇరువది శ్లోకాలకు మించి లేవు. గోపికా గీతలు 19 పద్యాలు (ఆంధ్ర మహా భాగవతం - దశమస్కంధం 31 వ అధ్యాయము 1035 - 1054), భ్రమర గీతలు (ఆంధ్ర మహా భాగవతము - దశమస్కంధము - 47 వ అధ్యాయము - 1454 - 1463) పది పద్యాలుగా ఉన్నాయి. వీటిని కేవలం ప్రేరణగా స్వీకరించి సత్యనారాయణ గారు మూడు ఖండాలుగా ఒక్కొక్క ఖండంలో వంద పద్యాలుగా గోపికా గీతలను విస్తరించారు. భ్రమర గీతలలో ఖండాలు లేవు. కేవలం వంద

పద్యాలు మాత్రమే ఈ రెండింటి నిర్మాణ లక్షణం కావ్యపరంగా భిన్న మార్గాల్లో కనిపిస్తుంది. అందుకని ఈ రెండు కావ్యాలను విడి విడిగా దర్శించ వలసి ఉంటుంది.

రచనాకాలాన్ని బట్టి భ్రమర గీతలు మొదటి కావ్యం. భాగవత క్రమాన్ని బట్టి చూస్తే రెండవ కావ్యము అవుతుంది. ప్రస్తుత పరిశీలన భాగవత క్రమంను అనుసరించబడినది.

## గోపికా గీతలు

భాగవతము దశమ స్కంధము పూర్వార్ధములో 29వ అధ్యాయమునుండి 33వ అధ్యాయము వరకు అయిదు అధ్యాయాలను ప్రధాన ఘట్టంగా 'రాస పంచాధ్యాయి' అని వ్యవహరిస్తారు. ఈ అయిదు అధ్యాయాల మొత్తంలోను ఒకే సన్నివేశం చిత్రింపబడింది. కాని, ఈ సన్నివేశం యొక్క క్రమ వికాసాన్ని వ్యక్తీకరించేందుకే అయిదు అధ్యాయాలుగా విభజింపబడినది. ఈ అయిదు అధ్యాయాల్లోని విషయమిది:

శరద్రాత్రులలో శ్రీకృష్ణుడు యమునాతీరాన వేణుగానము చేస్తుంటాడు. ఆ వేణుగానము విని గోపికలు విభ్రాంత చేతస్కలై, ఎట్లా ఉన్నవారు అట్లాగే కృష్ణ దర్శనానికై యమునా తీరాన్ని చేరుకుంటారు. అంత రాత్రివేళ వచ్చిన ఆ గోపికలందరిని చూచి కృష్ణుడు 'ఇల్లు, వాకిళ్ళు వదిలిపెట్టి మీరిట్లారాకూడదు. వెళ్ళి మీ కుటుంబాన్ని, భర్తను, పిల్లలను చూసుకోవడమే ధర్మం'అంటూ వారిని వెళ్ళిపొమ్మంటాడు. అప్పుడు గోపికలు 'నీవే మాకు అన్ని సంబంధాలు. నిన్ను వదిలిపెట్టి ఉండం' అని అతని భగవల్లక్షణాన్ని వ్యక్తపరుస్తారు. అది విని వారి భక్తికి ప్రీతుడైన కృష్ణుడు వారితో ఆ యమునా తీరాన రకరకాలుగా రమిస్తాడు.

'ఏవం భగవతః కృష్ణాత్ లబ్ధ మానామహాత్మనః
ఆత్మానాం మేనిదే స్త్రీణాం మాలినో ఇభ్యదికం భువి॥"1

శ్రీ కృష్ణుని పొందిన ఆ గోపికలు లోకంలోని ఇతరులందరికన్న తామే గొప్పవారమని అనుకుంటారు. గోపికలలో కల్గిన ఈ గర్వభావాన్ని గుర్తించిన కృష్ణుడు దానిని తొలగించేందుకు అంతర్ధానం పొందుతాడు. ఇది మొదటి సర్గలోని విషయం.

కనిపించకుండా పోయిన కృష్ణునికోసం గోపికలు ఆ అడవిలో అనేక రకాలుగా అన్వేషించడం, చెట్టు చెట్టును, పుట్టపుట్టను శ్రీకృష్ణుని గూర్చి అడగటం, కృష్ణ చేష్టలను స్మరించుకోవటం మొదలైనవి రెండవ సర్గలోని విషయం.

ఈ విధముగా అన్వేషణ సాగించి లభించని కృష్ణుని గూర్చి గోపికలు చేసే తత్వార్థ గర్భితమైన ప్రార్థన మూడవ సర్గలోని విషయం. ఈ అధ్యాయం లోని గోపికల ప్రసంగానికే గోపికా గీతలని ప్రసిద్ధి.

గోపికల దైన్యలక్షణాన్ని గుర్తించిన కృష్ణుడు వారికి మళ్ళీ కనిపించడం, ఆయనను చూచి గోపికలందరు ఆనందంతో పొంగిపోవడం, శ్రీకృష్ణుడు తనను సేవించడంలోని ప్రవృత్తి లక్షణాన్ని వారికి ఉపదేశించటం నాలుగవ సర్గలోని విషయం.

అయిదవ సర్గలో రాసక్రీడ చిత్రింపబడింది.

ఇక్కడ గోపికల అనుభవానికి సంబంధించిన ఒక క్రమం గోచరిస్తుంది. కృష్ణునిచేత ఆకర్షించబడటం, అతనియందు తమ భక్తి యొక్క స్వరూపాన్ని వివరించడం, వారికి భగవదనుభవం, తద్వారా వారిలో ఇతరులను కించపరచే గర్వలక్షణం కలగడం, అది కూడా భక్తికి బోధకం కాబట్టి దానిని తొలగించేందుకు కృష్ణుడు అంతర్హితుడు కావడం, గోపికల భక్తి, దైన్య, ఉన్మాద, దుఃఖ భావాలతో పొంగి పొర్లడం, మరల భగవంతుని అనుగ్రహం కలుగడం ఇందులో ప్రధానమైన అంశం. గోపికలలో గర్వభావం కలుగడం దానికి పూర్వదశ. అది తొలగిన తర్వాతది ఉత్తరదశ. వీటి చిత్రణమే "రాసపంచాధ్యాయి."

గోపికా గీతములన్నని ఈ సన్నివేశంలోని ఒక దశకు సంబంధించినవి. అది భగవద్విరహం. మొదట భగవంతుని సేవించడానికి వారు వచ్చారు. అక్కడ విరహ ప్రసక్తి లేదు. కొంత భగవదనుగ్రహం కలిగింది. దానిని వారు కోల్పోయినారు. ఈ దశ అత్యంత బాధాకరమయినది. అప్పుడు వారు తమ మనోభావాన్ని వ్యక్తీకరించారు. ఆ వ్యక్తీకరణే గోపికా గీతలు.

'రాసపంచాధ్యాయి'లోని మూడవ అధ్యాయం మాత్రమే గోపికాగీతలు. పందొమ్మిది శ్లోకములు గల ఈ అధ్యాయంలో గోపికల 'శ్రీకృష్ణదర్శనలాలస' ప్రధానమైన విషయం. శ్రీకృష్ణుడు కనిపించనప్పుడు తాము ఎంత దుఃఖ పడతారో, వేదన పొందుతారో ఈ గీతలలో వ్యక్తీకరింపబడినది అంటే - "శ్రీకృష్ణ దర్శనలాలసత్వ"మనేది గోపికాగీతల కేంద్ర బిందువు ఈ బిందువును స్వీకరించి సత్యనారాయణగారు "గోపికాగీతలు" రచించినారు.

భక్తుడు భగవంతుని పొందటంలో భక్తుని పాత్ర ఎంత? భగవంతుని పాత్ర ఎంత? నిజానికి సాధన చేసి భగవంతుని పొందవలసినది భక్తుడే కాని, భగవంతుడు భక్తుని పొందడమనేది లేదు. ఈ భక్తుల భావనయొక్క స్థిరత్వాన్ని, తీవ్రతను పరీక్షించువాడు మాత్రమే భగవంతుడు. ఈ సాధనలో కలిగే అనేకమైన ఆటంకాలు, వాటి నధిగమించడం మొదలైనదంతా భక్తునికి సంబంధించినది మాత్రమే. అందువల్ల భక్తుల వేదన ఆర్తి దీనికే ప్రాధాన్యము. ఈ దృష్టితో సత్యనారాయణగారి 'గోపికాగీతల'లో ఆద్యంతం, గోపికల వేదనా చిత్రణమే ప్రాధాన్యం వహిస్తుంది.

ఈ వేదన అనేది మనో విషయం ఈ మానసికమైన విషయాన్ని చిత్రించడంలో అంతటి వేదనను కవి పొందినప్పుడే ఆ రచనలో ఒక శక్తి వస్తుంది. భాగవతమును రచించేటప్పుడు పోతనగారు ఆ భాగవతములోని కొన్ని పాత్రలతో ఆత్మీయతను పొందటం వల్ల అయా ఘట్టాలు ఎంతో ప్రభావోత్పమైనాయని విమర్శకులు భావిస్తున్నారు. గజేంద్ర మోక్షములో గజేంద్రుని మొర, దశమ స్కంధములో గోపికల దుఃఖము మొదలైవన్ని పోతనగారే అనుభవించి ఉంటారని భావించబడుచున్నది. అయితే, పోతనగారు ఆ పాత్రల మీద ఎంత ఆప్యాయత పొందినా కూడ భాగవత స్వభావాన్నిబట్టి అవి కావ్య పాత్రలే అవుతున్నాయి. సత్యనారాయణగారి దగ్గర అందుకు భిన్నంగా కనిపిస్తుంది. ఈ గోపికలు అచ్చంగా ఆనాటి గోపికలు కాదు. ఈ గోపికల మాటలన్నీ కూడా సత్యనారాయణగారివే. ఈయన శ్రీకృష్ణుని గూర్చి పొందిన వేదన, శ్రీకృష్ణుని భావించిన వివిధ రీతులు, శ్రీకృష్ణుని విస్మరించినప్పుడు వారి మనస్సులలో కలుగుతున్న అనేక విధములైన భావాలు ఈ కావ్యంలో వ్యక్తమవుతాయి.

ఆత్మాశ్రయ కవితా రీతికి సంబంధించి చూస్తే, సత్యనారాయణగారు భావకవితా యుగంలో వికసించిన గొప్ప భావుకుడైన మహాకవి భావకవిత్వంలో ఒక విషయానికి సంబంధించి కవి యొక్క భావాలకే, అనుభవాలకే ప్రాధాన్యము. ఇతరుల భావాలను కాక తన భావాలనే వ్యక్తీకరించడం ఇందులోని ప్రధాన లక్షణం. ఆత్మాశ్రయ లక్షణం ఉన్నచోటల్లా సత్యనారాయణగారి కావ్యాల్లో ఈ వేదనా తీవ్రత గమనించవచ్చు. ఇతర పాత్రల ఆధారంగా భావ వ్యక్తీకరణ జరుగుతున్నప్పుడు ఆ పాత్రలకు సంబంధించిన పరిమితులు కూడా ఈ భావాలకు అనువర్తిస్తాయి. కవి యొక్క అనుభవ సంస్కారాలు భూమికగా ఆయా పాత్రల సంస్కార స్థాయి పరిధుల్లో భావాలు ఎంతో కొంత కుదించుకపోవడాని అవకాశం అధికంగా ఉంటుంది. ఇక్కడ సత్యనారాయణగారు గోపికలను పాత్రలుగా స్వీకరించారు గోపికల పాత్ర స్వభావాన్నిబట్టి భావాలకు కూడా పరిమితులు ఏర్పడవచ్చు. అయితే, గోపికలన్నది ఒక సమూహం. ఎంతో మంది గోపికలు ఉన్నారు. ఆయా గోపికల సంస్కార భేదము, అనుభవ భేదము ఎంతో ఉండే అవకాశమున్నది. ఒకే పాత్రను తీసుకున్నప్పుడు ఉండే పరిమితులు, ఒకే విషయానికి సంబంధించి భావించడంలో, అనేక పాత్రలను స్వీకరించటంవల్ల పరిమితులు లేకుండా పోతుంది. అంటే, కవి యొక్క సంస్కార పరిమితులే వైవిధ్యముతో ఇక్కడ భాసిస్తాయి.

గోపికా గీతలు అంకితం పద్యాల్లో చివర ఒక పద్యమున్నది. ఆది—

"ఆయనఁ గూర్చి నేపడిన యార్తి ఫలంబునఁ గొంత నీకునై
యీయఁగఁగా దసంగ నతఁడెవ్వడు వేఱొకఁ డెవ్వఁ డేదో జ
న్మాయత సంక్రియా ఫలము నప్పుడు నప్పుడు జీవులందునన్
దోయిలి యొగ్గివచ్చు నిదితో కొనిపోఁగదవోయి పున్నెమున్."

ఇక్కడ ఆయన కృష్ణుడు. కృష్ణుని గూర్చి ఈ కనబడిన ఆర్తియే ఈ కావ్యంగా పరిణమించింది. దీనికి పై పద్యములో "………. నా వాక్కున గోపికా కృతిని ……" కల్పించినట్లు స్ఫురింప చేయబడినది. అంటే, కవి వాక్కు గోపికగా మారిపోయింది. ఈ వాక్కు ద్వారా వ్యక్తమయ్యే భావ వైవిధ్యమే, గోపికా వైవిధ్యం కూడా. అందుకని ఈ గోపికా గీతలలో ఆద్యంతమూ కవి సంస్కార పరిణతమైన ఆర్తి, దాని ప్రసారము గోచరిస్తుంది.

ఈ ఆర్తి ప్రహరము మూడు ఖండాలుగా విభజింపబడినది. అది చింత, అన్వేషణ, సాక్షాత్కార ఖండములు. 'రాస పంచాధ్యాయి'లో కృష్ణుడు అంతర్ధానము పొందిన తర్వాత గోపికలు ఉన్మత్త భావము పొంది, చెట్టును పుట్టను కృష్ణుని గూర్చి అడుగడానికి ముందు కృష్ణునిగూర్చి అక్షిప్రచిత్రలు, తదాత్మికలుగా చింతించినట్లు స్ఫురింప చేయబడుతుంది గోపికా గీతలు ఇక్కడ ప్రారంభమవుతున్నాయి. శ్రీకృష్ణుడు అంతర్ధానం అయిపోయిన తర్వాత గోపికల భావనతో ఈ కావ్యం మొదలవుతున్నది.

**చింతాఖండము :**

> "శ్రీ సముపేతవక్షమును చిర్నగవొప్పెడు మోము రత్నము
> క్రాసు మహోని పల్వరుస తమ్ముల చిమ్ములకన్నుదోయి సం
> ధ్యాసుషమాసమచ్ఛవిపదంబు జపాకుసుమాన్వితంబుగా
> జేసిన మౌళిపింఛియము చిన్నరి యచ్యుతు డెందుపోయెనో!"

"ఎందుకు పోయెనో" అను శంకతో ఆరంభమైన ఈ ఖండము "రాగదె నంద బాలకా" అనటంతో పూర్తవుతుంది. ఈ శంకకు, ఆ ప్రార్థనకు మధ్య శ్రీకృష్ణుని గూర్చిన చింతనలోని వైవిధ్యమంతా ఇందులో కనిపిస్తుంది. కృష్ణుడు కనిపించకుండా అంతార్ధానమైనాడని కాని, అందుకు ఫలానా కారణమని కాని తెలిపే పూర్వరంగమేదీ ఈ కావ్యానికి లేదు. అందువల్ల భక్తుడు తాను భావించే భగవంతుడు తనకందకుండా పోతున్నాడే అనే తాత్పర్యముతో కావ్యమారంభమయినదని కూడా అనవచ్చును. ఇందులో ఒక అంశం గమనించవలసి ఉన్నది: భాగవతములో గోపికలు "ఇట్లా అన్నారు" అని సామూహికంగా చెప్పబడుతుంది. అందరు గోపికలు ఒకే విషయం వ్యక్తీకరించారా? భగవంతుని గూర్చి సాగే ఆలోచన అందరిలోనూ ఒకే విధముగా ఉంటుందా? ఒక భక్తుడైనా సరే, భగవంతుని గూర్చి ఆలోచించడములో, ఆ ఆలోచన విస్తరించడములో వైవిధ్యము ఉండదా? వుండడమే సహజమైనది. గోపికాగీతలలో ఈ సహజత్వం స్పష్టంగా కనిపిస్తుంది. ఒక గోపిక, మరొక గోపికతో లేదా ఇతర గోపికలతో తన భావాన్ని వ్యక్తీకరిస్తున్నట్టుగా ఉంటుంది. దీనివల్ల గోపికలలోని వైవిధ్యం మన అనుభవానికి అందుతుంది. ఈ వైవిధ్యమంతా కవి భావనదే. కావ్యోపరితలములో కనిపించే ఈ వైవిధ్యము కవి ఆర్తిలోని తీవ్రతవల్ల పాఠకుల అనుభవంలోకి వస్తుంది.

"మడకల్ చూడగదే మదేభగమనా! మన్నించి మన్నించిగా
గడుసున్ లెక్కఁగ గోడిబిళ్ళ కొలతల్‌గా నింతయోడించియె
క్కఁడు కుంటించిన వాఁడు వాని మరలం గుంటింతుమంచున్ భయం
పడి యే కోనల దాగెనో వెదుకలే బ్రధ్నాంశుమూర్తిన్ హరిన్"

అని ఒక గోపిక అంటుంది. కృష్ణుడు గోడు బిళ్ళ ఆటలలో తమను మోసం చేసి కుంటించినాడట, మళ్ళా తాము కుంటిస్తామనే భయంతో ఎక్కడో పోయి దాగున్నాడట. ఈ అనటంలో శ్రీకృష్ణుని బాల్యక్రీడా స్మరణం, ఆ క్రీడలో తాను అన్వయించటం, కృష్ణుని గురించి ఒక మధురమైన భావన గల నిందారోపణ చేయడం కనిపిస్తుంది.

"నా కుచసీమ గోపలలనాజన బాలలతాంత సాయకుం
డాకుల పాటుగాగఁ దన యంగుళి గ్రుచ్చి యిదేమె గుండె? లోఁ
తే కనిపించదాపయిని నింతటి యెత్తని మోసగించెఁదా
నే కనుపించ కేగె నతఁడిప్పుడు వచ్చిన లోఁతెఱింగెడున్."

కృష్ణుడు బాలలతాంత సాయకుడు. ఇది మరియొక రకమైన మధురోహ. లతాంత సాయకుడు అంటే పూవులు (లతాంతములు) బాణములు (సాయకములు) గా కలవాడని అర్థము. ఇది మన్మథ వాచకమైన పదబంధము. ఈ కృష్ణుడు మన్మథుడే కాని, యవ్వన దశలోని మన్మథుడు కాడు. బాల్యంలోని మన్మథుడు. అసలు మన్మథునికి బాల యవ్వనాది వయో దశలు ఊహించడానికే అవకాశం లేదు. అతను నిత్య యవ్వనుడు. కాని, ఇక్కడ మన్మథుడైన కృష్ణుడు బాల్య వయో దశలో ఉన్నాడు. ఒకవేళ మన్మథునికి బాల్య దశ అనేది ఉంటే అప్పుడతడు శ్రీకృష్ణుడు.

బాలకృష్ణుడు వ్రేలితో ఈ గోపిక గుండెపై గ్రుచ్చి, ఇది ఎత్తుగానైతే ఉన్నది కాని లోతు లేదు అన్నాడట. ఉబికి పరిపుష్టమైన స్తనమండలం ఉన్నతంగానే ఉంటుంది. కాని, లోతుగా ఉండే అవకాశమే లేదు. వేలుతో వత్తినా కూడా అది లోతు కాదు. ఇది యదార్థము. కాని, అది హృదయ స్థానము. ఆ గోపిక యొక్క భక్తి పైకి ఆర్భాటంగా కనిపించేదే కాని, గాఢమైనది కాదని తాత్పర్యము. అయితే, అది గాఢమో కాదో తెలుసుకోవడానికి ఒక సన్నివేశము

కూడా అవసరము. ఈ భావం గాఢమైనదా కాదా అనేది కలిమిడిలో కాని, సుఖంలో కాని స్పష్టపడదు. విరహంలో, దుఃఖంలో మాత్రమే తెలుస్తుంది. "అతడిప్పుడు వచ్చిన లోతెరింగెడున్" అనడంలో ఆ గోపిక వేదన వ్యక్తమవుతున్నది. ఇక్కడి ఈ లోతు పరమేశ్వరునిపై తన భక్తికి సంబంధించినది. తన ఈ వేదన తన భక్తి లోతును తెలియచేస్తుంది.

"నాకొక యూహ తట్టెడు మనంబున నందఱ మొక్కసారిగా
లోకము నెంచకన్ యమునలోఁ బడిపోదము వేయి చేతులం
గైకొనవచ్చు స్వామి మరి కన్నుల కద్వను దీరు విశ్వరూ
పాకృతిఁ జూడనౌనుగద ఆపయిఁ జచ్చిన నేమి నష్టమో?"

తామందరు కలిసి ఒక్కసారిగా యమునలో పడాలట. అప్పుడు వారిని రక్షించడానికి కృష్ణుడు వస్తాడు. ఒక్కొక్కరిని ఉద్ధరించడంలో ఆలస్యమై మిగతావారు మరణించే అవకాశము ఉంటుంది. స్వామి వేయి చేతులతో ఒక్కసారి ఉద్ధరించవచ్చు. స్వామి వేయి చేతులతో కన్పించినాడంటే ఆ స్వామి విశ్వరూప దర్శనమవుతుందని భావం. భగవంతుని విశ్వరూప ప్రదర్శనకు ఇదొక మార్గముగా ఆ గోపిక ఊహిస్తుంది.

"స్వామిని జూచుచున్నప్పుడు చాన! హృదంతరమందు దుఃఖమై
స్వామిని జూడలేనపుడు చాన! హృదంతర మందు దుఃఖమై
స్వామియు నాదు దుఃఖమున సంభవమైన విధానఁ దోఁచెఁబో
యీమెయి దుఃఖమూలమున నెప్పటి స్వామి కడింది చూడనో?"

భగవంతుడు చూస్తున్నప్పుడూ, చూడనప్పుడూ దుఃఖమే. అసలు పరమేశ్వరుడు ఈ దుఃఖము నుండే జన్మించాడా అనిపించిందొక గోపికకు.

ఆంజనేయుడు అశోకవనములో సీతాదేవిని దర్శించినప్పుడు అతనిని తాను దూతగా నమ్మడం కొరకు, రాముని వర్ణించమని సీత అడుగుతుంది. అప్పుడు ఆంజనేయుడు శ్రీరామచంద్రుని వర్ణించి వర్ణించి "సుందరు డతడు వెలందె కన్నులు, అతని చూచిన గుండెయందు నుండి త్రవ్వుకో వచ్చునే దారుణ్య భావ పయః పయోధి నవసీతాకృతీ! యేదో గాలి వంటిది దుఃఖ తరంగమ్ము వికృతమో నానంద మధురమేచి ......"[3] అని అంటాడు. ఈ గోపికకు అట్లాంటి భావమే కలిగించి.

ఒక దశలో భగవంతుడు తనకు లభించడం లేదంటూ అతనిమీద కోపము కూడా రావచ్చు. ఒక గోపికకు అట్లా కోపం వచ్చింది —

"కోపము వచ్చుచున్నయది కోమలి! నాకును స్వామియందు నా
కోపము వ్యర్థమైనదని కోమలి నేను నెఱుంగుదుం గదా
కోపము వ్యర్థమైన యది కోమలి యెందుకుఁ గల్గగావలెన్
శ్రీపతి నన్ను నీగతి సృజించెన్ మిక్కిలి వ్యర్థురాలినిన్."

భగవంతుడిపై కోపం వచ్చి లాభమేమిటి? ఆ కోపానికి ఫలితము లేదు. మరి ఈ వ్యర్థమైన కోపము తనకెందుకు వస్తున్నది? వ్యర్థమైన కోపము తనలో పెంచి భగవంతుడు తనను వ్యర్థపరచినాడని అనుకుంటుంది.

ఒక గోపిక-

''నాతుకలార! తోచెడిని నాకొక యూహ అతండు గుండెలో
పాతుక కూరుచుండి యెద బాధయు నీ వలపంత కూర్చెడున్
మూతుక వృత్తి వానినిటఁ గాననమందున గాదు గుండెలో
లోతు కనంగఁ ద్రవ్వుడు తలోదరులార! కనంగ నెంచినన్."

భగవంతుని వెదుక వలసినది వెలుపల కాదు. అంతరాంతరాల్లో వెదుక వలసి ఉంటుంది. బహిర్గతమైన చిత్తవృత్తి బహుముఖంగా, ప్రసరించి, ఏకాగ్రతను కోల్పోవుతుంది. అదే చిత్తవృత్తి అంతర్ముఖీనమై ఏకాగ్రతను సాధిస్తుంది. దాని ద్వారానే భగవంతుడు లభించవచ్చు.

ఇంకొక గోపిక-

''ఇంతయు రూపకంబయిన యీ జగమెల్ల వృధా సరస్వతీ
చింతన చేయు గుండియను జేరని పొంగులుగాగఁ బెద్దవి
క్రాంతికిఁగాక బృందవ్రజకాంతలు బిట్టుతపింతురన్న వి
భ్రాంతిని గూర్పనేల హరిభావన చేయుడు గుండెలందునన్.''

ఈ లోకమంతా ఒక నాటకము, ఇక్కడ మాట్లాడేవన్నీ మనస్సు శ్రోతులకు సంబంధించినవి కావు. ఆ విభ్రాంతి కలిగించేవి మాత్రమే. అందుకని గుండెలలో హరిని భావించమని అంటుంది.

మరియొక గోపిక-

"తెలివి యొదల్ విడంబర చితిన్ బహుయత్నము చేసి నీ కృపా
విలసిత సౌరశైవలిని పీచిక చిమ్ముల నల్లనల్ల బో
దెలకు మరల్చి యేమరిరితిన్ ఉరుగంజడిపోయె నీవు క
న్నులకును గానిపించవు మనోహర! నా కథ యిట్టులైనదే!"

శరీరాన్ని, జ్ఞానాన్ని వేరుచేసినా నంటుంది ఈ గోపిక. ఇవన్నీ యో లక్షణాన్ని స్ఫురింపచేస్తాయి. ఈ చింతా ఖండములో క్రమక్రమంగా సామా మైన భావాలనుండి యోగ స్థాయికి ఎదిగిరావటం గమనించదగినది. ఈ చిం ఖండములో చివరి పది పద్యాలు గోపికల మాటలనటం కన్న, కవి నేరు ప్రవేశించి మాట్లాడినట్టే అనిపిస్తుంది.

"రవి కన్యాజలమందు( గన్పడవహో? రాజీవముల్ కోకిలల్
నవలాకూయదు కృష్ణపక్షమున జ్యోత్స్నల్ బిట్టు బాధించెడున్
గవితాశక్తియు లేచిపోయెను మనఃకంజాత సంజాతమున్
ధవుమూర్తింబలె నేటి కిప్పటికి( గాంతారమ్ము కాంతారమై."

ఇక్కడ "కవితా శక్తియు లేచిపోయెను" అంటాడు కవి. అనగ భగవంతుని గూర్చి ఏవో వర్ణనలు మొదలైనవి చేయడం కాదు. ఆయన తీవ్రముగా భావించవలసి ఉంటుంది అన్న ఈ మాటలు ఒక గోపిక కన్న కవి అనువర్తిస్తాయి. ఈ విధముగా చింతా ఖండమంతా భగవంతుని గూర్చిన ర రకాలైన ఊహలు, ఆలోచనలు, భావనలు గోపికల వైవిధ్యాన్ని వ్యక్తీకరిస్తూ కవియొక్క ఆర్తి గాఢత్వమును స్పష్టపరుస్తాయి.

## అన్వేషణా ఖండము :

అన్వేషణా ఖండము స్వరూపము మరొక విధముగా ఉంటుంది. అందులో కూడా భగవంతునికి సంబంధించిన భావనలే కాని, అవి లోక వ్యాపకముగ ఉంటాయి. అడవిలోని తీగలను, రకరకాలైన చెట్లను కృష్ణుని గూర్చి అడిగి నట్లుగా ఉంటుంది. భాగవతములో కూడా ఇదే విధముగా ఉంటుంది అయితే, అక్కడ కేవలం చెట్ల పేర్లు పేర్కొన బడ్డాయే తప్ప ఆ చెట్టును పర మేశ్వరుని గూర్చి అడగడంలో సంబంధమేమీ స్పష్టపడదు. ఏ చెట్టు పేరైనా అక్కడ ఒక్కటే. కాని, పోతనగారి భాగవతములో కొంత సంబంధమున్నట్టు కనిపిస్తుంది.

"పున్నాగ కానవే। పున్నాగ వందితుఁ దిలకంబ। కానవే తిలకనిటలు
ఘనసార। కానవే ఘనసారశోభిత బంధూక। కానవే బంధుమిత్ర
మన్మథ। కానవే మన్మథాకారుని వంశంబ। కానవే వంశధరుని
జందన। కానవే చందన శీతలుఁ గుందంబ। కానవే కుందర దను
నింద్ర భూజమ। కానవే యింద్రవిభవుఁ గువలవృక్షమ। కానవేకువలయేశుఁ
బ్రియక పాదప। కానవే ప్రియు విహారుననుచుఁగృష్ణుని వెదకిరయ్యబ్జ
ముఖులు''4

అది పున్నాగ వృక్షము. అందువల్ల పున్నాగుని గూర్చి దానిని అడగటం. ఈ ఒక్క పద్యములో మాత్రమే ఈ విధమైన సంబంధ స్ఫూర్తి కనిపిస్తుంది. ఇది కృష్ణ వర్ణనలోనే అంతర్భవిస్తుంది కాని, గోపికా గీతాలలో "అన్వేషణ" లోని తీరు మరియొక విధముగా కనిపిస్తుంది. ఏ చెట్టునుగాని, ఏ జంతువును గాని కృష్ణుని గూర్చి అడిగినా కూడ ఆ చెట్టుకి, పరమేశ్వరుడికి లేదా తమకు ఏదో ఒక రకమైన సంబంధాన్ని వ్యక్తీకరించడం గమనించదగినది.

"పండిన పండ్ల తావికిని బంభరసంతతి బిట్టు మ్రోయుచున్
బండులు కట్టివచ్చినఁ గపిత్థమ వేణురవంబుతోనఁ గృ
ష్ణుండును వచ్చియుండును గనుంగన భ్రాంతిని కూర్చి నీకు గు
ర్తుండును లేదు జ్ఞప్తి వెలయున్ మతిలోఁతుగఁజూచిచెప్పవే"

వెలగపండ్ల కోసం తుమ్మెదలు మ్రోగుతూ వస్తున్నాయి. ఆ ధ్వనికి, కృష్ణుని వేణు ధ్వనికి సామ్యమున్నది. వేణునాద మెక్కడ ఉంటే కృష్ణుడక్కడ ఉంటాడు. అందువల్ల నీతో ఎక్కడ ఉన్నాడో మతి లోతుగ చూచి చెప్పుమని అడుగుతారు. మది లోపల చూడడమంటే ధ్యానమార్గమున గుర్తించడమని తాత్పర్యము. ఆకాశమంతా వ్యాపించిన మర్రిచెట్టుతో నీ యే ఆకుమీద భగవంతుడు శిశువుగా పడుకొని ఉన్నాడో చూపుమని గోపిక కోరుతుంది. (అన్వే. 12)

సుగంధిపాలకు గోపి అని మరియొక పేరు.5 ఈ నామసామ్యంతో 'సుగంధిపాల'ని గోపి మనోజ్ఞమైన కృష్ణుని గూర్చి అడుగుతారు. శ్రీకృష్ణో

పాసన మార్గంలో శ్రీకృష్ణుడిని మదన గోపాలుడుగా ఉపాసించడం కూడా ఒక సంప్రదాయం ఆయన మదనగోపాలుడు కాబట్టి మదనతాపాన్ని కలిగించటం సమంజసమే. ఆ కృష్ణుడు మదనతాపము కలిగించగా, తాపమును చల్లార్చునది సుగంధిహాల.

"ఈ బక మొంటి కాలిపయి నెంత తపం బొనరించుచున్న ద
క్షీబము స్వామి తొట్ట తొలి చేప స్వరూపము బుద్ధి నెంచుచున్
వేబక రాజ! స్వామి దిని వేయకువే సహసాగ్రహించి పా
పీ బరువౌనె స్వామి కనిపించినదే కనిపించకుండినన్." (అన్వేషణ-33)

ఒక కొంగ ఒంటి కాలిపై చేప కోసం తపస్సు చేస్తున్నట్టుగా ఉంటుంది. నిజంగా ఆ కొంగ ఆదిమత్స్య స్వరూపాన్ని గూర్చి తపస్సు చేస్తున్నదేమో, ఆ స్వామిని పట్టుకుంటుందేమో అని భయం వ్యక్తీకరిస్తారు. కొంగ జపం అనేది ఒక నానుడి. జపం చేస్తున్నట్లు నటించటం అని తాత్పర్యం, కొంగ చేపలను పట్టుకోవటం అనే పనిలో ఏకాగ్రతంగా ఉన్నది. అంతవరకు అది జపమే. చేపను పట్టుకొంటుంది. కొంగ స్థితిని చూచి అది మత్స్యం కొరకు ఈ కొంగ నిజంగా తపస్సు చేస్తున్నదనే అనుకున్నారు. వెంటనే కొంగ చేపను తింటుందనే విషయం గుర్తుకువచ్చి తిన వద్దని అంటారు. నిజంగా ఆ కొంగకు తొట్టతొలి చేపను మింగే శక్తి ఉన్నదా? ఉండదనే విషయం ఆ క్షణంలో వారికి స్ఫురించక పోవటం వారి అమాయకత్వాన్ని, పరమేశ్వరునికేమైనా హాని కలుగుతుందేమో ననే పామరత్వాన్ని స్ఫురింపచేస్తుంది.

ఈ విధమైన భావనలవల్ల సర్వ సృష్టియందు భగవద్ రూపాన్ని, భగవత్ సంబంధాన్ని ఆత్మ సంబంధాన్ని, ఆత్మాభివ్యక్తిని గోపికలు భావిస్తున్నారన్న అంశము వ్యంగ్యంగా చెప్పబడింది ఒకచోట అశోక వృక్షము కనిపించినది. దానిని చూడగానే ఒక గోపికకు సీతాదేవి గుర్తుకువచ్చింది.

"ఇద్దియశోకమే చెలియ! యిచ్చట మొద్దుగ( గూరుచుండు నా
వద్దకు వచ్చు వేడయిన వానరు( డాతనితోడ జెప్పెదన్
నిద్దపుస్వామి వచ్చు(గద నిప్పులలో నుడికించినన్ సరే
తద్దయు( జూడకుండ హరి తమ్మి మొగంబును, నిల్వజాలనే!"

అశోకము కింద సీత కూర్చున్నది. ఆమెవద్ద కెవరో వానరుడు వచ్చినట్టు తన వద్దకు కూడా రావచ్చును. ఆ తర్వాత స్వామి నన్నేమి చేసినా సరే, నిప్పులలో దూకించినా సరే, అతని మొఖం చూడకుండా ఉండలేనంటుంది. ఇక్కడ అశోకము నడగడం కాదు. అశోకమును చూడగానే తనకు కలిగిన భావము ఇక్కడ చెప్పబడింది అట్లాగే—

"పతివిడివాడి వత్తలయి వ్రాలెదు నేలపయిన్ హృదంతర
స్థితము పరీమళంబును త్యజించవు భర్త్ృ మనోజ్ఞనుయాయినీ
మతియును గల్గినన్ వకుళమా! నిను వంటిది కల్గగా వలెన్
పతిపయి మేము నీసు నెఱపం జొరనట్టుల నేర్పిపెట్టవే!"

వకుళపుష్పానికి, చెట్టుకు ఇక్కడ భార్యా భర్త్ృ సంబంధము చెప్ప బడింది. ఆ పూవు చెట్టునుండి రాలి వాడి వత్తలై పోయింది. అంటే, భర్త్ృ విరహం కలిగింది. ఆ విరహంలో వాడి వత్తలైంది. అయినా, చెట్టు మీద ఉన్నప్పటి వాసన ఏమాత్రం తగ్గలేదు. భర్త్ృ విరహంలో కూడా ఆ పూర్వ స్థితియే ఉన్నది. తమకేమో ఈ కృష్ణ విరహంలో కృష్ణునిపై కోపం వస్తున్నది. ఈసు కలుగుతున్నది. ఇట్లాంటి వికారభావాలు కలుగకుండా ఉండే విధానాన్ని నేర్పవలసిందిగా వకుళ పుష్పాన్ని కోరుతున్నారు గోపికలు. భగవంతున్ని అన్ని సందర్భాలలోను ఏక భావాత్మకంగా సేవించే స్థితి భక్తుడికి కలుగవలెనని సూచన.

ఈ అన్వేషణలో శ్రీకృష్ణుని పాదచిహ్నములు గోపికలకు కనిపించడం భాగవతములో ఉన్నది. ఇక్కడకూడా ఉన్నది. కాని, దానిని గూర్చి భావించిన తీరు వేరు.

"నినిచిన వెట్టచూచితివె నిప్పులు చెర్వేడి నెండలిచ్చటన్
పొన పొన పాదముం గమలిపోయెడుఁ గోమలి మీరు పోయిక్రా
న్ననలను లేఁత యాకులను నల్లవొ నన్నని లేత కాడలం
గొ ?చనుదెండు పాదమునకున్ జలికోటను గట్టగావలెన్."

వెన్నెలలు వారికి విరహములో ఎండల్లాగ ఉన్నాయి. ఈ ఎండలకు ఈ పాదములు కమిలిపోతాయేమో అన్నంత తద్భావన వారికి కలిగి, ఎండ తగులకుండా తామరాకులు కప్పి, చల్లదనము సమకూర్చా లనుకుంటారు. పాదాలు శరీరావయవాలు. అందువల్ల వాటికి ఎండవల్ల బాధ కలుగవచ్చు. కాని, ఇక్కడ కనిపించేవి పాదముద్రలు మాత్రమే. వీటికి బాధ అనేది ఉండదు. కాని, ఆ పాదముద్రలను గోపికలు భగత్పాదాలుగానే భావిస్తున్నారు. అందుకే—

"తలిరులకంటె మెత్తనలు తామరసాక్షుని కాలికల్వ లు
త్పలములకంటె మెత్తనలు తత్పద చిహ్నము లందొకండు మా
కలవచేఁ జిన్నిసన్నని నిగారపు వెన్నెల సొక్కిపోవు న
వ్వుల కెరటాల పీచికొని ప్రోచికొనన్వలె వేయికన్నులన్."

స్వామి పాదాలు కలువలు. అవి తలిరుల కంటె కూడా సుకుమారమైనవి. కాని, ఆయన పద చిహ్నాలు ఉత్పలముల కంటె - కలువల కంటె సుకుమారమైనవి. వాటిని చిన్ని సన్నని నిగారపు వెన్నెలలతో సొక్కిపోయే నవ్వుల కెరటాలను పీచి, వేయి కన్నులతో రక్షించుకోవాలి అంటారు గోపికలు. ఇక్కడ పాద చిహ్నలను గూర్చి గోపికల భావన పది పద్యాలలో చిత్రింపబడినది.

ఈ పాదాలమీద, పాద చిహ్నల మీద గోపికలకు ఎంతో ప్రేమ. "స్వామి మొగంబు కంటె ప్రభుపాదము మిక్కిలి సేవనీయమంచా మను లామునుల్ పలుక అంబుజలోచన" వింటినంటుంది ఒక గోపిక.

ఈ పాద చిహ్నముల విషయము సంస్కృత భాగవతములో ఈవిధముగా ఉంది. గోపికలు కృష్ణుని పాదచిహ్నలే కాక మరొక చిహ్నలు కూడా చూచి—

"కస్యాః పదానిచైతాని యాతా యానంద సూనునా"6 అనుకుంటారు. ఈ స్త్రీ పాదాలు మరెవరివో? దాదాపుగా ఈ విషయం మరొక విధముగా గోపికా గీతలలో చిత్రింపబడినది.

''ఇదిగో యింకొక పాదచిహ్నము ప్రభుండిచ్చోటనొయ్యారపుం
బదమై ప్రక్కగఁ గాలు మోపి మదమంబై కెత్తి నిల్చుండె నే
పొదయున్ దగ్గరలేదు కాద యెదియో పూత్రుంచగా నెంచె నం
చెద భావింపఁగ స్వామి యీ మెఱుగకే హేలాక్రియం జేసెనో.''

"ఆయాతేందిర మింట మింటనె పరిష్వంగంబునన్ దివ్యలీ
లాయోగ్యంబుగ మన్ననల్ సలిపి హేలామూర్తి పంపించెనో
చేయిన్ మింటికినెత్తి వేనిక భయశ్రీ యిచ్చెనో శాంతి రే
ఖాయోగ్యంబులు తోచుచున్నవి సుమీ కాంతార సంతానముల్."

కృష్ణుని మరొక పాదచిహ్నము ఎలా ఉందో మొదటి పద్యంలో చిత్రింప బడినది. మడుమను పైకెత్తి ఏదో పూవును తుంచడానికి కృష్ణుడు నిక్కినట్లుగా అనిపిస్తుంది. కాని, అక్కడ ఏ చెట్టూ లేదు. అందుకని గోపికలు చేసిన ఊహ రెండవ పద్యం పూర్వార్థములో ఉన్నది. లక్ష్మీదేవి ఆకాశం మీదినుంచి వస్తూ ఉంటే ఆమెను నిక్కి అందుకొని ఆకాశంలోనే కవుగిలితో మన్నన చేసి పంపించి ఉంటాడు.[7] ఆది ఒక దివ్యలీల. ఉత్తరార్థంలో ఇంకొక ఊహ చెప్పబడింది. స్వామి పైకి నిక్కి ఎవరికో అభయమిచ్చి ఉంటాడు. అందుకే ఈ వనమంతా ప్రశాంతంగా కనిపిస్తుంది.

ఈ విధమైన భావనా తీవ్రతలో ఒక ఉన్మాద లక్షణం కూడా స్ఫురి స్తుంది. తానే కృష్ణుడనని, కృష్ణ లక్షణాలు తన మీద ఆరోపించుకొని గోపికలు చెప్పిన తీరులో—

"మతి చెడె దీనికంచు నను మానినులందఱు మీరలన్న స
మ్మతమెయగున్ నిజంబుగను మాధవుఁడాతఁడు వేఱు నేను వే
ఱితరదుఃఖహేతువిదియైనది నేన యశోదబిడ్డ నీ
క్షితి సకలంబు నేనయవకించెదఁ జిత్రవిచిత్ర లీలలన్."

"అరయుడు మీరు నా వెలవులందున సన్నని వెన్న చాఱల
బ్బురముగఁదోచు నేను గిరిమోసెదఁ బాముతలన్ నడించెదన్
విరవిరలాడ గుండియలు వేణువు నూదెద ధాత్రి సాదెదన్
శరనిధి నీదెదన్ దనుజసంతతి మోదెద మిన్ను లాదెదన్."

ఈ తీరులో స్వామి చేష్టానుభవం కూడా ఇమిడి ఉన్నది. చివరకు ఒక గోపిక తమనే కృష్ణుడని అనుకోవడంలో వ్యక్తమవుతుంది. మళ్ళీ ఇంతదూరము వచ్చిన తర్వాత చింతా ఖండము చివర మాదిరిగానే.

"ఓ పద్మాసనలార నేనో కడు లోనూహించెదన్ కాముకీ
వ్యాపారంబుగఁ జెట్టుపుట్టలబడిన్ బారాడగా నేటికిన్
ధీపూరించుచుఁ గూరుచుండి యొకచో దివ్యానురాగ ప్రభా
శ్రీపూర్ణాకృతి నూహ చేయుదము దాక్షిణ్యంబు చూపించునో"

అంటుంది బహిర్ముఖంగా, కాముకీ వ్యాపారము లాగా తిరుగడం కాదు. బుద్ధిని పూరించి "దివ్యానురాగ ప్రభా శ్రీ పూర్ణాకృతి నూహ చేయుదము" అంటుంది. ఈ దశకు వచ్చిన తర్వాత పరమేశ్వరుడి సాక్షాత్కారమే చివరి ఫలము.

## సాక్షాత్కార ఖండము :

ఆ పరమేశ్వరుడు ఎట్లా ఉంటాడు? ఎవరి భావన ఎట్లా ఉంటే అట్లా ఉంటాడు.

''తవరూపం నజానానికే దృశోసి మహేశ్వర:
యాదృశోషి మహాదేవతా దృశాయ నమోనమః॥''

అని ఒక భక్తుడంటాడు. ఆ పరమేశ్వరుడెట్లా ఉంటాడో తెలియదు. ఎట్లా ఉంటే అట్లాంటి వాడికి నమస్కారమని తాత్పర్యము. భక్తుడు ఎట్లా భావిస్తే అట్లా ఉంటాడు. అంటే, భగవంతునికి ఫలానా రూపమంటూ లేదు, నియతము కాదు. భక్తుడు తన సంస్కారాన్ని బట్టి, తన భావనా శక్తిని బట్టి, ఊహా శక్తినిబట్టి తనలో సాక్షాత్కరింపచేసుకుంటాడు. ఈ భావనా రూపమే భక్తునికి భగవత్ సాక్షాత్కారము. మరొక విధముగా భక్తునిలోనే భగవంతుడున్నాడు. ఉన్నాడనుకున్న భావనకు మూర్తికల్పన మాత్రమే భగవంతుడు. ఈ అంశమే పై పద్యములో చెప్పబడింది. ఇదే అంశము సాక్షాత్కార ఖండమంతట నిండి ఉన్నది.

తనకు సాక్షాత్కరించిన రూపాన్ని పాంచభౌతిక రూపంగా కూడ భక్తుడు భావించే అవకాశము ఉంది.

"పిడుకలు కొట్టు చేతులను పేడను జేసెడి చేతులంట్లతో
మెడునవి మోటు చేతులను మీరును స్వామిని పట్టి తాఁకఁ బో
కుఁడు నునుమెత్తమేనది గగుర్చును కందును స్వామిపై కెగం
బడకుఁడు దవ్వునన్ నిలచి స్వామిని జూచినయంతఁ జాలదా?"

అనే పద్యముతో సాక్షాత్కార ఖండము ప్రారంభమవుతుంది. స్వామిని ముట్టుకుంటే ఆయన శరీరము కందిపోతుందట, దూరంగా ఉండి చూస్తే చాలదా?! అనటంలో మనసు ద్వారా భగవంతుని చూడటమే తప్ప, స్పర్శాదులు అక్కడ అంతగా భావింపదగినవి కావనిపిస్తుంది. భాగవతములో శ్రీకృష్ణుడు గోపికలకు మళ్ళీ కనిపించగానే ఒక గోపిక ఆయన చేతిని పట్టుకున్నట్టు, మరొక గోపిక ఆయన భుజం మీద తలవాల్చినట్టు - ఇట్లా రకరకాలుగా చెప్ప బడింది. ఇక్కడ ఆ విధమయిన ప్రత్యక్ష వర్ణన ఉండదు ఈ సాక్షాత్కార ఖండము ఆ అంశాలపై సాగిన విపుల వ్యాఖ్యలాగా ఉంటుంది.

తపోయోగనిష్ఠాదుల ద్వారా భగవంతుని సాక్షాత్కరింప చేసుకోవచ్చు. మంత్ర తంత్రాదులవల్ల ఆయనను తమలో బిగించుకొనవచ్చును. కాని, ఇదేమి లేకుండానే ఆత్మసమర్పణ రూపమైన భక్తిద్వారా భగవంతుడిని పొందవచ్చు.

"ఒక మంత్రంబు జపింపమైతిమి మరే హోమంబునుంజేయమే
యొక యంత్రాన బిగింపమైతిమి ప్రభుండూరేగుచున్నాడ యీ
చకితైణాక్షులనేమి చేసిన నదే సాగున్ దొరైనాడ యీ
రక సాగించును సాగనిచ్చెద మహో రాజీవ పత్రేక్షణల్."

"ఈయన పోకిళుల్ తెలిసియే ఋషులెల్లరు తీవ్ర మంత్రవ
ర్ణా యతిమై బిగించిరి మహా ప్రభు దానికి నాగలేక భి
క్షూ యొక గొల్ల గూడెమును జూచి చొరంబడెఁ బద్ధవాఁడు మా
కీయమునాతటీ విరహమేటికిఁ జేయునె మాటిమాటికిన్."

అనటం ద్వారా ఈ అంశం స్పష్టపడుతుంది. పరమేశ్వరుని రూపము భావనా గమ్యము కావడంతో, భావనా గమ్యమైన రూపవర్ణన సాక్షాత్కార ఖండములో కనిపిస్తుంది. ఆ పరమేశ్వరుని పాదాలు, జంఘలు, కటి, వక్షస్థలము, కంఠము, ముఖము, కన్నులు, చూపులు, పరమేశ్వరుని హాసము సాక్షాత్కార ఖండములో భావనామయంగా వర్ణించబడినవి. ఇవన్నీ ఇట్లా ఉన్నాయని చెప్పడమెట్లా? దీనికి సమాధానమన్నట్టుగా ఒక గోపిక—

"నే వర్ణించిన స్వామియే మొగము వర్ణింతున్ మదిన్ నామ నో
భావంబెట్టిదో అట్టి స్వామి మొగమున్ వర్ణింతునైనన్ సరే
నా వాక్యంబుల కర్థమై నిలుచు నందస్వామి యౌచిత్యరే
ఖావైదగ్ధ్య వదర్ధభూమియగు గోపాలుండు గోపాలుడై"

అని అంటుంది. ఆ స్వామి మొగము తన భావములో ఎట్లా ఉన్నదో అట్లా వర్ణిస్తుంది. స్వామిని కూర్చిన భావన ఎంత తీవ్రముగా, స్పష్టముగా వుంటుందో అరూపముకూడ అంత స్పష్టముగా ఉంటుంది. ఈ వర్ణించిన వాక్కులకు అర్థముగా ఔచిత్యవంతమై గోపాలుడుంటాడు. అయితే, అది మనసా భావింపదగినదే కాని, వాక్కుల ద్వారా వ్యక్తం చేయగలిగింది తక్కువే.

యోగులు యోగికల్పులు మహోనిదులుజ్జ్వల ధీకులున్ సమ
స్తాగమ సారభూత ధిషణాఢ్యులు చూచినవస్తువున్ యధా
యోగము చెప్పఁగల్గుదుర యూరక వాగ్విభవాన్వితుల్ మతిం
దూగి యెవేని పోలికలతో వచియించెద రల్పతుష్టికై."

యోగదృష్టితో చెప్పగలుగుతారు. వాగ్విభవాను నితులైన కవులు ఏవో కొన్ని పోలికలు చెప్పి తృప్తిపడతారట. అది కేవలం అల్పతుష్టి. ఒక బులుపు.

సాక్షాత్కార ఖండములో కూడా కవి నేరుగా చివరకు వ్యక్తమవుతాడు.

"చివురుంగైదువుజోదు ధూర్జటి దహించెన్ ముక్తిబాహ్యుండునాన్
జివురుంగైదువుజోదుతోడ నుపదేశించెంగదా ముక్తి మౌ
నివరేణ్యుండగు వ్యాసుఁడా చివర సంధించెన్ నినున్ నీవు మా
ధవ! మా యిండ్లకె యేగుదెంతువు సముద్రంబిట్లు పొంగించుచున్."

శివుడు మన్మథుని ముక్తికి బాహ్యుడని దహించివేశాడట. కాని, వ్యాసుడు ఆ మన్మథుడు ఆధారంగానే ముక్తిని ఉపదేశించాడు. అంటే, మధురభక్తి ఇక్కడ ముక్తికి దారి వేసిందని తాత్పర్యము.

"శ్రీకృష్ణా యను మాట వచ్చినది యా యేయూహయోకల్మి యీ
శ్రీకృష్ణా యను మాట వచ్చినది నా హృత్సీమలో నెందు నీ
శ్రీకృష్ణాంకితమైన యూహ తొలినెట్లేపారుదానింగనన్
లేకన్ ప్రాణము సొమ్మసిల్లెదఁ గుకూలీభూతజీవేశ్వరా!"

అనిన పద్యము దగ్గరనుండి కవి వాక్కులుగానే కన్పిస్తున్నది.

"నీకై యేడ్చుచునున్న యప్పుడునుగానీ! కొంచుఁబోవచ్చునే
నాకాదన్నదియున్నదా సమద నానాజీవ బంధాకృతీ
నాకున్ సూచనచేయుమంటి నదియైనన్ నీ కృపాధీనమే
కాకేమున్నదిరయ్య! కృష్ణ! జగతీకళ్యాణ మూలచ్ఛవీ!"

అనే పద్యాన్ని గమనిస్తే రామాయణ కల్పవృక్షములోని ఈ క్రింది పద్యము స్ఫురిస్తుంది:

"కలవొక కొన్నివేళలు నికామభవత్పదచింతనా నలో
జ్జ్వలితశిఖాసనాథములు స్వామి! ననున్ మృతిఁబొందనీవె ము
జ్జ్వలమగు తన్నిమేషమున జన్మయికొక్కఁడు లేకయుండ వి
హ్వల కరుణాభిత ప్తమయినట్టి జనుస్సులు చాలు ధూర్జటీ!"8

"హీరమువంటి నీయెడఁద నే చిఱుబెజ్జము చూచినాడొ నీ
మాఱట రూపమైన మునిమాధవ! వ్యాసుడు గోకులాంగనా
శ్రీరమణీయ మధ్వమును సృష్టియొనర్చెను ముక్తి త్రోవలన్
గేరదమౌచుఁ బద్యటుజకీర్తులు మాదృశులంగలార్పగన్."

ముక్తికి "గోకులాంగనా శ్రీరమణీయ మధ్వమును" పరమేశ్వరుని అవతారమైన వ్యాసుడు సృష్టియొనర్చి ఇచ్చినాడట. మావంటివారు పద్యాలు రాసి పొంగిపోతామే తప్ప, నిజమునకు అందుకోవలసినది ఆ 'అధ్వము' అనటంతో సాక్షాత్కార ఖండం పూర్తవుతుంది. అనేక భక్తి మార్గాలలో "గోకులాంగనా శ్రీరమణీయధ్వము" ఒకటి. సత్యనారాయణగారు ఈ "అధ్వగామి". గోదాదేవి (ఆండాళు), మీరాదేవి, విష్ణుచిత్తులు మొదలైనవారి దారికూడా ఇదే.

ఈ కావ్యములో ఒక అంశము ప్రధానంగా గుర్తించవలసి ఉంది. చింతా ఖండం, అన్వేషణాఖండం చివర్లో సూచించినట్లు ఈ భగవద్విషయ భావన అంతా అంతర్ముఖీనంగా సాగవలసిందే. బహిఃర్విషయంగా చెప్పినవన్నీ కూడా అంతర్ముఖీనంగా సాగే భావనలో చిత్రితమయ్యే అంశాలే. అందుకే సాక్షాత్కార ఖండంలో జరిగిన భగవత్ సాక్షాత్కారము ఆంతరికమైనదే తప్ప బాహిరమైనది కాదు.

''గోపికా గీతలు" పరమేశ్వర గీతమైన కవి యొక్క ఆర్తికి అక్షర రూపము. ఆ ఆర్తి కవిగా ఎంత పొందుతాడో సహృదయులలో తన కావ్యము ద్వారా అంతగా కలిగిస్తాడు.

## భ్రమరగీతలు :

"భక్తి ప్రభేదమగు పరభక్తి - పరమాత్మ దర్శన రూపము" - ఇది పూర్వానురాగము వంటిది. "పరజ్ఞానము, పరపురుష సంగమ రూపం" - ఇది సంభోగము వంటిది. పరమభక్తి విశ్లేషమునందు ఆత్మధారణకు అశక్తత - ఇది విప్రలంభము వంటిది. కవి సామ్రాట్టుని భ్రమరగీతలందు వర్ణితమైనది పరమ భక్తియే" అన్నారు అ. తి. సింగరాచార్యులు. భక్తిలోని స్థాయీ భేదాలకు, శృంగారములోని స్థాయీ భేదాలకు ఇక్కడ పోలిక చూపెట్టబడినది. భక్తికి, శృంగారానికి పోలిక అనేది మధురభక్తిలో మాత్రమే కుదురుతుంది. ప్రియుని విషయంలో ప్రియురాలు లేదా ప్రియురాలు విషయంలో ప్రియుడు పొందే అనుభవములో ఒక క్రమ వికాసముంటుంది. హఠాత్తుగా చూడగానే ప్రేమ కలగడమనేది ఆ తర్వాతి దశలనుబట్టి చెప్పేది గాని, కేవలం చూడటం అన్న దానిమీదనే ఆధారపడి ఉండదు ప్రేమను విస్తరించడానికి ఈ చూడటం అనేది అత్యంత ప్రాథమిక దశ. ఇక్కడితోటే ఆగిపోతే ప్రేమకు విస్తృతి ఉండదు. కేవలం చూపులు కలుసుకోవడమే కాకుండా, మనసులు కలుసుకోవడం కూడా అవసరం. యదార్థానికి ప్రేమ అనే భావం స్పష్టపడటానికి ఇదే ఆధారం. దీని తర్వాతనే ప్రేమ విస్తృతమవుతుంది. ఆ విస్తరించడంలో వివిధమైన మానసిక దశలకు ప్రియాప్రియులు లోనవుతారు. ఈ అంశాన్ని గమనించి పూర్వాలంకారికులు శృంగారములో దశావస్థలకు ప్రవేశం కల్పించారు. ఈ అవస్థలు ప్రియాప్రియులు వియోగంలో ఉన్నప్పటి శృంగార దశలని తాత్పర్యము. అయితే,

వియోగమనేది సంయోగము తర్వాత కూడా జరుగవచ్చు. కాని, అక్కడ పూర్వ రాగములో ఉండే దశలన్నీ యథాయోగ్యముగా ప్రవర్తిస్తాయే తప్ప అవి వికాస స్వరూపము కావు. పరాకాష్ఠ చెందిన వియోగము యొక్క స్థితి నిరూపణము మాత్రమే.

పూర్వరంగములోని ప్రేమ వికాస దశలను కొందరాలంకారికులు పదిగా పేర్కొనగా, మరికొందరు పన్నెండుగా పేర్కొన్నారు. ఈ పన్నెండు ఇవి-

"చక్షుః ప్రీతిః మనస్సంగః సంకల్పోఽథ ప్రలాపితా
జాగరః కార్శ్యమరతిర్లజ్జాత్యాగోఽథ సంజ్వరః
ఉన్మాదో మూర్ఛనంచైవ మరణం చరమం
అవస్థా ద్వాదశమతాః కామశాస్త్రానుసారతః."[1]

ఈ ద్వాదశావస్థల శృంగార రసము యొక్క అంకురితత్వ, పల్లవితత్వ, కుసుమితత్వ, ఫలితత్వ హేతువులుగా విద్యానాదుడు నిరూపించాడు. ఈ వరసన చూస్తే శృంగార భావము యొక్క ఉద్గమ క్రమ వికాసాలను లక్షించినట్టుగా స్పష్టపడుతుంది. ఈ దశలో వ్యక్తిలోని భావనా తీవ్రతను దానివల్ల మనశ్శరీరాలలో కలిగే మార్పులు సూచిస్తాయి ఈ పన్నెండింటిలో జాడ్యము, మరణము అనేవాటిని కొందరు లాక్షణికులు వదిలివేసి ఈ దశలు పది మాత్రమే అని భావించారు. భావ ప్రకాశములో—

"దశథా మన్మథావస్థాః భవేత్ ద్వాదశ థాపివా
ఇచ్ఛో త్కంఠాభి లాషాశ్చ చింతాస్మృతి గుణస్తుతీ
ఉద్వేగోథ ప్రలాప స్స్యాత్ ఉన్మాదో వ్యాధిరేవచ
జాడ్యం మరణమిత్రాద్యేద్వే క్శ్చిత్ వర్జితేథః"[2]

అని చెప్పబడింది. జాడ్య మరణాదులను కలుపుకుంటే మొత్తం పన్నెండు. మరణ చిత్రణ రసవిచ్ఛిత్తి హేతువు కాబట్టి దానిని విడుచుట సమంజసమే కావచ్చు. కాని, జాడ్యము అన్న దానిని కూడా వదిలి వేయడంలో ప్రత్యేకమైన కారణం కనిపించదు. కేవలం దశావస్థలనే పేర్కొన్నవారు కూడా మరణ దశను చెప్పినారు.

"దృజ్మ నస్సంగ సంకల్పా జాగరః కృశతారతిః
హ్రీత్యోగోన్మాద మూర్ఛాంతా ఇత్యంనగ దశాదశ"

"అంత" మనేది మరణార్థకము. ఈ దశలను పేర్కొవటములోను వాటిని గుర్తించడములోను 'స్వల్పమైన తేడాలున్నప్పటికి మొత్తంమీద ఈ దశలు విప్రలంభ శృంగార భావ తీవ్రతకు గుర్తులు. ఇవి అచ్చంగా పైన చెప్పబడిన క్రమంలో ఉంటాయనడానికి వీలులేదు మృతి మాత్రం చివరిది. దాని తర్వాత మరొకదశ ఉండే అవకాశం లేనే లేదు. ఏమి ఉన్నా అంతకుముందు ఉండవలసిందే. అయితే, కావ్యాలలో శృంగార రస చిత్రణలో మృతి అనేది రసవిచ్ఛేద కారణం కాబట్టి దానిని వర్ణించరు. ప్రియాప్రియులు మృతి పొందుతారు అనే దశ దాకా చిత్రించబడుతుంది. ఆ తరువాత సంయోగం. ఈ సంయోగమనేది మృతిని ఆపుతుందని అర్థము.

ఏ శృంగార కావ్యాల్లోనైనా ఈ దశలు అన్నీ తప్పనిసరిగా చిత్రింపబడతాయని చెప్పలేము. కొన్ని కొన్ని మాత్రమే ఆ నాయికా నాయకుల స్థితినిబట్టి వ్యక్తీకరింపబడతాయి. ఉదాహరణకు కుమారసంభవములో పార్వతి విషయముగా పరమేశ్వర గతమైన ప్రేమలో ప్రతాపము, నిద్రలేమి, అరతివంటి కొన్ని అంశాలు మాత్రమే చెప్పబడ్డాయి. ఈ స్థితికి ఏ శృంగార కావ్యాన్నైనా గమనించవచ్చు.

శృంగారానికి, భక్తికి ప్రధానమైన భేదము ఒక్కటే. లౌకిక స్త్రీ, పురుషులకు సంబంధించింది శృంగారము. కాగా, భక్తులకు పరమేశ్వరునియందు గల ప్రేమ భక్తి. ఈ భక్తిలో వ్యక్తి స్త్రీ అయితే ఈ శృంగార రస లక్షణం దానియందు వస్తుంది. అందుకే ఈ స్థితిని శృంగారాన్ని విభేదింపచేయటానికి రూపగోస్వామి మొదలైనవారు మధురముగా పేర్కొన్నారు భగవద్విషయమైన రీతి భావము మధురమన్నమాట. దీనిని కలిపి మధురభక్తి అనటం సామాన్య వ్యవహారము.

ఆలంబన విభావాలతో ఉండే ఈ తేడాను బట్టి రతి ప్రధానమైన ఈ రసాల్లో తేడా వస్తున్నది. కాని, శృంగారములో ఉండే అవస్థలన్నీ కూడా, మధురభక్తిలో కూడా ప్రవర్తించవచ్చు. అందుకే భగవద్విషయములో పరమ భక్తి విప్రలంభ రూపమని చెప్పడం.

శృంగార మధుర భక్తులకు ఇంత ఏకీభావమున్నా కూడా మధుర భక్తిలో శృంగార ద్వాదశావస్థలను చిత్రించిన కావ్యములు తెలుగులో చాలా తక్కువన్న వాటిలో కూడా ఈ విశ్లేషణ కనిపించదు. కనిపించే తొలికావ్యము విశ్వనాథ సత్యనారాయణగారి ఈ "భ్రమర గీతలు".

కృష్ణుడు నంద వ్రజములో గడిపినప్పుడు గోపికలు అతని సంయోగములోనే ఉన్నారు. అతన్ని చూస్తూ, అతని సామీప్యాన్ని అనుభవిస్తూ ఒకానొక సందర్భములో రాసక్రీడ యందు సంయోగ అనుభవాన్ని కూడా పొందారు. భాగవతంలో ఈ "రాస పంచాధ్యాయి" తర్వాత మనకు గోపికల ఈ విధమైన భక్తి చిత్రణ కనిపించదు. కృష్ణుడు మధురకు వెళ్ళిపోయిన తర్వాత కూడా ఉద్ధవుడు వచ్చేదాకా మళ్ళీ గోపికల ప్రసక్తి ఉండదు. ఉద్ధవుడు వచ్చినప్పటి గోపికల స్థితి, సంయోగానంతర స్థితికి సంబంధించినది. ఈ దశలో ద్వాదశావస్థలను చిత్రించడం భ్రమరగీతాల ప్రత్యేకత. ఇందులో మరొకవైచిత్రి ఉన్నది. ఈ చిత్రింపబడిన ద్వాదశావస్థలు కూడా కృష్ణ సంయోగానంతర వియోగకాలానికి సంబంధించినవి కావు. కృష్ణుడు మధురకు వెళ్ళడానికి ముందు అనుభవించిన అవస్థల స్మృతి కథనమే ఈ భ్రమరగీతలలో చిత్రింపబడినది. అలంకారశాస్త్ర మర్యాదలో శృంగార రూపమైన భక్తికి సత్యనారాయణగారు చేసిన పరిష్కారమిది.

భ్రమర గీతలు అంటే భ్రమరాన్ని ఉద్దేశించి గోపికలచే వ్యక్తీకరించబడిన భావాలు అని తాత్పర్యము. ఇవి భ్రమరంతో చెప్పినట్లుగా ఉంటాయి. నిజానికి భ్రమరంతో చెప్పడమనే ప్రసక్తి ఉండదు. చెప్పటము, వినటము అనేది మానవులకు సంబంధించిన వ్యవహారము ఒక వ్యక్తి తన కష్టాలను కాని, సుఖాలను కాని మరొక వ్యక్తితో చెప్పుకుంటాడు తప్ప ఏ పురుగుతోనో, పులుగుతోనో చెప్పుకోడు. కాని, మేఘ సందేశము, హంస సందేశము మొదలైన కావ్యాలు ఆ విధముగా చెప్పబడినట్లే రచింపబడటం ప్రసిద్ధమే. ఈ విషయములో కాళిదాసు ఒక సమర్థన చేశాడు:

> "ధూమ జ్యోతిస్సలిల మరుతాంసన్నిపాతః క్వమేఘః
> సందేశార్థాః క్వపటు కరణైః ప్రాణిభిః ప్రాపణీయాః
> ఇత్యౌత్సుక్యాదపరిగణయన్ గుహ్యకస్తం యయాచే
> కామార్తా హి ప్రకృతి కృపణాః చేతనాచేతనేషు."

పొగ మొదలైన వాటితో రూపొందిన మబ్బు సందేశాన్ని తీసుకపోగలదా? సమర్థులైన వ్యక్తులు తీసుకపోవలసిన సందేశాన్ని తీసుకపొమ్మని మబ్బును యక్షుడు ప్రార్థించాడు కామార్తులైన వారు చేతనా చేతన విషయంలో ప్రకృతి కృపణులు. అంటే కామార్తులైన వారికి తమ సందేశవాహులను గూర్చి పెద్ద పట్టింపు ఉండదని తాత్పర్యము. అందువల్ల భ్రమరంతో చెప్పుకోవడం కూడా జరుగవచ్చు. గోపికలు కూడా ప్రస్తుతం భక్తిపరంగా ఆ దశలోనే ఉన్నారు. అయితే, ఇక్కడొక చిన్న భేదమున్నది. భ్రమరం ఒక నెపమే తప్ప నిజంగా వారు చెప్పుతున్నది ఉద్ధవుడికి. ఉద్ధవుడు తమను మోసగించి వెళ్ళిన కృష్ణుని దూత. అందుకే అతడితో మాట్లాడటం వారికి ఇష్టం లేదు. కాని, చెప్పవలసింది అతనితోనే. అందువల్ల తత్కాలములో అక్కడ కనిపించిన భ్రమరాన్ని ఒక నెపంగా తీసుకొని చెప్పిన్నారన్నమాట. రామాయణములో సీతాదేవితో రావణుడు మాట్లాడినప్పుడు ఆమె ఒక గడ్డి పరకను మధ్యలో వేసి, ఆ గడ్డి పరకతో మాట్లాడినట్టుగా రావణుడికి సమాధానం చెప్పుతుంది ఒక విధముగా ఇక్కడ కూడా అదే పరిస్థితి. అయితే, రామాయణంలో రావణుడు ఉండగా, ఇక్కడ ఉద్ధవుడు. ఈ ఉద్ధవుడు కృష్ణదూత కాబట్టి దూతకున్ను, అతన్ని పంపించిన ప్రభువుకి అభేదము. అట్లాగే తుమ్మెద నెపంగా ఉద్ధవుడికి చెవుతున్నారు కాబట్టే వీరికి అభేదము మొత్తాన్ని కలిపి చూస్తే ఈ తుమ్మెదకున్ను, కృష్ణుడికి అభేదము భ్రమరములో ఒక పుష్పము నుంచి మరొక పుష్పము మీదికి పోయే లక్షణమున్నది. గోపికలు కృష్ణుని విషయములో కూడా ఇదే ఉన్నదన్న భావనతో కృష్ణుని ఉపాలంబన చేస్తారు. అందువల్ల భ్రమర కృష్ణులకు భేద అభేద లక్షణాలు రెండు కూడా మనకు కన్పిస్తాయి.

భ్రమరాన్ని సంబోధిస్తూ ఈ గోపికలు తమ భావాల్ని వ్యక్తీకరిస్తుంటారు. అయితే, ఈ భ్రమర సంబోధన, భ్రమరానికి గల అనేక పర్యాయ పదాలతోటే సాగవచ్చు. సంస్కృత భాగవతములో "మధుప, కితవబంధో" అని మధుప శబ్ద మొక్కటి భ్రమర గీతలలో కనిపిస్తుంది. పోతన భాగవతములో "భ్రమర" శబ్దముతోటి ఈ గీతలు ప్రారంభమవుతాయి. "భ్రమరా! దుర్జనమిత్ర...." అంటూ "భ్రమర గీతలు" అనటాన్ని సార్థకం చేసేందుకు ఈ పదంతో పోతన గారు ప్రారంభించినారు. "భ్రమర, భృంగ, రోలంబ, షట్పద, మధువ్రత, ఇందిందిర, పుష్పంధయ" అనే పర్యాయ పదాలు కన్పిస్తాయి. సత్యనారాయణ

గారి భ్రమర గీతలలో "తుమ్మెద, పుష్పంధయ, షట్పద, మధువ్రత, బంభర, రోలంబ, అళి, భ్రమర, ఇందిందిర, చంచరీక, షడంఘ్రి"అనే భ్రమర పర్యాయ పదాలు సంబోధనలుగా కనిపిస్తాయి. వీటిలో షట్పద అనేది మాత్రమే 59 సార్లు ప్రయోగించబడినది. పుష్పంధయ, మధువ్రత, బంభర, పదాలు ఎనిమిదేసిసార్లు; అళి మూడుసార్లు, భ్రమర రెండుసార్లు, మిగిలినవి ఒక్కొక్కసారి ప్రయోగింపబడ్డాయి. ఇన్నింటిలో షట్పద పదమే అధికంగా కనిపించడము గమనింపదగిన అంశము. ఇది మిగతా వాటికన్న సాభిప్రాయంగా ప్రయోగింపబడినట్లు కనిపిస్తుంది. షట్పదమంటే ఆరు పాదములు కలదని అర్థము. కృష్ణుడు సాక్షాత్ నారాయణుడుగా భావింపబడ్డాడు. శ్రీ మన్నారాయణుడు జ్ఞాన, శక్తి, బల, ఐశ్వర్య, వీర్య, తేజస్సులనే షడ్గుణములు కలవాడు. అనగా షాడ్గుణ్య పరిపూర్ణుడు. గోపికలు ఈ షాడ్గుణ్య పరిపూర్ణుడైన, శ్రీమన్నారాయణావతారమైన కృష్ణునియందే బద్ధ మనస్కులైనారు అనే అంశము ఈ షట్పదము యొక్క బహుళ ప్రయోగముతో స్ఫురింప చేయబడినది అనటానికి అవకాశము కలుగుతున్నది.

ఈ భ్రమర గీతలు కావ్యము కేవలము లౌకిక శృంగార భావనగా ఆరంభమవుతున్నది. క్రమక్రమంగా దీనిలో అలౌకిక శృంగారము, అనగా శృంగార రూపమైన భక్తిగా పరిణమిస్తుంది భౌతిక స్థాయిలోని గోపికలయందు శ్రీకృష్ణగతమైన రతిభావ పరిణామము ఇందులో సూచింపబడుతున్నది.

"తుమ్మెద రాయబారీ! నవతోయదమాలికలోని నీలియం
దమ్ములు రెక్క యంచులను దమ్ముకొంగను క్రొత్తమైజిగుల్
చిమ్మగవచ్చి మా చరణ సీమల కోమల సంచరం(దవా
ర్ద్రిమ్ముగ తచ్చియాడెదవు రాగసుధాభినయప్రగల్భతన్."

ఈ పద్యముతో కావ్యమారంభింపబడుతున్నది. ఈ కావ్య పరిమితినిబట్టే ఉద్ధవుడి ప్రసక్తిలేదు. గోపికలు ఉద్ధవుని చూచి అతనితో బదులు ఒక తుమ్మెదతో మాట్లాడటంతోటే కావ్యారంభం. ఇక్కడ కనిపించిన తుమ్మెద ఇక్కడిది మాత్రమే. ఎక్కడో ఉన్న 'మధుర'లోని కృష్ణుడి దగ్గరి నుండి వచ్చింది కాదు. వచ్చిన వాడు నిజానికి ఉద్ధవుడు. కృష్ణ సందేశాన్ని తీసుకువచ్చిన సందేశ

వాహకుడు మాత్రమే కాదు - ఆ సందేశముతో పాటు కృష్ణుని పరిస్థితి కూడా వివరించి గోపికలలో కృష్ణుని గూర్చి కల మోసగాడనే భావాన్ని తొలగించి వారిని ఓదార్చడమనే పనిని నిర్వహించడానికి వచ్చిన రాయబారి. ఈ ఉద్ధవుని రాయబారితనాన్ని తుమ్మెద మీద ఆరోపించటంతో ఈ కావ్యము ఆరంభమవుతుంది. రాయబారిగా వచ్చినవాడు పనిని నిర్వహించడానికి అనేక విధాలుగా ప్రవర్తిస్తుంటాడు. గోపికలు ఈ తుమ్మెద రాయబారి చేసే ప్రయత్నాన్ని గుర్తించటం ఉపాలంభిస్తున్నారు. ఆ తుమ్మెద క్రొత్తగా వచ్చిన మబ్బుల అందాల రెక్కలమీద వ్యాపించగా గోపికల పాదపద్మాల దగ్గర మనోరంజకంగా తిరుగుతున్నది. సంగీతాభినయం చేస్తున్నది. ప్రగల్భత్వాన్ని ప్రదర్శిస్తున్నది. తుమ్మెదలు పద్మాలచుట్టూ తిరగడం సాధారణమే. గోపికల పాదాల చుట్టూ తిరగడం సాధారణమే గోపికల పాదాల చుట్టూ తిరగడం - వారి పాదాలు పద్మాల వలె ఉన్నాయని ఉపమాలంకార ధ్వని. అతని అభినయం, గడుసుదనం తమకు తెలిసిపోయింది కాబట్టి అతనిని "నమ్మము" అన్న గోపికల భావము కూడా వ్యంజితమవుతున్నది. శ్రీకృష్ణుడు "నీలతోయదమాలిక." "నీల తోయదమాలిక" అనేది ఇక్కడ శ్రీకృష్ణునికి పర్యాయ పదమని భావించవలసి ఉంటుంది. జగన్నాథ పండితరాయలు ఇలాగే భావించినారు. ఆయన తన "రస గంగాధర"మనే గొప్ప అలంకారశాస్త్ర గ్రంథాన్ని ఆరంభిస్తూ–

''స్మృతాపి తరుణాతపం కరుణాయా హరంతీన్నృణాం
అభంగుర తను త్విషాం మయితాశతైర్విద్యుతాం
కళిందగిరినందినీ తటసుర ద్రుమాలంబినీ
మదీయ మతిచుంబిని భవతి కాపి కాదంబినీ''3

అంటూ ఒక అందమయిన శ్లోకం రచించాడు దాని తాత్పర్యమిది. "స్మరించినంత మాత్రంలోనే తరుణాతపాన్ని హరించునది, అనశ్వరమైన శరీరకాంతులు గల వందలాది మెరుగు తీగలతో పరివేష్టింపబడినది, యమునా నది తీరము నందలి కడిమిచెట్లపై ఉన్నది నా బుద్ధిని చుంబించునది అయిన ఒకానొక కాదంబిని- మబ్బుల వరుస ఉన్నది." ఇక్కడ గోపికలు మెరుపుతీగల ద్వారా స్ఫురిస్తున్నారు. ఇందులో 'కాదంబిని' - అంటే మేఘమాల. ఇది కృష్ణుడికి పర్యాయ వాచకమన్నట్టు అలంకార గర్భితంగా ప్రయోగించాడు. ప్రస్తుత

పద్యంలోని 'నవతోయద మాలిక' కూడా అట్లాంటిదే. ఆ తోయదమాలిక విసీల మయింది. తుమ్మెద వర్ణము కూడా అదే నవతోదయ మాలికలోని నీలి అంద మ్ములను సంతరించుకోవటం వల్లనే కొత్త మైజిగుల్ చిమ్మగలుగుతున్నది. అందుకోసమే గోపికలకు అంత కోపము వచ్చినది. ఆ కోపములో తుమ్మెద చేష్టలన్నీ మోసముతో కూడినవే అని వారు నిందిస్తున్నారు. తనయందు శ్రీకృష్ణ త్వాన్ని కప్పుకొని వచ్చిందీ తుమ్మెద. అదీ వారి కోపం. తుమ్మెదను తర్వాతి పద్యములో 'సింగారీ!' అని గోపికలు సంబోధించారు. శృంగార శబ్దానికి వికృతి 'సింగారము'. అది కలవాడు సింగారి. ఈ తుమ్మెద చేసే చేష్టలన్నీ మోసం కాబట్టి శృంగార సందర్భంగా వ్యక్తము కావలసిన పరస్పర విశ్వాసము అనేది వికృతంగా పరిణమించింది. అని ఈ సంబోధన స్ఫురింప చేస్తుంది. పద్యంలో శృంగారి అన్నాకూడా ఇబ్బందేమీ లేదు. కాని, ఈ తద్భవ శబ్ద ప్రయోగము తుమ్మెదను వెక్కిరించడానికి ఉపయోగింపబడింది. ఈ వెక్కిరింత వెనుక గోపికల కోపమున్నది.

''పిడొకరుండు షట్పద విభుండు....'' అని ఒక గోపిక మరొక గోపికతో అంటుంది. ఇక్కడ ''విభు'' అనే శబ్దము వెక్కిరింతను సూచించటం అట్లా ఉంచి 'విభు'త్వమనే పరమేశ్వర సంబంధి అంశాన్ని కూడా వ్యక్తము చేస్తుంది. 'షట్పద' అనేది ఇందుకు బలం కలిగిస్తున్నది. 'పిడొకరుండు' అనే మాట నిరాదరణను సూచిస్తుంది. దానితో బాటు 'అద్వితీయుడు' అనే స్ఫూర్తి గూడా కలిగిస్తున్నది. ఈ పద్యం చివర 'కైశ్యనవ కాంత్యంభోదపాటచ్చరీ!'' అని గోపికా సంబోధన ఉన్నది. ఆమె కొప్పు క్రొత్త వెలుగులు చిమ్మే మబ్బు సౌభాగ్యాన్ని దొంగలిస్తున్నది అని అర్థము. తుమ్మెద సంబోధనలో ఉన్న నీలత్వము ఆ రెక్కలయందు పులుముకున్నట్టు చెప్పబడింది. ఇక్కడ ఇది సహజమైనది. అంతేకాదు. నీవెంతో మేము కూడా అంతవారమే అన్న భావము కూడా స్ఫురిస్తుంది. ఈ అనటం కూడా గోపికల కోపభావాన్ని స్ఫురింపచేస్తూనే ఉన్నది

గోపికలకు ఎందుకింత కోపము? కృష్ణుడు తమతో నున్నంత కాలము బాగానే ఉన్నాడు. నగరానికి, అంటే మధురకు వెళ్ళిన తరువాత నాగరికుడు

అయినాడు. నగరవాసుల తెలివిమీరినతనమంతా అతనికి అబ్బి తమను నిర్లక్ష్యం చేశాడని వారి బాధ. ఈ బాధ యొక్క ఒక రూపము కోపము అయితే, మరొక రూపము తమ స్థితిని గూర్చిన దైన్యము. ఈ కోపము దైన్యముగా పరిగమించడాన్ని గోపికల మాటల్లో గమనించవచ్చు.

"తలిరులలోని మెత్తనలు తమ్మికనుందుదలందు, చొక్కపుం
బలుకుల యందు తేనియలవాలును, వాలునుబోని గుండె లో
పల బిఱు చెమ్మ యేర్పడని పర్వతసాను శిలాత్వ రేఖ, కా
వలెనని సేయు నీ నగరవాసుల మోసమెఱుంగ శక్యమే!"

ఈ పద్యములో నగరవాసుల మోసం చేసే లక్షణం చెప్పబడింది. దాని వెంటనే "ప్రేమించిన ప్రేమింతురు, ప్రేమించరయేని యంతె ప్రేమించరు...." ఇది పల్లెటూరి వారి పరిస్థితి. వీరి యొక్క అమాయకత్వం ఇందులో స్పష్టము చేయబడింది. వీరింత అమాయకులు కాబట్టే నగరం చేరిన కృష్ణుడు వీరిని మోసం చేయగలుగుతున్నాడు. నగరంలోని వారే తమ యొక్క వైభవంతో జానపదుల కనులకు మిరుమిట్లు గొలిపి వారిలో ఒక గిలిగింత కలిగించి మోసగిస్తారు. వారికి దయ లేదు. ఇట్లా మమ్మల్ని మోసం చేయడమెందుకు? కొండ కొమ్ముల కూల్చగల గాలి చివురాకుల మీద తన ప్రతాపము చూపించడమెందుకు? తనకు సమ ఉజ్జీలైన, తాను చేయగల మోసముతో సమానంగా మోసము చేయగల వారైన పట్టణ స్త్రీలతో కలిసి ఉండవచ్చుగదా! గోపికల ఈ మాటలలో కృష్ణుడు తమను నిరాదరించటమువల్ల కలిగిన బాధ, నగరవాసుల నింద వ్యక్తమవుతున్నది. ఆ మోసము యొక్క పరాకాష్ఠ ప్రస్తుత స్థితి. అంటే కృష్ణుడు వెళ్ళిపోయినాడు. కొంతకాలం బాధపడ్డారు గోపికలు. ఆ తర్వాత క్రమక్రమంగా మరచిపోయినామని అనుకుంటున్నారు. ఈ దశలో ఈ రాయబారము పంపి, మరచిపోతున్న దానిని మళ్ళీ ఉద్బుద్ధం చేసి బాధ పెడుతున్నాడు. ఇది కౌటిల్యం. తమ భర్తల వేషధారణ అచ్చంగా జానపదమైనది. నిరాడంబరమైనది. కాని, ఈ రాయబారి వేషము చాలా ఆడంబరముతో కూడినది. ఈ ఆడంబరము అపరిచితము కావటం వల్ల మనస్సుల మీద బరువు వేస్తున్నది. ఇట్లా రకరకాలుగా అతని కౌటిల్యం వ్యక్తమవుతున్నది. ఇంకా గోపికలను బాధ పెట్టేది వేరొకటి ఉన్నది:

"అంతటఁ గూలనేసి చెయి నందుకొనంగ నొసంగబోడు, మా
యంతట మేము లేచినపు డా! యిదె యుంటి నటంచువచ్చు మే
మింతకు వాని నన్న పనియేమి, యెఱింగి యెఱిం...
జెంతకు జేరుచుందుమన, సిగ్గని మాకును లేద, ష

తమను దుఃఖములో కూలవేసిన వాడు ఆయనే కనీస
చేయి కూడా అందివ్వడు. అంటే, తమ ప్రయత్నం తావ
ప్రయత్న పూర్వకముగా పైకి లేచినప్పుడు, ఇదిగో నే
చిత్రమేమిటంటే ఇట్లాంటివాని దగ్గరకు మరొకసారి పో
తెలిసి కూడా మళ్ళీ మళ్ళీ అతని దగ్గరకే పోతున్నాము.
పని అని అంటారు గోపికలు.

పరమేశ్వరుని పొందడానికి భక్తుడు చేయవలసిన
చేయవలసి ఉంటుంది ఆ సాధన ఫలించినప్పుడు పరమే
తుంది. తమ సాధనలో కలిగిన బాధలన్నీ అప్పుడు గుర్తు
గోపికల మాటలలో స్ఫురిస్తుంది. ఇప్పటిదాకా కృష్ణుని
ఇక్కన్నించి తమ పరిస్థితిని వెళ్ళబోసుకోవటంగా సాగు
రూపము ఎట్లాంటిది?

"తలపై చిక్కని నెమ్మిపింఛియము ముత్యాల్రాయెతుల్ ...
గుళులన్ పిల్లనగ్రోవి మువ్వలునుగా కుంబీనసస్వామి త్రా
క్కిళులన్ కాలికి గట్టుపెండెరమునౌ కృష్ణుండు నిన్నొలె నీ
వల నీ వేసము గట్టి యుండడుగదా, పౌరాకృతీ! షట్పదా!"

ఈ తీరులో కనిపించవలసిన కృష్ణుడు మారిపోలేదు కదా! అని ఆ
గోపికలు. ఈ కృష్ణస్వరూప చిత్రణ బాలకృష్ణోపాసనలో ధ్యాన శ్లో
చిత్రింపబడిన రూపముగా స్ఫురిస్తుంది. కాళీయుని పడగలమీద నృత్యం చేస్తు
శ్రీకృష్ణుని తాండవ రూపము ఇక్కడ చిత్రింపబడినది. గోపికలు కృష్ణుని
ధ్యానించటములో రూపపరముగా వారిని ఆకట్టుకున్న అంశాలు ఈ పద్యంలో
చిత్రితమైనట్లు కన్పిస్తాయి. ఇట్లాంటి కృష్ణుడు పూర్వము వ్రేపల్లెలో నున్నప్పుడు

తాము ఎన్నో విధాలుగా అతనిని అనునయించారు. చీకటి రాత్రులలో ఒంటరిగా శ్రీకృష్ణుడు అడవుల్లో తిరుగుతూ భయపడి, ఆ భయాన్ని పోగొట్టుకోవడానికి వేణువూదేవాడు. అది విని, అయ్యో పిల్లవాడు భయపడుతున్నాడు కదా! అని మేము పోయి, అతనిని ఆదుకున్నాము. అట్లాంటి మమ్మల్ని ఈనాటికిట్లా కృష్ణుడు నిరాకరిస్తున్నాడు. ప్రజాపతి సృష్ట్యాదియందు ఒంటరిగా ఉండి, ఆ ఒంటరితనము భయము కలిగించగా స్త్రీని సృష్టించుకున్నాడట. కృష్ణుని భయము పోవడానికి ఇక్కడ గోపికలు కారణముగా చెప్పబడ్డారు. ఇది సృష్ట్యాది యందలి స్త్రీ పురుష సన్నివేశాన్ని స్ఫురింప చేస్తుంది. ఈవిధముగా కృష్ణుని చేష్టలను కూడా గోపికలు వర్ణిస్తారు. ఈ చేష్టలలో ఒకటి చాలా విచిత్రమైనది:

"అంతటి పాటలో యమున యున్నది నేరక పోవుచుండగా
కాంతలు మున్గిపోదురని కాంతుడు వేణువు పాటమాన, మా
యంతట మా కొడళ్ళు తెలియన్ యమునానది తప్పికొంటి మా
యింతటి ప్రేమ స్వామి యెద నేమయి పోయెనో చెప్పు, షట్పదా!"

కృష్ణుడు వేణుగానం చేస్తున్నాడు. అది చీకటిరాత్రి. వేణుగానము విన్న గోపికలు అడవిలోకి పరుగెత్తారు. అది వింటున్నంత సేపు బాహిరమైన జ్ఞానము వారికి లేదు. ఏదారిన పోతున్నారో తెలియదు. ఆ చీకటిలో నల్లనైన యమునా నది కూడా వారికి కన్పించడము లేదు. కృష్ణుడు, గోపికలు ఈ పారవశ్యములో యమునానదిలో పడిపోతారేమోనని వారు యమునానది దగ్గరకు వచ్చేటప్పటికి స్వామి వేణువూదడం ఆపేస్తున్నాడు. దానితో బాహ్యజ్ఞానము కలిగి, యమునా నదిని వారు గుర్తించి ప్రక్కకు తప్పుకున్నారు. ఈ విధముగా పరమేశ్వరుడు జ్ఞాన, అజ్ఞానాల మధ్య కొట్టుకులాడుతున్న తమను, తన దగ్గరికి వచ్చేదారి చూపించాడు. అంతటి దయగల స్వామి ఈనాడు మమ్ములను వదిలివేసినాడని గోపికలు దైన్యము పొందుతున్నారు.

తమలో వేణుగానము వ్యాపిస్తున్నది. నిజానికి కృష్ణుడు యమున ఒడ్డున వేణు వూదుతున్నాడు. ఆ పరిసరాలే తాము, అంటే వాటితో తమకు సామ్య మున్నది. మా శరీరాలే ఇసుక తిన్నెలు, కొండలు, నదులు, తరంగాలు, కలువలు, పద్మాలు. గోపికల శరీరమందలి వివిధాంగాలకు ఆ పరిసరాల్లోని

వస్తువులకు పోలికలు. అందువల్ల వీరు కూడా వనములే. తమ శరీరములు వనములు కాబట్టి తమలో వేణుగానము వ్యాపించింది అనడానికి ఆనాడు కృష్ణుడు సాక్షి. ఈనాడు ఆయన లేకపోవటము వలన ఆ జ్ఞానము కూడా లేకపోయింది. ఈ విధముగా వారి దైన్యము విస్తృతంగా చిత్రింపబడుతున్నది. ఆ దైన్యములోనే కృష్ణుడు వ్రేపల్లెలో ఉన్నప్పుడు తమలో కలిగిన మార్పులను స్మరించుకోవటముగా మారుతుంది. ఈ దశలో ద్వాదశావస్థలుగా చిత్రింపబడ్డాయి ఈ ద్వాదశావస్థ చిత్రణలో శృంగార భావ పరివ్యాప్తమయిక మధుర భక్తి అద్భుతంగా చిత్రింపబడింది.

లాక్షణికులలో భక్తిని రసంగా అంగీకరించని వారే ఎక్కువ. రూప గోస్వామి వంటి ఏ ఇద్దరు ముగ్గురో మాత్రమే భక్తినిరసంగా ప్రతిష్ఠాపించారు. వీరు మొదట భక్తులు తర్వాత సాహిత్య కర్తలు. మిగిలిన లాక్షణికుల స్థితి ఇది కాదు... వారు శాస్త్ర దృష్టితో పరిశీలించినవారు. అందుకే అనేకమంది భక్తిని ఒక భావముతో శాంతరసములో అంతర్భవించేదిగా భావించారు.[4] భక్తినే రసంగా అంగీకరించనప్పుడు మధుర భక్తిని రసంగా అంగీకరించడమా లేదా అనే ప్రశ్న ఉత్పన్నం గాదు. మధుర భక్తి అనేది లాక్షణికులు అంగీకరించింది కాదు. భక్తి అనేది అయితే రసమయినా కావల్సి ఉంటుంది, లేకపోతే భావమైనా కావల్సి ఉంటుంది. అంతేకాని, దానియందు మరొక రసలక్షణము ఆరోపించ బడదు. రసము అనేది మౌలికమే తప్ప ఆరోపితాంశము కాదు. కాని, గోపికాదుల యొక్క కృష్ణగతమైన భక్తిభావము శృంగార రస పద్ధతిలో చిత్రించడం అనేక కావ్యాల్లో కన్పిస్తుంది.

"కామోత్కంఠత గోపికల్" పరమేశ్వరుని పొందినారని భాగవతము చెప్పుతున్నది, అందువల్ల గోపికలయందలి భక్తి శృంగార సంబంధమైన రతి కావలసి ఉంటుంది. దీనికి ఆలంబనం భగవంతుడు. శృంగారానికి భగవంతుడు ఆలంబన కావడానికి వీలులేదు. అందువల్ల ఇక్కడ విచిత్రమైన సంక్లిష్ట పరిస్థితి ఏర్పడుతుంది. గోపికలలో ఉన్నది భక్తి. ఈ భక్తి యొక్క ప్రకటనలో శృంగార లక్షణం కన్పిస్తున్నది. మరొక విధముగా చెప్పితే భక్తిమీద శృంగారము ఆరోపించబడినది అందువల్ల ఆరోపణ పొందిన భక్తి పైకి స్పష్టపడదు. ఆరోపితమైన శృంగారము లోపలికి చొచ్చుకొనిపోదు. అది శృంగార మవు

తుందో, భక్తి అవుతుందో చెప్పడం సాధ్యపడదు. ఈ రెండింటి విచిత్రమైన సమ్మేళనము జరిగిందనుకోవలసి ఉంటుంది. అంటే, సర్వత్రా శృంగారమవు తుంది, కాదు అన్న స్థితి ఏర్పడుతుంది. ఈ అవుగామి స్థితిలో శృంగార దశావస్థల చిత్రణ ఈ కావ్యములో నిర్వహింపబడింది.

సామాన్యముగా ఈ దశావస్థలు నాయికా విషయంలోనే చిత్రింపబడటం కావ్యాల్లో చూడవచ్చు. నాయక విషయంలో కూడా చిత్రించడానికి వీలున్నది కాని, ఆ విధమైన చిత్రణ చాలా అరుదు. కృష్ణుడి యందు ఈ దశా విశేషాలను వర్ణించిన కావ్యాలు కొన్ని దక్షిణాంధ్ర సాహిత్యంలో కన్పిస్తాయి. అక్కడ కృష్ణుడు, గోపికలు లేక రాధ వీరందరూ మానుష వ్యక్తులుగానే కన్పిస్తారు తప్ప దైవలక్షణం కనిపించదు. భక్తి ప్రాతిపదికగా ఉన్నప్పుడు ఆ భక్తికి భగవంతుడు ఆలంబనము అయినప్పుడు, భగవంతునియందు కూడా విరహ చిత్రణను చిత్రింపవచ్చు. అట్లా చిత్రిస్తే అది భక్తికాక కేవలం శృంగారమే అవుతుంది. అందువల్ల గోపికల విషయంలో ఈ అవస్థలు గోపికలయందే చిత్రింపబడటానికి అవకాశం ఉన్నదితప్ప కృష్ణునియందు లేదు. మరి ఈ గోపికల అవస్థలు, కష్ణునికి చెప్పేవారు ఎవరు? శృంగారవీధి కావ్యంలో రాధా విషయాన్ని దూతిక కృష్ణునికి విన్నవించినట్లుగా చిత్రింపబడింది. బహుశః ఆ దూతిక కూడా ఒక గోపిక అయి ఉండవచ్చు. ఇక్కడ గోపికలే నాయికలు, గోపికలే దూతికలు. అందుకని గడచిన విషయాలను చెప్తున్నట్టుగా తమ స్థితిని గోపికలే చిత్రించు కొంటున్నారు. ఇక్కడి ఇది కూడా ఒక క్లిష్టమైన దశ. ఉద్ధవుడు వచ్చినప్పుడు గోపికల స్థితి ఈ అవస్థలన్నిటిని దాటిపోయినది. అందువల్ల ఆ గోపికలే తాము అనుభవించిన పూర్వావస్థలను స్మృతికి తెచ్చుకొని తటస్థవ్యక్తిగా వ్యక్తీకరిస్తున్నట్లు చిత్రింపబడుతున్నది. ఈ కావ్యములో ఈ ద్వాదశావస్థల వర్ణనలను ఈ భూమికపై దర్శించవలసి ఉంటుంది.

ప్రతాపరుద్రీయములో పేర్కొనబడిన ద్వాదశావస్థల క్రమమే ఇక్కడ పాటింపబడినది. నిజానికి అవస్థలకు కచ్చితంగా ఒక క్రమం చెప్పడానికి వీలున్నదా? "దృక్సంగం, మనస్సంగం, సంకల్పం" ఈ క్రమం నిశ్చితమే. జాగరము, కృశతకు హేతువు కావచ్చు. దానివల్ల అరతి కలుగవచ్చు. అది కారణముగా జ్వరము కలుగవచ్చు. ప్రలాపము, హ్రీత్యాగం, ఉన్మాదము,

మూర్ఛ - ఇవి ఒక వరుస. చివరిది మరణం. ప్రలాపం అనేది ఒక్కటి సంకల్ప జాగరలకు మధ్య కన్న జ్వరోన్మాదాల మధ్య చేరటం సమంజసంగా అనిపిస్తుంది.

ఈ పన్నెండు అవస్థలలో ఒక్కొక్కటి నాలుగేసి పద్యాలుగా భ్రమర గీతలలో వర్ణించబడినవని స్థూలంగా చెప్పవచ్చును. కాని, ప్రలాపము, మూర్ఛ, మరణం అనేవి మాత్రము మూడు, రెండు, ఒకటి పద్యాలలో మాత్రమే చిత్రింపబడ్డాయి. సంకల్పము మాత్రము 9 పద్యాల దాకా పెరిగింది. నిజానికి ఈ అవస్థను ఎన్నెన్ని పద్యాలలో చిత్రించాలని కాని, అన్నన్ని పద్యాలలో చిత్రించటంలో ఏదో విశేషమున్నదని కాని, చెప్పవలసిన అవసరము లేదు. ఈ అంశము ఈ పద్యాల సంఖ్య వలన స్పష్టపడుతున్నది. అయితే, సంకల్పము అనేది తొమ్మిది పద్యాలుగా విస్తరించడములో మొత్తానికి సంకల్పమనేది ప్రధానమన్న విషయం గుర్తించదగినది. ఈ సంకల్పానికి వచ్చేందుకు "దోహదం కలిగించేవి దృక్మనస్సంగమాలే" వీటివల్ల - మనస్సులో సంకల్పము ఎంత దృఢమయితే ఆ తర్వాతి అవస్థలు ఏర్పడటానికి అంత బలమయిన అవకాశమున్నది. సంకల్పములోని బలహీనత తర్వాతి దశలను కలిగించజాలదు. ఆ దృష్ట్యా మాత్రమే సంకల్పావస్థ ఇందులో ఎక్కువగా చిత్రితమైనదని చెప్పవచ్చు.

గోపికల దృక్సంగము శ్రీకృష్ణుని శైశవదశ నుంచి మొదలవుతుంది. "మన యశోద చిన్ని మగవాని కనెనట, చూచివత్తుమమ్మ సుదతులారా"... 5 అంటూ గోపికలు యశోద పొత్తిళ్ళలోని కృష్ణ శిశువును చూడటమే దృక్సంగమము. ఈ దృక్సంగము మన్మథావస్థ అవుతుందా? కాదా? నాయకుడు శిశువు, నాయికలు యువతులు. ఈ విచిత్రమైన దశలో గోపికల మనోభావమునకు మాత్రమే ప్రాధాన్యము. అందువల్ల ఈ దృక్సంగము గోపికలందలి భావము నుండి ఉదయించిందే తప్ప, శ్రీకృష్ణుని యందు ఆధారపడినది కాదు. అందుకే ఈ కావ్యములో దృక్సంగము కృష్ణుని శైశవ దశ వర్ణనముతో ఆరంభమవుతుంది.

"తరుణి యశోదమ్మ పురిటి సీళ్ళోసికోన్
సవము చేసిన బారసాల యపుడు
మఱియు నామెకు నెలపురుడు వెళ్ళిననాడు
వెస నూతిలో చేద వేసినపుడు

పడుచును లేచుచు ప్రాకుచు నవ్వుచు
చేవిడి విద్దెముల్ సేయునపుడు
విడి తప్పటడుగులు వేయుచో నడుగు ద
మ్ములకును నరిసెలు పోయునాడు

అత్తలకు కన్నొమలంగి నందావసథము
వేయి వంకలుగా పెట్టి వెళ్ళి స్వామి
శ్రీ మనోహరమూర్తి దర్శించినాము
ఓయి బంభర! నేడు రాడాయె స్వామి.''

ఈ పద్యములో పౌత్త్రిళ్ళలోని శిశువు నడక నేర్చేదాకా ఎదిగిన స్థితి వర్ణించబడినది. గోపికలు అత్తల దృష్టి నుంచి తప్పించుకుని స్వామిని చూడ టానికి మాటిమాటికి వెళ్ళేవారు. పుట్టింటి పండగల్లో అతని అందమైన అలంకరణ చూసి ''ఎల్ల జన్మలయందలి కంటి తృప్తిగా కట్టిన మూర్తి.'' వారికి కృష్ణుడు. తృణావర్తుడు కృష్ణుని ఆకాశంలోనికి ఎగురవేసుక పోయినప్పుడు గోపికలందరు ఆత్రముతో పైకి చూస్తూ వెళ్ళినారు. ఆయన పిల్లనగ్రోవి ఊదుతుంటే, ఇంత చిన్నతనములోనే పిల్లనగ్రోవి ఊదే నేర్పు ఎలా అలవడిందని ఆశ్చర్యముతో చూస్తుండేవాళ్ళు. గోపికలకు ఆదినుంచే కృష్ణ భావనతో ఈ దృక్పంగం సాగిందన్నమాట! దీనితో మనస్సు కూడా లగ్నమవుతున్నది. కృష్ణుడు కొంత పెరిగిన తర్వాత ఈ గోపికల యిండ్లలో తిరుగుతుండేవాడు. ఇది కృష్ణునివైపు నుండి బాల్యక్రీడ. కాని, కృష్ణుడు తమకోసమే వస్తున్నాడు అనేది గోపికల భావన. తాము వెడితేనే కృష్ణుడు ఏడుపు మానతాడని, తమకోసమే ఆయన వేణువూదుతాడని, అంటే తమయందే ఆయనకు మనస్సు లగ్నమయినదన్న భావన గోపికల మనస్సులలో తీవ్రమయినది. ఆయన వేణువు ఊదుతూ తమ కన్నులద్వారా తమ లోపలికి ప్రవేశించినాడని, తాము అతని మనస్సులో వ్యాపించినామని వారి తాత్పర్యము. కృష్ణుడికి తామే తల దువ్వాలి, తామే ఎత్తు కోవాలి, లేకపోతే ఆయన వేరెవరితోనూ దువ్వించుకోడు, ఏడ్పు మానడు అనేది వారి మనస్సును రతి భావంతో ఉద్దీపింప చేసింది. ఈ రెండు దశలు వారిలో కృష్ణ సంకల్పాల్ని దృఢతరం చేయసాగినవి.

అనేక గోపికలు కోడండ్రుగా వ్రేపల్లెలోకి వచ్చినారు. అసలు భర్త లేమో లౌకికంగా వేరే ఉన్నారు. కాని, కృష్ణుడు కొత్త భర్తగా వారి భావనలలో నిలిచాడు. ఇదొక చిత్రమైన దశ. లోకములో చిన్న పిల్లలతో పరిహాసముగా భార్యాభర్తల మాటలు మాట్లాడుకోవడం సామాన్యమే. గోపికల విషయంలో మానసికముగా ఆ భావము యథార్థమనిపిస్తుంది ఆయన లేక బ్రతుకడము కష్టము. ఈ ఒక్క జన్మకే కాదు, సర్వజన్మలకు ఆయనయే భర్త అన్న నిశ్చయ స్థాయికి వారెదిగినారు. నీ భర్త పేరేమిటంటే కృష్ణుడు అనేవారు. భర్త పేరు చెప్పడానికి తప్పించుకొని పసివాడి పేరు చెప్పుతున్నారని వినేవారికి అనిపించేది. కృష్ణుడిని నీవు ఎవరిని పెళ్ళి చేసుకుంటావని అంటే, అందరినీ చేసుకుంటానని అనేవాడు. అది పిల్లల మాటగా నవ్వులాటగా అనిపించేది. కృష్ణుడు పసివాడు కాబట్టి ఆయనని ముద్దు పెట్టుకోవటం, కౌగలించుకోవటం, అతడు వీళ్ళను కూడా అదే విధముగా చేయడం, ఉభయుల వయస్సులోని తారతమ్యం వల్ల పెద్ద విశేషంగా అనిపించేది కాదు కాని, వీరి మనస్సులో మాత్రం ఆ చేష్టలు అతనియందు భర్తృ భావాన్ని నిలిపేవి. ఇంతదాక వచ్చిన తరువాత ఈ దశలోని క్లిష్టతకు గోపికలు ఈ విధముగా స్పష్టపరుస్తారు:

"మనసిది రెండుగా సగము మన్నును తాకుచు మిన్నుతాకికొం
చును పయిసాము దివ్యమగుచోటున నీయన భర్తగాఁగ మా
మనసున పాపమన్నయది మాలిన వైఖరి చిత్తగించు కొం
చును మనుచుంటి మల్ల యదుశూరుడు శూరత చూప షట్పదా!"

మనస్సు రెండు భాగాలుగా ఉంటుంది. క్రింది భాగము లోకముతో సంబంధము కలది. పైభాగము అలౌకికమైన దివ్య భావనకు సంబంధించినది. కృష్ణుడు భర్త అన్న భావము ఈ పై భాగమునకు సంబంధించినది. అందువల్ల లౌకికంగా భర్త ఒకడుండగా మరొకరి యందు, మనస్సు లగ్నం కావడం, ప్రేమ గాఢం కావడము తప్పు కావచ్చును కాని, దివ్య భూమికలో భగవద్గీతమైన భర్తృ భావన వ్యక్తి యొక్క ముక్తికి సంబంధించినది. గోపికలలోని శ్రీకృష్ణ గత భర్తృ భావనకు ఇది ఒక వ్యాఖ్యానము. అనగా, గోపికలయొక్క భావన వాహిక, ఆయుష్మికములందు సమానముగా విభజింపబడి ప్రవర్తిస్తున్నది. వారు లౌకికంగా భర్తలతో సంసారము - లోక యాత్ర సాగిస్తూనే ఉంటారు. అదే

సమయంలో పరమేశ్వర భావనాపరివ్యాప్తలవుతుంటారు. "చిత్తగించుకొనుట" అంటే, చిత్తముగా చేసుకోవటం. అంతఃకరణానికి సంబంధించి మనోబుద్ధ్యహంకార చిత్తములలో ఈ గోపికల "చిత్త" స్థాయి ఇక్కడ సూచింపబడుతున్నది. ఇది గోపికల శృంగార రూపమైన భక్తివైచిత్రి.

ఈ సంకల్పము వారిలో ఒక విచిత్రమైన ధైర్యాన్ని కలిగించింది. అత్తలు ఇంట్లో ఏదో కన్పించలేదని కోపంతో కోడండ్రే దిగమింగి కూర్చున్నారని నిందించినప్పుడు ఈ కోడళ్ళు 'ఔను! దిగిమింగినాము' అని నోరు తెరచి చూపించేవారట (ప. 61). ఇందులో అర్థంలేని ప్రలాపము, శ్రీకృష్ణచేష్టానుకరణము కలసి వ్యక్తమవుతాయి. మట్టితిన్న కృష్ణుడు యశోదకు నోరు తెరచి చూపించిన చేష్టకు అనుకృతి. అయితే, ఆ నోటిలో యశోదకు కనిపించిన దృశ్యము ఇక్కడ అత్తలకు కనిపించదు. వీరు భగవంతుడు కాదు కదా! అందుకని కోడండ్రు తమను వెక్కిరిస్తున్నారని అత్తలకు కోపము. భర్త పక్కన పడుకున్న గోపిక, స్వప్నములో చూచిన కృష్ణుని గూర్చి 'గోవుల కాలి దుమ్ము బారిన కోమలచారు శరీరము గలవాడా, గోపీప్రియా!' అని పలవరించేవారట. (ప. 62) ఈ సంబోధనలు భర్తలకు కూడా వర్తిస్తాయి. మనస్సు కింది భాగంలో భర్త- పైభాగములో భగవంతుడు - ఇద్దరిస్థాయిసమానమేనని స్ఫూర్తి. ఆవిధముగా ఒకప్పుడు వారి ప్రలాపాలు సాగేవి.

వర్షాకాలములో వానలవల్ల కృష్ణ దర్శనము అయ్యేదికాదు. ఆయన దర్శనము కోసము వీరు రాత్రంతా మేలుకొని ఉండేవారు. వానయొక్క చప్పుడు వేణునాదమా! అన్న భ్రాంతి కలిగేది. (ప. 65). ఈ నిద్రలేమిచేత వారి శరీరములో పెరిగిన వేడికి ఆవానలే శైత్యోపచారాలుగా అయ్యేవి విరహ తప్త నాయికలకు శైత్యోపచారాలు చేయటమనేది శృంగార ప్రబంధాలలో కన్పించే సామాన్యాంశం. ఇరుగు పొరుగిండ్లలో ఏవైనా కార్యాలు జరిగినప్పుడు సహాయపడటంగా రాత్రింబవళ్ళు అక్కడ గడిపేవారు. ఈ నిద్రలేమితనానికి ఈ సహాయం కారణమని ఇతరులకు అనిపించేది కాని ఇది యదార్థం కాదు. కృష్ణుడు కనిపించక పోవటం వల్ల మాత్రమే వారికి కునుకు పట్టేది కాదు. ఈ నిద్రలేక పోవడం వాళ్ళలో కృశత్వమును కలిగించింది. రవికలన్నీ వదులు అయ్యేవి. శరీరములో పూర్వమున్న బరువు తగ్గిపోయేది. ఈ రెండు దశలు వారిలో

'అరతి'ని, అంటే ఏ విషయంలో కూడా ఆసక్తిలేనితనాన్ని పెంచినవి. ఇది భక్తివైపునుంచి చూస్తే ఒక వైరాగ్య లక్షణం. ఈ ఆసక్తి లేకపోవడం సిగ్గు మాలినతనానికి దారి తీస్తుంది. ఇక్కడ గోపికలు ఒక విచిత్రమైన అంశాన్ని ప్రతిపాదిస్తారు.

> "మాకుం జీవితముగాగ నున్న యది, యున్మత్తాళి! యీ దేహముల్
> లేకున్నన్ యదునాథభావన మదిన్ లేకుండు, తద్భావనా
> సాకల్యమ్మునకున్ తనూస్థితికినిన్ సంబంధమున్ లేద, యీ
> లోకంబో తమవుం బ్రధానముగ నాలోచించు పుష్పంధయా!"

ఈ దేహమున్నది కాబట్టి కృష్ణసంబంధమైన ఈ భావన ఉన్నది. అయితే, దేహానికి, ఈ భావానికి సంబంధము లేదు. కాని, లోకము దేహాన్నిబట్టే ఆలోచిస్తుంది. దేహాతీతమైన అంశాన్ని, దేహబద్ధంగా ఆలోచించడమువల్ల లోకానికి భక్తులు సిగ్గు విడిచినవారుగా, ఉన్మాదులుగా అనిపిస్తుంటారు. గోపికల శరీరములో జ్వర తీవ్రతవల్ల తీవ్రమైన వేడి పుట్టింది.

> "లోన సెగలూది రాత్రి సంధ్యా నితాంత
> తప్తతనులము దక్షిణాదర్వ పవన
> చాలితజ్వాలలము గాగ స్వామి కేమొ
> పగటి దివిటీల మైతిమి, భ్రమరరాజ!"

భగవత్సేవ లేకపోవడంచేత ఈ "లేమి" అన్న భావం తీవ్రమై, అది మంటగా లేచి, భగవంతుడికి వారు పగటి దివిటీలైనారట. ఈ పగటి దివిటీలకు ప్రయోజనము లేదు. కాని, అది ఒకరోజు భోగము. ఒక దేవ భోగము. ఈ దివిటీలు ఆ భోగానికి సూచనలు అంటే తాము భగవద్భోగానికి హేతువులవుతున్నారన్నమాట!

వారి మనస్సులలోని "శ్రీహరి భావవహ్ని" ఈ శరీరాన్ని తగులబెట్టినంతగా చేస్తున్నది గాని తగులబెట్టదు. (వ. 89.) శరీరము కదులుతూనే ఉంటుంది. లోపల "స్మృతి" ఆడుతూనే ఉంటుంది. శరీర సంబంధము అప్పుడు

వారికి గుర్తుండదు. ఎంత బ్రహ్మ జ్ఞానము కలిగినవారికి అయినా ఈ శరీరము మాత్రము ప్రారబ్ధకర్మను బట్టి ఎంతకాలము ఉండవలెనో అంతకాలము ఉంటుంది. ఈ శరీర స్పృహ లేకపోవటం మూర్ఛా లక్షణం. స్మృతి ఉండటం మూర్ఛకాని లక్షణం ఈ రెండింటి సమ్మిళిత స్థితి గోపికలలోని పదకొండవ అవస్థ. అట్లాగే మృతి కూడా. మృతి అంటే చిత్తవృత్తులు అన్నీ నశించిపోవడం అని ఇక్కడ భావించవలసి ఉంటుంది. కృష్ణుడు వీరికి మృత్యువు కానట్టి మృత్యువును కలిగింపచేసినాడు. అది ఆయన విరహం మాత్రమే. ఈ నిత్య విరహం వీరి చిత్త వృత్తులను నశింపచేసిన సమాధి దశ కలిగించింది. మృత్యువు అంటే దేహాన్నుంచి ఆత్మకు ముక్తి. ఇక్కడ గోపికల విషయంలోని మృత్యువు చిత్తవృత్తుల నుంచి ముక్తి. శృంగార కావ్యాల్లో మృత్యువును వర్ణించరు, ఇది శృంగార కావ్యము కాదు. అందువల్ల మృత్యువును వర్ణించవచ్చు. కాని, శృంగార కావ్యము కాకపోతే ఈ అవస్థల ప్రసక్తే లేదు కాబట్టి, మృత్యువు కాని మృత్యువు - లౌకికముగా మృత్యువు కాదు. అలౌకికముగా చిత్తవృత్తుల నాశన రూపముగా మృత్యువు. కాబట్టి, గోపికలు జీవన్ముక్త దశకు ఎదిగినారని తాత్పర్యము. ఈ దశకు వచ్చిన తరువాత విరహము లేదు. దుఃఖము లేదు. ఈ రాయబారము కూడా అప్పుడనవసరము. ఈ అవస్థల చిత్రణ తర్వాత గోపికలు భగవత్ తత్వాన్ని నిరూపిస్తూ ఉండడముతో కావ్యము పూర్తవుతుంది. ఇది భ్రమర గీతల స్వరూపము.

సత్యనారాయణ గారు భక్తి, శృంగారాల విచిత్ర సమ్మేళనములో జీవన్ముక్తావస్థకు సంబంధించిన శాంత భావాన్ని వ్యాపింపచేయటం గమనింప దగిన అంశము. ఈ విధమైన కావ్య నిర్వహణ సత్యనారాయణగారి అనుభవము నుంచి రూపుదిద్దుకొన్నది. తన ఏ కావ్యానికి వ్యాఖ్యానము కాని, కనీసము వివరణ కూడా వ్రాయని సత్యనారాయణగారు ఈ ఒక్క కావ్యానికి మాత్రం వ్యాఖ్య వ్రాసినారు.[6] ఈ వ్యాఖ్య భక్తి భావానుభవములో మాధుర్య లక్షణము ఇమిడిపోవటములోని సంక్లిష్ట లక్షణాన్ని వ్యక్తం చేసేందుకే వ్రాయబడింది. అయితే, ఈ వ్యాఖ్య పాఠకుల భావనకు ఒక పరిమితి కలిగిస్తుంది. వ్యాఖ్యానాన్ని అపేక్షించకుండా, కావ్యాన్నే సహృదయుడు భావిస్తే మరింత విచిత్రమైన అనుభవం కలిగే అవకాశము ఈ కావ్యములో ఉన్నది.

## పాద సూచికలు :

**గోపికా గీతలు :**

1. సంస్కృత భాగవతమ్ - దశమ స్కంధం - 29 వ అధ్యాయం - 47 వ శ్లోకం.
2. గోపికా గీతలు- విశ్వనాథ వారు ఈ కావ్యమును శ్రీ ముక్కామల వేంకట లక్ష్మీ నరసింహారావు (కంటి డాక్టరు) గారికి అంకిత మిచ్చినారు.
3. రామాయణ కల్పవృక్షము - సుందరకాండ - ఉషః ఖండము -172.
4. ఆంధ్రమహా భాగవతము - దశమ స్కంధము - పూ. భా. 1008.
5. గోపికా గీతలు - టిప్పణి.
6. సంస్కృత భాగవతమ్ . దశమ స్కంధం - 30వ అధ్యాయం - 27వ శ్లోకం.
7. గోపికాగీతలు - టిప్పణి.
8. రామాయణ కల్పవృక్షము - యుద్ధకాండము - ఉపసంహరణ ఖండము- 415.

**భ్రమర గీతలు :**

1. ఆంధ్ర ప్రతాప రుద్రీయము - రసప్రకరణము - 84, 85 వ శ్లోకము.
2. ఆంధ్ర ప్రతాప రుద్రీయము - రసప్రకరణము - 83 (రత్నాపణవ్యాఖ్య).
3. రస గంగాధరం - జగన్నాథ పండితరాయలు - 1 వ శ్లోకం.
4. భగవదాకారాకారితమైన రతి భక్తియందు స్థాయిభావమగుట కుదురు తున్నది. చిద్రూపముగా లభించి చిద్వృతి, చిత్స్వరూపము అగుట భక్తి రసము అందుచేతనే దానిని సంపూర్ణ రసము అని మధుసూదన సరస్వతి నిర్దేశించినారు.

   భగవంతః విభుంనిత్య పూర్ణంబోధ సుఖాత్మకం
   యద్గృహాతి సుఖం చిత్తం కిమస్యదవ శిష్యతే॥

   భగవంతు డనగా ఆత్మ స్వరూపమని మధుసూదనుని అభిప్రాయము. విభువు నిత్యుడు, పూర్ణుడు, బోధ స్వరూపుడు అనుటచే సచ్చిదానందా త్మకమైన పరబ్రహ్మతత్వమే భగవంతుడని చెప్పినట్లయినది. భాగవ తము కూడా నిట్లే చెప్పుచున్నది :

"వదంతి తత్తత్త్వ విదస్తత్త్వం యజ్ఞానమవ్యయం
బ్రహ్మేతి, పరమాత్మేతి భగవానితికథ్యతే॥"

ఇట్టి భగవదాకారాది కాంత చిత్తవృత్తి స్థాయియని చెప్పుటచేత భక్తి రసమనగా శాంతరసమని చెప్పినట్లయినది. శాంతరసమని అలంకారికు లన్నదానినే భక్తులు భక్తి రసమని పిలుతురనవలెను. భక్తి, జ్ఞాన, వైరాగ్యములు పరస్పర సహాయకములు. ఒకదానివలన నొకటి పరిపుష్ట మగునట్టివి భక్తిరసము నందాత్మత్వ మీశ్వర స్వరూపముగను, శాంతము నందు స్వస్వరూపముగను ప్రతీయమానమగుట తప్ప మరియొక భేదమేమీ రెంటికిని లేదు. ఈ భేదమును పురస్కరించుకొని యిది పదవ రసముగా మధుసూదన సరస్వతి చెప్పినాడు.

—శ్రీమదాంధ్ర భాగవతానుశీలనము-ధూళిపాళ శ్రీరామమూర్తి, పుటలు. 526, 528, 529.

5. ఆంధ్ర మహాభాగవతము - దశమ స్కంధము - పూ.భా. - 183.

6. గోపికా గీతలు, ప్రద్యుమ్నోదయములకు "టిప్పణి" రాశారు. అనగా కొన్ని కఠిన పదాలకు అర్థములను ఇచ్చారు.

# నాలుగవ అధ్యాయము

# ప్రద్యుమ్న వ్యూహోదయం

## ప్రద్యుమ్నోదయము

ఝాన్సీరాణి, శ్రీ కుమారాభ్యుదయము, శివానుగ్రహము మొదలైన రచనల్లో ఎక్కడ కూడా ఆ రచన ఏ కావ్య ప్రక్రియకు చెందినదో సత్య నారాయణగారు చెప్పినట్లు కనిపించదు. రురు చరిత్రములో మాత్రము పయి, లోపలి ముఖ పత్రాలలో "ప్రబంధము" అని చెప్పబడిందే తప్ప కావ్యానికి అవతారిక, ప్రాచీన పద్ధతిలో కృతిపతి వంశ విషయము మొదలయినవి ఏవీ లేవు. ఒక్క ఈ కావ్యములోనే కాదు-మరి ఏ ఇతర కావ్యాలలో కూడా ఈ అవ తారికాదుల ప్రసక్తి ఎక్కడా కనిపించదు. అట్లా కనిపించేది కేవలం రెండు కావ్యాలతో మాత్రమే. ఒకటి శ్రీమద్రామాయణ కల్పవృక్షము; రెండు ప్రద్యుమ్నోదయము. శ్రీమద్రామాయణ కల్పవృక్షములో—

> "ఈ దృశంబుగ మహా కావ్యరచనాప్రసూనన బంభరాయమాన చిత్తుండ
> వయి సర్వ ధర్మమూల బీజంబుగ నవిచ్ఛిన్న సంప్రదాయమూర్తివై...."

అని పూర్వ కవి స్మరణ, తన కావ్య విషయము, కృతిశ్రోతృ విషయము చెప్పి చివరకు "నందమూరి విశ్వేశ్వరా" సంబోధనతో బాల కాండము ఇష్టి ఖండము ఆరంభమవుతుంది. రామాయణంలోని ఈ అవతారికారీతి ప్రాచీన కావ్యములలోని ఏ అవతారికతో పోలిక లేకుండా అత్యంత నవీన విధానముతో సాగుతుంది. ప్రద్యుమ్నోదయంలోని అవతారిక ప్రాచీన కావ్యాల అవతారికల తీరుకు చాలా దగ్గరగా ఉంటుంది. ఈ అవతారికాంతాన—

> "నా ఎడంద ఎందుకో ఎవరి మీదనో ఎప్పుడో స్నిహ్యమాణ మగుచుండు
> నందీయన యొక్కండు, అందుచే నీయన కభ్యుదయ పరంపరాభివృద్ధిగా
> నా రచించు నీ మహా కావ్యంబునకు గథా క్రమం బెట్టిదనిన"

అని అసలు కథ ప్రారంభము చేయబడుతుంది. "అభ్యుదయ పరం పరాభి వృద్ధిగా........ "అన్న భాగము అచ్చంగా ప్రాచీన కావ్యాల్లో మాదిరిగానే కనిపిస్తుంది. ఇక్కడ ఈ ప్రద్యుమ్నోదయం మహా కావ్యంగా పేర్కొనబడింది, ఆ శ్రీమద్రామాయణ కల్పవృక్షము శ్రీరామ చంద్ర విషయము కాగా ఈ ప్రద్యుమ్నోదయము కృష్ణ విషయము. అందువల్ల రామ విషయమైన మహా కావ్యమొకటి, కృష్ణ విషయమైన మహాకావ్య మొకటి రచింపబడినట్లు చెప్పవచ్చు. కాని, శ్రీమద్రామాయణ కల్పవృక్షము ఆరు కాండలు, ముప్పది ఖండాలు దాదాపు 13 వేల పద్యాలతో బహుముఖమైన స్వరూప స్వభావాలు కలది కాగా, ప్రద్యుమ్నోదయము అయిదు ఆశ్వాసాలతో దాదాపు 350 పద్యాలతో ఏకముఖీనమైనది. దీనినిబట్టి ''మహాకావ్యము"నకు రామాయణ కల్పవృక్షము ఒకవిధమైన ఉదాహరణ కాగా, ప్రద్యుమ్నోదయము మరియొకవిధమైన ఉదాహరణ అని చెప్పవచ్చు. మహా కావ్యమన్నదానికి ఒక కొన ఒకటి కాగా రెండవది మరి ఒక కొన.

ప్రద్యుమ్నోదయం అవతారికాంతాన మహాకావ్యం అని కూడా ముఖపత్రాలమీద ప్రబంధమని, రురుచరిత్రములో వలె సూచింపబడినది. ప్రబంధానికి కావ్యానికి అభేద భావం ఇక్కడ వ్యక్తమవుతున్నది. ప్రబంధమనేది కావ్యంకన్న ఒక భిన్నమైన ప్రక్రియగా గుర్తించటం, గుర్తించకపోవటం కూడా తెలుగు సాహిత్య చరిత్రలో గమనింపవచ్చు. పెద్దనాదులకు ముందరి శ్రీనాధాదుల రచనలను కావ్యాలని, ఆ తరువాతవాటిని ప్రబంధాలని భావించే పద్ధతికూడా కన్పిస్తుంది. మొత్తం మీద కావ్య ప్రబంధాలకు కచ్చితంగా విభేదక సూత్రం కన్పించదు. స్థూలంగా ప్రబంధాలు అని ప్రసిద్ధి పొందిన పెద్దనాదుల కావ్యాలు పురవర్ణనతో ప్రారంభము కావడం, మొత్తం రచన వర్ణనా ప్రాధాన్యం కలిగి ఉండటం, శృంగార ప్రధానం కావటం మొదలైనవి ప్రచురంగా కనిపించే అంశాలు. ఈ విధంగా చూస్తే ప్రద్యుమ్నోదయం ప్రబంధము అయ్యే అవకాశం లేదు ఇది నగర వర్ణనతో ప్రారంభము కాదు. వివిధ వర్ణనలు ఇందులో లేవు. అసలు వర్ణనలే లేవని చెప్పవచ్చు.

మహాకవి కాళిదాసు "కుమార సంభవము" మొదలైన సంస్కృత మహాకావ్యాల ధోరణిలో - శ్రీమద్రామాయణ కల్పవృక్షములో మాదిరిగానే

ప్రద్యుమ్నోదయంకూడా వస్తునిర్దేశముతో ఆరంభమవుతుంది. ప్రద్యుమ్నోదయం అన్న పేరు తెలుగులోని "స్వారోచిష మను సంభవం" అన్న పెద్దన్నగారి కావ్య నామాన్ని స్ఫురింప చేస్తుంది. అంతేకాదు - కాళిదాసు కుమారసంభవాన్ని కూడా గుర్తుకు తెస్తున్నది. ఇది ఈ మూడింటిలోనూ వరుసగా కుమారస్వామి, స్వారోచిష మనువు, ప్రద్యుమ్నుడు- ఈ ముగ్గురి జననంతో ఇంచుమించు కావ్యాలు సమాప్తమవుతాయి. 'కుమార, మను, ప్రద్యుమ్నుల' కథ వీటిలో చాలా స్వల్పము. వీటికి పూర్వరాగముగా శివపార్వతుల, రుక్మిణీకృష్ణుల వివాహ కథ విస్తరింప చేయబడినది. స్వారోచిషమనుసంభవములోని పూర్వరాగము వీటి కంటె భిన్నమైనది. వరూధినీప్రవరులు, మాయాప్రవరుడు, స్వరోచి-ఆయన ముగ్గురు భార్యలు, వనదేవతల విషయం చిత్రించబడుతుంది. కాగా, ప్రద్యుమ్నోదయానికి మనుసంభవముతో కన్న కుమార సంభవముతో కొంత పోలిక కనిపిస్తుంది. అయిదు ఆశ్వాసాల ప్రద్యుమ్నోదయ కావ్యంలో మూడాశ్వాసాలు కృష్ణ కళ్యాణగాథ. తరువాత రెండాశ్వాసాలలో ప్రద్యుమ్న జననానికి పూర్వ రంగం చిత్రింపబడుతుంది. వీటిలో చివరి ఆశ్వాసములో ప్రద్యుమ్న జననం చెప్పబడుతుంది. అనిరుద్ధ జననం జరిగిందనడంతో కావ్యం సమాప్తమవుతుంది. ఈ కథా స్వరూపాన్ని, క్రమాన్ని విశేషంగా గమనించవలసి ఉంటుంది.

## రుక్మిణీ కళ్యాణ గాథ :

ఈ కావ్యంలో చిత్రింపబడిన రుక్మిణీ కళ్యాణకథ హరివంశ భాగవతాలలో సుప్రసిద్ధమైనది. కాని, ఈ కథకు సంబంధించి ఒకటి రెండు తేడాలు ఈ రెండింటిలో కనిపిస్తాయి. రుక్మిణి తనను రాక్షస విధానంతో వివాహమాడి తీసుకొని పొమ్మని కృష్ణునికి సందేశం పంపినట్లు హరివంశంలో లేదు. నారదుడు శ్రీకృష్ణుని వద్దకు వచ్చి రుక్మిణిని గూర్చి చెప్పతాడు. ఆమె "కృష్ణార్తురాల"ని కృష్ణుని -

"అనుపమ సద్గుణ స్థితికి నమ్ముడు వోయిన జిహ్వాయుం బ్రియం
బున దమకించి నీ లలితమూర్తి గనుంగాన కోరుచూడ్కి-యున్
దన కమరంగ రాజసుత దక్కి-న భంగు లెరుంగ దేమియున్...."

అంటూ రుక్మిణికి శ్రీకృష్ణుని యందు గల ప్రేమభావాన్ని వివరించి, ఆమెను వివాహమాడేందుకు శ్రీకృష్ణుని ప్రోత్సహిస్తాడు భాగవతములో ఈ సన్నివేశము మరొక విధముగా నున్నది. రుక్మిణి అప్తుడైన ఒకానొక బ్రాహ్మణుని శ్రీకృష్ణుని దగ్గరకు పంపుతుంది. అతడు కృష్ణునికి రుక్మిణి విషయాన్ని వివరించి సందేశాన్ని వినిపించి రుక్మిణిని వివాహం చేసుకునేందుకు ప్రోత్సహిస్తాడు. హరివంశములోని నారదుని స్థానములో ఇక్కడ ఒకానొక బ్రాహ్మణుడు కనిపిస్తాడు. కాని, నారదుడు తనంతట తానుగా శ్రీకృష్ణుని దగ్గరకు వెళ్ళి రుక్మిణి విషయం చెప్పగా, ఇక్కడ బ్రాహ్మణుడు రుక్మిణీదేవిచేత పంపించబడినవాడు. హరివంశములో లేని రుక్మిణి చొరవ భాగవతములో కనిపిస్తుంది. భాగవతములో రుక్మిణికి అప్తుడైన బ్రాహ్మణుడు అని మాత్రమే చెప్పబడింది. "విచింత్యాప్తం ద్విజం కంచిత్ కృష్ణాయ ప్రాహిణోత్ ద్రుతం........"బాగా ఆలోచించి ఒకానొక అప్తుడైన బ్రాహ్మణుని కృష్ణుని వద్దకు తొందరగా పంపెను అని చెప్పబడిందే తప్ప రుక్మిణికి ఆ బ్రాహ్మణునితో ఉన్న అప్తత్వము ఎట్లాంటిదో, అతని పేరేమిటో వ్యాస భాగవతములో తెలియదు. పోతన గారి భాగవతములో కూడా ఇట్లాగే ఉంది కాని, ఆ బ్రాహ్మణుని పేరు "అగ్నిద్యోతనుడు" అని మాత్రం చెప్పబడింది. ఈ పేరు పోతనగారి ఊహలో నుంచి ఉదయించిందో లేదా మరెక్కడి నుంచి లభించిందో తెలియదు. హరివంశము, భాగవతము రెండింటిలో కూడా రుక్మిణిని హరించి తీసుకొనిపోయేందుకు శ్రీకృష్ణుడు వచ్చినప్పుడు ఆయనవెంట బలరాముడు కూడా సైన్యాలను వెంటతీసుకొని వచ్చినట్లు చెప్పబడింది.

ప్రద్యుమ్నోదయ కావ్యంలో రుక్మిణీ కళ్యాణ కథకు భాగవతమే మూలము. ఇందులో కూడా రుక్మిణి కృష్ణుని దగ్గరకు ఒక బ్రాహ్మణున్నే పంపిస్తుంది. ఆ బ్రాహ్మణుని పేరూ అగ్నిద్యోతనుడే. ఈ కారణముగా భాగవతమే దీనికి మూలమైనదిగా స్పష్టపడుతుంది. భాగవతములో రుక్మిణికీ, బ్రాహ్మణునికీ మధ్యగల ఆత్మీయత తెలియదు కాని, ఈ విధమైన ఒక రహస్యమైన జీవితసార భూతమైన విషయంలో ఉపయోగించుకొనగలిగిన వ్యక్తి ఎంతో ఆత్మీయుడూ, తనమీద ఎంతో వాత్సల్యం గలవాడు, ప్రేమ, అభిమానం కలవాడు. ఇంకెవరికీ అనుమానం కలుగడానికి అవకాశం లేనివాడు అయినప్పుడే రుక్మిణి అతనిని పంపించ గలుగుతుంది. ఇట్లాంటి లక్షణాలన్నీ ఉండేవాడు చిన్నప్పటినుంచి ఆమెకు చదువు చెప్పే గురువు మాత్రమే కాగలుగుతాడు. అందు

వలన ప్రద్యుమ్నోదయంలో అగ్నిద్యోతనుడు రుక్మిణీదేవికి ఆబాల్యంగా విద్యాబుద్ధులు నేర్పిన గురువుగా చిత్రింపబడ్డాడు.

ప్రద్యుమ్నోదయంలో రుక్మిణీ కళ్యాణ గాథ స్థూలంగా ఇది—

"హేలవిదర్భరాజ దుహితృస్థితిఁగాంచె వికుంఠనాథు ని
ల్లాలుపయోధికూఁతురబలామణిరుక్మిణి యౌచు నంత వి
య్యాలకునై వికుంఠపతి యాదవుఁడై చనుఁదేరుదెంచి, క
య్యాలకునై విదర్భపతియాత్మజుఁడై చనురుక్మియున్ దిగెన్."

శ్రీ లక్ష్మిదేవి విదర్భరాజుకు రుక్మిణిగా జన్మించినప్పుడు వియ్యానికి యాదవుడుగా కృష్ణుడు, కయ్యానికి రుక్మిణి అన్నగా రుక్మి ఈ లోకంలోకి అవతరిస్తారు. రుక్మి తన చెల్లెలిని శిశుపాలున కిచ్చి వివాహం చేస్తానంటాడు. కృష్ణునిమీద ద్వేషంతో శిశుపాలుడు రుక్మిణిని వివాహం చేసుకోవటానికి ససైన్యుడై విదర్భకు వస్తాడు. శ్రీకృష్ణుని కోసమే తాను జన్మించిందన్న నిశ్చయం గల రుక్మిణి తన అన్నగారి ప్రయత్నాన్ని విఫలం చేస్తూ కృష్ణునికి అగ్నిద్యోతనుని ద్వారా సందేశం పంపిస్తుంది. ఆ సందేశాన్ని పురస్కరించుకొని శ్రీకృష్ణుడు విదర్భకు వస్తాడు. వివాహాత్పూర్వము ఆలయంలో నిర్వహించవలసిన గౌరీ పూజ చేసి తిరిగివస్తున్న రుక్మిణిని ఎత్తుకొని కృష్ణుడు తన రథం మీదికి రాబోతున్నప్పుడు శిశుపాలుని సైన్యం వారిని చుట్టుముట్టుతుంది. శ్రీకృష్ణుడు అస్త్రాగ్నితో సైన్యాన్ని విదలించి వేస్తాడు. తన వెంటపడి వస్తున్న రుక్మిని బంధించి అతని తల గొరిగి అవమానిస్తాడు. ఆ తరువాత ద్వారకకు వచ్చి రుక్మిణిని విధువిధిగా వివాహం చేసుకుంటాడు. మొదటి మూడాశ్వాసాల లోని కథ ఇది. తరువాత రెండాశ్వాసాలలో ప్రద్యుమ్న విషయం స్థూలముగా ఇది....

## ప్రద్యుమ్న గాథ :

శివుని కంటి మంటలో ఏనాడో మన్మథుడు భస్మమై పోయినప్పుడు దుఃఖిస్తున్న రతికి, దేవి - నీ భర్త కృష్ణావతారములో కృష్ణుడి కుమారుడిగా లభిస్తాడని అప్పటిదాకా ఈ భస్మమును రక్షించుకుంటూ ఉండవలసిందని అంటుంది. ఆ భస్మాన్ని మూటగట్టుకొని అప్పటి నుంచి ఈ రుక్మిణి వివాహం

దాకా రతీదేవి నిరీక్షిస్తూ ఉంటుంది వివాహానంతరం రుక్మిణి దగ్గరకు వచ్చి తన గోడు వెళ్ళబోసుకుంటుంది. రుక్మిణికి ఆమెపై ప్రేమ, దయ కలుగుతాయి. రుక్మిణి ప్రేరణతో కృష్ణుడు శివుని దగ్గరకు వెళతాడు. ఉభయులు పరస్పరం గౌరవించుకుంటారు. శివుడు కృష్ణునికి సంతానంగా మన్మధుని అనుగ్రహిస్తాడు. రుక్మిణి గర్భవతియై ప్రద్యుమ్నుని కంటుంది. ఆతడు సద్యోయౌవనుడై రతీదేవిని వివాహమాడుతాడు. వారికి అనిరుద్ధుడు జన్మిస్తాడు. దీనితో కావ్యం పరిసమాప్తమవుతుంది.

హరివంశ భాగవతాలలో ప్రద్యుమ్న గాథ మరొక విధముగా ఉంటుంది. రుక్మిణీ కృష్ణులకు ప్రద్యుమ్నుడు జన్మించి పది రోజులు గడువకుండానే "శంబరుడు" అనే రాక్షసుడు ఆ శిశువును అపహరించుకొనిపోయి సముద్రంలోకి విసిరివేస్తాడు. ఆ శిశువును ఒక చేప మింగుతుంది. ఆ చేప జాలరులకు లభిస్తుంది. అపురూపంగా కనిపించిన ఆ చేపను జాలరులు శంబరాసురునికే సమర్పిస్తారు. దానిని చక్కగా వండమని శంబరుడు అంతఃపురానికి పంపిస్తాడు. అక్కడ "మాయాదేవి" అన్న పేరుతో వ్యవహరింపబడుతూ రతీదేవి ఉంటుంది. ఆ చేపను చీల్చినప్పుడు వెలువడిన శిశువును - ప్రద్యుమ్నుని మాయాదేవి పెంచుతుంది. ప్రద్యుమ్నుడు పెరిగి రతీదేవి ప్రోత్సాహంతో శంబరాసురుని వధించి, ఆమెతో సహా ద్వారకకు వస్తాడు. నారదుని వలన యదార్థమెరిగిన రుక్మిణి ఈ ఇద్దరికి వివాహం జరిపిస్తుంది. రతీప్రద్యుమ్నులకు అనిరుద్ధుడు జన్మిస్తాడు. ప్రద్యుమ్నోదయంలో ఈ శంబరాసుర విషయం కనిపించదు. భాగవతంలో లేని భస్మ విషయం, శివసమాగమ విషయము ప్రద్యుమ్నోదయములో ప్రవేశించినవి. శివ సమాగమం ఉత్తర హరివంశం నుంచి గ్రహింపబడింది.

ప్రద్యుమ్నోదయం రుక్మిణీ కళ్యాణగాథను గాని, ప్రద్యుమ్నుడి జననాదులను గాని మహావైభవంగా వర్ణనాదులతో చిత్రించడానికి ఉద్దేశింపబడిన కావ్యం కాదు. అందువల్లనే ఈ కావ్యంలో కథాకథనము సామాన్య ధోరణిలో సాగదు. తెలియని కథ చెప్పడంలో, తెలిసిన కథ చెప్పడంలో కథాకథన విధానము భేదించక తప్పదు. తెలియని కథ చెప్పటంలో కథను విస్తరిస్తూ కథా ప్రాధాన్యంతో కథనం సాగుతుంది తెలిసిన కథను చేప్పేటప్పుడు కథకు ప్రాధాన్యం ఉండదు.

రామాయణ కల్పవృక్షంలో సీతాదేవి ఆంజనేయుడు అప్పటి దాకా సాగిన రామాయణ పూర్వోత్తర కథలను పరస్పరం చెప్పుకున్న తీరు ఇందుకొక చిన్న ఉదాహరణ. కాగా ఇట్లాంటి సందర్భాల్లో కథ ఒక పరమార్థాన్ని నిరూపించ దానికి అనుభవంలోకి తీసుకురావడానికి అనుకూలమైన పద్ధతిలో సాగుతుంది. కథ ఏకేంద్ర బిందువు చుట్టూ తిరుగుతూ ఆ బిందువును అభివ్యక్తం చేస్తున్నది అనేదానిమీదనే ఆ కథనం యొక్క, ఆ కావ్యం యొక్క గొప్పతనము, ప్రత్యేకత నిరూపించబడుతుంది. అంతటి భాగవతములో రుక్మిణీ కళ్యాణ గాథ, ప్రద్యుమ్న గాథ ఆ విధంగా చిత్రించబడిన తర్వాత అవే అంశాలను ఆ ప్రణాళికతోనే రచించనవసరం లేదు. ఏ మహా కవి కూడా అట్లాంటి పని చేయడు. ఆ కథను ఒక మహార్థాన్ని వ్యంజింప చేయటంలోనే అతని మహాకవి లక్షణం వ్యక్తమవుతుంది. ఆ లక్షణాన్ని వ్యక్తీకరింపచేసే ఒక తాత్వికమైన పునాది గల కావ్యం ప్రద్యుమ్నోదయం.

శ్రీకృష్ణుడు అనగానే శ్రీమన్నారాయణుని అవతారమని అర్థమవుతూనే ఉంది. కృష్ణుడుగా అవతరించినప్పుడు "నారాయణుని యందు అనపాయిని" అయిన లక్ష్మీదేవి రుక్మిణిగా అవతరించింది అనేది కూడా నిరూఢమైన విషయం. ఇది పునాదిగా కావ్యము నిర్మించబడింది. ఈ అవతార మందును, సృష్టి వికాసంలో ఈ అవతారాదుల ప్రాధాన్యమేమిటి? నారాయణునితో అవిభాజ్యమైన శ్రీ స్వరూపమేమిటి? ఆమె యొక్క శక్తి లక్ష్యమేమిటి? ఈ సృష్టి క్రమాన్ని ఆగమములు ఏ విధంగా భావిస్తున్నాయి? ఆ భావన యొక్క స్వరూప మేమిటి? దాని ప్రయోజనమేమిటి? ఈ మొదలైనవి ప్రద్యుమ్నోదయ మహా కావ్యానికి మూలభూతమైన అంశాలు. వీటితో రచింపబడిన ఈ కావ్యం ఇతర కృష్ణకావ్యాల వలె భక్తి భావ చిత్రణకు గాని, భక్తి పారవశ్యానికిగాని సంబంధించినది కాదు. ఇది తత్త్వప్రధానమైన కావ్యము ఇది వస్తుప్రధానమైన కావ్యము. భక్తికి ఆశ్రయ భూతుడైన శ్రీమన్నారాయణుడు ఈ సృష్టిగా విస్తరించుకోవటం అన్నది ఇందులో ప్రధానమైన అంశము. ఈ అంశం వైష్ణవాగమమైన పాంచరాత్రాగమ నేపథ్యంతో చిత్రింపబడినది. శ్రీమన్నారాయణుడు సృష్టి స్థితిలయాదుల విషయంలో ప్రవర్తించే తీరు వ్యూహ పద్ధతిలో పాంచరాత్రాగమము చిత్రించింది. ఈ వ్యూహ నిర్మాణము ప్రద్యుమ్నోదయ కావ్యానికి కీలకాంశము. ఈ విధముగా తాత్త్విక మౌలికాంశాలు ఎన్ని ఉన్నా కథాకథనంలో సరస్వతీనదీవలె అంతర్వా

హీనులుగానే ఉండి ఉపరితల కథన ప్రవాహాన్ని మెరిపింప చేస్తుంటాయి. కాగా, ఈ కావ్యము రూపాన్నిబట్టికాక ప్రతిపాద్యమైన, చిత్రితమైన అంశాన్నిబట్టి ఒక మహా కావ్యమైనది. సృష్టినిర్మాణలక్షణం కల కావ్యం మహా కావ్యం కావటంలో అటంకపరిచేదేమీ ఉండదు కాగా ఈ కావ్యంలో ఈ అంశాలు చిత్రింప బడిన తీరు విశిష్టంగా గమనించదగినది.

## వస్తువిన్యాసం :

"శివశ్శక్త్యాయుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
న చే దేవం దేవో నఖలు కుశలః స్పందితుమపి
అతస్త్వా మారాధ్యం హరిహర విరించాది భిరపి
ప్రణం తుంస్తోతుంవా కథమకృత పుణ్యః ప్రభవతి" (సౌందర్యలహరి-1)

శంకర భగవత్పాదుల "సౌన్దర్య లహరి" ఈ పద్యంతో ఆరంభమవుతుంది. శక్తితో కూడుకొని ఉన్నప్పుడు ఈశ్వరుడు కార్య ప్రవృత్తుడౌతున్నాడనేది ఈ శ్లోక తాత్పర్యము. శ్రీస్తవములో కూడా —

"లోకేవనస్పతి బృహస్పతి తారతమ్యం
యస్యాః ప్రసారపరిణామ ముదాహరంతి
సాభారతీ భగవతీతు యదీయ దాసీ
తాం దేవ దేవ మహిషీం శ్రియ మాశ్రయామః
యస్యాః కటాక్ష మృదువీక్షణ దక్షణేన
సద్యః సముల్లసితపల్లవ ముల్లలాస
విశ్వం విపర్యయ సముత్థ విపర్యయం ప్రాక్
తాం దేవదేవ మహిషీం శ్రియ మాశ్రయామః" (శ్రీస్తవము-కూరనాథులు)

అంటూ శ్రీ కూరనాథులు శ్రీదేవి యొక్క వీక్షణాలను అనుసంధించి భగవంతుడు ఈ సృష్టిని సాగిస్తున్నాడు అని అంటాడు. సరిగ్గా ఇదే అంశంతో ప్రద్యుమ్నోదయం ఆరంభమవుతుంది. "వైకుంఠనాథు నిల్లాలు పయోధి కూతు రబలామణి రుక్మిణీ యనుమ" విదర్భ రాజుకు కుమార్తె స్థితిని పొందుతుంది. అప్పుడే "వైకుంఠపతి యాదవుడై చనుదెంచినాడు" అంటే, శక్తితో పాటుగా భగవంతుడు

అవతరిస్తున్నాడని తాత్పర్యము. ఈ సృష్ట్యాదినుండి విరోధి ప్రవృత్తి కూడా సాగివస్తూనే ఉంది. అందుకే 'కయ్యాలకునై విదర్భపతి యాత్మజుడై చను రుక్మి యున్" రుక్మిణి అన్నగా దగెను అని చెప్పబడింది. ఈ మూడంశాలను ఒకే వాక్యంలో సంధానించటం, వీటి మూలతత్త్వ ప్రాబల్యాన్ని సూచించటంగా భావించవచ్చు రుక్మి తన చెల్లెలైన రుక్మిణిని శిశుపాలుని కిచ్చి వివాహం చేస్తానన్నాడు. అంటే, శ్రీకృష్ణుని వివాహమాడవలసిన రుక్మిణిని అతనికి కాకుండా శిశుపాలుని పరం చేస్తానని అన్నాడు. అంటే, అవిభాజ్యమైన శ్రీ-శ్రియః పతులను విడదీయడానికి ప్రయత్నిస్తున్నాడన్న మాట! రామాయణంలో రావణుడు చేసింది కూడా ఇదే. రుక్మి చెప్పినంతలో రుక్మిణి తనకు లభిస్తుందని శిశుపాలుడు పొంగిపోయినాడు. ఈ శిశుపాలుడు ఎవడు? పూర్వం అంటే, రెండు జన్మలకు ముందు వైకుంఠములో జయ విజయులతో ఒకడనేది ప్రసిద్ధమైన గాథ. వైకుంఠములో అమ్మవారికి సేవకుడుగా ఉండిన శిశుపాలుడు తనకు శాపవశాత్తుగా కలిగిన రాక్షసత్వంవల్ల తల్లిని గుర్తించలేకపోయినాడు. ఈ శిశుపాలుడు పూర్వజన్మలో రావణుడు. ఆ రావణుడు, ఈ శిశుపాలుడు ఉద్దేశించిన విషయం ఒక్కటే. శ్రీ శక్తిని శ్రీమన్నారాయణుని నుండి విడగొట్టి తన స్వాధీనం చేసుకోవటం. అయితే, రావణునికన్న శిశుపాలుడు కొంత నయమని పిస్తుంది. సీతారామచంద్రులకు వివాహమయిన తర్వాత సీతను అపహరించుకొని పోయినవాడు రావణుడు. రుక్మిణీ కృష్ణులకు వివాహం కాకముందు, రుక్మిణిని వివాహమాడదలచినవాడు శిశుపాలుడు. సందర్భాలలో ఉన్నది దైత్య భావమే. కాని, అక్కడికన్న ఇక్కడ కొంత పలుచబడింది. ఇది జయ విజయులకు సంబంధించిన చివరిజన్మ. రావణునిలోని ప్రవృత్తి రుక్మి - శిశుపాలుడుగా విభజింపబడినట్లుగా ఈ కావ్యంలో చిత్రించబడింది. రావణునికి అంతరాంతరాలలో శ్రీరామచంద్రుడు - సీతకు సంబంధించిన యదార్థభావన రుక్మిలో ఉన్నది. రావణునిలోని ఈ భాగం రుక్మి. కాగా, ఇక్కడ రుక్మి శిశుపాలుడు ఒకవైపు, రుక్మిణీ కృష్ణులు మరొకవైపుగా గుర్తించవచ్చు. రుక్మి తన చెల్లెలిని శిశుపాలునకిచ్చి వివాహం చేస్తానన్నాడు కాని, శిశుపాలుని వివాహమాడటం రుక్మిణికి ఇష్టమా - కాదా అనేది తెలుసుకోవాలనుకోలేదు. ఇట్లాంటి '...... వారికిన్ గోమలు లుర్వి జంపువుకున్ జడ యార్థులు భోగవస్తువుల్" (1.4) మాత్రమే. ఇది పశులక్షణం.

రుక్మిణికి తాను పరమేశ్వరుని కోసమే జన్మించినట్లు క్రమంగా స్పష్ట పడుతుంది. భాగవతములో పోతనగారి రుక్మిణీదేవి శ్రీకృష్ణునికి పంపిన సందేశము—

"ప్రాణేశ! నీ మంజు భాషలు వినలేని
కర్ణ రంధ్రంబుల కలిమి యేల
పురుషరత్నమ! నీవు భోగింపగాలేని
తనుల వలని సౌందర్యమేల
భువనమోహన! నిన్నుఁ బొడగానగాలేని
చక్షురింద్రియముల సత్వమేల
దయిత! నీ యధరామృతంబానఁగా లేని
జిహ్వకు ఫలరససిద్ధియేల
నీరజాతనయన! నీ వనమాలికా
గంధ మబ్బలేని ఘ్రాణమేల
ధన్యచరిత! నీకు దాస్యంబు సేయని
జన్మమేల యెన్ని జన్మములకు?"

ఈ పద్యంలో శ్రీకృష్ణ సేవలోనే తన పంచేంద్రియాలకు ధన్యత ఉందని రుక్మిణి భావించినట్లు స్పష్టపడుతుంది. ప్రద్యుమ్నోదయంలో ఈ విధంగా ఉంది—

"కొన్నాళ్ళు తానెందుకు ధరిత్రి కరుదెంచె
మఱచిపోయినయట్లు మసలె బిడ్డ
మఱియు గొన్నాళ్ళకు గుఱుతు వచ్చుచునున్న
యట్లుగా దిరుగాడెనంత బాల
ఇంక గొన్నాళ్ళకు నెందుకు వచ్చెనో
తెలిసినయట్లుగాఁ దిరిగె యువతి
ఆపైన దనవచ్చినట్టి కార్యమునెట్లు
పొసఁగించుటో తలపోయు దేవి

ఈమె యొక భక్తురాలో మరెవ్వరైన
దేవతయొ యన్న యట్లుగా చిరుగుం చల్లి
నవ్వునాయమ యెచ్చటో నవ్వినట్లు
బిగియునాయమ యిచ్చట బిగిసినట్లు."

ఇందులో రుక్మిణీదేవి తన అవతార ప్రయోజనాన్ని క్రమక్రమంగా వయసును బట్టి స్పష్టపరచుకున్నట్లు తెలుస్తుంది. బిడ్డ, బాల, యువతి, దేవి అన్న మాటలు ఆమె వయస్సులోనూ, మనస్సులోనూ క్రమవికాసాన్ని తెలియ చేస్తాయి. ఆమె భక్తురాలో, దేవతయో అనడంవల్ల భగవంతుడికి శక్తి రూపమైన శ్రీదేవి శేష భూతురాలు అవటంతోపాటు నియామకురాలు అను విషయం కూడా స్పష్టపడుతుంది.

రుక్మిణీదేవి అగ్నిద్యోతనుడితో శ్రీకృష్ణునికి సందేశం పంపిస్తూ—

"ఇదియును వానికోసమయి యెత్తిన జన్మయటంచు నాకు నా
యెదననిపించునాతనికి నీయనిపించుట యేమిగుర్తు...."

అని అంటుంది. పరమేశ్వరుడు ఏ కార్యం కొరకు అవతరించాడో, ఆ కార్యము సాగటానికి శక్తిస్వరూపిణియైన దేవి అవసరము. అందుకే వానికోసమై - వాని పనికోసమయి - అని రుక్మిణి అంటుంది. అంతేగాదు".... అతడు లేకుండ నే లేనయతడు లేడ యేను లేకుండ ననిపించు .." (2-16) అని కూడా అంటుంది. శక్తి, శక్తిమంతులకు విడిబాటుగాని, భేదం కాని ఉండదు. ఉన్నట్లు అనిపించడం కేవలం ఆభాస మాత్రమే. అగ్నిప్రవేశానికిముందు సీత రామచంద్రునితో ఆయన అన్న మాటలన్నిటికిని సమాధానము చెప్పుతూ—

"ఆడది యింత సేయుననుటన్నదియున్నదెయంచు నన్ను మా
టాడితి, కైకకోరక మహాప్రభు! నీవని రాకలేదు, నీ
యాడది సీతకోరక మహాసుర సంహారణంబు లేద, యా
యాడది లేక లేద జగ మంచు, నిరంతయు నేన చేసితిన్"5

అని అంటుంది. మహాసుర సంహారమనే ఉద్దిష్టకార్యం సీత తోడ్పాటులేకుండా అయ్యేదికాదు. ఈ లోకము ఆడది లేకుండా లేదు. ఇదంతా నేనే చేసినానంటుంది సీత. ఇక్కడ "ఆడది" - లేదా "స్త్రీ" శక్తిస్వరూపిణిగా సమస్త నిర్వహణకు మూల బీజమయ్యిందని తాత్పర్యము. చివరకు—

"ఇరువురము నొక్క వెలుఁగున
జెలుసగమును దీనినెఱుఁగు శివుఁడొకరుండే
పురుషుఁడ నీవై తివి నే
గరితనుగానైతిఁ బ్రాణకాంతా! మఱియున్."

అంటుంది. అంటే, ఒక వెల్గు యొక్క ఉభయ పార్శ్వాలు శక్తి, పరమేశ్వరులని అర్థం. ఒకరు లేకుండా ఒకరుండటం అనేది అసంభావ్యమైన అంశము. రుక్మిణీ మాటలలో కూడా ఈ విధమైన అర్థమే స్ఫురిస్తుంది. చెప్పవలసిన సందేశమంతా చెప్పి చివరకు—

"ఏయగ్ని ప్రకాశించునా నీయగ్నిద్యోతనాఖ్యనెగడుట కొరకై
ఆ యగ్నిని బహిరగ్నిని జేయకువేయాంతరాగ్ని చేయుము దయతో
ఒక్కటి విను రాచపడుచు చిక్కని లజ్జను త్యజింప జేసెను దొరయై
చిక్కని లజ్జను దొలచుటయొక్కటి కావలయు వానికుక్కి వుడగుచున్."
(2.17)

అని అంటుంది. అగ్ని ప్రకాశించడం ప్రసక్తి ఇక్కడ ఏమిటి? అగ్నిద్యోతను డన్న పేరు సార్థకం కావడం కొరకు. ఏ అగ్ని ప్రకాశిస్తుందో ఆ అగ్ని అంతర మైనది. దాన్ని బహిరగ్నిగా చేయవద్దు, అంతరాగ్నిగానే ఉంచవలసిందని తాత్పర్యము. అగ్నిద్యోతనుడు అంటే అగ్నిని ఉద్దీపింపచేయువాడు, ప్రకాశింప చేయువాడని అర్థము. తాను చెప్పిన విద్యద్వారా రుక్మిణిలో విద్యాభ్యాస సంద ర్భాన పరమార్థ జ్ఞానం కలిగించి, ఆమెలోని ఒక అగ్నిని రగల్చినాడు ఈ అగ్నిద్యోతనుడు. శిశుపాలునితో తన చెల్లెలునుగూర్చి చెప్పుతూ- "తెలివి గలట్టి బాల, కులదీపము రుక్మిణి, యామె నెల్ల విద్యలు చదివించినాము, పరమార్థమెఱింగిన పిల్ల.... (1.24) అంటాడు. ఆ పరమార్థ జ్ఞానం "నిరపాయం బగు బుద్ధి కల్గిన...." (1.25) అగ్నిద్యోతనునివల్ల జరిగింది. ఇప్పుడు రుక్మిణీ సందేశంద్వారా కృష్ణునిలో అగ్నిని ఉద్దీపింపచేయబోతున్నాడు. అందువల్ల ఈ గురువుగారు - విద్యాదేశికుడు, సార్థకనాముడు. ఇక్కడ రుక్మిణి మాటలలో అంతరాగ్నిని బహిరాగ్నిగా చేయవద్దనగా శ్రీకృష్ణుడితో వివాహము జరుగకపోతే తనకు అగ్నియే శరణ్యం - అగ్నిలోపడి దేహత్యాగం చేస్తుందని సాధారణంగా తెలుస్తునే ఉంది. కాని, ఇక్కడ మరొక అంశము కూడా స్ఫురిస్తుంది. సతీదేవి

దక్షుని యజ్ఞవేదికమీద అంతరాగ్నితో తన దేహమును భస్మము చేసుకున్నది. సీతాదేవికూడా ఆ విధముగానే చేసుకోగలనని రామాయణంలో అన్నది. ఇక్కడ రుక్మిణి కూడా దాదాపుగా అదే మాట అంటున్నది ఈ మూడు సందర్భాల లోనూ కన్పించే ముగ్గురు వ్యక్తులు శక్తిస్వరూపాలే.

మరొకటి-తంత్ర శాస్త్రములో షట్చక్రములను గూర్చి అనేక విషయాలు చెప్పబడ్డవి. షట్చక్రాలలో స్వాధిష్ఠాన చక్రం రెండవది. ఇది రుద్ర గ్రంధి స్థానము. మరొక విధంగా చెప్పితే అగ్నిస్థానము. స్వాధిష్ఠానచక్రము అగ్ని తత్వాత్మికమైనదిగా చెప్పబడుతున్నది. ఆ అగ్నియొక్క తీవ్రతవల్ల అధోముఖ మైన సుషమ్న ఊర్ధ్వముఖముగా సహస్రారంవైపు ప్రయాణిస్తుందని చెప్పబడు తున్నది. రుక్మిణి మాటలలోని అంతరాగ్ని ఈ విషయాన్ని స్ఫురింపచేయడమే కాకుండా, అంతరాగ్ని విద్యారూపమైన ఒక యోగ విధానాన్ని కూడా వ్యంజి స్తున్నది.

అగ్నిద్యోతనుడు కృష్ణునితో రుక్మిణీదేవిని గూర్చి చెప్తూ—

"తోరముగాగ నైధృతిమతుల్ నవరించిన మూర్తి యామెతా
హ్రీరమణీయు, మాపనిది, శ్రీరమణీయ, లతాంగి...." (2.33)

అని అంటాడు. ఇక్కడ రుక్మిణీదేవి యొక్క రూప సౌందర్య విషయమట్లా ఉంచి, ఆమె శ్రీ శక్తి స్వరూపిణి అని సూచింపబడినది. హ్రీ, శ్రీ అనేవి లక్ష్మి దేవికి సంబంధించిన బీజాక్షరాలు. రెండూ ఇక్కడ చెప్పబడ్డాయి అట్లాగే— "ఆయమ చంద్రమండలము నందలి వెన్నెల యూట బావి............"(2.35), "........ఆమె భ్రూవల్లిక మధ్యనుండి మెయివారును ఫాలము వంద చంద్రులై" (2-36) అనికూడా అగ్నిద్యోతనుడు అంటాడు. ఈ అనటంలోని చంద్రప్రసక్తి సహస్రార చక్రగతమైన దేవిని స్ఫురింపచేస్తుంది. ఇంతటితో ఆగకుండా అగ్ని ద్యోతనుడు "........దేవళమునంజని చూడుము కొండకూతుః మాన్మారమణాత్మ జాత సరిగా నటులుండున...." (2.39) అని చెప్పడంలో రుక్మిణి పరమేశ్వరి అని స్పష్టపరుస్తాడు. ఇది కేవలం అగ్నిద్యోతనుడు కృష్ణునికి చెప్పిన మాట మాత్రమే కాదు. మొదటినుండికూడా రుక్మిణిని గూర్చి అగ్నిద్యోతనుడు ఈ అంశం చెప్తూనే ఉన్నాడు. రుక్మి శిశుపాలునితో "....రుక్మిణింజెప్పః బ్రజ్ఞా

నిరాకరుఁడైన బ్రాహ్మణుఁడు సాక్షాల్లక్ష్మి యంచు....'' (1-26) అని అంటాడు. రుక్మిణీ లక్ష్మి యొక్క అవతారమనేది అగ్నిద్యోతనునికి అనుభవంలోని విషయం. అందుకే తనకు వేదము, పురాణము, రామాయణము మొదలైనవి చదువుతున్నప్పుడు ''....మధురార్థవిశిష్ట సమాస తద్ధితల్ మాయురెయర్థపుష్టి యును, మాధురినెంచిన నామెరూపమే... ...." (2-41) తనకు స్ఫురిస్తుందని కృష్ణుడితో అంటాడు. "సమాస తద్ధితాకారాయై నమః, విభక్తి వచనాత్మికాయై నమః" మొదలైనవి లక్ష్మి సహస్ర నామస్తోత్రంలోని నామాలు. ఈ అంశాలన్నీ అనేక ముఖాలుగా రుక్మిణీదేవి యొక్క అవతార లక్షణాన్ని వ్యక్తీకరిస్తున్నాయి. అగ్నిద్యోతనుడు కృష్ణునితో చెప్పవలసినదంతా చెప్పి, ఒక సాలగ్రామము శ్రీకృష్ణ దేవుని చేతిలో పెట్టి దానిని దేవతార్చనలో పెట్టుకోవలసినదని అంటాడు. అది శివునికి సంబంధించిన సాలగ్రామము.

"....లక్షణంబులు పరీక్ష యొనర్చితి గామదోగ్ధయై
జాయి, పురాతనంబయినరాపిడి చేయడులోననున్న గాం
గేయపువన్నె చూడుములగించిన క్రొమ్ముడి చిన్నెపోల్చెడుం
బోయతికాడు హైమగిరి పుత్రిమగండు ..."

అని అంటాడు. (2-49) అగ్నిద్యోతనుడు చెప్పినదంతా విని శ్రీకృష్ణుడు "నిద్రాముద్రితమైన నా యెడద నగ్నిన్ మేలుకొల్పంగ స్వాహా ద్రవ్యంబును నీవు కూర్చితివయా...." (2-54) అని అంటాడు. అప్పటివరకు యోగనిద్రలో నున్న పరమేశ్వరుడు శక్త్యుద్బోధము పొందటాన్ని ఈ మాటలు స్ఫురింప చేస్తాయి.

ఈ కృష్ణుడు రుక్మిణీదేవిని లభించుకోవటానకి కుండినపురం వెళ్ళుతాడు. అక్కడ రుక్మిణీదేవి దేవాలయానికి వెళ్ళి గౌరీ పూజ చేసి –

"మేలితపంబుచే ననుగమింతువు భర్తను నీవు మేము క
య్యాలును రాయబారములు నారటముల్ వయినంగలార్చుటల్
నీలసరోరుహాభకమనీయ శరీరపు గానితచ్ఛవి
శ్రీలగు నందమైన నునుజెక్కుల తుమ్మెదతోడి పొత్తుగా ''

"ప్రీలనిమిన్నుజుట్టు ముడివేసిన తెల్లని వెల్లుగుండియన్
వ్రాలిన బిడ్డనేనసితవల్లిక నీవును పూచినట్లుగా
దేలవలీలతాళమగుదేహపుఁ జేటినినున్ వరింపగా
శీ! లలితాసితచ్ఛ విశిలీముఖమేను వ:ంచితిన్ శివా!"

అని ప్రార్థిస్తుంది. కాళీదేవి నల్లనిది - శివుడు తెల్లనివాడు. అందుకనే "నీలసరోరుహాళి కమనీయశరీర...." అయిన కాళిక "సితచ్ఛవిశ్రీల" తుమ్మెద పొత్తును పొందినది. మరి తాను "లలితాసితచ్ఛవి శిలీముఖమును" కోరింది. అక్కడ తెల్ల తుమ్మెద శివుడు కాగా, ఇక్కడ నల్లని తుమ్మెద కృష్ణుడు కృష్ణుని లలితాదేవి యొక్క అపరావతారముగా భావించబడుతున్నది. పద్యంలో "లలితా" పదం ఈ అంశాన్ని స్ఫురింపచేస్తుంది. "బాణత్వం వృషభత్వ.... భార్యాత్వ, మార్యావతేః" అని శివానందలహరిలో చెప్పబడింది. ఇక్కడ కాళికా దేవికి కృష్ణునికి అభేద భావం స్ఫురిస్తుంది.

రుక్మిణిని తన చేతులతో ఎత్తుకొని రథంమీదికి తెచ్చుకున్న తర్వాత తన నెదిరించిన రుక్మితో కృష్ణుడు—

"ఈ దరహాసముగ్ధ మదురేక్షణ నేనును గెల్చికోను రా
లేదిది మున్నె నా హృదయలీన మహోమదురేఖ శస్త్రసం
పాదన చేయఁగాఁదగిన వస్తువు కాదిది సిద్ధమూర్తి యీ
పైదలి నేన మామెయును పైదలినేనును నిత్యమూర్తులై"

అని అంటాడు. ఆమె నిప్పుడు తాను క్రొత్తగా తీసుకుపోతున్నదేమీ లేదు. తన లోనే ఆమె ఉన్నది. ఆమె సిద్ధమూర్తి. తామిద్దరు నిత్యమూర్తులు అని ఆమెకు, తనకు గల అభేద భావాన్ని వ్యక్తీకరిస్తాడు. రామాయణ కల్పవృక్షములో రావణుడు రామచంద్రుని చేతిలో మరణించబోతూ—

"ఇతనికి దేవికిం దనరునింతటి భేదము, స్యూతభావనా
తతముగ దేవియే యితడు తానగు, నన్ను వధింప బ్రహ్మసం
గతమగు దీప్తికాఁదొలి వికారము నందలి తేజమౌచు, స
చ్యుతుఁడును దానుదేవియు త్రిశూలియు నందఱునైన చోటునన్"6

అనుకుంటాడు. దేవి, విష్ణువు, ఆయన అవతారాలు, శివుడు - వీరందరూ తొలి తేజము యొక్క వికారములు - మారు రూపములు.7

రుక్మి శిశుపాలుర సైన్యము చుట్టుముట్టగానే కృష్ణుని రథాశ్వముల నాసా గోళముల నుండి అగ్ని చెలరేగుతుంది. రథచక్రములు మహాకాశ గోళముల పోలిక మండగా అగ్ని విజృంభిస్తుంది. ఈ అగ్ని రుక్మిణీ కృష్ణులు అధిష్ఠించిన రథానికి ఒక ఆవరణగా ఏర్పడుతుంది. ఆ అగ్నికి తట్టుకోలేక సైన్యం పారి పోతుంది. శిశుపాలుడు కూడా వెనుకకు పారిపోతాడు. అప్పుడు—

"చెల్లెలినేమి వాడు వలచెన్ శిశుపాలుడి తండుగాని సం
ఫుల్ల సరోజలోచనుఁడు ముగ్ధమనోహర నీలమేఘ సం
పల్లవితాంగుడున్ వలచె బాలికనుం దన ప్రాణమన్నటుల్
కల్లయుఁగాద చెల్లెలు సుఖంపదు; దృప్తి వహించె రుక్మియున్."(3.37)

అయితే తాను కూడా వెనుకకు వెళ్ళిపోతే కృష్ణునికి భయపడి పారిపోయి నాడని ఎవరైనా అనుకుంటారేమోనని పంటి బిగువుతో కృష్ణుని ఎదిరించి తూల నాడుతాడు. రుక్మిణి ఆవరణగా ఉన్న అగ్నిని ఆర్పుమని కృష్ణుని కోరుతుంది. అగ్ని ఆరిపోతుంది. ఈ ఘట్టమంతా అగ్ని ప్రాధాన్యంతో సాగటం గమనించ దగినది. శివుని కంటి మంటలో దగ్ధుడైన మన్మథుని పునరుజ్జీవితుని చేయటమే ప్రద్యుమ్నోదయంలోని కీలకాంశం. అందువల్ల రుక్మిణీ కళ్యాణగాథ అగ్ని ద్యోతనుడు మొదలుగాగల అగ్ని ప్రాధాన్యంతో సాగింది.

భాగవతంలోని రుక్మిణి పాత్ర చిత్రణకు, ప్రద్యుమ్నోదయంలోని చిత్రణకు తేడా కన్పిస్తుంది. భాగవతంలోని రుక్మివలె ప్రద్యుమ్నోదయంలోని రుక్మి కరుడుగట్టిన అసురలక్షణం కలవాడు కాదు. రుక్మికి, రుక్మిణికి కూడా అగ్నిద్యోతనుడే విద్యాగురువు. రుక్మిలో అసురలక్షణం ఒక పొరగా మాత్రమే ఉంటుంది. అతనికి అంతరాంతరాల్లో కృష్ణుని గూర్చిన దివ్యభావన కదులుతూనే ఉంటుంది. "నా చెల్లెలు నిన్నెఱింగిన విశేషములన్నియు నేను నేర్తును...." (3.51) అని అంటాడు అయితే యుద్ధంలో తనతో కలపడిన రుక్మిని బంధించి కృష్ణుడు అతని శిరోముండనము చేస్తాడు. ఈ శిరోముండనము సామాన్యమైన అవమానము కాదు ప్రాణములు తీసిన దానికన్న ఇది ఎక్కువ. దీనితో రుక్మి అవమానము భరించలేక పొడుచుకొని చావనైన చావవలసి ఉంటుంది. అయితే, ఇక్కడ రుక్మి చచ్చిపోలేదు. అందువల్ల సామాన్య ధోరణిలో అతనిని అభిమాన

గానుడని అనవలసి ఉంటుంది. అయితే, ఆతనిలోని దురభిమానము, పరమేశ్వ రానుగ్రహము వల్ల తొలగిపోవడానికి, అసురమైన పౌర విచ్ఛిన్నము కావడానికి ఈ వపనము ఒక సూచన. ఈ సందర్భములో వపనము చేసి శ్రీకృష్ణుడు—

"ఇపుడు నీవెఱుఁగదో యట్లుంటివో యన్న
నిపుడు నీవెట్లుంటి వెఱుఁగుదె యనె
బ్రాహ్మణుఁడనగఁ గన్పడెద నీవనఁగ మం
గలివోలె నీవును గన్పడుదనె
భద్రనేర్తువె శతరుద్రీయ మన్నను
అంతకు మించి నీవధికుఁడ వనె
నీ చెల్లెలగు స్త్రీకి నే భర్త ననినంత
శిశుపాలుఁ డంతకుఁ జెడియె ననియె
నీదు ప్రాణముల్ నే తీయలేద యనిన
నిదియు నంతకు మించినదే యఁటనియె
కడఁగి నిన్నని నే సిగ్గుపడెద ననఁగ
పోయె నా సిగ్గదెప్పుడో పోయె ననియె." (3-49)

ఇక్కడ శత రుద్రీయం ప్రస్తావన ప్రత్యేకంగా గమనించదగినది. "శత రుద్రీయమందు భగవంతుడు సర్వవృత్తులు కలవాడుగా చెప్పబడెను."శిమంగలిగా చెప్పబడలేదు. ఇది కూడా ఒక వృత్తియే. ఆ వృత్తి చెప్పబడకపోవడం వల్ల భగద్విషయంలో అది ఒక లోపమున్నట్లుగా భావించవచ్చు. ఆ లోపం ఈ రుక్మి కారణంగా తీరిపోయింది. ఆ తరువాత రుక్మి సిగ్గు మాట మరచిపోయి యోగి వోలె వెళ్ళిపోతాడు, "హరి కుటుంబి వోలె నరుదెంచె నరదంబు కడకు నూత్న లక్ష్మిగత హృదయుడు" (3-52). భక్తుడు! యోగి! సంసారాన్ని వదలించుకొని ముక్తుడు కాగా, పరమేశ్వరుడు సంసారాన్ని అనుగ్రహించడం కొరకు కుటుంబి అయినాడు. రుక్మిణి దగ్గరకు వచ్చిన కృష్ణుడు—

"నీ విట్లుందు వటంచు గుర్తుగను నగ్నిద్యోతనుండాడెఁగా
నీ వేణీకృతనీలపన్నగమణీ నిన్నేను గుర్తించ తే
నా వేమారులు స్వప్నమందుఁగని యన్నన్ దేవి యిట్లాడె ని
ద్రావస్థంగనువారికుండునది స్వప్నావస్థ యాత్మేశ్వరా!" (3-56)

అంటుంది. అంటే పరమేశ్వరుడు సృష్టివేళ నిత్యజాగృతుడు అని తాత్పర్యము.

రుక్మిణి పూర్వము అగ్నిద్యోతనుడితో సందేశము పంపుతూ శ్రీకృష్ణుడు తనను గుర్తించడానికి, 'చేతిలో గురుతుగ జేతి తమ్మిపువు కోపుగ మింటికి నెత్తియుంచెదన్" (2.15) అని చెప్పమంటుంది. అగ్నిద్యోతనుడు ఈ విష యాన్ని కృష్ణునికి చెప్పుతూ "లజ్జన్నపాత్మ జాతముద్రలన్ మరి వంచుక యుండు గుర్తుగా హృజ్జల జాతమట్లు గనునెత్తిన చేజలజాతముండెడిన్...." (2.45) అంటాడు. ఇక్కడ రుక్మిణి పద్మాన్ని ఎత్తి పట్టుకోవటం, హృజ్జల జాతం అనటం ఈ మొదలైనవన్నీ రుక్మిణి యొక్క పద్మ సంబంధాన్ని స్ఫురింప చేస్తున్నాయి. కాని, ఈశ్వరునికి ఈ గుర్తులేమీ అక్కరలేదు. నిత్య భావనా మగ్నుడై ఏ ఇతరమైన గుర్తులు లేకుండానే పరమేశ్వరిని గుర్తించగలడు. జరిగింది కూడా అంతే.

దేవళము నుంచి తిరిగివస్తున్న రుక్మిణిని చూసి, వస్తున్నది రుక్మిణి కాక గౌరీదేవియే అని చూచినవారనుకున్నట్లు కృష్ణుడు రుక్మిణితో అంటాడు. అప్పుడు రుక్మిణీదేవి తాను గౌరిదేవిని ప్రార్థించినానని, ఆమె తన వెంట వచ్చిందని అనగా "తన దేహంబును నీదు దేహమున సంధానించె నగ్గౌరి, పావన మీ దేహము దీని నే నెటుల సంస్పర్శింతు......."(3.58) నని కృష్ణుడంటాడు. దానికి సమా ధానముగా రుక్మిణి ఆ దేవి యొక్క "........ కనువెల్గుల్ననుఁజొచ్చె మంచుమల చొక్కాటంపుగూతుంగనుంగొనలన్ మన్మథమన్మథంబులగు వెల్గుల్ నిచ్చలుం బుట్టునాన్" (3.58) అని అంటుంది. రామాయణ కల్పవృక్షములో అకంపనుడు సీతాదేవిని గూర్చి రావణునికి చెప్పుతూ—

"అమ్మ దురావలోకనములద్భుతమయ్యెడు సీతలోచనాం
తమ్ములుసాగినంతన శతప్రమితుల్ మధురేక్షుచాప ఖం
డమ్ములవారు రత్నమకుటంబులవారు జగద్విలోలనా
స్యమ్ములవారునుం బ్రభవమందెరంబుదనీలరోచిషుల్"9

అంటాడు. అమ్మవారి కళ్ళలో నుంచి వందలకొలది మన్మథులు ఉదయిస్తున్నారు. ఇక్కడ రుక్మిణి మాటలలో ఆ అంశము కూడా స్ఫురిస్తున్నది. ఈ కావ్యం మన్మథుడు అమ్మవారి అనుగ్రహంతో ప్రద్యుమ్నుడుగా పునరుజ్జీవితుడు కావటం కీలకాంశం. దీనికి ఈ మాటలు స్ఫోరకాలు. ఇట్లా అన్న రుక్మిణితో—

"అంబుజమూర్తి దేవి పతియంబుజముందున నీవు పుట్టితౌ
నంబుజవైరి సోదరుఁడు నంబుజలోచనుఁ డేను నిట్లుగా
నంబుజ సాయకుం డుదయమందుట నిక్కము కల్లునన్న నీ
లాంబుదవేణి శౌరియెదయందున శీర్షము మోపె మోపుగా" (3-59)

అని అంటాడు.

ఈ విధముగా రుక్మిణి కళ్యాణ గాథ మూడవ అశ్వాసంతో పూర్తి అవుతుంది. ఈ గాథ యింతగా విస్తరించటానికి మూలమైన ప్రద్యుమ్నగాథ నాల్గవ అశ్వాసం నుంచి ఆరంభమవుతుంది.

రుక్మిణితో కృష్ణుడు "నేనెటుల స్పృశింతు" నంటాడు గదా! మరి ప్రద్యుమ్నోదయం ఈ స్పర్శ లేకుండా జరుగటమెట్లా? అందుకే తరువాతి కథలో శివుడు అనుగ్రహించటం అనే అంశం ప్రాధాన్యం పొందింది. శివాశివుల అనుగ్రహం ప్రద్యుమ్నుడు.

ఈ కావ్యములోని రుక్మిణీ కళ్యాణ గాథకు భాగవతంలో ఉన్నంత సంబంధము, ప్రద్యుమ్నునిగాథకు లేదు. ఈ విషయం ఇదివరకే ఈ కావ్యం లోని స్థూల పరిచయంలో చెప్పబడింది. శివుని కంటిమంటకు మన్మథుడు భస్మమై పోయిన తర్వాత దుఃఖిస్తున్న రతీదేవి పార్వతీదేవి సాంత్వనముతో తేరుకొని భర్త బూడిదను మూటగట్టుకొని రుక్మిణి జన్మించేదాకా ఆగి రుక్మిణీ కళ్యాణం తర్వాత ఆమె దగ్గరకు వచ్చి తన గోడు వెళ్ళబోసుకోవడం, రుక్మిణి కృష్ణునికి మన్మథుడు పునర్జన్మ పొందవలసిన అంశాన్ని సూచించడం, కృష్ణుడు తద్భావనా యత్తుడై ఒక కల కనటం చిత్రించబడినది. ఈ కల సంకల్పసృష్టికి మూల బీజము. ఆ కలలో మన్మథుడు శ్రీకృష్ణునితో తనను పునరుజ్జీవితుని చేయించ మని కోరుతాడు. ఆ కలలోనే—

"అంతటఁ బుష్పబాణునకు నందు శయించిన స్వామియందునన్
వింతగఁ దోచె నాల్గయిన వెల్గులు మూఁడవవెల్గు తానుగాన్
ప్రాంతమునందుఁ గృష్ణ బలరాములు నాల్గవవెల్గు చాలదు
ర్దాంతము నడ్డగింపఁ బడరానిదిగాఁ గనిపించె నంతటన్."

"నెఱిఁ బండ్రెండగు చక్రముల్ తిరుగుచుండెన్ మూఁడు మూడౌచు న
ల్గురిపైఁ దానయి పొల్చుచుండిన వెలుంగుంబూని తేవెన్నెలన్
తిరుగున్ శారదికంపు క్రొన్నిశల సందీప్తిన్ మఱిం బుప్పొడుల్
జరుగున్ సన్నని మంచుబిందులుగ నాశల్ గుమ్మడుల్ పూచెనాన్."

తననుండి మనస్సుదయిం
చునా మఱి తానే మనఃప్రసూతియొ మఱియుం
దనలేని మనస్సుండద
మనసని లేకట్టి జీవిమండలి లేదున్.

ఈ విశ్వంబున నంతటన్ మనసు తానేయై మహాధర్మ బో
ధావిర్భావము తాన చేయునదియై ఆ పొల్చు షాడ్గుణ్యమూ
ర్త్యావిర్భావమునుండి వెల్గులివి మూఁడై వచ్చి యందే చొరం
గా విశ్వంబిది సాగుచున్నది యనంగాఁ దోచె నాకిక్కంతలో."

ఒక దానినుండి యొక్కడు
వికసించెడు నాలుగవది వెల్గును తనను
డి కలుగు ధారా రూపం
బొకయంతయు లేని యట్టు లొప్పుచునుండెన్." (4.46 నుండి 50)

మన్మథునికి శయనించిన కృష్ణునిలో నాల్గు వెల్గులు కన్పించడం మొదలయిన ఈ అంశాలు పాంచరాత్రాగమానికి సంబంధించినవి. ఈ అంశాలను సత్యనారాయణగారు ఈ కావ్య టిప్పణిలో ఈ విధముగా వివరించినారుః

## చతుర్వ్యూహములు :

"శ్రీకృష్ణునియందు మన్మథుడు నాల్గు వెల్గులను చూచినాడు. మూడవ వెల్గు తాను, ఇచ్చటనుండి విశిష్టాద్వైత మతములోనున్న కొన్ని విషయములు అనుసంధించుకొనవలయును. విశిష్టాద్వైతమునకు యతీంద్ర మతమని ఇంకొక పేరు. ఆ మతమునందు ఈశ్వరుడు అయిదు విధములుగా నుండును.

"పంచధావస్థితః ఈశ్వరః - విభ్వంతర్యామ్యర్చావతార భేదాత్"

పరః ఏకధా.

వ్యూహచతుర్థా - వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధ భేదాత్" వ్యూహములు నాల్గు భేదములు - వాసుదేవ వ్యూహము, సంకర్షణ వ్యూహము, ప్రద్యుమ్న వ్యూహము; అనిరుద్ధ వ్యూహమునని ఈ వ్యూహ సిద్ధాంతము పాంచరాత్రాగమమున ప్రధాన వ్యూహమైనవి. ఈ వ్యూహము లొకదానినుండి యొకటి పుట్టుచున్నవి. పాంచరాత్రాగమము ననుసరించి ఒక జ్యోతినుండి యింకొక జ్యోతి పుట్టినట్లుగా నివి పుట్టుచున్నవి. వ్యూహ శబ్దము "ఉహ్" ధాతువునుండి పుట్టినది. "వి" ఉపసర్గ. "ఉహ్" అనగా ముందునకు త్రోయుట. ఈ ముందునకు త్రోయుట యెట్టిదనగా, ఆరు గుణములు మూడు జంటలుగా వెలికి వచ్చినవని వారు చెప్పుదురు. నాల్గు వ్యూహములు పరమేశ్వరుని యాఱు గుణములచేత నిండియున్నను తక్కిన మూడు వ్యూహములయందు ననగా సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధ వ్యూహములందు రెండు రెండు గుణములు ప్రాధాన్యము వహించి యుండునని చెప్పబడుచున్నది. ఇదికాక ప్రతి వ్యూహము భగవత్తేజస్సమన్వితమైయుండును. ఇటు లౌకికమైయుండును. నైతికమైయుండును. ఈ సందర్భమున శ్రీమద్రామానుజులవారు కొంత విశేషమును కల్పించిరి. వారి ప్రకారము సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధ వ్యూహములు జీవులను పాలించును. వారి జీవలక్షణమును పాలించును. సంకర్షణుడు ప్రధానముగా జీవుడు ప్రద్యుమ్నుడు మనస్సు, అనిరుద్ధు డహంకారము.

వాసుదేవ వ్యూహము సర్వాధికమైనది. ఆ వ్యూహమునందు షడ్గుణములు నున్నవి. జ్ఞానైశ్వర్య శక్తి బలవీర్య తేజస్సులు. భగవంతుని షాడ్గుణ్య విగ్రహు డందురు.

సంకర్షణుడు లయకారకుడు. వేదము లాయన నుండి యావిర్భవించినవి. ప్రద్యుమ్నుడు సృష్టికర్త. ఆయనవలననే ధర్మములు ప్రవచింపబడుచున్నవి. అనిరుద్ధుడు అహంకారమూర్తి. అనగా అహంకార ప్రాధాన్యము కలిగిన జీవ సంపుటికి నధినేత. ఆయన సృష్టికర్త. తత్త్వజ్ఞాపకమూర్తి. సంకర్షణుడు ఏకాంతక మార్గనేత. ఒకవేళ నారాయణు డొక్కడే దైవమని విశిష్టాద్వైతము చెప్పుచున్నది కదా! దాని మూలబీజము సంకర్షణ వ్యూహగతమైయున్నది. ప్రద్యుమ్నుడు తత్క్రియామూర్తి. అనిరుద్ధుడు క్రియాఫలదాత.

భగవంతుడైన వాసుదేవునకు పలు నామములు కలవు. ఈ నాల్గు వ్యూహముల నుండి యుపవ్యూహములు పుట్టుచున్నవి. వాసుదేవ వ్యూహమునుండి కేశవ నారాయణ మాధవ వ్యూహములు; సంకర్షణుని నుండి గోవింద విష్ణు మధుసూదన వ్యూహములు; అనిరుద్ధుని నుండి హృషికేశ పద్మనాభ దామోదర వ్యూహములు. అనగా ప్రధానములైన నాలుగు వ్యూహములనుండి పండ్రెండుప వ్యూహములు కలుగుచున్నవి.

భగవంతుడు కాలమూర్తి. ఈ యుప వ్యూహములైన పన్నిద్దఱు విష్ణు రూపులు సంవత్సరము యొక్క పండ్రెండు నెలలకు నధిదేవతలు. ఇది సంక్షేపముగా వ్యూహ నిర్మాణ పద్ధతి. విశిష్టాద్వైతమునందిది మిక్కిలి ప్రధానమైన విషయము.

అయినచో దీనికి, నద్వైతమునకేమి సంబంధమని ప్రశ్న.

అన్ని మతములునుపాసనా మార్గములే. మహానుభావులైన మతకర్తలు జీవలక్షణానుసారముగా నుపాసించుటకు నిన్ని మార్గములను గనిపెట్టిరి. జగత్తు యొక్క క్షేమము కోసము చేసిన పని జీవుల సంస్కార రూపముగా వారువారు తమతమ కనుకూలమైన యుపాసనా మార్గమును స్వీకరించవలెనని కాని మఱి యొకటి కనిపించుట లేదు. విశిష్టాద్వైతములో నీ వ్యూహ నిర్మాణ పద్ధతి చూచినచో జీవుడు క్రమముగా నధిరోహించెడి సోపానముల వరుస సూచింపబడి నట్లున్నది. బోధింపబడినట్లున్నది.

ఉప వ్యూహములు కాలాధి దైవతములు గదా! ఈ ప్రద్యుమ్న వ్యూహము నుండి త్రివిక్రమ వామన శ్రీధర వ్యూహములు సంజనితములు. ఈ ముప్వురు మూడు నెలల కధిదైవతములు ఆ నెలలు ఆశ్వయుజ కార్తీక మార్గశిరములు. మొదటి రెండు నెలలు శరదృతువు. మూడవ నెల హేమంతఋతువు. హేమంత ఋతువులో సగమే ఈ వ్యూహములో నున్నది. అది మొదటి సగము. సన్నని మంచుబిందులనుట చేత ముదురని హేమంతము వ్యంగ్యము.

అనిరుద్ధ వ్యూహము ప్రద్యుమ్న వ్యూహమునుండి పుట్టినది.".

వ్యూహ విషయాలు ఈ విధముగా పిళ్ళలోకాచార్యులవారి "తత్త్వ త్రయము"లో వ్యాఖ్యానించారు. "వ్యూహమనగా సృష్టి స్థితి సంహారార్థమైయును సంసారి సంరక్షణార్థమైయును, ఉపాసకాను గ్రహార్థమైయును, సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధ రూపముగా నిలుచు నిలుకడ, పరత్వమున జ్ఞానాదులారును పూర్ణమై యుండును. వ్యూహమున నీ రెండు గుణములును ప్రకటములై యుండును. అందు సంకర్షణులు జ్ఞాన బలములు రెండింటి తోడు గూడి జీవ తత్వము నధిష్టించి, దానిని ప్రకృతి నుండి వివేకించి, ప్రద్యుమ్నావస్థను భజించి శాస్త్ర ప్రవర్తనమునును జగత్సంహారమునును చేయవలసిన వారై యుందురు ప్రద్యుమ్నులు ఐశ్వర్య వీర్యములు రెంటితోనుంగూడి మనస్తత్త్వము నధిష్టించి ధర్మోపదేశమునును మనుచతుష్టయము మొదలగు శుద్ధ వర్గ సృష్టినిని చేయ వలసినవారై యుందురు. అనిరుద్ధులు శక్తి తేజస్సులు రెంటితోడుగూడి రక్షణ కును, తత్త్వజ్ఞాన ప్రధానమునకును, కాలసృష్టికి, మిశ్ర సృష్టికిని వలసినవారై యుందురు." (ఈశ్వర ప్రకరణము 43 నుండి 47 వరకు)[10]

ఈ వివరణలను బట్టి చూడగా కావ్యము ప్రధానంగా సృష్టి పరిణామాన్ని గర్భీకరించుకొని సాగినట్లు స్పష్టపడుతుంది.

వైష్ణవ సంప్రదాయంలో భగవంతుడు అయిదు విధాలుగా ఈ సృష్టి పరి పాలిస్తున్నట్లు చెప్పబడుతుంది. పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చ అని భగవత్స్వరూపము అయిదు విధాలు పరమనగా పరవాసుదేవుడు. వైకుంఠ మందలి రూపమిది. రెండవది పైన వివరించబడిన వ్యూహాత్మకము మూడవది రామకృష్ణాద్యవతార రూపము, పరమేశ్వరుని అవతారాలలో కొన్ని తాత్కాలిక ములు లేదా ఆవేశాత్మకములు. ఇవి ఒకానొక ప్రయోజనము కొరకు మాత్రమే ఉద్దేశింపబడినవి. ఉదాహరణకు మత్స్యకూర్మాద్యవతారాలు. రామకృష్ణావతారాలు సంపూర్ణావతారాలు. అంటే లోకాన్ని ధర్మాచరణ, ధర్మ నిరూపణవంటి వాటి ద్వారా అనుగ్రహించటం. నాల్గవది అంతర్యామి. భగవంతుడు సర్వజీవుల యందు అంతర్యామిగా ఉంటాడు. ప్రకృతి జీవునికి, జీవుడు పరమేశ్వరునికి దేహము వంటివారు. ఈ విధముగా పరమేశ్వరుడు వాసుదేవుడుగా, ప్రకృతి జీవాంతర్యామిగా ప్రవర్తిస్తాడు. "వాసనాద్వాసుదేవస్య వాసితంతే జగత్త్రియం" అన్నట్లుగా వాసుదేవుడంటే సర్వవ్యాపకుడు. సర్వమూ అతనియందు వ్యాపించి యున్నదని తాత్పర్యము.

చివరిది అర్చావతారము. భక్తులు పరమేశ్వరుని తనకు అభిమతమైన రీతిలో విగ్రహాలను రూపొందించుకొని అర్చిస్తారు. అర్చనకు యోగ్యమైన రూపమే అర్చా రూపము. ఈ అయిదింటిలో భక్తులకు అత్యంత సులభమైనది అర్చా రూపమే. మిగిలినవి అందుబాటులోనివి కావు. ఈ అయిదు విధాలలో వ్యూహ విధానం ఈ కావ్యంలో విభవరూపమైన శ్రీకృష్ణుడు భూమికగా చిత్రింపబడింది. శ్రీకృష్ణుడు షాడ్గుణ్య పరిపూర్ణుడైన శ్రీమన్నారాయణుడు. ప్రద్యుమ్నుడు సృష్టికి, ధర్మవ్యాప్తికి, క్రియాచరణకు సంబంధించిన వాడుగా చెప్పబడినాడు. ఈ సృష్టి భగవంతుని సంకల్ప సృష్టి తరువాతది, "స్త్రీపుంసయోగోద్భవ"మైనది. అందుకే ప్రద్యుమ్నుడు మన్మథుడు. మన్మథుడు స్త్రీ పురుషుల సంయోగాన్ని కలిగించి తర్వాత సృష్టి యొక్క అవిచ్ఛిన్నత్వాన్ని సాధిస్తున్నాడు. ఈ విధముగా కాలాత్మకుడైన పరమేశ్వరుడు సృష్టిహేతువైన ప్రద్యుమ్ని ప్రాధాన్యంతో ఈ కావ్యం సాగింది. ఈ వ్యూహ విధానం ఒకటి ఉపాసనామార్గమని సత్యనారాయణగారు సూచించినారు. వేదాల తిరువేంగళాచార్యులవారు11 కూడా ఈ ఉపాసన భాగవత ప్రోక్తమని వివరిస్తూ ఈ విధముగా అన్నారు:

"నాల్గు వ్యూహములుగా నున్నదియు నామహానుభావుడైన భగవానుడు పరవాసుదేవుడే. అతడు పరవాసుదేవ తత్త్వమున స్వయముగా సూక్ష్మమనబడును. ఈ వాసుదేవాదులు నల్గురు వ్యూహములు. మత్స్య, కూర్మాది అవతారములు విభవము. ఈ విభవమును - రామకృష్ణాద్యవతారమును భక్తి శ్రద్ధలతో నర్చించి క్రమాభివృద్ధితో వ్యూహములు నొందును. వానిని కూడా భక్తి వృద్ధితో ధ్యానార్చనాది విధానమున సేవించి సూక్ష్మము నొందునని పాంచరాత్రాగమ ప్రక్రియ. ఈ యాగ మోక్తమగు విధానముననే ఈ మహానుభావు నర్చింపవలెనని 'చతుర పాంచరాత్రోక్త హరి సమారాధన క్రియలను' అను మాటతో పోతనామాత్యులు తెల్పిరి."

ఇక్కడ మరొక విషయం గుర్తించదగినది. ఉత్తర హరివంశములో రుక్మిణీదేవి తనకు కొడుకును అనుగ్రహించుమని వేడినట్లుగా ఉన్నది.

"అఖిల లోకైకనాథ! నీయట్టి రూప
విక్రమౌదార్య శౌర్య వివేకనిలయు
నొక కుమారుని దయచేసి యుర్విలోన
గడుపుచల్లని కాంతల గలుపునన్ను"

అని రుక్మిణి అంటుంది. ఈ సందర్భాన్ని "ఒకడు నాచనసోమన్న" అన్న విమర్శక గ్రంథంలో సత్యనారాయణగారు ఇలా వ్యాఖ్యానించారు:

"రుక్మిణీదేవి తనకు కొడుకు ననుగ్రహించుమని శ్రీకృష్ణుని వేడినది. ఇది యొక చమత్కారము. మన కావ్యములయందు పురాణములయందు తమకు పుత్రుల ననుగ్రహించుమని కొందరు స్త్రీలు ఋషులను వేడినట్లు గలదు. లోకమునందు స్త్రీ పురుషసంగమము కలదు. కొందరు స్త్రీలు గర్భవతులగుదురు. కొందరు కారు. కొందరు సంతానము కొరకు మిక్కిలి నోములు నోచుదురు. ఇది యంతయు ప్రకృతిలోని లక్షణముగా కనిపించుచున్నది. కాని, ఈ సంతానము కలుగుట మన దేశమునందు పూర్వజన్మ కర్మఫలమో, పరమేశ్వరానుగ్రహమో యని భావించుట కలదు. ఏది యెట్లున్నను, ఇదిగో నీకు నేను సంతానమిచ్చుచున్నానని ప్రతిజ్ఞ చేసి యే పురుషుడును స్త్రీని గర్భవతిగా చేయలేడు గదా! అది యట్లగుచున్నది. అది భగవదనుగ్రహము. కాలము యొక్క స్వరూపము. ప్రపంచము యొక్క లీల."[12]

ప్రద్యుమ్నోదయంలో రుక్మిణి శ్రీకృష్ణుని ఈ విధముగా కోరదు. "కంతుడు కానిపించడును గన్పడనట్టిదిమేలో...." 4.25 అంటుంది ఒక విధముగా శ్రీకృష్ణుని ఆజ్ఞాపించినట్టుగా స్ఫురిస్తుంది. పార్వతీదేవి రతీదేవికిచ్చిన వరాన్ని అమలుపరిచేందుకు రుక్మిణిమార్గం సుగమం చేస్తుంది. శక్తిప్రధానమైన సృష్టిలో శక్తికే ప్రాధాన్యం. అందుకే రుక్మిణి కృష్ణుని ఉత్తర హరివంశంలో వలె వేడలేదు.

కృష్ణుడు మన్మథుని విషయం రుక్మిణి చెప్పిన తరువాత, తాను కలగన్న తర్వాత తెల్లవారి కాషాయవస్త్ర ధారియై కైలాసానికి వెళ్ళి శివుని దర్శిస్తాడు. శివకేశవులు పరస్పరం గౌరవించుకుంటారు. "అంత శ్రీకృష్ణదేవుండు తన యనంతమైన మహా తపస్సునుండి పన్నెండేళ్ళ తపస్సు గ్రహించి తన తెచ్చిన బిల్వదళంబున దానినుంచి శ్రీ పరమేశ్వరుని శిరస్సుననుంచి యిట్లనియె"—(5.5)

"సంకల్పము లేని మహా
శంకర నినుమేము చెప్పఁజాలుదుమె నిరా
తంక తపోనిష్ఠను నీ
లెంకలమయి నిన్ను మూదలించెదము మృడా!" (5.10)

అని అంటాడు. శివునికి సంకల్పము లేదు. సంకల్పించేవాడు నారాయణుడు. మన్మథుడు సంకల్ప సంభవుడు సంకల్పము ఈ సృష్టికి మూలము. సంకల్ప నాశము శివాత్మకము. అందువల్ల కృష్ణుడు కుమారునికోసం - మన్మథునికోసం శివుని అర్చించటం ఇక్కడ గమనించదగినది. భాగవతములో ఈ శివకేశవ [illegible]వేశము లేదు. కాని, ఉత్తర హరివంశములో ఇది కన్పిస్తుంది. పురాణ [illegible]లలో పాత్రలుగా కనిపించే కృష్ణుడు, రుక్మిణి, ప్రద్యుమ్నుడు, అని [illegible]వారంతా తాత్త్వికంగా వివిధాంశాలకు ప్రతీకలు. ఇదంతా [illegible] సృష్టి ప్రతీకాత్మకంగా చిత్రించబడ్డది.

[illegible] కొడుక నేనొసంగితి
[illegible]కుం గయికొమ్ము రుక్మిణీహృదయేశా!
[illegible] గడుపు తప్పకు
[illegible] కొడుకుంబోలెం గామినీ కుసుమేషూ!'

[illegible] నుండి నీవుగ గణింతము చేసితి వెల్లలోకముల్
[illegible] జంద్రముడు కంజహితుండు కృపీట యోనియున్
[illegible] బ్రహ్మ త్రిగుణించితి నించితి సర్వసృష్టికిన్
[illegible] సుతహావిః కృతబుద్ధుల యందు వెన్నుడా!''

[illegible] సృష్టి చేసికొని నీవొక వెఱ్ఱియు లేక యుండగా
[illegible] యంత నలినంబున బ్రహ్మను జేసి సృష్టికై
[illegible] చేసికొను చక్కటి! యేపని కేని నన్నునున్
[illegible] మాధవుం డంచును నీవు మాధవా!''

[illegible]! పెద్దపీట వేసెదవు నాకు
[illegible] పీటపై నీవు నాసీనుడవయి
[illegible] వ్యాహారచన జగద
[illegible] కృపాసనమోది కృతాత్మ!' (5-17 నుండి 20)

[illegible]. ఈ వ్యాహారచనంతా "జగదధీశ్వరీ కృపారస" [illegible]ంపదగినది. రతీదేవికి వరమిచ్చింది దుర్గాదేవి. మన్మథుని [illegible] కృష్ణునికి ఇప్పించింది రుక్మిణీదేవి. స్థూలంగా ఈ కథకు [illegible] పరమేశ్వరి ఆజ్ఞాపాలనగా కనిపిస్తుంది. కేవలం ప్రస్తుత [illegible]నే కాక మొత్తం సృష్టిశక్తి విలసనమే కాబట్టి ఆమె కృపాధీనముగానే [illegible] తాత్పర్యము.

కృష్ణుడు తిరిగి వచ్చిన తరువాత రుక్మిణికి, రతికి తన కైలాస యాత్రా విషయము చెప్తాడు. "నేనడుగంగ లేదు! కాంచును జనుమీవు నీ కొడుకు నూనశరాస్త్రిని........" అని శివుడన్నట్లుగా చెప్తాడు. రుక్మిణి సద్యోగర్భవతి అవుతుంది. తొమ్మిది రోజులలో ప్రద్యుమ్నుని కంటుంది. నెల గడిచింది. రతీదేవితో అతని వివాహము జరుగుతుంది. ఇక్కడ కాలం కుంచించుకపోయి నట్లుగా చెప్పబడింది. తొమ్మిది రోజులు తొమ్మిది నెలలుగా, ముప్పదిరోజులు ముప్పది ఏళ్ళకు (5.40) ప్రతీక. కాల విషయంలో ఈవిధంగా చెప్పడం ప్రద్యుమ్నుడు కాలమూర్తి అనడానికి సూచకము. "వయ సంచు నున్నదియే వీరికి చూడగ నిత్యమూర్తులై" అంటాడు శ్రీకృష్ణుడు. రతీ ప్రద్యుమ్నులు తొలి సారిగా కలుసుకున్నప్పుడు, రతీదేవి పూర్వము మన్మథుడు శివుని కంటి మంటలో దగ్ధం కావటానికి ముందే తన గర్భంలో నులి నొప్పి వచ్చి ఓకిలింతలుగా యున్నదని అంటుంది. రతీదేవికి అనిరుద్ధుడు జన్మించడానికి ఇది సూచన. "నీ జనియించుట పెట్టిదియొ, నీ సుతుడున్ జనియించుటట్టిదే...." అంటుంది. అప్పుడు ప్రద్యుమ్నుడు "....నాథుడు వాసుదేవుడే బీజము సర్వసృష్టికి, గృపీటము వహ్నియు, వాయువాకసంబా జగదీశుడూర్చునవి" (5.53) అంటూ వ్యూహ మార్గాన్ని ఆమెకు వివరిస్తాడు. "ఏను మనో భవుండననఁగా మనస్సును నేన. మనోధికారిని నేను. నీ కొడుకహంకారమ్ము. తదధిదేవత. మేమిద్దరము సృష్టి కర్తలము. బలరామదేవుండు లయాకృతి. ఆయన శివాకృతి. శ్రీకృష్ణుడు వాసు దేవుండు. షాడ్గుణ్యమూర్తి. ఇవి నాల్గు వ్యూహములు. ఇది యొక యుపాసనా మార్గము. (5.54). ఈ వ్యూహ మార్గములో శివుని అన్వయింప చేయటం విశేషం. ఆ తర్వాత—

"అంతఁ బుట్టెఁ దా నహంకారవారాశి
రూశమతి యయి యనిరుద్ధుఁ డతఁడు
బాణుచేతఁ గట్టుబడి వేఁడు తాతను
విశ్వవిభుని నింత వేడఁబోడు." (5.59)

అట్లాంటి అనిరుద్ధుని జన్మదినోత్సవము ప్రస్తావనతో కావ్యం పూర్తవుతుంది.

రుక్మిణీ కళ్యాణగాథలో కొంత కథాలక్షణమున్నది. కాని, ఈ ప్రద్యుమ్న గాథలో కథా లక్షణము లేదు. కేవలం ప్రతీకాత్మకమైన అంశాలకు వ్యాఖ్యాన రూపముగా ఈ ఘట్టము సాగింది. ప్రద్యుమ్న గాథలో శంబరాసురుని విషయం చేరి ఉండి ఉంటే కథాత్వము వికసించి ఉండేది. ఈ కావ్యములో కథ చెప్పడం కాక కొన్ని తాత్త్విక అంశాలను వ్యాఖ్యానించడం ప్రధానం. రుక్మిణీ కళ్యాణ

షట్టం వరకు కథలో లౌకికమైన వాస్తవిక లక్షణం కూడా కనిపిస్తుంది. ప్రద్యుమ్నోదయంలో అలౌకిక వాస్తవికతా లక్షణం మాత్రమే విస్తరిస్తుంది. అందుకే ఇక్కడ కాలానికి లౌకిక పరిగణనం ఉండదు. శివకేశవుల ప్రస్తావన సృష్టిలయముల అనంతత్త్వమునూ సూచిస్తున్నది. శివుడు మన్మథుని దహించటం కృష్ణుడు పునరుజ్జీవింప చేయటం అనేది వరుసగా, అనంతంగా సాగుతూ ఉండేది. రతీ ప్రద్యుమ్నులు వయసులేని నిత్యమూర్తులు అవడంలో ఈ అర్థం స్ఫురిస్తుంది.

ఈ విధముగా తపస్సు యోగము కాలము, వివిధ వ్యూహాలు మొదలైన వాటిని వ్యాఖ్యానిస్తూ కథను కేవలము పైపొరగా సంధానిస్తూ రచింపబడిన సృష్టి రహస్య తత్త్వ ప్రతిపాదకమైన కావ్యము ప్రద్యుమ్నోదయం. దీనిలో లౌకిక అలౌకిక వాస్తవికతలను అనుసంధింప చేసి కావ్య పౌరాణిక లక్షణాలను గుంఫించడంవల్ల ఇది వస్తుమయ కావ్యముగా రూపొందింది. ఇంత వ్యాఖ్యాన లక్షణమున్నా కూడా రచనా విధానంలోని, కథనంలోని వైచిత్రి ద్వారా దీని కావ్యత్వము అనుభవంలోనికి వస్తూనే ఉంటుంది.

## పాద సూచికలు :

1. హరివంశము - ఉత్తర భాగము 3.42 - నాచన సోమన.
2. సౌందర్య లహరి - 1 శ్లోకం - శంకర భగవత్పాదులు - సంఘ శేషాచలశాస్త్రి వ్యాఖ్య.
3 శ్రీ స్తవము - శ్రీ కూరనాథులు.
4. శ్రీమదాంధ్ర మహాభాగవతము - దశమ - పూ.భా. - 1708
5. శ్రీమద్రామాయణ కల్పవృక్షము - యుద్ధకాండ-ఉపసంహరణ ఖండము. 154.
6. - పైదే - నిస్సంశయ ఖండము - 386.
7. సౌందర్య లహరి - సంఘ శేషాచలశాస్త్రి వ్యాఖ్య.
8. ప్రద్యుమ్నోదయం - టిప్పణి.
9. శ్రీమద్రామాయణ కల్పవృక్షము-అరణ్యకాండము-మారీచఖండము-28.
10. తత్త్వత్రయము - పిళ్ళ లోకాచార్యుల వ్యాఖ్య - ఈశ్వర ప్రకరణము - 43 నుండి 47.
11. శ్రీమదాంధ్ర మహాభాగవతోపన్యాసములు - శ్రీ వేదాల తిరువేంగళాచార్యులగారి వ్యాసం - పుట 351.
12. ఒకడు నాచనసోమన్న - విశ్వనాథ సత్యనారాయణ - పుట - 38.

# ఐదవ అధ్యాయం

# శ్రీకృష్ణ సంగీతాలాపన

## శ్రీకృష్ణ సంగీతము :

విశ్వనాథ వారి కృష్ణ కావ్యాలలో ఒక్కొక్కటి మరొకదానికన్నా నిర్మాణాన్ని బట్టిగానీ, విషయ విన్యాసాన్ని బట్టిగానీ భిన్న భిన్నంగా ఉన్నాయనేది స్పష్టమే. అయినా, ఈ అన్నింటిలోనూ "శ్రీకృష్ణ సంగీతం" మరింత ప్రత్యేకంగా, విశిష్టంగా దర్శనమిచ్చే విలక్షణమయిన కావ్యం. ఈ విలక్షణత్వాన్ని నిర్మాణపరంగాను, విషయ విన్యాస పరంగానూ విడివిడిగా విశ్లేషించుకొంటే శ్రీకృష్ణ సంగీతం ప్రత్యేకత, విశిష్టత స్పష్టమవుతాయి.

## కావ్యనిర్మాణం - విధానం :

నిర్మాణపరంగా శ్రీకృష్ణ సంగీతంలో కన్పించే ప్రత్యేకత దాని ఛందో విధానం శ్రీకృష్ణ సంగీతం ఏకచ్ఛందోమయమయింది. మొదటి నుంచీ చివరి దాకా ఈ కావ్యం తేటగీతి ఛందస్సులో సాగింది. భ్రమర గీతలలో ఉత్పల చంపక శార్దూల మత్తేభ వృత్తాలూ, సీస కంద పద్యాలూ కలగలుపుగా ఉన్నాయి. వీటిలో దేశి పద్యాలు మాత్రం చాలా తక్కువ, వృత్తాలే అత్యధికం గోపికా గీతలలో దేశి పద్యాలు అసలే లేవు. అన్నీ వృత్తాలే. ప్రసిద్ధమయిన ఉత్పల మాలాదులు నాలుగు ఇందులో కనిపిస్తాయి. ప్రద్యుమ్నోదయం చంపూ ప్రబంధం కాబట్టి పద్యవచన మిశ్రత్వం - పద్యాల్లోనూ, ప్రసిద్ధ వృత్త జాతి సమ్మేళనం కనిపిస్తుంది. ఈ విధముగా వీటిలో ఛందో వైవిధ్యం ఉంది.

శ్రీకృష్ణ సంగీతం ఆద్యంతమూ ఏకచ్ఛందోమయమే. ఆ ఛందస్సు గూడా దేశి ఛందస్సు - గీతపద్యం. కావ్యం శ్రీకృష్ణ సంగీతం కాబట్టి కావ్య ఛందస్సు కూడా "గీతం" కావటం ఒక చమత్కారమే కావచ్చు. కాని, సంగీతానికి గల ప్రవాహ లక్షణం ఇక్కడ ఈ గీత పద్యంలో కనిపించకపోవటం గుర్తింప

దగిన అంశం. ఇక్కడి ఈ గీతపద్యం "గీతం"గా కాక వచనంగా నడుస్తుంది. గీత పద్యానికి నిర్ణీతమయిన గణాదులు ఉంటాయి. వాటినిబట్టి పాదవిభజన గూడా కనిపిస్తుంది కాని, నడకమాత్రం ఆయా గణాల కూర్పు ద్వారా నిర్దిష్ట మనిపించే తీరుగా ఉండదు. వచనంలాగా ఉంటుంది. ఈ కావ్యంలోని ఒక ఖండిక 'పుస్తక ప్రపంచం' పత్రికలో ఈ క్రింది విధంగా ప్రచురింపబడినది ఆది ఈ కావ్యంలోని అరవై ఒకటవ ఖండిక. దాని శీర్షిక "గురువులు." (ఇక్కడ ఆయా పంక్తుల మధ్య నిలువు గీతలు గీత పద్య పాదాంతాలను సూచిస్తాయి).

బృందలో నొక గది యున్నది
అందులోని। కెవ్వరును బోరు
ఎవరిని బోనీరు
ఒక్క। ఉపిద రెండు జాముల యెండ
ఒక్కనాడు।
మండిపోవుచునుండగా
మమత నిల్వ। క
అంబుజాక్షుని జూడగా నరుగుదెంచి।
అల్లగదిలోన
ఒక్కరు పిల్లగ్రోవి।
ఒకరు వీణను వాయించుచున్న యట్లు।
విని
ఒకండు శ్రీకృష్ణుడు
వేరొక రెవ। రంచు
జంజాటపడి
స్వామికంత। అప్పురాలెవ్వరాయని
అతని కొరకు। మిట్టమధ్యాహ్నమున
వచ్చునట్టి తన్ను
తానె నిందించుకొని, తన దారి దాను। బోదు
ఇంక నీ వయిపునకు తిరిగి। చూడనని
మరి నిశ్చయించుకొని
మరలి।

తనకు పిణియరాదు గదా ।
ఎవతెయొ । వీణ నేర్చినదానితో
విభుడు పాడు । కొంచునుండంగ తప్పేమి ।
కోపమేల ? ।
కొంతసేపటికో ఒక కొంత సేప । టికిని
వత్తురేకద బయటికని వారు ।
ఆమె మొగమును చూచి పోనగును గాదె ।
దాని డొక్క లో మెదలించుకోనువచ్చు ।
ననుచు
ఒక తమాలచ్ఛాయ నాశ్రయించి ।
వారు వచ్చినయప్పుడు వారు
తనకు । గానుపించనువలయు
తా గానుపించ । రాదు
అనుచు నొక్క పొదరింట
క్రమ్ముకొన్న । యాకులుగ దాగికొని
ఆకులందు సందు । చేసి
గది తల్పునెదురుగా
చెలగిలోన। నుండి యెవ్వరువచ్చిన
ఉవిద యొక్క
కన్నుత గులక యుండబొగానుపీలు । లేనిగతి
ప్రతీక్షించుచు
చాన యుండె।
పాట యాగిపోయిన యది.
ద్వార బంధ । ము
ఎవరు తెరచిన యది లేద
ఎవరు వెళ్ళి । సదియు లేద
ఆ వెన్కనేదైన నింక । నొక్కద్వారమ్ము కలదో
అంచు
ఊహ చేయ।

ఇంతలో వల్లు తెరువుదై
ఇంతి చూడ
వచ్చె స్వామియు
వెనువెంట వచ్చె నార । దుండు
నిలచి గుండియ
నారదునకు । మొక్కి ।
"హరికి నేర్పెరో సంగీతము?"
అన
సురర్షి।।
నేను సంగీత గురువన
నీవు కామ । గురువవు
అని పలుకుచును
నవ్వుకొంచుబోయె."

ఒక గోపిక శ్రీకృష్ణుడున్న చోటికి రావటం, ఆమె తనలో తాననుకున్న మాటలూ మొదలయిన వాటి తీరు అంతా "స్వగతం" కథన పద్ధతిలో సాగింది. అరవై మూడు పంక్తులుగా ఇక్కడ కనిపిస్తున్నప్పటికీ ఈ పంక్తులు "వచన పద్య" ధోరణిలో పాదాలు విభజించటం కాకుండా స్పష్టంగా అర్థం అయ్యేందుకు అనుకూలంగా విడగొట్టినట్టు కనిపిస్తుంది. నిజానికి ఈ మొత్తం పది గీత పద్యాలు. (అక్కడక్కడ సంధులు చేయక పోవటం వల్ల కొంచెం తేడా ఉన్నట్టు కనిపిస్తుంది)

## పద్యవచనం :

పద్యాన్ని వచనంలాగా రచించే పద్ధతి భావ కవితా యుగంలో కొంత కనిపిస్తుంది. వేంకట పార్వతీశ్వర కవులు ఈ తీరుకు ప్రారంభకులనవచ్చును. వారి "భావ సంకీర్తన" సీసపద్య రచన.[1] అయినా, ఆ సీసపద్యాలన్నీ అచ్చంగా వచనం మాదిరిగా కనిపిస్తాయి. అంటే, సీసపద్యపు నడక కన్పించదు. దీని తర్వాతనే భావకవులలో ఈ ధోరణి కొంత కొంతగా వ్యాపించినట్టుగా కనిపిస్తుంది.

"ఆమె కన్నులలో ననంతాంబరంపు
నీలి నీడలు కలవు;
వినిర్మలాంబు
పూర గంభీరశాంతి కాసారచిత్ర
హృదయములలోని గాటంపు నిదురచాయ
లందు నెడనెడఁగమ్ము"2

వంటి కృష్ణశాస్త్రిగారి రచనలను ఉదహరించుకొనవచ్చును. ఈ విధముగా పద్యాన్ని వచనంగా నడిపించే తరహాను "పద్య తిరస్కార ధోరణి"3 అనవచ్చు అని వెల్చేరు నారాయణరావుగారన్నారు. ఈ విధముగా పద్యాన్ని తిరస్కరించకుండానే పద్య లక్షణం పాటిస్తూనే వచనంలాగా నడిపించడం పద్య రచనలో ఒక ప్రయోగంగా ఆనాళ్ళలో భావించబడినట్లు కన్పిస్తుంది. పద్య తిరస్కార ధోరణి అంటే ఒక పద్యానికి నిర్ణీతమయిన గణాల కూర్పు ద్వారా ఏర్పడే నడక స్ఫురించకుండా రచించటమని తాత్పర్యం. కాని, కవులు గణాలను బట్టి పద్యాన్ని రచించే తీరుకు ఎప్పుడూ ప్రాధాన్యం ఇవ్వలేదు. పద్యాలకు రకరకాలైన నడకలు పదాల విరుపులు మొదలైన వాటి ద్వారా రకరకాల నడకలు సాధించినారు. అందువల్ల దీన్ని పద్య తిరస్కార ధోరణి అనడంకన్న స్పష్టంగా పద్య వచన ధోరణి - పద్యాన్ని వచనంగా నడిపించే తీరు అనటం సముంజసంగా ఉంటుంది. ఈ తరహాకు తిక్కనగారినాడే అంకురార్పణ జరిగిందనవచ్చు. తిక్కనగారి రచనలలో అనేక పద్యాలు వచనంలాగానే అనిపిస్తాయి. గణయతిప్రాసాదులనుబట్టి వ్యక్తమయ్యే తీరు ఇక్కడ స్పష్టపడదు.

"అధిప! నీ యోధులందు సేనాపతిత్వమునకుఁ జాలనివారుఁగలరె!
అందరు నయపిక్రమాదిగుణంబుల మునుల;
యట్టులైన,
ఎల్లవారి ముఖ్యుల చేయవచ్చునే?
యొక్కరు గైకొన్న మత్సరగ్రస్తబుద్ధి నన్యులు
విపరీతులై కలగకయుండువారు కావలయు
ఎవ్వరును ద్రోణుడనిన కాదనరు

అతఁడుద్యోగాధిపత్యమునకు
ఆచార్యుడు, బ్రాహ్మణుండు, వివిధ రణకోవిదుడు,
వయోవృద్ధుడు, అధికబలుడు, శూరుడు
కట్టుమపట్టమతని.''4

ద్రోణాచార్యుడికి సేనాధిపత్యము కట్టిపెట్టమని కర్ణుడు దుర్యోధనుడితో అన్నప్పటి పద్యమిది. ఇది సీసపద్యమే కాని ఇందులో ఉన్న విరుపులు సంభాషణ ధోరణికి చెందినవే తప్ప, పద్య పాద గణ విభజనకు చెందినవి కావు. ఆ పద్యమునకు ఉన్నదనుకొనబడే ప్రవాహ లక్షణం కూడా ఇక్కడ లేదు. ఆలోచన, సంభాషణ, వితర్కము మొదలైన అంశాలు విషయమైనప్పుడు పద్యాన్ని వచనానికి ఒదిగించడం తిక్కన గారు నేర్పిన విద్య. నాటకీయత వ్యక్తం కావటానికి ఉపకరించే అంశాలలో ఇది కూడా ఒకటి.

శ్రీకృష్ణ సంగీతములో సంభాషణ, ఆలోచన మొదలైన అంశాలకే ప్రాధాన్య మున్నది. అందువల్ల సత్యనారాయణ గారు ఈ కావ్యాన్ని పద్య వచనముగా రచించినారు.

## శతకధోరణి :

శ్రీకృష్ణ సంగీతములో 108 శీర్షికలతో 108 ఖండికలు ఉన్నాయి. వీటిలో కొన్నింటిని తగ్గించినా, మరికొన్నింటిని చేర్చినా ఇబ్బంది ఏమీ లేనట్టుగానే అనిపించవచ్చు. శీర్షికలు కూడా వేరు వేరే కాబట్టి, ఇవి ఇన్నే ఉండాలన్న నియమం కూడా ఉండనక్కర లేదు కాని, ఇందులో 108 శీర్షికలు ప్రత్యేకమైన ప్రయోజన దృష్టితో సంకలనం చేయబడినట్టు కనిపిస్తుంది. భ్రమర గీతలలో 100 పద్యాలున్నాయి, గోపికాగీతలలో మూడు ఖండాలు ఒక్కొక్క ఖండంలో నూరేసి పద్యాలున్నాయి. శ్రీకృష్ణ సంగీతములో కూడా ఆ విధముగానే నూరు ఖండికలు మాత్రమే ఉండవచ్చు కాని, 108 ఖండికలను కూర్చటం వలన శతక లక్షణం ఉద్దేశింపబడినట్లు స్పష్టపడుతుంది.

సాహిత్యంలో శతక ప్రక్రియ ప్రసిద్ధమైనది. ఈ ప్రక్రియకు ప్రధానమైన లక్షణాలు రెండు. మొదటిది పద్య సంఖ్యా నియమము, శతకమంటే వంద కలది అని అర్థము. ఇక్కడ ఈ సంఖ్య పద్యాలను సూచిస్తుంది. శతకమనేది

వంది అనే సంఖ్యను చెప్పినా కూడ తెలుగులోను శతక సాహిత్యములో 108 పద్యాలుండటమే సంప్రదాయం. ఈ సంప్రదాయానికి మూలం జపవిధానము కావచ్చు. భగవన్నామ జపంలో అష్టోత్తర శత సంఖ్య ప్రసిద్ధమైనది. సహస్ర నామ పారాయణం కూడా ఉన్నది. కాని అక్కడ అధికంగా ఎనిమిదిని చేర్చడం కనిపించదు. భగవన్నామ సంకీర్తనం ఎట్లాంటిదో భగవంతుని వివిధ విషయాలను గురించి స్మరించటం భావించటం కూడా అట్లాంటిదే. శ్రీకృష్ణ సంగీతము నిర్మాణంలో ఈ విధమైన ఆలోచన కనిపిస్తుంది. అందుకే భ్రమర గీతలు మొదలైన వాటికంటె భిన్నంగా 108 సంఖ్య ఇందులో కనిపిస్తుంది. ఇంతకు పూర్వము సత్యనారాయణగారు "మా స్వామి" పేరుతో విశ్వేశ్వర శతకము, విశ్వనాథ మధ్యాక్కరల పేరుతో మున్నంగి, భద్రాద్రి మొదలైన పది శతకాల సముచ్చయం రచించారు. కాని, వాటన్నింటిలో నూరు పద్యాలు మాత్రమే ఉన్నాయి. శ్రీకృష్ణ సంగీతములో మాత్రం నూట ఎనిమిది ఉండటంవల్ల నామ జప సంప్రదాయాన్ని ఇక్కడ పాటించినట్టు కనిపిస్తుంది.

శతకం యొక్క రెండవ లక్షణం మకుటం. ఈ మకుటము సంబోధన రూపముగా ఉండటం సర్వసాధారణం. "బసవా! బసవా! బసవా! వృషాధిపా!"; "శ్రీకాళహస్తీశ్వరా!"; "సర్వేశ్వరా!"; "సుమతీ!"; "భాస్కరా!" మొదలైన విధముగా ఉండే సంబోధనలను శతకసంప్రదాయంలో "మకుటము"గా వ్యవహరిస్తారు. ఈ మకుటం పద్యాంతములోనే ఉంటుంది. సంస్కృతములోనూ శతకాలు ఉన్నారు. కాని వాటికి సంఖ్యా నియమము తప్ప మకుట నియమము లేదు. సాధారణముగా శతకాలు భగవత్ స్తోత్రమయంగా ఉంటాయి. భగవంతుడిని అనేక విధాలుగా స్తోత్రం చేయడం వీటిలోని విషయం. భక్తుడు తన వేదనలను, బాధలను లోక రీతిని నేరుగా భగవంతునికి విన్నవించుకోవడం కూడా వీటిలో ఉండవచ్చు. ఈ విధమైనవే కాకుండా, నీతిధర్మం మొదలైన వాటిని చెప్పే శతకాలు మొదలైనవి సంస్కృతములోను, సుమతి, భాస్కర శతకాదులు తెలుగులోను ఇందుకు ఉదాహరణలు.

సంస్కృత శతకాలలో వేరు వేరు ఛందస్సులను ప్రయోగించడం సర్వసాధారణం. మయూరశతకం వంటి కొన్నింటిలో మాత్రమే ఛందస్సులయొక్క

ఏకత్వం కన్పిస్తుంది. తెలుగులో వృత్తమయశతకాలలో ఉత్పల చంపకమాలల సమ్మేళనం, లేదా శార్దూల మత్తేభ విక్రీడితాల సమ్మేళనం ఉంటుంది. పద్యాంతములోని మకుటము నియతం కాబట్టి విభిన్న పద్యాలను ప్రయోగిస్తే వాటిలో ఆ మకుటము ఇమడకపోవచ్చు ఉత్పల చంపకమాలల మరియు శార్దూల మత్తేభాల జంటల నిర్మాణంలో తొలి అక్షరాలలోనే మార్పు తప్ప మిగతా భాగమంతా ఒకేవిధముగా ఉంటుంది. ఆ రెండు రకాల పద్యాలలో కూడా ఒకే మకుటము ఇముడవచ్చు. ఈ కారణంగా ఆయా రెండేసి పద్యాల సమ్మేళనం శతకాలలో చేయబడింది. దేశి పద్యాల శతకాలలో ఈ విధమైన సమ్మేళనం ఉండదు.

శ్రీకృష్ణ సంగీతము సంఖ్యా దృష్ట్యా శతక లక్షణం ఉన్నది కాని మకుటము మాత్రం పాటించబడలేదు. ఈ విషయంలో సంస్కృత శతకం పద్ధతి అనువర్తించిందని అనవచ్చు.

## మౌలికాపద్యం :

శ్రీకృష్ణ సంగీతము గీత పద్యమయమయిందని ఇదివరకే చెప్పబడింది. పద్యం సాధారణంగా నాలుగు పాదాలతో ఏర్పడుతుంది. చాలా అరుదుగా ఒకటి రెండు పాదాలు పెరుగవచ్చు. అప్పుడు పద్యాలను పంచపాది, షట్పాది అని ఛందోగ్రంథాలు వ్యవహరించాయి. అంతకుమించి కూడా పాదాలు పెరిగినప్పుడు దానిని మాలిక అంటారు. ఈ పాదాల సంఖ్య పెరగడం- మాలికగా రచించడం అనేది ఏ పద్యానికైనా అనువర్తిస్తుంది. 'పూత మెరుంగులున్ పసిడిపూప జెడంగులు మాపునట్టి ఛాకైతలు....' అంటూ కవితా లక్షణాన్ని చెప్పేదిగా ప్రసిద్ధమైన పెద్దన్నగారి రచన ఉత్పలమాలిక. ఉత్పలమాలా పద్యపాదాలు ఇందులో నలభైదాకా ఉన్నాయి. పాదాలు నలభై కాబట్టి పద్యాలు పది అని చెప్పవచ్చు. కాని, అన్ని పాదాలకు కూడా ఒకే ప్రాస ఉండడం, నాలుగవ పాదము దగ్గర భావంకాని, వాక్యంకాని పూర్తి కాకపోవడం కారణంగా ఈ మొత్తం ఒకే (మాలికా) పద్యముగా పరిగణింపబడుతున్నది. ప్రాస నియమము లేని సీస గీతాదులలో కూడా ఈ విధమైన మాలికా పద్యరచన తెలుగులో సుప్రసిద్ధము. శ్రీకృష్ణ సంగీతములో ఈ రచనా పద్ధతి కనిపిస్తుంది. "మాలికా పద్య" వ్యవహారము లేకున్నా కూడా భావకవితా కాలంలో బహు పాదగీత పద్యాలు రచింపబడటం గమనించవచ్చు.

శ్రీకృష్ణ సంగీతములో 108 శీర్షికలు. ఒక్కొక్క శీర్షిక ఒక్కొక్క గీత పద్యమాలిక. దాదాపుగా అన్ని గీతమాలికలలోను నలభై పాదాలుంటాయి. ఏ కొన్నింటిలో మాత్రమే ఇంతకుమించి కూడా ఒకటినుంచి 5, 6 పాదాల దాకా పెరిగిన గీతమాలికలు కావ్యాదులలో కనిపిస్తాయి. మొదట్లో పాద సంఖ్యను గురించి నిశ్చితత్వము లేకున్నా, తరువాత పాద సంఖ్యా నియమము పాటింపబడినట్లు చెప్పవచ్చు. 108 పద్యమాలికలతో భగవద్విషయం ఈ కావ్యములో ప్రపచింపబడింది.

## శతకస్థాయిని మించిన తీరు :

స్థూలముగా శతక లక్షణమున్నదనుకున్నా శ్రీకృష్ణ సంగీతంలో ఒక అసాధారణమైన విశేష లక్షణం గుర్తింపదగింది. ఇందులో ప్రతి ఖండిక - మాలిక ఏదో ఒక సన్నివేశాన్ని చిత్రిస్తుంది. చిన్నచిన్న కథలు చెప్పినట్టుగా ఉంటుంది. కొన్నింటిలో గోపికలు పరస్పరం సంభాషించుకొన్నట్టు తమ భావాలను, అనుభవాలను చెప్పినట్లు ఉంటుంది. కొన్నింటిలో కథా సన్నివేశాలే చిత్రింపబడుతుంటాయి. ఇది శతకాల లక్షణం కాదు. వీటిలో కథా లక్షణం ఉండటంవల్ల అనేకమైన సన్నివేశాల వేరు వేరు గాథల సంకలనంగా చెప్ప వచ్చును. ఈ గాథా సంకలనాన్నిబట్టి, హాలుడి గాథా సప్తశతి దీనికి ప్రేరణగా చెప్పే అవకాశం ఉన్నది. "శ్రీకృష్ణ సంగీతం" ప్రణాళిక ప్రాయికంగా గాథా సప్తశతి వంటిది అని అన్నారు ధారా రామనాథ శాస్త్రిగారు.[5] కాని దానికి, దీనికి సంబంధం లేదు. గాథా సప్తశతిలోని గాథ ఒక సన్నివేశాన్ని సూచించే పదము కాదు. గాథ అనేది ఒక పద్యానికి పేరు. పద్యాల సంకలనమేనని మాత్రమే అక్కడ అర్థం. అది రూపపరమైనది. శ్రీకృష్ణ సంగీతములో వస్తుపరమైనది.

సత్యనారాయణగారు రచించిన "గిరికుమారుని ప్రేమగీతాలు" అన్న ప్రణయ కావ్యములో ఉన్నవన్నీ గీతపద్య ఖండికలే. వాటిలో మాలికా లక్షణం కూడా కొన్నిచోట్ల కనిపిస్తుంది. కాని, ఈ ఖండికలన్నీ ఒకటి రెండు అని అంకెలతోటే సూచింపబడ్డాయి తప్ప, వాటికి ప్రత్యేకమైన శీర్షికలు లేవు. శ్రీకృష్ణ సంగీతములో ప్రతి ఖండికకు ఒక శీర్షిక - ఖండికలోని విషయానికి సూచకంగా ఉన్నది. భర్తృహరి సుభాషితాలలో పదేసి పద్యాలకు కలిపి ఒక శీర్షిక కని పిస్తుంది. నీతి శతకములో పది పద్ధతులు ఉన్నాయి - సుజన పద్ధతి, దుర్జన

పద్ధతి మొదలైనవి ఆ పద్ధతులు. తమిళంలో నమ్మాళ్వారు రచించిన "తిరువాయి మొళి" అనేది వేయి పద్యాల కావ్యం. ఈ వేయి పద్యాలు పది శతకాలుగా, ఒక్కొక్క శతకము పది దశకాలుగా విభజింపబడటం గమనింపదగినది. విశ్వనాథ మధ్యాక్కరలలో మకుట భేదమే తప్ప పది శతకాలు కూడా మధ్యాక్కర ఛందస్సులోనే ఉన్నాయి. ఈ విధముగా దశకాలకు పేర్లుండటం, లేకపోవడం కూడా గమనించవచ్చు. "తిరువాయి మొళి" పూర్తిగా భగవద్విషయము. శ్రీకృష్ణ సంగీతము కూడా భగవద్విషయమే.

## వస్తు విన్యాసము :

శ్రీకృష్ణ సంగీతములోని వస్తువు మిగతా కృష్ణ కావ్యాల్లో మాదిరిగా కృష్ణ విషయమే కాని, శ్రీకృష్ణ సంగీతములోని శ్రీకృష్ణ విషయము మిగిలిన వాటికన్న భిన్నమైనది. విశ్వనాథవారి ఇతర కృష్ణ కావ్యాల్లోని కృష్ణ విషయానికి ప్రధానముగా భాగవతమే మూలము. భాగవతములో చిత్రింపబడిన సన్నివేశాలే, కథాంశాలే ఒక ప్రత్యేక పద్ధతిలో, విశిష్ట విధానంతో రచింపబడిన కావ్యాలు భ్రమర గీతలు, గోపికా గీతలు, ప్రద్యుమ్నోదయం. ఈ మూడూ కాక శృంగార వీథికి సంబంధించినంతవరకు జయదేవుని గీత గోవిందం ప్రభావం స్పష్టమే. ఒక్క "శ్రీకృష్ణ నిర్వేదం"లోని విషయ వస్తువుకు మాత్రం భాగవతం కాని, మరేదీ కాని మూలం కాదు. శ్రీకృష్ణ దేవుని నిర్వేదములో రుక్మిణి, సత్యభామ మొదలగు భాగవత వ్యక్తులతోపాటు, భాగవతంలో లేని రాధ కూడా కనిపిస్తుంది. కామం మాయా స్వరూపమై ఆ మాయ తొలగటం, కామదహనంతో శ్రీకృష్ణ దేవుని పరబ్రహ్మతత్వం అభివ్యక్తం కావడానికి జ్ఞాన మార్గంలో చిత్రించటం ఆ కావ్య వస్తువు. (ఈ అంశాలు శృంగార వీథి కావ్య వివేచన సందర్భంగా వివరించబడ్డాయి.)

శ్రీకృష్ణ సంగీతం కావ్యానికి కేంద్ర బిందువు భాగవతంలో మాదిరిగా భక్తియే. దాన్ని జ్ఞాన, వైరాగ్యాలు కమ్ముకొని ప్రవర్తిస్తూ ఉంటాయి. భాగవత ప్రసిద్ధమైన ఏ వ్యక్తి కూడా ఈ కావ్యంలో కనిపించరు. ఇందులో కనిపించే వ్యక్తులు గోపికలు, వారి భర్తలు, కొందరు అసురులు. ఇక్కడ సామూహికంగా పరంధరు భాగవతంలోని వ్యక్తులే కావచ్చు కాని, ఏ ఒక్కరికి కూడా ప్రత్యేక

మైన పేరు లేదు. ఈ పేరు లేకపోవడంవలన వ్యక్తుల స్వభావానికి మాత్రమే ప్రాధాన్యం కలుగుతున్నది తప్ప, ప్రత్యేక వ్యక్తికి ప్రాధాన్యము లేకుండా పోతున్నది. సామాన్యంగా లోకంలో నామరూపాలనుబట్టి మాత్రమే వ్యక్తులకు ప్రత్యేకంగా గుర్తింపు కలుగుతుంది. పేర్లు లేకపోవడంవలన అందరూ కేవలం వ్యక్తులుగానే మిగిలిపోతారు. "శ్రీకృష్ణదేవుని నిర్వేదము"లో వ్యక్తుల పేర్లు కూడా ఉండడముతో, ఆ వ్యక్తులతో ఇంతకుముందే పరిచయం ఉండడంవల్ల వారు మనసులో రూపుగట్టి, వారి నామరూపాలనుబట్టి ఏర్పడే పరిమితులు కూడా కొన్ని భావించబడుతున్నాయి. సత్యభామను గూర్చిన ఘట్టంలో సత్యభామ పేరుతో గుర్తింపబడే ఒక వైయక్తిక లక్షణం సూచింపబడింది.

''వంచితమృత్యువై వెలయువాని మహేశ్వరుఁ జచ్చికూడ సా
ధించిన పూవుముల్కి దొర దృ ప్తవిలోచన త్రివరేఖ బం
ధించి వనీలతాంతవ్రతతీ యువతీ పరిహాసమూర్తి యే
తెంచెను సత్యస్వామియెద త్రెవ్విన చోటికిఁ బాలదండయై."

శ్రీకృష్ణునిపై తన అధికారాన్ని ప్రదర్శించే తరహా సత్యభామ లక్షణం. సత్యభామ అనగానే భాగవత, పారిజాతాపహరణాదులలో చిత్రింపబడ్డ ఆమె స్వభావ లక్షణాలు సహజంగానే కవి పాఠకుల భావనలను ఒక ప్రత్యేకమైన పద్ధతిలో సాగేటట్టు చేస్తాయి. ఈ ధోరణి శ్రీకృష్ణ సంగీతంలో ఉండదు. ఇందులో "గోపికలు" మాత్రమే ఉన్నారు. ఫలానా గోపిక ఫలానా స్వభావం కలది అని భాగవతంలో కూడా చిత్రింపబడలేదు. అందువల్ల ఆ గోపికలు గాని, వారి భర్తలుగాని, ఇంకా ఇతరులు కాని కేవలం వ్యక్తులుగా మాత్రమే ఉంటారు. కవి వ్యక్తీకరించే భావాలకు వారు ఆలంబన విభావాలు. ఆ భావం ఫలానా గోపికకే చెందినదని చెప్పడానికి వీలులేదు. ఏ గోపిక అయినా కావచ్చు, ఏ గోపకుడు అయినా కావచ్చు. ఈ ఆలంబన విభావాల ద్వారా వ్యక్తమయ్యే భావాలు, అనుభవాలు, ఆలోచనలు మొదలైనవన్నీ కృష్ణ విషయంగా గోపికా పరంగా వ్యక్తమవుతున్నాయే తప్ప వాటికి కచ్చితంగా దేశకాల వ్యక్తి పరిమితులు ఉండవు. అందువల్ల శ్రీకృష్ణ సంగీతంలో చిత్రించబడిన అంశాలు లౌకికమైన పరిమితుల నుంచి ఉదయించి, పరమేశ్వర తత్త్వములో లీనమవుతాయి. ఈ కావ్యంలో ప్రసక్తమయ్యే గోపికలు వివిధ జీవుల భావరూపాలు, అనుభవ రూపాలు.

శ్రీకృష్ణ సంగీతములో వ్యక్తుల పేర్లు ఏ మాత్రమూ లేవని చెప్పటానికి పూర్తిగా వీలులేదు. అలాంటి వ్యక్తులు ముగ్గురు కనిపిస్తారు. ఒకరు యశోద, యశోదతోపాటే అభిన్నంగా నందుడు, మరొకరు కంసుడు. కావ్య విషయం అంతా శ్రీకృష్ణుడే కాబట్టి శ్రీకృష్ణుడు ఉండనే ఉంటాడు. కంసుడు శ్రీకృష్ణ భావనను నిర్మూలించేందుకు ప్రయత్నించే ప్రతికూలాంశం. యశోద శ్రీకృష్ణుడిని రక్షించుకునే అనుకూలాంశం. ఈ ఇద్దరి ప్రసక్తి రెండుమూడు సార్లకు మించి కావ్యంలో కనిపించదు. భగవద్భావనకు వినాశము లేదు. వినాశకాంశమైన కంసత్వాన్ని అతిక్రమించి, తొలగించి భగవద్విషయం ప్రవర్తిస్తుంది. ఈ వినాశన ప్రయత్నం కూడా పరిణామక్రమంలో భగవద్భావనలో అనుకూలాంశముగా పర్యవసిస్తుంది. ఈ అంశమే "శ్రీకృష్ణ సంగీతం"లోని చిట్టచివరి ఖండిక "సూటి చెడ్డ బాణము"లో చిత్రింపబడింది.

కంసుడు బాలకృష్ణుడిని సంహరించేందుకు పూతనాదులను పంపించినాడు. వారందరు భగవంతుని చేతిలో నిహతులైనారు. అయినా—

"ద్యూత మాడుచునుండగా నోడుచుండి,
మరల నీసారి యంచును మరల నోడి,
యిది చివరిసారి యని యొడ్డి, యదియు నోడి,
చివరిసారి మరొక్కటి చేసి, దాని
నోడి, నాశనమగు దాఁక నోడుచుండు।"

ఈ ఓడిపోవడం లోని మూలతత్త్వం ఓడిపోయేవాడికి దైవం అనుకూలించినప్పుడు మాత్రమే తెలుస్తుంది. దైవానికి వ్యతిరేకంగా పోతున్నంతవరకు తెలియదు. అప్పుడు కంసుడొక "రతి మహావీరురాలైన" ఒక రాక్షస స్త్రీని పిలిచి, 'పూర్వం పూతనవలె కాక నీవు అందమైన కాంతగా వెళ్ళి అతన్ని చంప వలసింది. అతడు కాంతాసక్తుడు. ఒక చేతితో అతని చేయి పట్టుకొని విలాసంగా ఊపుతూ రెండవ చేతితో గొంతు పిసికి చంపమంటాడు.'[6] ఆమె ప్రేపల్లెకు వచ్చి భగవంతుడిని దర్శించేటప్పటికి ఆమెలోని రాక్షసలక్షణం దివ్యలక్షణంగా పరిణమిస్తుంది. మూలభూతమైన అజ్ఞానం కరుడుగట్టినచోట కొంత ఆలస్యం కావచ్చు కాని, సాధారణంగా భగవంతుని ఎదుట ఏ దుష్ట లక్షణమైనా, తన దుష్టత్వాన్ని

కోల్పోతుందని తాత్పర్యం. అందుకే ఈ కావ్యములో కంసుడు ప్రత్యక్షంగా కనిపించడు. అనుకూలాంశమైన యశోద శ్రీకృష్ణుని రక్షించుకునే ప్రయత్నం లోనే ఉంటుంది. రక్షించుకోవడమంటే రక్షించుకోవలసిన వస్తువుకు ఎప్పుడు ఏ విధముగా నష్టం జరుగుతుందేమోననే భయం అంతరాంతరాల్లో మెదలుతూనే ఉంటుంది. 'ఆత్మానుసంధానము' (67 వ ఖండిక) లో ఈ విషయం చిత్రింప బడినది. ఈ ఇద్దరు మాత్రమే ఈ కావ్యంలో పేరుగలవారు. మిగతావారంతా కేవలం వ్యక్తులు. ఈ వ్యక్తులను తీర్చిన తీరు, వీరి ఆధారంగా వ్యక్తమయిన సన్నివేశాలు, భావనావిధానాలు, అనుభవాలు భాగవతాదులలో ఎక్కడా కని పించవు. మరొకవిధముగా చెప్పితే వాటిల్లో కనిపించని విషయాలే ఈ కావ్యంలో చిత్రింపబడ్డాయి. ఈ అంశము "విశ్వరూపము" అనే ఖండిక (51) చివర వ్యంగంగా స్ఫురిస్తుంది.

"—స్వామి వానికి వ్యాసమౌని
వ్రాని లేనట్టి విశ్వరూపంబునెఱపె."

ఇక్కడి "వాడు" భారత భాగవతాదులలో వ్యక్తీకరించబడని అంశాలు మాత్రమే ఒక విలక్షణమైన పద్ధతిలో శ్రీకృష్ణ సంగీతం వ్యక్తీకరిస్తున్నదని చెప్పవచ్చు. కావ్య విషయం శ్రీకృష్ణ సంబంధమైనది కాబట్టి వ్రేపల్లె, యమున, బృంద, వేణువు మొదలైనవి ఉంటాయి కాని, వీటిని ఉపయోగించుకున్న తీరు మాత్రం ఈ కావ్యంలో అపూర్వం. ఇవన్నీ కూడా వివిధాంశాలకు, భావాలకు ప్రతీకలుగా చిత్రింపబడ్డాయి.

శ్రీకృష్ణ సంగీతములో కృష్ణ భక్తి కేంద్ర బిందువు. ఆద్యంతము అనేక విధాలుగా అనేక మార్గాలలో ఇది చిత్రింపబడినది. ఆద్యంతమూ "సాగే" కథా వస్తువూ ఇందులో లేదు "ఇందు కృష్ణగత భావన కల్గిన గోపికలు తమ యను భూతులను భిన్న గాథల రూపమున దమ చెలులకు చెప్పటయు, తాము స్వగత ముగ భావించుటయు జరుగును. ఒక్కొక్క గాథ స్వామి ప్రణయాంశమును గాని, తాత్త్వికాంశమును గాని నిరూపించును వీని సమాహార స్వరూపము గోపికా హృదయాంతర్గతమైన స్వామి తత్త్వము. అది వారి హృదయములందు చిరంత నముగ మ్రుమ్రోంచుచున్న సంగీత స్వరూపము, నిరంతర చైతన్య స్వరూపము

గోపికారూప జీవాత్మల భిన్న, భిన్న భావములలో లీలావిలీనమైయున్న శాశ్వత బాలమూర్తి." ఆ మూర్తికి సంబంధించి ఎవరో గోపిక మరెవరో గోపికతో సంభాషించడమో, తన అనుభవాన్ని చెప్పడమో, ఏదో ఒక అంశాన్ని చర్చించడమో ఒక్కొక్క ఖండికగా రచింపబడ్డాయి కొన్ని ఖండికలలో కవియే ఒక సన్నివేశాన్ని చిత్రించడం కూడా కనిపిస్తుంది. కొన్ని ఖండికలు గోపికల కథనంతో మొదలై కవి కథనంతో పూర్తవుతాయి. కొన్ని సంభాషణలుగా సాగుతాయి. ఒక ఖండికకు, ఇంకొక ఖండికకు అవినాభావమైన అనుస్యూతి లక్షణం ఉండదు. అందువల్ల ఈ కావ్యమంతా వివిధ ఖండికల సంకలనముగానే కనిపిస్తుంది. ఈ కావ్యంలోని ఏక సూత్రత్వం అన్ని ఖండికలూ శ్రీకృష్ణ తత్వాన్ని ఆశ్రయించినవి కావటమే.

## శ్రీకృష్ణ సంగీత తరంగాలు :

శ్రీకృష్ణ సంగీతము 'దయ్యము' అనే ఖండికతో ఆరంభమవుతున్నది. ఒకానొక గోపిక తాను వ్రేపల్లెకు కాపురానికేగినట్టి "తొలి రేయి కథ" మరొక గోపికకు చెప్పినట్టుగా చిత్రింపబడింది. ఆమె భర్తతో ఏకశయ్యాగతురాలైనది. భర్త గాఢంగా నిద్రపోతున్నాడు కాని, ఆమెకు నిద్ర రాలేదు. ఇంతలో ఏవో ధ్వనులు వినిపించాయి. అది భర్త గురక కాదు. ఈ ధ్వని ఎక్కడినుంచి వస్తున్నదా అని ఆలోచించగా ఆది యమున ఒడ్డునుంచి వస్తున్నదనీ, ఎవరో ఆదుపులేని పిల్లవాడు ఊదుతున్న వేణువు ధ్వని అని అనిపించింది. ఎవరైతే నేమిలే అనుకున్నది కాని, ఆ పాడుతున్నది ఎవరో చూడాలనే భావం తీవ్రమయి, ఆమెకు తెలియకుండానే ఆ ధ్వని వెంట పడిపోయింది. కొంత దూరం పోయే టప్పటికి ఆ ధ్వని ఆగిపోయింది. ఆమె అక్కడనే స్మృతిలేక పడిపోయింది. మగడు, అత్తమామలు వెతుకుతూ వచ్చినారు. కొంతసేపటికి ఈమెకు స్మృతి వచ్చినది. ఇదంతా ఏదో దయ్యము చేసిన పని అని వారంతా అంటే ఔనని ఆమె కూడా అనుకున్నది. ఇది ఆ కథ ఇంత చెప్పి చివరకు ఆ గోపిక—

"మూడు యుగములు గడచెఁ బూఁబోడి! యెపుడు
దయ్యమది వేణువూదు కథల్ వినంగ
ధాము, తుది నాకునై ద్వాపరమున వచ్చె!"

అని అంటుంది. ఈ గోపికా కృష్ణ విషయమంతా ద్వాపర యుగమునకు సంబం ధించినది. నాలుగు యుగాలలో ద్వాపరము మూడవది. ఈ కథ కూడా ద్వాప రాంతమునకు చెందినది. ఇప్పటిదాకా ఏ దయ్యమో - దైవమో - భగవదవ తారమో వేణువు వాయించినట్లుగా లేదు. ఈ ద్వాపరాంతానికి ఆ వేణువు తన కోసం వచ్చిందని ఆ గోపిక అంటుంది.

'దయ్యము' పట్టినదని భర్త మొదలైనవారన్నారు. నిజానికి ఆమెను పట్టినది దైవము. దివ్యస్థాయికి చెందినది దైవమైతే, దాని వికృతరూపం దయ్యము. ఉభయత్రా లక్షణాలలో సామ్యముండవచ్చుకాని, భావించడంలో భేదం ఉంటుంది. దైవాయుత్తమైన భక్తుల స్థితి తదితరులకు దయ్యం పట్టినట్లుగా కనిపిస్తుంది. ఈ సృష్టి భేదము ఇక్కడ గుర్తింపతగినది.

గోపిక ఒక కథ చెప్పినట్లుగా చెప్పింది కాని, ఇందులో ప్రతిపాదింపబడిన అంశము వేణునాదములోని ఆకర్షణ శక్తి. ఇంతకు పూర్వపు అవతారాలలో ఎక్కడ కూడా ఈ తీరు కనిపించదు. ఒక్క కృష్ణావతారములోనే వేణువు ప్రధానాంశమైనది. రామ అవతారములో ధనుస్సు ప్రధానమైందే కాని అది శత్రు సంహారానికి ఉపయోగింపబడినది. కృష్ణుని వేణువు జీవులను ఆకర్షించు లక్షణానికి ప్రతీక. శ్రీకృష్ణ సంగీతములో ఈ వేణువు, వేణునాదం, దాని ఆకర్షణకు సంబంధించి అనేకవిధాలైన చిత్రణ కనిపిస్తుంది.

భాగవతములో ఈ వేణునాదానికి సంబంధించిన విశిష్టత శరద్రాత్రి ఘట్టములోనే కనిపిస్తుంది. సర్వ చరాచర ప్రకృతి వేణునాదానికి పరవశమయి పోయినట్లుగా అక్కడ చిత్రింపబడినది. ఈ కావ్యములో కూడా పారవశ్య లక్షణం వివిధ జీవుల సంస్కార భేదాన్నిబట్టి వేరు వేరు తీర్లలో ఉన్నట్లుగా చిత్రింపబడినది. దయ్యము శీర్షికలోని కథలో వేణుగానానికి ఆ గోపిక కొంత దూరము మాత్రమే పోయింది. ఆ గాన మాగిపోవటం, ఆమె స్మృతి తప్పటం ఆ జీవియొక్క స్థాయిని సూచిస్తుంది ఇక్కడి ఈ అంశానికి భ్రమరగీతలలో "అంతటి పాటలో యమున యన్నది నేరకపోవుచుండగా...." (18 వ పద్యము) అన్న పదములోని భావము సజాతీయముగా కనిపిస్తుంది. వేణుగానాన్ని వింటూ, దారియొక్క స్పృహ లేకుండా వస్తున్న గోపికలు యమునానది దగ్గరకు వచ్చే

ఒప్పటికి గానం ఆగిపోయింది. గోపికలకు స్పృహ వచ్చి దారి తప్పుకున్నారు. తాము యమునా నదిలో పడకుండా, తన గాన మాపి స్వామి తమను రక్షించా డని గోపికలు భావించారు. ఇక్కడి ఈ ఖండికలో వేణుగానాన్నిబట్టి గోపిక రావడం సజాతీయత్వమే. అక్కడ గోపికలకు గానం ఆగేటప్పటికి స్పృహ వచ్చింది. ఈ గోపికకు ఉన్న స్పృహ తప్పింది. వేణుధ్వని ఈ విధంగా వివిధ వ్యక్తుల సంస్కారాలను, ప్రవృత్తినీ అభివ్యక్తీకరిస్తుంది.

శ్రీకృష్ణ సంగీతములోని అనేకానేక ఖండికలలో వేణు ప్రసక్తి ఉండనే ఉంటుంది. గాన విషయము చిత్రింపబడుతుంటుంది. అయినా వేణువుకు సంబంధించిన శీర్షికతో ఉన్న ఖండికలు 9 మాత్రమే

| శీర్షిక | సంఖ్య |
|---|---|
| ధాత్రి వేణువు | 3 |
| విదుర వేణువు | 17 |
| వేణు భూత | 18 |
| వేణు పరీక్ష | 19 |
| దూర వేణువు | 32 |
| రక్షో వేణువు | 49 |
| వేణు ఫలము | 59 |
| తోడి వేణువు | 63 |
| వక్ర వేణువు | 91 |

వీటిలో వేణువుకు సంబంధించిన విషయం అనేక విధాలుగా చిత్రింప బడినది. ధాత్రి వేణువులో ఒక గోపిక ఇంకొక గోపికతో కొంత వెక్కిరింతగా మాట్లాడుతుంది.

"నందగోపుని మగబిడ్డ యందమెల్ల
చూరగాననెంచుచున్నట్టి సుందరాంగి
వాని చిహ్నంబు లెచ్చటఁబడిన నచటఁ
గనఁబడున యన్నదగు ప్రతిజ్ఞానిరూఢురాల!"

అని సంబోధించి కృష్ణుడంతటా వ్యాపిస్తాడనే భావాన్ని వెక్కిరిస్తున్నట్టుగా "మా జన్ని కుట్టికట్టావు కాలిగిట్ట గుర్తులలో బరీక్షించినాను. చీలికను మౌళి నెమ్మిపించియముకాడ నైతమును బోల్చుకొనునట్టి జాడలేదు ..." అంటుంది. ఆవు కాలిగుర్తు నెమలి పించంతో కొంత పోలిక కలిసి ఉంటుంది. కాని, అక్కడ పోల్చుకోదగింది ఏమీ ఉండదని శ్రీకృష్ణుని సర్వవ్యాపిత్వము మీద వెక్కిరింత. అప్పుడు ఈ రెండవ గోపిక—

''అందరును నిద్రపోయిన యర్ధరాత్ర
మందు వచ్చెద, పున్నమ చందిరుండు
నేడు తనుకారు జిలుగువెన్నెలలు కాయు
నావుకట్టావుగద। గిట్టలఱుము గుర్తు
లంత మాత్రము వెన్నెలయందుఁదప్ప
కుండ గన్పించునని—''

అప్పుడు చూడవచ్చునని రమ్మంటుంది. ఆ రాత్రి ఇద్దరు వెన్నెల్లో గిట్ట గుర్తులు వెతుకుతూ నేలకు చెవులాన్చి వింటారు. అప్పుడు ''దూర దూరవికల పాతాళమును శ్లథమై పురాణ వంశనాళమ్ము నందున వాయు వురలి యుదరి పడినట్లు వచ్చెడు నోసరిలుచు'' నేలకు చెవి నాన్చినపుడు వారికి, పాతాళమును చీల్చుకొని పైకి వస్తున్నట్లుగా వేణునాదము వినిపించింది. ''ప్రాతముళ్ళను సడలించుకొనుచు వచ్చినది'' అనగా ఆ గోపికలో క్రమ్ముకొన్న అనేకములైన అవిద్య పొరలను చీల్చుకొనుచు పరమేశ్వర భావము ఉద్భుదమైనదని తాత్పర్యము.

''వేణుభూత'' అన్న ఖండికలో ఒక గోపిక వేణువుగానే తనను అను కుంటుంది. ''గాలి పోసుకఁ బతుకుదుగాదె నేను, నలినలోచన దూరుచున్నాడు నన్ను'' "వేణువుగ బూని ప్రాణాల వివరములను, తనకు బొడ్డు సుడిన్ సము ద్యత్తరంగభంగములుగాగనై తోకపైనిలేచు పామువలె నాడుచున్నట్టి వాయువు లను పోయుచున్నాడు బుడగలు పుట్టునట్లు.'' ఇక్కడ పామును గూర్చి చేసిన ప్రస్తావన కుండలినీయోగాన్ని స్ఫురింప చేస్తుంది. ''ఇదివరకె స్వామి యూదిన ఎన్ని ఎన్ని పిల్లఁగ్రోవి సవ్వడులు విన్పించుజుమ్ము, చెవిని నా గుండె దగ్గర

చేర్చి వినుము'' అనడంలో ఈ మార్గాన పూర్వుల పరంపర స్ఫురిస్తుంది. "స్వామి వేణురవంబు పూర్వంబు విని తదంతరాంతర మాధుర్య మాత్మనెఱుగు వారికేగాని తెలియదు" అంటుంది. ఈ రకమైన యోగసిద్ధికి దాని గూర్చిన తెలివిడి అవసర మన్న అంశము కూడా స్పష్టపడుతుంది.

''తోడి వేణువులో'' నాదోపాసన చిత్రింపబడినట్టుగా స్ఫురిస్తుంది. ఒక గోపికకు కల వచ్చింది. ఎవరిదో పెళ్ళి పాట పాడుమని కొందరు బలవంతం చేశారు. ఆమె పాడుతుంటే తోడుగా ఒక వేణునాదం కూడా సాగుతున్నట్లు అనిపించి, ఆమె పరకాయించి చూడగా, దూరములో పొదల దగ్గర మంటలు కనిపించాయి. భయపడేసరికి మెలకువ వచ్చింది. ఆ తర్వాత ఆ గోపిక ఎప్పుడు అనుకోకుండా పాట పాడినా వేణురవం తోడుగా వస్తూనే ఉంది. స్వామి యూదుచునుండగా వనిత చాలసార్లు విన్నది. హృదయంబు సంతసింప అరయ ఈ తోడివేణువు అట్లులేదు. భయము కనిపించుచున్నది భామ ఎడద. అందుకని తాను పాట పాడవద్దని నిశ్చయం చేసుకుంటుంది. ఎప్పుడో అప్పుడు తనకు తెలియకుండానే గొంతులోంచి పాట రావటం, దానితోపాటు వేణుధ్వని, దానితో పాటు భయము. ఈ భయము పోగొట్టుకొనుట కొరకు, ఆ ధ్వనికి అలవాటు పడడం కొరకు అయినదానికి, కానిదానికి పాట పాడడమే సాగించింది. చివరకు ఆమెకు అదొక పిచ్చిగా మారింది. శరీరానికి సంబంధించిన శ్రద్ధ పూర్తిగా పోయి, ఆమె ఆడ బైరాగిలాగ మారిపోయింది. అందరామెను పిచ్చిది అనుకున్నారు కాని, ఆమెకు మాత్రం భయం పూర్తిగా తొలగిపోయింది. "ఆమెకు వేణురవమట్లె ఎప్పుడు వినిపించుచుండు." ఈ ఖండికలో నాదోపాసన తీరు విచిత్రంగా చిత్రింపబడినది. ఇక్కడ మంటలు, భయము ఉపాసనా మార్గములో కలిగే ఒడిదుడుకులకు సూచన. సర్వదా వేణుగానము వినిపించడము అనేది సిద్ధికి సూచన. ఈ విధముగా ఒక్కొక్క వేణు ఖండిక ఒక్కొక్క విధమైన అనుభవాన్ని, శాస్త్రీయ విషయాన్ని, ఉపాసనా విధానాన్ని వ్యక్తీకరిస్తూ ఉంటుంది.

ఈ సందర్భములోనే "కృష్ణ యంత్రము" ఖండిక గూడా గమనించ దగినది. ఇందులో ఒక గోపిక కలవరిస్తున్నట్టుగా చిత్రించబడినది. ఆమె కలువరింతయు ఒక క్రమంతో సాగినట్లు కనిపిస్తుంది. మొదట్లో "జోగి జోగి పోపో!"

అనడంతోపాటు జోగి చిత్రణ ఉంటుంది. పద్మాసనం వేసుకొని శూన్యమో కనుల యందు వెనుక చూపులు కల యోగాభ్యాసము ఇందులో స్పష్టపడుతుంది. ఆ తర్వాత "పొమ్ము పొమ్ము బాల బాల పొమ్ము" అంటుంది. ఇక్కడ లలితాదేవి యొక్క బాలాస్వరూపము చిత్రించబడుతుంది. ఆ తర్వాత "పిశాచాధినేత పొమ్ము పొమ్ము స్వామీ, స్వామి పొమ్ము పొమ్ము" అంటుంది. ఇక్కడ శివ స్వరూపము చిత్రించబడినది. ఈ ముగ్గురిని పొమ్మన్న తర్వాత "రమ్ము రమ్ము గోపాలకా రమ్ము రమ్ము" అంటుంది. ఈ అనటంలో బాలగోపాల స్వరూపం చిత్రింపబడుతుంది. చివరకు "వంచనము సేయకుర కౌగిలించినంత । పూని కౌగిలి కౌగిలిలోనె జోగి । వగుదు, బాలవ గురువు, మువ్వాయి తాల్వ । వ గురు త్రిప్పలు పెట్టకుమయ్య స్వామి!' అంటుంది. అంతే.కృష్ణభావావరణతోనే యోగి, బాల, శివుడు ముగ్గురు ఇమిడిపోతున్నారు. మువ్వాయి తాలుపు అంటే శూలధారి అని తాత్పర్యం. ఇక్కడ ఒక్కొక్క రకమైన ఉపాసనతో ఒక్కొక్క మెట్టుగా అధిగమించి, శ్రీకృష్ణ ఉపాసనలోనే వాటి పరిణతి అనుభవానికి వచ్చినట్టుగా చిత్రించబడినది. అందుకే ఒక గోపకుడు తన కోడలు ఈ విధముగా కలవరిస్తున్నదని చెప్పినపుడు ఈ లక్షణం తెలిసిన బ్రాహ్మణుడు కృష్ణయంత్రాన్ని ఇచ్చినట్లుగా ఈ ఖండిక సమాప్తమవుతుంది.

జీవుల పరమేశ్వరానుభవము వైయుక్తికము. ఈ అంశము 'రహస్యము' అన్న ఖండికలో వ్యక్తము చెయబడినది. ఒక గోపిక మరొక గోపికతో ఒక రహస్యము చెప్పుతుంది. "ఎదదలో బరువుగా కూర్చుండి, ఎవరితోనైనా చెప్పక ఈ యెదంద నిలుచునట్లుగ లేదు" అని చెప్పక తప్పదన్నట్లుగా చెప్పుతుంది. మరెవరితో చెప్పనని చేతిలో చేయి వేయించుకొని మరీ చెప్పింది. ఇంతకూ ఆమె చెప్పిన రహస్య మిది: "నాతోడ శ్రీమనోజ్ఞ । మందహాసుడు, లే చందమామ వంటి నొసలివాడు, కన్నుల నవ్వు మసలువాడు । ఎంచి నన్ను నొక్కర్తె । ప్రేమించు నంట । స్వామికిన్ నేను కలలలో వత్తునంట । తక్కినందరు నిట వచ్చెదరు మరెట్లు । పొమ్మనుట యంచె గాని నా పొన్ను దమ్మి । వంటి మొగములు లేవని, కంటి జిగులు । లేవని వచించె జూమీ, నమ్మలేదు నేను, నమ్మేడు విధంబుగా చెప్పినాడు. తుదకు । వనిత । నమ్మక తప్పక వచ్చినది." ఇది ఆ రహస్యము. ఈ రహస్యము విన్న ఆ మరొక గోపిక ఏడుస్తుంది. ఈ చెప్పి నామె ఎందుకేడుస్తున్నావని బలవంతం చేసి అడుగుతే నాతోడ గూడ ఈ రీట

చెప్పె స్వామి అన్నది. ఇట్లాగే ఇతర గోపికలతో కూడా చెప్పినట్లు తెలుస్తుంది. చివరకు అందరు కలిసి స్వామి దగ్గరకు వెళ్ళి ఎందుకిట్లా చెప్పావయ్యా అనడిగితే "ఒక్క మాట కూడా మీరు దాచలేరు. 'ఒకడ నన్ను క్రొవ్వు కుందురటే" అని అన్నాడు. అంటే పరమేశ్వరుని అనుభవము ఎవరికి వారికే స్వంతమైనది. స్వామి అనుభవము తనకే అనిపిస్తుంది. కాని, యదార్థము స్వామి ఏ ఒక్కరివాడో కాదు. అందరికీ స్వామి అందరివాడే, ఈ రహస్యము భక్తుల అనుభవానికి సంబంధించినది.

భక్తుల యొక్క ప్రకృతిలో ఎంతో వైవిధ్యముంటుంది. ఎవరివి వారివేను. "ప్రేమయు భక్తి, వచ్చి పూసుకొంచు తిరిగెద స్వామి యులికించ బోడు, స్వామి కొలగారము మరిబోలు" అని ఒక గోపిక అంటుంది. (ఒక ప్రకృతి-15 వ ఖండిక.)

"ఎండవెన్నెలలు" అనే ఖండికలో అక్షిపురుషోపాసన లక్షణం కనిపిస్తుంది. అందరు గోపికలు రాత్రి పూట స్వామి దగ్గరకు వెళ్ళి సేవించ గలరు. కాని, ఒక గోపిక అట్లా వెళ్ళడానికి వీలుకుదరక రాత్రంతా స్వామి స్మృతితోనే గడుపుతుంది. ఆమెకు స్వామి దర్శనము పగటి పూట మాత్రమే "కనిపించిన ఆ కృష్ణుడు । ఎడమ కను మూసి కుడి కన్ను నింత నిచ్చి యొక్క చటుల శృంగార భావోదయముగ కనుబొమలు నాట్యమాడించు, కదిలించి తలమకర కుండలమతులు మణి కిరీట హారి కేయూర వంతుండు, హస్త యుగళి నియత శంఖచక్రుడు, హిరణ్మయవపుషుడు, సరసిజాసన సన్నివిష్టముగాతోచు."

"ధ్యేయః సదా సవితృ మండల మధ్యవర్తి
నారాయణస్సరసి జాసన సన్నివిష్టః
కేయూరవాన్ మకర కుండలవాన్
కిరీటీ, హారీ హిరణ్మయ వపుః ధృతశంఖ చక్రః"

....అన్న శ్లోకంలోని వర్ణన ఇక్కడ చేయబడింది ఆమెకు శ్రీకృష్ణుడు ఆదిత్య మండలాంతర్గతుడైన నారాయణుడుగా దర్శన మిచ్చినాడు. "ఎడమ కనుమూసి కుడి కన్ను నింత నిచ్చి" అనటం ఈ అంశాన్ని సూచించటానికే. పరమేశ్వరునికి కుడి - ఎడమ కనులు సూర్యచంద్రులు. అందువల్లనే ఆమె మిగతా గోపికలతో

"అరయ చల్లని వెన్నెలలనుభవింప మీరలు, నా పాలి ఎండలయ్యె।" అంటుంది. ఇక్కడి ఎండలు ప్రసక్తి పై ఉపాసనకు సూచకము.

అక్కడక్కడ కొన్ని ఖండికలు తాత్విక విషయాలను నేరుగా వివరించినట్లుగా ఉంటాయి. ఉదాహరణకు 'అచ్చ తెలివి' (54 వ ఖండిక) చూడవచ్చు.

"ఆమె యిట్లన్న యది కృష్ణుడన్న వాఁడు
దేహి, దేహమ్మునకు లేదు తెలివి, తెలివి
యది యనంత కోట్ల విధాలఁ గదలుచుండు,
కొన్ని తెలువులు సృష్టికై కొన్న యపుడు
దేహములు తాల్చి, తపములు తీర్చి తీర్చి
సర్వలోక మహోగ్ర శిక్షా నిరూఢి
సర్వలోకైక సాదురక్షా నిరూఢి
పేర్చి తమయందుఁబట్టి నిల్పికొని పొలుచు!
నుగ్ర తపములచే శక్తులుద్భవిల్లు
తెలివికిఁ దనంత లేదు, శక్తి, తపమొలనీ
కల్లు, దేహధారణము లేక అది కల్ల,
దా మహాశక్తి తేజోమయంబు దేహ
మొకటి నిర్మించి కొంచుఁ దాన్నుండు వాఁడ
సాధ్య, దేహధారులకంటె శక్తి కలఁడు
దేశమును గాలమును దదధీనమైన
తెలివి తెలివిగా నుండును దెలివి కొంత
యొక్కచోఁ జేరుకొని తపస్సుగ్రమగుచు
దివ్య దేహమ్మొకందు సంధించుకొంచుఁ
దనకు మించని తెలివిపైఁ దాల్చు ప్రభుత
ప్రభుత తాల్చుటయనఁగాఁ దపస్సుయొక్క
కోటి సంవత్సరాల్ చేసికొనుట మరియుఁ
ద్రిగుణముల కూర్పులోఁ గొంత తీర్చికొనుట

వేఱ భగవంతుఁడని లేఁడు పిర పిర
యందు నధిక తపస్వియైనట్టి వాఁడు
కాక, తపమందె నిలుచు జగంబిదెల్ల!
తెలివి సాక్షిగఁ జూచు నంతయు లతాంగి
యితఁడు నాపై మహా తపమ్మేచువాడు
దేహము ధరింపకయ తన తెల్విచూపు
మనుము, చూపఁగా లేకె దేహము ధరించె!
తెలివియు విచిత్రమది యేక దేశమందు
నెట్లో సర్వదేశమునందు నట్లె తపము
పెద్ద యైనట్టిది తెలివి ముద్ద తానె
యఖిలమగు తెల్విగానగు నది యెఱుంగు
నెఱుఁగుటయు దాని శక్తియె యెసక మెఁసగు
ననిన శ్రీకృష్ణుడిట్లనె నామె తపము
కొలది యెంతయొ చని కనుగొంచరమ్మ
నంచ స్వామి! నేనే యామె. నస్మదీయ
మగు తపమ్ము భవద్ధయానుగము, వేణు
వేల? కళలెందుకు? రసించు టేల? నాకు
నచ్చ తెల్వి ప్రసాదించు మనుచుఁ జనియె."

ఇందులో 'తెలివి' జీవికి పర్యాయముగా చెప్పబడింది. ఆత్మశుద్ధ జ్ఞాన స్వరూపము. అదే అచ్చ తెలివి.

"ఆత్మ నిత్యమ్ము కాలాద్య వచ్ఛిన్నమ్ము సచ్చిదానంద సంపచ్ఛయమ్ము
అద్వితీయమ్మేకమ పరిణామ్మప్రాప్తపరిమేయమ్మది యచ్చతెలివి
అట్టి జ్ఞానముతోఁడనైన కాలికముగా నాది మునుల్గలరా ప్రభువులు
యోగనిద్రాముద్రనూ తామే యద్దై యదియ తామైయుందు
రమృతకళలు"8

అని సత్యనారాయణగారు రామాయణ కల్పవృక్షమును ప్రారంభిస్తూ చెప్పిన విషయము ఈ ఖండికలో భంగ్యంతరంగా వివరించబడింది.

ఈ ఖండికలో తపోలక్షణము ప్రస్తరించబడినది. తపస్సుచేత ఆత్మైకం లభిస్తుంది. తపస్సులోని అంతరాలు ఫలసిద్ధిలోను అంతరాలు కలిగిస్తుంది. గోపిక తపో విషయాన్ని వివరించగా చివరకు శ్రీకృష్ణుడు "అమె తనముకొలది ఎంతయో చని కనుగొంచురమ్మ" అనటంలో ఈ అంశం స్ఫురిస్తుంది. మరొకటి - ఈ తపస్సుకూడా భగవత్ దయాధీనమైనదే. అందువల్లనే గోపిక చివరకు తనకు అచ్చతెల్వి ప్రసాదించమంటుంది.

"ఇద్దరు ఋషులు" వంటి కొన్ని ఖండికలు తత్త్వవ్యాఖ్యానరూపముగా కనిపిస్తాయి. కృష్ణుడిని చూసి ఒక గోపిక ముసిముసి నవ్వులు నవ్వుతుంటుంది. అప్పుడు కృష్ణుడు ఆ గోపిక చెంగుబట్టి లాగి గోలచేసి, నవ్వడానికి కారణం చెప్పమంటాడు అప్పుడామె "నాకు నవ్వేల వచ్చెననంగ పిచ్చి శూర్పణఖ నాడు వచ్చి నీ చుట్టు తిరిగి కత్తిరింపులు పడ్డదికాని, నేడిదెంత సులభము, వ్రేపల్లె ఇంతియైన అన్న ఊహ వచ్చినది. నాకందుచేత నవ్వు వచ్చినది" అంటే మరికొంత వివరించమంటాడు కృష్ణుడు. అప్పుడామె రాముడు ధర్మరక్షకుడని అంటుంది. ''నేను కాననే కదా!''అని అంటాడు కృష్ణుడు. వ్రేపల్లెలో జరిగినదంతా చూస్తే నీకే తెలుస్తుందంటుంది గోపిక. అప్పుడామెకు "ఆట్లై కనిపించిరిద్దరు మహర్షు లొక్కరుండు తపోమూర్తి, యొకడు జ్ఞానమూర్తి, తొలుతటి ఋషి రామమూర్తి, యితడు నెదురుగా వచ్చి నిలుచుండెఁ కృష్ణమూర్తి!" రామ కృష్ణులకు చేయబడిన తాత్త్విక వ్యాఖ్యానమిది.

ఒక గోపిక బిక్కమొగముతో బృందలో స్వామిదగ్గరకు చేరుతుంది. ఆమె దుఃఖ కారణాన్ని స్వామి అడిగితే ఇట్లా చెప్పుతుంది. "గోపికలందరు వచ్చి నీ అమృతమూర్తిలో తన్మయత్వం పొందుతారు. నేను నీ గుట్టుమట్టులు తెలిసి వారినిగూర్చి విచారిస్తానే తప్ప తన్మయత్వం పొందలేను. వేణునాదమందలి అర్థాన్ని వివరిస్తాను కాని, దానిలో లీనం కాలేను. నేను పండితురాలను. వారి పారవశ్య విషయం తెలిసికూడా, నేను విడిగా మాత్రమే ఉంటున్నాను. తన్మయత రాదుకాని కంటనీరు, గొంతులో గాద్గదికత్వం వస్తుంది.. అంతకు మించి పైకి పోలేదు. అన్ని తెలిసి ఉండడం అనేది ఒక దోషమా?'' అని

అంటుంది. అప్పుడు కృష్ణుడు ఆనందమన్నది ఉన్నది, అందులో భేదాలున్నాయి. "పరమమైన ఆనందము. పరమమైనట్టి విజ్ఞానమును రెండు అవధి యంచులేని, ఉనికి లోపల చేరి లీనమగును.'' ఇప్పటి నీ స్థితి మొదటి మెట్టు అంటాడు. "అవధి యంచులేని ఉనికి'' అంటే సత్ పదార్థము. అది విజ్ఞానానంద ఘన రూపము అయినది. పట్టి జ్ఞానము పారవశ్యతను కలిగించి ఆనందమయమైనప్పుడే ఈశ్వరతాదాత్మ్యము సిద్ధిస్తుందని "మొదటి మెట్టు" అన్న (76 వ) ఖండికలో వ్యాఖ్యానించబడింది.

"వ్యర్థ దౌత్యము" (79 వ) ఖండికలో కృష్ణ, గోపికల సంబంధాన్ని కూర్చిన వ్యాఖ్యానము వేయబడింది. ఇది ఒక గోపిక మరొక గోపికతో చెప్పి నట్లుగా సాగుతుంది. కృష్ణుడు బాలుడు కాబట్టి వారిమధ్య జారత్వశంక లేదు. అయినా వారు అతనినే భావించడం. నటునకు రసానుభూతి ప్రధానం కాదు. అది ప్రధానముగా సామాజిక ధర్మము. సామాజికుడంటే సహృదయుడైన ప్రేక్షకుడు. ప్రతి ప్రేక్షకునికి రసానుభూతి కలుగదు. పూర్వజన్మల నుంచి సమార్జిత పొందిన వారికే రససిద్ధి కలుగుతుంది. రససిద్ధి విషయమై ఇట్లా ఉంటే, ముక్తిని గూర్చి వేరే చెప్పడమెందుకు? "పున్నెము ఉండి ముక్తికి అభి ముఖంబుగ నున్న భక్తునకు మాత్రమే మోక్షమిచ్చును మాధవుడు. హృదయ పతియని బయలుదేరిన లతాంగులందరుకు ముక్తి యబ్బిన నద్దిముక్తి కాదు." అంటుంది. ఇందులో రసానంద, బ్రహ్మానందములను పోల్చి చెప్పడం వాటిమీద చేసిన వ్యాఖ్యాన్యాన్ని స్ఫురింప చేస్తుంది. ఈవిధముగా కృష్ణ సంగీతములోని ప్రతి ఖండిక భక్తి జ్ఞాన వైరాగ్యాలకు సంబంధించి, ఉపాసనలకు సంబంధించి, అను భూతికి సంబంధించి ఏదో ఒక అంశానికి వ్యాఖ్యానంగా చిత్రణగా రూపొందింది.

మిగిలిన కావ్యాలలో లేని ఒక ప్రత్యేకమైన అంశము శ్రీకృష్ణ సంగీతములో కనిపిస్తుంది. అది దశావతార చిత్రణ.

శ్రీకృష్ణుడు భగవదవతారముగా చెప్పడం సామాన్యం. భగవంతుడైన విష్ణువుయొక్క అనేకమైన అవతారాలలో దశావతారాలు ప్రసిద్ధమైనవి. వీటిలో కొన్ని అంశావతారాలుగా, కొన్ని ఆవేశావతారాలుగా, కొన్ని సంపూర్ణావతా రాలుగా భావించబడుచున్నాయి. మత్స్యావతారము మొదలు పరశురామావ

తారం వరకు అన్నీ ఆవేశాంశాం అవతారాలే. ఈ ఇద్దరిలోను శ్రీరామచంద్రుడిని మాయా మానుష విగ్రహుడని, శ్రీకృష్ణుని లీలామానుష విగ్రహుడని అంటారు. శ్రీకృష్ణునియందు భగవత్‌స్పృహ నిత్యజాగృతంగా ఉంటుందని తాత్పర్యము. అందువల్ల ఈ అవతారాలన్నింటికి మూలమైన విష్ణు స్వరూపానికి, కృష్ణ స్వరూపానికి అభేదము. భాషలో విష్ణువాచకమైన పదాలన్నీ కృష్ణవాచకాలుగా వ్యవహరింపబడటానికి కారణం ఇదే. ఈ కావ్యంలోని దశావతార వర్ణన ఈ అంశాన్నే స్ఫురింప చేస్తుంది.

సాధారణంగా కావ్యాల్లో దశావతార వర్ణన ఒక పద్ధతిలో సాగుతుంది ఫలానా అవతారములో ఫలానా పని చేశావు అన్న విధముగా వర్ణనామయ స్తోత్రరూపముగా సాగుతుంది. ఇందుకు మనుచరిత్రాదులలోని దశావతార వర్ణనలు చూడవచ్చు. సత్యనారాయణగారు కూడా మధ్యాక్కరలలోని మున్నంగి శతకము, శేషాద్రి శతకము అన్న రెండింటిలో దశావతార వర్ణన చేశారు. మున్నంగి శతకములో ఒక్కొక్క అవతారాన్ని గూర్చిన వర్ణన ఒక్కొక్క పద్యంలో సాగగా, శేషాద్రి శతకములో ఏకోత్తరాభివృద్ధిగా - అనగా మొదటి అవతారము ఒక పద్యంలోను, రెండవ అవతారము రెండు పద్యాలలోను, మూడవ అవతారము మూడు పద్యాలలోను........ఈ విధముగా సాగుతుంది. ఈ రెండు సందర్భాలలోను దశావతార వర్ణన ప్రబంధ సామాన్య పద్ధతిలో కాకుండా ఆత్మానుభవ సమన్వయంతో చిత్రణ సాగుతుంది. ఉదాహరణకు పరశురామావతార వర్ణన—

"ఇతె తానధికారమున్న దంచు నేయితరుల సొమ్ము
లట్టె కోరిక మాత్ర వచ్చి వడవలె న్యాయమ్ము లేదు
మిట్టి పాటున కంతు పంతు లేదాయె పీది గొడ్డంటి
పెట్టుగాఁ ద్రుంచెదు వాని మున్నంగి వేణుగోపాల!"[9]

ఇక్కడ కార్త వీర్యార్జునుని విషయాన్ని వర్తమాన కాలంతో సమన్వయించి చెప్పడం గమనింపదగినది. అన్నింటిలోను ఇట్లాగే ఉంటుంది.

శేషాద్రి శతకములో కూడా ఇదే తీరు సాగుతుంది. అధిక్షేపము, వ్యంగ్యము, వ్యాజనిందవంటి అంశాలు ఈ వర్ణనలో కన్పిస్తాయి. కాని, శ్రీకృష్ణ సంగీతములో దశావతార చిత్రణ ఈ అన్నింటికంటే కూడా భిన్నమయినది.

శ్రీకృష్ణ సంగీతములో దశావతారాలు కృష్ణుని యందే చిత్రింపబడు తాయి. సాధారణంగా దశావతార వర్ణన కల్క్యవతార వర్ణనతో పూర్తవుతుంది. కావ్య సమాప్తి కూడా ఆ వర్ణనతోనే. వీటిలో శ్రీకృష్ణుని యొక్క సాక్షాత్ భగవత్ లక్షణము సర్వావతారలక్షణ సన్నివేశము చిత్రింపబడుతుంది. దశావతార పరిగణనలో రామావతారం తర్వాత బలరాముడిని పేర్కొనడం ఒక సంప్రదాయం —

"మత్స్యః కూర్మో వరాహశ్చ, నారసింహశ్చ వామనః
రామో రామశ్చ రామశ్చబుద్ధః కల్కిరేవచ"

అన్న దశావతార పరిగణన శ్లోకం సుప్రసిద్ధమే. ఇందులో పేర్కొన్న ముగ్గురు రాములు భార్గవ, దాశరథి, బలరాములు అయితే "రామో రామశ్చ కృష్ణశ్చ" అని కృష్ణుని చేర్చడం కూడా సంప్రదాయమే. కృష్ణుడే సంపూర్ణావతారముగా భాగవతాదులలో చిత్రింపబడటంవల్ల ఇదే ప్రసిద్ధ సంప్రదాయమైనది. శ్రీకృష్ణ సంగీతములో "సంకల్పాది (87); ఆటలో ఆబేలు (88); నామగత దురహం కారము (101); జాతి లక్షణము (102); గ్రామ వర్ణము (103); రాజస భక్తి (104); నిర్గుణుడు (105) అన్న ఖండికలలో మత్స్యావతారము మొదలు రామావతారము వరకు చిత్రణ సాగుతుంది. కామమూర్తి (106); తెల్లరాతు (107); నూటికెద్ద బాణము (108) అన్న ఖండికలలో వరుసగా బుద్ధ, కల్కి, కృష్ణావతారాలు చిత్రించబడ్డాయి.

ఈ అవతార వర్ణనలన్నీ చిన్న కథలుగానో, సన్నివేశాలుగానో చిత్రించ బడ్డాయి. సంకల్పాది ఖండికలో సన్నివేశమిది:

యశోద రోజూ శ్రీకృష్ణునికి స్నానం చేయిస్తూ ఉంటే, నేనే స్నానం చేస్తాను. నన్ను యమునకు పోనీయవు, స్నానం చేయడం, ఈదడం నాకిష్టం. యమునలోనుండి గంగకు, గంగనుండి సముద్రానికి పోయి, సముద్రంలో ఈదు లాడ కోరుతున్నా నంటాడు. యశోద కృష్ణుని మాటలను ముద్దు మాటలుగా భావిస్తుంది. ఒకనాడు కృష్ణుడు ఇక్కడే నాకు ఒక గదినిండా నీళ్ళు నింపితే అక్కడే ఈదులాడుతాను, లేకపోతే ఏ రాత్రో లేచి వెడతాను అంటాడు. అప్పుడు భయపడిన యశోద, పెద్ద గదినిండా నీరు నింపి స్నానం చేయమని చెప్పి,

ఇద్దరు పరిచారకల నుంచి వెళ్ళిపోతుంది. కృష్ణుడు నీళ్ళలో ఈదులాడుతూ తాను చేపను అంటాడు. ఆ ఇద్దరు స్త్రీలకు చేప కనిపిస్తుంది. వారు భయపడి యశోదకు చెప్పుతారు. ఆమె వచ్చి చూస్తే కృష్ణుడే కనిపిస్తాడు. ఆమె ఆ స్త్రీలను కోప్పడి వెళ్ళిపోతుంది. ఆ స్త్రీలకు మళ్ళీ మత్స్యరాజే కనిపిస్తాడు. ఆ తర్వాత యశోద వచ్చి కృష్ణుని బయటకు తీసి తుడుస్తూ 'చేప చేప అన్నారు' అని పరిహాసిస్తుంది. అప్పుడు కృష్ణుడు నేను చేపనే నా శరీరము పొలుసు వాసన వేస్తుంది చూడ మంటాడు. అప్పుడు యశోద కాదురా, నీళ్ళలో కలిపిన కర్పూరపు వాసన అంటుంది అప్పుడు "మోహము నిజమ్ము - బ్రహ్మ సమీహమైన ఆది సంకల్ప బీజమంచనియె శౌరి." ఇది మత్స్యావతార చిత్రణ. సృష్టికి "ఆది సంకల్ప బీజము మోహము" అనే అంశాన్ని యశోద ద్వారా ఇందులో చిత్రించబడినది. ఆమెకు కృష్ణుడు బాలకృష్ణుడే. ఎప్పుడు తన చంక నుండువాడే అంతకు మించి ఆమెకు శ్రీకృష్ణుని భగవల్లక్షణం తెలిసికూడా తెలియదు. ఇది మోహము. యశోదకు శ్రీకృష్ణ మృద్భక్షణ వంటి అనేక సందర్భాలలో శ్రీకృష్ణుని పరమేశ్వరత్వం వ్యక్తమయినా కూడా "కలయో వైష్ణవమయో, ఇతర సంకల్పార్థమో" అని అనుకుంటుందే తప్ప ఆమెకు యదార్థమందు స్థిరత్వం కలుగదు. మత్స్య ప్రస్తావనతో ఈ ఖండికలో ఈ విషయం చిత్రింపబడినది.

"నామగత దురహంకారము" కథ మరొక విధముగా ఉంటుంది. శ్రీకృష్ణుని రూపాన్ని చూసి దైత్య జాతికి కృష్ణుడు అవతారమేమోనని భయం పెరుగుతూ ఉంటుంది. ఒకడు తన కొడుకుకు హిరణ్యాక్షుడు అని పేరు పెట్టాడు. పెరిగిన కొద్ది తాను హిరణ్యాక్షుడనే అనుకుంటాడు. కృష్ణుడు కనిపించినప్పుడల్లా 'ఏమిరా పంది! నన్నెప్పుడు చంపుతావు' అని వెక్కిరిస్తుంటాడు. ఒకసారి కృష్ణుడు 'నేను పందినయి నిన్ను వధిస్తాను.' నీవు చచ్చిన తర్వాత నీవెరింగి ఏమి ఫలము ఎరుగక ఏమి ఫలము? అందువల్ల అందరితో పోయి చెప్పిరమ్మంటాడు. వారయినా తెలుసుకుంటారు గదా అని. అప్పుడు వాడు అందరికీ చెప్పి వస్తాడు. వారందరు ఇదంతా ఒక నవ్వులాటగా భావిస్తారు. కృష్ణుడు నిన్ను "ఎలయించుచున్నా"డంటారు. తర్వాత ఒకనాడు యమున మడుగులో వాని శవం కనిపిస్తుంది. బంధువులు పైకి తీసి చూస్తే కోరలతో పంది కుమ్మినట్లు వాని శరీరం మీద గాయాలు కనపిస్తాయి. నిజానికి ఆ రాక్షసుడు చంపబడవలసిన అవసరం లేదు. కాని, వాని అహంకారము వానికి ఆ గతిని కలిగించింది. వాని

పేరు ఆ అహంకారానికి మూలం. వాడు నిత్యం పంది చేత తన చావును భావిస్తూనే ఉంటాడు. ఆ భావనకు ఈ అహంకారము మూలము. వరహావతార చిత్రణ ఆ విధముగా సాగింది.

వ్రేపల్లెలో జాతర సాగుతుంటుంది. దేవత రేణుక. ఆమె కొడుకు పరశు రాముడు. ఒక గోపిక ఆ పరశురాముడు కృష్ణుడు విష్ణువే అనగా అన్నవారు "వాడు విష్ణువే అయితే పరశురాముడు చేసిన పనులన్నీ చేస్తాడు" అని వెక్కి-రిస్తారు. భార్గవరాముడు చిన్నపిల్లవాడుగా ఉన్నప్పుడే సర్వభూపాల వధ చేయ లేదుగదా! కృష్ణుడు కూడా పెరిగిన తర్వాత చేస్తాడంటుంది. పదేండ్లు గడువు పెడుతుంది. ఈ విషయమంతా కృష్ణుడికి చెప్పినపుడు "స్వామి నవ్వి నేనట్టుల సలపనేని తెరవా! వారువచ్చి ప్రాణాలు తీసెదర చే! అంత తలపైకి నరుదెంచినప్పు దెవ్వరి చేతనైన చేయింతు లే చెలియ" అంటాడు. అర్జునునితో సకల రాజవధ చేయించిన తీరు స్ఫురించి పరశురామ లక్షణం కృష్ణుని యందు అభివ్యక్తమవు తుంది.

ఈ విధముగానే "నిర్గుణుడు" అన్న ఖండికలో శ్రీరామచంద్రుని సగుణ తత్వలక్షణం, కృష్ణుని నిర్గుణతత్వము చమత్కారముగా చెప్పబడుతుంది. "రాముడు మరిగుణవంతుడగుట వ్రాసె వాల్మీకి, నినుగూర్చి వ్రాయుటకును నిర్గుణుడవీవు, వ్రాయగా నేర్వడెవడు, అతడు జనకుని మాటపై నడవికేగె, నీవు జనని మాటను చంకను నిల్పవు" అంటుంది యశోద. ఇక్కడ గుణశబ్దపు ప్రయోగము లౌకికంగా భాసిస్తూనే పరమేశ్వర లక్షణాన్ని కూడా స్ఫురింప చేస్తుంది.

ఈ విధముగా శ్రీకృష్ణ సంగీతములో సర్వ అవతారాలు కృష్ణావతార మందే సమన్వయింప చేయటం సత్యనారాయణగారు కృష్ణ తత్త్వానికి చేసిన వ్యాఖ్యానం.

మిగిలిన కృష్ణ కావ్యాలలో ఏదో ఒక ప్రధానమైన అంశాన్ని ఆద్యంతమూ విస్తరించుకుంటూ పోవడం కనిపిస్తుంది. కృష్ణ సంగీతం అట్లాకాక, అది ఒక భగవత్ విశ్వరూపం. కృష్ణతత్త్వాన్ని భూమికగా చేసి, పరమేశ్వర ప్రాప్తి మార్గ ములో జీవులకు సంబంధించి అనేక తాత్త్విక, ఉపాసనా పరమైన అంశాలను

చిన్న చిన్న కథలుగా చిత్రించటం ద్వారా పారమార్థిక ప్రపంచాన్ని ప్రస్తుతీకరించినట్లుగా ఈ కావ్యం రూపొందింది. ప్రతి ఖండికలోను విషయం శ్రీకృష్ణుని అనుగ్రహ లక్షణాన్ని ఏదో ఒక విధముగా స్ఫురింప చేస్తూనే ఉంటుంది. శ్రీకృష్ణ సంగీతములోని సంగీతము భగవదనుగ్రహానికి సంకేతము.

## పాదసూచికలు :

1. భావ సంకీర్తనము - వేంకట పార్వతీశ్వర కవులు, పుట 64. (తెలుగు ఛందో వికాసం - ఆధునిక ఛ్ఛందస్సు - కోవెల సంపత్కుమారాచార్యులు (1990) పుట 305).
2. కృష్ణ పక్షము - దేవులపల్లి కృష్ణశాస్త్రి (ఆమె కన్నులలో - పుట 123) 1983.
3. తెలుగులో కవితా విప్లవాల స్వరూపం - వెల్చేరు నారాయణరావు (1978) పుట 134
4. ఆంధ్ర మహాభారతము - ద్రోణ పర్వము 1 - 62.
5. ఆంధ్ర వాఙ్మయము - కృష్ణకథ - డా॥ ధారా రామనాథశాస్త్రి (1982) పుట 115.
6. ప్రియుడు లేదా ప్రియురాలు ఒకరి చేతిని మరొకరు పట్టుకొని ఉల్లాసంగా ఊపుకుంటూ పోవడమనేది శృంగారంలో ఒక మధురమైన చేష్ట.

    "ఉత్ఫుల్లగండ యుగముద్గత మందహాస
    ముద్వేలరాగమురరీకృత కామతంత్రం
    హస్తేన హస్తమవలంబ్య కరామసీలే
    సల్లాప రూపమమృతం సరసే రహస్యాః॥

    —కువలయావళి - అంకం 3 - పద్యం 4.

7. ఆంధ్ర వాఙ్మయము - కృష్ణకథ - డా॥ ధారా రామనాథశాస్త్రి (1982) పుట 117 & 118
8. రామాయణ కల్పవృక్షము - బాలకాండము - ఇష్టిఖండము - 2.
9. మున్నంగి శతకము - విశ్వనాథ మధ్యాక్కఅలు - 93 వ పద్యం.

ఆరవ అధ్యాయము

# వేణుసంతానగోపాల లీల

## మున్నంగి, నందమూరు శతకాలు :

విశ్వనాథ వారి కృష్ణ కావ్యాలలో కృష్ణ విషయంగా రచింపబడిన రెండు శతకాలు కూడా గ్రహింపవలసి ఉంటుంది. శతకము అనిబద్ధ కావ్యము. అంటే ముక్తకాల సంకలనమని తాత్పర్యము. లఘు కావ్యాల కోవలోకి ఇవి వస్తాయి. ప్రక్రియాపరమైన దృష్టితో మాత్రమే వీటిని లఘు కావ్యాలనడం. విషయము అభివ్యక్తిపరంగా వీటిని లఘు కావ్యాలని అనలేము. తెలుగులో ధూర్జటి "కాళహస్తీశ్వర శతకము'' మొదలైన శతకాలతీరు సామాన్య శతకాల కన్నా భిన్నమైనవి. ఈ భిన్నత్వము వాటిలో వ్యక్తమయ్యే జీవగతమైన ఆర్తి, వేదనల తీవ్రతను బట్టి గుర్తింపబడుతున్నది.

తెలుగులో శతక ప్రక్రియ వినూత్నమేమీ కాదు. కానీ మధ్యాక్కర ఛ్ఛందస్సులో శతకము వ్రాయడమన్నది మాత్రము అత్యంత వినూత్నమైన అంశము. నన్నయగారి తర్వాత ''భద్రచనయకా'' ఎఱ్ఱనగారు రచించిన ''భారతారణ్య'' పర్వశేషములో నన్నయగారి స్మృతిగా ఒకే ఒక మధ్యాక్కర పద్యము రచింపబడినది తప్ప, మళ్ళీ ఆధునికముగా ఆ పద్యాన్ని వెలుగులోకి తెచ్చి దానికొక వైభవాన్ని కలిగించిన గౌరవం కేవలం సత్యనారాయణ గారిది మాత్రమే. గత శతాబ్దం చివరన రాయదుర్గము నరసయ్యగారు తమ అభిజ్ఞాన శాకుంతలములో మూడు మధ్యాక్కరలు వాడి యున్నారు.1 ఈ శతాబ్దం చివరన ఒకళ్ళిద్దరు ఒకటి రెండు మధ్యాక్కరలు రచించినా వాటికి ప్రాచుర్యం కలుగ లేదు రామాయణ కల్పవృక్షములో మధ్యాక్కర పద్యము చాలా విస్తృతంగా విరివిగా ప్రయోగింపబడినది. రామాయణ రచనా కాలం చివరి రోజులలో సత్యనారాయణగారు కేవలం మధ్యాక్కర ఛ్ఛందసులోనే పది శతకాలు రచించారు. ఈ పది శతకాల సముచ్చయం ''విశ్వనాథ మధ్యాక్కరలు.'' ఈ రచనకు

అవకాశముంది. అందువల్ల రెండవ భాగపు అద్యక్షరాన్ని యతిగా చెల్లించి ఒక సమత్వాన్ని లాక్షణికులు దీనికి సాధించినారు కానీ, తొట్టతొలిగా తెలుగులో మధ్యాక్కర పద్యం కనిపించే యుద్ధమల్లుని బెజవాడ శాసనంలో యతి నాలుగవ గణం మొదటి అక్షరం (అంటే రెండవ భాగం మొదటి అక్షరం) కాక అయిదవ గణం మొదటి అక్షరానికి చెల్లించబడినది నన్నయగారు కూడా ఈ నియమాన్నే పాటించినారు. అయిదవ గణాద్యక్షరం యతి చెల్లించడముతో పద్యగతి విచిత్రముగా మారిపోతుంది. వచనపు లక్షణం సంక్రమిస్తుంది. సత్యనారాయణగారు రామాయణ కల్పవృక్షంలో ప్రయోగించిన మధ్యాక్కర పద్యాలలో అంతటా ప్రతి పాదములో నాలుగవ, అయిదవ గణాద్యక్షరాలకు యతి చెల్లించినారు. కానీ, ఈ పది శతకాలలో మాత్రం కేవలం అయిదవ గణాద్యక్షరాన్ని మాత్రమే యతి చెల్లించినారు. విషయానికి అనుగుణమైన తీరును సంపాదించినారు. సత్యనారాయణగారు మధ్యాక్కర పద్యానికి వ్యాప్తి తెచ్చిన తరువాత చాలామంది కవులు తెలుగులో మధ్యాక్కర పద్యాలను విరివిగా రచించారు. ఎక్కువమంది అయిదవ గణాద్యక్షరాన్నే యతిగా చెల్లించినారు.

మధ్యాక్కర పద్యం ప్రాచుర్యాన్ని చెందటంలో సమకాలీనంగా మరొక అంశం కూడా గుర్తింపదగినది. గణ యతి ప్రాసాదులతో నిమిత్తం లేకుండా కేవలం పాద నిరూపణం మీదనే ఆధారపడి అత్యాధునికంగా వచనపద్యం అనే ఒక ధోరణి తెలుగులో ప్రారంభమయినది. గణ యతి ప్రాసలతో ఉన్న మధ్యాక్కర పద్యం వచన పద్యానికి దీటుగా నిలువగలిగిన ఛందస్సు. ఈ ఛందస్సుతో పది శతకాలు రచించడం ద్వారా సత్యనారాయణగారు పరోక్షంగా వచన పద్యానికి దోహదం కలిగించారేమో ననిపిస్తుంది.[4]

ఈ పది మధ్యాక్కర శతకాలలో "మున్నంగి శతకము"[5] మొదటి రచన. ఈ శతకాల రచనా కాలక్రమానికి పెద్దగా ప్రాధాన్యమేమీ లేదు. ఇవన్నీ 1958-61 ల మధ్య ఒక్క ఊపులో వ్రాసినవి. అన్నింటిలోనూ కవి ఆత్మ నివేదనే అనేక విధాలుగా వ్యక్తమౌతుంటుంది. శతకాలలో నేరుగా భగవంతునికి తనను గూర్చి చెప్పుకోవటం ప్రధానం కావటం వల్ల ఇది ఒక దినచర్య గ్రంథం (డైరీ) తరహాలో ఉంటుంది. ఇక్కడ దాపరికాలు కాని, వ్యంగ్యాలు కాని, అతిశయోక్తులు కాని ఏవీ ఉండవు. అందువల్ల పాఠకులకు కవి యొక్క వ్యక్తిత్వం అన్ని కోణాలనుంచి ప్రత్యక్షమవుతుంది.

సత్యనారాయణగారు హరిహరభేదం పాటించని అద్వైతి. హరిహరులు ఆయనలో విచిత్రంగా కలగలసిపోయినారు. నామభేదము, దైవభేదముగా ఆయ నలో లేదు. ఈ ఏక భావ లక్షణానికి మూలం మున్నంగి శతకములో చెప్పబడి నది. ఆయన అంటారు—

"మాయూర నీపేరి స్వామి కలడు, కమ్మకులాంబుధిశః
పాయక కట్టించె దేవళము గూడవల్లి బ్రహ్మయ్య,
ఆయన వరుసకు మామ నాకుఁ, జిన్నప్పటినుండి
నే యెఱుంగుదు నిన్ను నేను, మున్నంగి వేణుగోపాల!"

"మాయూరి పెద్దలు మామ బ్రహ్మయ్య మా తండ్రి, నాదు
నాయన విశ్వేశ్వరునకుఁ గట్టించినా డాలయమ్ము
మీ యిద్దఱి నెఱుంగదే ననాదిగా మేలి దైవముల
పేయమైన సుధాకృతులను, మున్నంగి వేణుగోపాల!"

గూడవల్లి రామబ్రహ్మం గారు నందమూరులో వేణుగోపాల స్వామి దేవాలయాన్ని కట్టించారు. సత్యనారాయణగారి తండ్రి శ్రీ శోభనాద్రిగారు విశ్వేశ్వరాలయం కట్టించారు ఈ అంశం రామాయణ కల్పవృక్షంలో కూడా ఈ విధముగా చెప్పబడింది:

"ఆ నా తండ్రియనన్ దధీచి శిబి కర్ణాదుల్ పునారూప సం
స్థానం బందిన కర్మయోగి సితచంద్ర ప్రౌఢ కాంతిచ్ఛటా
స్నానం బాడిన స్వచ్ఛలింగమయి నిన్ సాధించి మానందమూర్
లోనన్ నిల్పిన భక్తరాజు సుజన శ్లోకండు దారుండొగిన్."[6]

నందమూరులో కమ్మవారికి, వీరికి - అంతే కాదు, ఆ ఊళ్ళో ఉండే అన్ని కులాలు సౌహార్ద జీవితాన్ని, జీవిత సమన్వయాన్ని సత్యనారాయణగారు అతి చిన్నతనం నుంచే అనుభవించినారు. అది ఆయన హృదయదఘ్నంగా వ్యాపించిన వాస్తవం. ఆయన నవలల్లో - ప్రధానంగా "శార్వరి నుంచి శార్వరి దాకా" అనే నవలలో ఇదంతా చాలా విస్తృతంగా వర్ణించబడింది. ఈ విధమైన జీవన సమన్వయంలో ఆయనకు శివకేశవులిద్దరు అభిన్నంగా దర్శనమిస్తారు.

"తిరుపతి మంగళ సింహ భద్రాద్రి దేశంబు లందు
మరియు నీమున్నంగిలోన నచ్చట మా యూరఁగాక
సిరిగిరిలో ద్రాక్షతోటఁ గాళహస్తిపురి నెందైన
వెరవుగా మీరును మీరే మున్నంగి వేణుగోపాల!"

అంటారాయన. ఇక్కడ అనేక శైవ క్షేత్రాలు, వైష్ణవ క్షేత్రాలు పేర్కొనబడ్డాయి. "మా యూరు" ఈ పద్యంలో రెండుసార్లు కనిపిస్తుంది అంటే- నందమూరు శైవ క్షేత్రం, వైష్ణవ క్షేత్రముగా కూడా భావించబడింది.

"శిరసున నుండి స్వర్గంగ డిగివచ్చి చెంతను నిలువ
గిరిరాజ దుహిత కోపమున నరమేని కేరింత వలద
గరళంపు మెడకాంతి మేన నెల్లదఁ గ్రమ్మగా శివత
విరజిమ్మ వచ్చితో యిటకు మున్నంగి వేణుగోపాల!"

కవి విష్ణువు నందు శివ భావన చేయుచున్నాడు. ఆయన వేణుగోపాల స్వామి. ఆయన చెరియొక ప్రక్క రుక్మిణీ సత్యభామలు కలరు. శివుని శిరస్సు మీది గంగ సత్యభామవలె దిగివచ్చి ప్రక్కన నిల్చినది. పార్వతీదేవి శరీరార్ధ భాగము నుండి విడివడి ప్రక్క నిలచినదట. మెడలోని గరళకాంతి మేనెల్ల వ్యాపించినదట. 'ఓ స్వామీ! శివత విరజిమ్మవచ్చితివా' అని కవి పృచ్ఛ చేయుచున్నాడు. ఇది మహాకవి యొక్క ఉజ్జ్వల భావనా శక్తికి మరొక ఉదాహరణము. శివ కేశవాభేద భావమున కింతకన్న వేరొక మార్గమున లేదా యున్నంత పరాకాష్ఠలో నున్నదీ పద్యము.''[7] ఈ శతకాలు మొత్తంలో అనేక సందర్భాలలో హరి హరాద్వైత లక్షణం చిత్రింపబడినది. శివుడు విష్ణువుగా, కృష్ణుడుగా - విష్ణువు శివుడుగా పరస్పరం మారిపోతున్న తీరు విచిత్రంగా చిత్రింపబడినది.

"నీలగళా! రఘోత్తముండు నీవును నిద్దఱు కానియట్లుగా
నోలి భజించితిన్ మఱియు నున్న దినంబులు నట్లె చేసెదన్
వ్రాలెడు మేను దాఁక నభవా! బ్రదుకైన వికార భావనా
జాలము తప్పుకున్నఁ దుదిజన్మగఁ జేయుముదీని ధూర్జటీ![8]

అని తన జీవితాన్ని రామ - ధూర్జటిలతో పంచిపెట్టుకున్నానంటారు. ఈ విధముగా శివకేశవాద్వైతం చిత్రింపబడగా ఈ కృష్ణ శతకాలు రెండింటిలో కృష్ణపరమైన భావనావైచిత్రి కనిపిస్తుంది.

నందమూరులోని కృష్ణునికి వేణుగోపాలస్వామి అని పేరు. మున్నంగిలోని కృష్ణునికి వేణుగోపాలస్వామి అని పేరు. నిజానికి ఇద్దరిలో తేడా లేదు. కాని, ఉపాసనా మార్గంలో శ్రీకృష్ణుని సంతాన వేణుగోపాలస్వామిగా ఉపాసించటం ఉన్నది. ఈ ఉపాసనలో స్వామి రూపాదులలో కొన్ని కొన్ని విశిష్టాంశాలు ఉంటాయి. మంత్రాలలో కూడా ప్రత్యేకమైన మంత్రాలు ఉంటాయి. నందమూరిలోని స్వామి ఆబాల్యతః తన మనస్సును పట్టుకున్నవాడు. ఈ స్వామి భావన ఇతర వేణుగోపాలుర యందు కూడా అభివ్యాప్తమవుతుంది. మున్నంగిలో ''మా యూర" అనటం ఈ "మాయూరు"లోని స్వామి యొక్క భావన మున్నంగి స్వామియందు సంవ్యాప్తమైందని తాత్పర్యము. నందమూరి స్వామినిగూర్చి ఒకచోట—

"హారి నా జపంబతయును బటాటోపమునకుఁ జేయకువె
యరయ నంతస్తాపమునకుఁ గాక నా యక్షి మధ్యమున
శిరసునఁ బింఛమ్ములోని యొక యీక చిన్నారి కన్ను
విరియవే నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల!"

అంటారు. అక్షి మధ్యమున శిరసున శ్రీకృష్ణుని తలమీది నె లోని చిన్నారి కన్నును తెరిపించమంటారు. అక్షి మధ్యమనగా నాస కన్ను తెరిపించడమే శివత్వప్రాప్తిని కలిగించమని పె మురిపించటం జ్ఞాననేత్రానికి ప్రతీక. ఇక్కడ సంపాదిస్తున్నాడు "....నిదురలో సైతము (నందమూరు 85) న్నానని అంటాడు. రా... వస్తునేమియన స్వప్న సుషుప్తులఁగూడ రామనామ గ్రహణంబె నావయిన మానస జిహ్వాలు చేయుఁ....'' చుండు (బాలకాండ అవతారిక - 6) అంటారు రామ కృష్ణ శివసంపుటి - సత్యనారాయణగారిని సమావరించుకొన్నదని దీనివల్ల స్పష్ట పడుతున్నది.

వేణువు గూర్చిన ప్రస్తావన ఈ రెండు శతకాలలోను అనేక సందర్భాలలో వస్తుంది.

''సృష్టి లోపలఁ గల సర్వ మాధుర్య రేఖ సంగీత
యష్టిగాఁగ హిరణ్యగర్భు నాకారమైన వేణువును
ముష్టిఁగైకొని వచ్చినావు స్వామి । నా ముంగిలిలోఁ బ్ర
విష్టుడై నందమూర్తి లయ! సంతాన వేణుగోపాల! ''

అలాగే''....మృదు వేణురావము బంభర ధ్వని రీతిగా....'' (మున్నంగి - 33) వస్తుందంటాడు మరొకచోట.

''నీపైన మధ్యాక్కలను వ్రాయుచు నిద్రింప నేను
స్వాపమ్ము లోన నా స్వామి బంభర ధ్వానము వింటి;
శ్రీపతి నీ వేణురావ సాంతత్య మృదుధార వచ్చి
వీపున కంటుకపోయె మున్నంగి వేణుగోపాల!''

అంటారు. యోగ మార్గాన ఈ బంభరీధ్వానము ప్రసక్తమవుతుంది. మరొక చోట—

''నా హృదంతరమున యందు మృదువేణు నాదంబు కలదొ
బాహిరిల్లిన యట్టి గేహ భామినీ భావంబు కలదొ
మోహనాంభోధర స్నిగ్ధ వర్ణగ మోహంబు కలదొ
బేహారమ్మయ్యె నీ తోడ, మున్నంగి వేణుగోపాల!''

''చందనాచల గంధవాహ బాలక సంస్పర్శ సుఖము
పొందుచున్నది గుండె వేణు మృదురవమ్మును సంస్మరించి
నందనందన, యెప్డు విన్నదిద్ది? మానస మాత్మ గడప
విందైన యపుడు విన్నదియొ? మున్నంగి వేణుగోపాల?''

ఇక్కడ కృష్ణునితో తన సాయుజ్య లక్షణం వ్యక్తమవుతుంది. వేణు రావాన్ని మరొక విధముగా కూడా ఆయన చిత్రించారు. వేణురవము శంఖా రావము కాదు, బంభరస్వానము. అది ''....అరయ జీపుడు సేయు షట్పదీస్వాన

పట్టిది....'' అంటారు. అంతేకాదు ''........జీవ విశిష్ట లక్షణాంకంబు భ్రమరీ నినాద సాహిత్యమైతిని........'' అని కూడా ఆ నాదముతో తన సాయుజ్యాన్ని స్పష్టము చేస్తాడు. ఇక్కడ ప్రసక్తమైన ఈ వేణునాద విషయం శ్రీకృష్ణ సంగీతం మొదలైన ఇతర కృష్ణ కావ్యాలతో సమన్వయించుకొని చూచుకోవచ్చు. ముకుందమాల లో కులశేఖరాళ్వారులు—

''నాస్థాధర్మేన వసుచనియేనైవ కామోప భోగే
యద్వద్భవ్యం భవతు భగవన్ పూర్వకర్మానురూపమ్
ఏతత్ప్రార్థ్యం మమ బహుమతం జన్మజన్మాన్తరేపి
తత్వాదామ్భోరుహయుగ గీతా నిశ్చలా భక్తి రస్తు'' (5వ శ్లోకం)

అని అన్నారు. సత్యనారాయణగారు కూడా—

"జన్మ లింకెన్ని నాచేత నెత్తింప సంకల్పమయ్య
జన్మలెన్నైన నాకేమి వైరాగ్య సంపదతోడ
మన్మనోవిహరణ మీవు వదలకు మదనవేణుగోపాల
విన్మ నా యీ మాట యొకటి మున్నంగి వేణుగోపాల!"

కులశేఖరులు జన్మ జన్మాంతరాలలో కూడా భగవంతుని యందలి భక్తి తనకు నిశ్చలంగా కలిగించవలెనని కోరగా, ఇక్కడ జన్మలెన్నైనా సరే— వైరాగ్యసంపదతో తన మనస్సులో విహరించడం మానవద్దని కోరుతాడు. రెండు చోట్లా మౌలిక తాత్పర్యం ఒకటే కాని, అక్కడ తాను, తన భక్తి అనే అంశాలకు ప్రాధాన్యం కాగా, ఇక్కడ భగవదనుగ్రహానికి ప్రాధాన్యం కనిపిస్తుంది.

నందమూరు శతకములోని ఈ పద్యం విశేషంగా గుర్తించదగినది.

"వెలందిపై బిడ్డపై కోర్కెవలదు జీవికి నంచు నాకుఁ
దెలిపితి వొక భార్యఁ జంపి యొక్కఁ బిడ్డఁ దీసుకపోయి
తెలిసికోలేకపోయినను నీవెట్లు తెలిపెదు వట్టి
వెలుఁగవై నందమూర్నిలయ! సంతాన వేణుగోపాల!"

ఈ పద్యం సత్యనారాయణగారు ఎప్పుడో రచించిన "దయాంబుధి" అనే చిన్న పద్య ఖండికను గుర్తుకు తెస్తుంది.

"నా కనుల యెట్టయెదుటన నా జనకుని
జనని కుత్తుకలను కోసి ననునడిగె న
తండు 'నే దయాంబుధిని కాదా!' యటంచు
ఓ ప్రభూ! యగునంటి నేనొదిగి యుండి."

"నా కనుల యెట్టయెదుటున నా లతాంగి
ప్రాణములు నిల్వనందీసి యడిగె నను న
తండు 'నేదయాంబుధిని కాదా?' యటంచు
ఓ ప్రభూ! యగు నంటి నెనొదిగి యొదిగి."

"నా కనుల యెట్టయెదుటున నా యనుంగు
తనుజ కుత్తుక నులిమి తానునడిగె న
తండు 'నే దయాంబుధిని కాదా!' యటంచు
ఓ ప్రభూ! నీవయంటి నేనొరిగిపోయి."9

తనకు లౌకికంగా, ఆపదలుగా కనిపించే అంశాలు వ్యక్తిని నిరాశలోకి, నిస్పృహలోకి త్రిప్పవచ్చు. లేదా, వైరాగ్య మార్గానికి త్రిప్పవచ్చు. జీవితంలోని సన్నివేశాలను వ్యక్తి భావించే తీరునుబట్టి, ప్రవృత్తినిబట్టి ఈ మార్పులు కలుగుతాయి. ఇక్కడ వైరాగ్య ప్రవృత్తికి లౌకిక సన్నివేశాలు దోహదం చేసిన తీరు వ్యక్తం చేయబడింది.

ముక్కంగి శతకంలో సుప్రభాత లక్షణం కూడా అనువర్తింప చేయబడింది. "మేలుకోవే స్వామీ... ...." (71 వ పద్యం) మొదలుకొని "మేలుకోనాదు గుండియను......." (74 వ పద్యం) వరకు నాలుగు పద్యాలు సుప్రభాత పద్యాలు ఈ మేలుకోవటం బయట ప్రపంచంలో కాదు, తనలోనే మేలుకొమ్మంటాడు ఇక్కడ నిద్రపోవటం మేలుకోవటం అనే అంశం ఈ క్రింది పద్యాలలో సూత్రప్రాయంగా చెప్పబడింది:

''నిదుర మేల్కొనుమంచు మాటిమాటికి నీకిట్లు చెప్ప
నిదురపోయెడు వాఁడిచట నెవండని నీవందు వేని
నిదుర నాకును మాత్రమున్నదాయేమి? నిద్రాభినయము
ప్రిదిలించుకొనుమంటిగాని మున్నంగి వేణుగోపాల!''

"అభినయించుచు నిద్ర, మేలుకొనియుంటి ననుకొంట వేఱు
అభితో పినిద్రాగతుండు నారీతి ననుకొంట, వేఱు
నభయులు మాదృశుల్ స్వామి రెండవ జాతి నీ కరుణ
విభు! లేమ, లేదు జాగ్రత్త మున్నంగి వేణుగోపాల!''

ఈ శతకములో 82 వ పద్యమునుంచి 97 వ పద్యమువరకు దశావతార వర్ణన చేయబడింది. ఈ వర్ణనలో సమకాలీనమైన భావనాంశాలు చిత్రించబడి నాయి. వామనవతార చిత్రణలో—

''పరలోకములు లేవు సంఘ మర్యాద పాటింపె కలదు
ధరణి మానవసేవ మించి ధర్మమ్ము దైవమ్ము లేదు
మఱుగుజ్జువాడేమి బాగుపడు నేలమట్టమైపోయి
విరచిత వామనాకార! మున్నంగి వేణుగోపాల!"

అంటాడు. సంఘ మర్యాద పాటింపు, పరలోక భావన, మానవ సేవ, దైవసేవ వీటికిమధ్య సమన్వయం సాధించటంలోనే సార్థక్యం ఉన్నదని స్ఫూర్తి. ''మరుగుజ్జు వాడేమి బాగుపడు'' అన్నది వెక్కిరింత. ఈ దశావతారాలలో కృష్ణవర్ణన లేదు. దానికి బదులు బలరామ చిత్రణ ఉంది పది అవతారాల తర్వాత కృష్ణావతారము వర్ణించబడింది. శ్రీకృష్ణ సంగీతములో బలరామ చిత్రణ లేదుకాని కృష్ణ చిత్రణ అన్నింటి చివర వస్తుంది. ఈ చివర రావట మనేది రెండుచోట్ల సమానము. అన్ని అవతారాలకు సమన్వయం కృష్ణావతారము లోనే అన్న స్ఫూర్తి కలుగుతుంది. ఈ విధంగా ఈ రెండు శతకాలలోను భగవద్భావన, ఆర్తి ఏ పొరలు లేకుండా కృష్ణ భూమికపై ఆవిష్కరించ బడినాయి.

## పాదసూచికలు :

1. తెలుగు ఛందో వికాసము - ఆచార్య కోవెల సంపత్కుమారాచార్యులు (1990) - పుట 76.
2. విశ్వనాథ వాఙ్మయ సూచిక (1974) - కాకతీయ - పుట 20.
3. విశ్వనాథ వాఙ్మయ సూచిక (1974) - కాకతీయ - పుట 20.
4. సాహిత్య వివేచన - కోవెల సుప్రసన్నాచార్యులు - పుట 2.
5. విశ్వనాథ మధ్యాక్కరలు మొత్తంలో ఈ శతక మొక్కటే 108 పద్యాలున్న రచన
6. రామాయణ కల్పవృక్షము - అవతారిక - 8.
7. హరిహరాద్వైతము - సహృదయ చక్రము - సుప్రసన్న (1983) పుట 190 & 191.
8. రామాయణ కల్పవృక్షము - యుద్ధకాండ - ఉపసంహరణ - 413 వ పద్యం.
9. దయాంబుధి - భ్రష్టయోగి (1970) పుట 20.

# ఏడవ అధ్యాయము

# కృష్ణ కావ్య సౌందర్య రేఖ

## కృష్ణకావ్య సౌందర్యరేఖ :

"నన్ను నెఱుగరో ఈ తెల్గునాట మీరు
విశ్వనాథ కులాంభోదివిధుని, బహు వి
చిత్ర చిత్రధ్వని బహు విచ్ఛిత్తి మన్మ
హాకృతి ప్రణేత సత్యనారాయణ కవి."

ఇది త్రిశూలం నాటకంలోనిది. తన రచనా సౌందర్యాన్ని, ఆనాటికే దాని ప్రసిద్ధిని వ్యక్తం చేసే పద్యమిది సత్యనారాయణగారు తాను రచించే కావ్య స్వరూపమేమిటో, రచనా విధానమేమిటో, శిల్ప సంయోజనమేమిటో స్పష్టంగా తెలిసిన జ్ఞాతశిల్పి.

"ప్రోవౌ సర్వకవిత్వ మర్మవిదుడ"ని ఆయన చెప్పుకోవటంలో కూడా ఈ అంశం వ్యక్తమవుతుంది. రామాయణ కల్పవృక్షంలోని వివిధ ఖండాల చివర ఆయా ఖండాల రచనా సౌందర్యాన్ని, వస్తు విన్యాసాన్ని గమనించవలసిన తీరు తెన్నుల్ని స్ఫురింప చేస్తారు. "అమరీకైశిక పారిజాత కుసమోహ స్వాదువీ బాలకాండము" అని బాలకాండాంతంలో, "అమృతోక్త్యంచిత ముంగథా కథన శిల్పానేకమార్గాభిరామము" అని అరణ్యకాండాంతములోను, "కోమల చమత్కృత్యధ్వనినిర్మాణ సంపదనూనోజ్జ్వల రమ్యభావరస సామగ్రీ సమగ్రంబు" అని కిష్కింధకాండ చివరిలోను చెప్పిన అంశాలను గుర్తించవచ్చు. మిగిలిన కావ్యాలలో ఈవిధమైన సూచనలు లేకున్నా కూడ ఎంతోమంది సహృదయ భావుకులైన విమర్శకులు సత్యనారాయణగారి వివిధ కావ్యాల రచనా సౌందర్యాన్ని దర్శించి, వ్యాసాలుగా, గ్రంథాలుగా వెలువరించారు. ఆ మార్గములో రేఖా ప్రాయంగా కృష్ణ కావ్యాలలోని రచనా సౌందర్యం దర్శించే ప్రయత్నం ఇక్కడ చేయబడుతున్నది.

కృష్ణ కావ్యాలు కృష్ణతత్త్వ ప్రధానమైనవి. కృష్ణతత్త్వమే గొప్ప సౌందర్య నిధానము. ఈ కావ్యాలలోని కృష్ణపరమైన వస్తువులోనే దానిని విశ్వసింప చేయటంలోనే వస్తు సౌందర్యము అభివ్యక్తమవుతున్నది. "మధురం రసవద్వాచి వస్తున్య పిరస స్థితిః"[1] అని గొప్ప అలంకారికుడైన దండి అన్నాడు. ఇక్కడ రసమన్నది అనంతర కాలాన ఆనంద వర్ధనాదులు నిరూపించిందికాదు ఒకవిధముగా మాధుర్య పర్యాయమైనది. మాధుర్యం రసవత్తు. వాక్కునందు, వస్తువునందు కూడా రసము[2] ఉంటుందని ఆయన తాత్పర్యము. ఈ రెండంశాలు ఈ కృష్ణ కావ్యాలలో సార్థకమవుతాయి. అంటే, ఇక్కడి రచనా విషయంలోను, ఉక్తిలోను, వస్తువులోను మాధుర్యం వ్యాపించి ఉన్నది. మాధుర్య మనగానే కేవలం సుకుమారమైన శబ్దాలు. భావాన్ని సుకుమారంగా చెప్పడం లేదా సుకుమారమైన భావాన్ని వ్యక్తం చేయటమని మాత్రమే కాదు. ప్రధానంగా భావానికి అనుగుణమైన శబ్దరచన ద్వారా మాధుర్యం కలుగుతుంది. మాధుర్యం శైలీ భేదాన్నిగూర్చి కూడా మారిపోతుంటుంది. కుంతకుడు సుకుమార మార్గంలోను, విచిత్ర మార్గంలోను మాదురీ గుణం ఉంటుందంటాడు. ఆస్వాద్యత్వం మాధుర్యానికి మౌలికమైన లక్షణం. ఈ ఆస్వాద్యత్వం వస్తుపరంగా, రచనా పరంగా కృష్ణ కావ్యాలన్నింట అనుభవానికి వస్తుంది.

శృంగారవీధి మొదలుకొని ప్రద్యుమ్నోదయందాకా వివిధ మార్గాలలో వివిధ రూపాలలో అభివ్యక్తమయ్యే కృష్ణతత్త్వము వివిధమైన మాధుర్య లక్షణాలతో ఉద్దీప్తమై కనిపిస్తుంది. శృంగార వీధిలో యవ్వనోపేతమైన శృంగార మాధుర్యం, శ్రీకృష్ణ నిర్వేదములో శాంతమాధుర్యం, గోపికా భ్రమర గీతలలో విరహాభక్తి మాధుర్యం, శ్రీకృష్ణ సంగీతములో భక్త్యుపాసనల మాధుర్య వైవిధ్యం, ప్రద్యుమ్నోదయంలో తాత్త్విక మాధుర్యం, కృష్ణ శతకాలలో వేదనా మాధుర్యం వ్యాపించి ఉన్నవి. ఈ మాధుర్యానికి అనుగుణమైన, ఉద్దీపకమైన ఊహలు, అలంకారాలు, కల్పనలు, ఉక్తివైచిత్రి మొదలైన అనేకాంశాలు సహృదయుల మనస్సులను అనుక్షణం స్పందింపచేస్తూ ఉంటాయి. సూచనప్రాయంగా కొన్నికొన్ని అంశాలు ఇక్కడ వ్యక్తీకరించబడుతున్నాయి.

శ్రీకృష్ణ దేవుని నిర్వేదములో రుక్మిణీ సత్యభామలు కాక మిగిలిన ఆరుగురు భార్యలు శ్రీకృష్ణుని సేవిస్తున్నారని చెప్పిన సందర్భములో కాళిందిని గూర్చిన ఈ పద్యం మనోహరమైన దృశ్యాన్ని మన మనస్సుకు కట్టిస్తుంది:

"చిందుల నల్లనీళ్ళు విరఁజిమ్మిన క్రైవడి వేణివిప్పి కా
ళింది, చకచ్ఛకలదలిమదలీలలుగా విదిర్చినన్
నందకుమారు నీలమసృణచ్ఛవిమత్తనుకాంతి లుప్తమై
క్రిందువడె న్మరుండును నిగిడ్చి మగిడ్చిన దౌతమోఽస్త్రమై."

ఆ కాళింది తన కేశపాశాన్ని విప్పితే నల్లని నీళ్ళు విరజిమ్మినట్లుగా ఉన్నది. ఆ వెంట్రుకలను విదిలించితే చకచక చలించే తుమ్మెదల లీలలుగా అనిపిస్తుంది. ఆ కేశపాశ కాంతిలో శ్రీకృష్ణుడు మృదువైన వినీలకాంతి వెనుకడుగు వేసింది. మొత్తంగా మన్మథుని "తమోఽస్త్రము" ఆ కేశపాశము. కాళింది ఒక నది. ఆ నదీ జలము నల్లగా ఉంటుందని ఒక భావన. కేశపాశము దీర్ఘంగా కదులుతూ ఉండడం, గాలికి ఎగిరినపుడు నల్లని నీళ్ళు చిమ్మినట్లుండడం, తుమ్మెదలు కదిలినట్లుగా ఉండటం, ఆ వ్యక్తి కాళింది కావటం, మన్మథుడికి ఒక కొత్త అస్త్రాన్ని కల్పించటం భావనామయంగా మధురమైన దృశ్యమిది.

ప్రాతఃస్తవములో ప్రతి పద్యము వాత్సల్య భావమాధుర్యంతో తొణికిసలాడుతూ ఉంటుంది. అక్కడి పలుకుబడి వ్యావహారికత. ఒక పల్లీయ వాతావరణాన్ని, ప్రాభాత శోభను, పిల్లల చిలిపిచేష్టలను ఆవిష్కరిస్తుంటాయి.

"అంతే కావలె నిద్రమేల్కొనవు నీ వన్నాయి తావచ్చి యా
యింత మీఁగడ పాలు వెన్న తిని యప్డే చెప్పకుండన్ జనెన్
సంతోషించిఁ గండ్లుచల్లపడెఁ గన్నా! లేవరా యంచు వే
నెంతేనిం బతిమాలుచుండినను నీవింతేని విన్నావురా!"

ఈ పద్యంలో వ్యావహారికత - చిన్నారి కొడుకును మేల్కొల్పడానికి ప్రయత్నించే తల్లి మాట్లాడే సహజమైన తీరు కనిపిస్తుంది.



"వెనుకత్రిప్పి చేతులను గుప్పిళ్ళు పట్టి
కనులు తుడుచుచుంటివి మణికట్లతోడ
నిక్కి నీల్గుచునుంటివి నిద్రయింక
నయ్యెనని యనుకొమ్మందువా? ముకుందా!"

ఇందులో కళ్ళు నులుపుకుంటూ లేచే పసివాని రూప సౌందర్యం అభివ్యక్త మవుతుంది. "మతకరిబుద్ధు లెంతకు మానవు, నిన్నుబట్టి యాప బ్ర - హ్మ తరము కాదు......." ఇక్కడ బ్రహ్మ శబ్దములోని పూర్వాక్షరము మొదటి పాదం చివర, ఉత్తరాక్షరం రెండవ పాదం మొదట వ్యాపించడంలో ఆ తల్లి పొందే విసుగు ఈ విరుపు ద్వారా వ్యక్తమవుతుంది.

"గొల్లల గూడెముల్ తడకకొంపలు తల్పులు లేవు నీవు ప్రే
పల్లెకు మేటివైతి వొక పాతిక క్రోఁతులు నీకుఁదోడు మీ
రెల్లరు నుట్లకెక్కుపనికేమొ హుజూర్సరదారులైరి యీ
పిల్లలతోడ నింకఁ గనుపింపుమ యింకొకమూఱు చెప్పెదన్."

పద్యంలో ఒక చిన్నపల్లె, ఆ పల్లెలోని పిల్లల దుందుడుకు చేష్టలు, ఆ పిల్లలపై కోపాన్ని కప్పుకున్న ప్రేమోక్తులు ఒక సహజ మాధుర్యాన్ని వ్యక్తం చేస్తున్నవి. ఈ విధంగా ప్రాతఃస్తవములోని ప్రతి పద్యంలోని విషయం భాష, పలుకుబడి, వాక్యవిన్యాసము సమష్టిగా కావ్య సౌందర్యాన్ని ఉద్దీపింప చేస్తాయి.

భ్రమరగీతలు, గోపికాగీతలలోని భావవ్యక్తీకరణ తెలుగు నుడికారాన్ని ఆశ్రయించి కావ్య సౌందర్యాన్ని మెరిపిస్తూ ఉంటాయి. శ్రీకృష్ణుని రూపము నాగరికము కావటంవల్ల ఆయన గోపికలకు "గుండెల మీద బరువై పోయినాడట" వెన్నెలలో శ్రీకృష్ణుని కాళ్ళు కాయలు కాచినాయట! అంటే, ఆ పాదాలు అంత సుకుమారమైనవి. శ్రీకృష్ణునితో గడిపిన తమ రోజులను గుర్తు తెచ్చుకుంటూ "మాకునై పోయిన వాదినమ్ములు" అంటారు గోపికలు. "దేహినో దివసా గతీః" అన్న ప్రసిద్ధ వాగ్విలాసము ఇక్కడ స్ఫురిస్తుంది. "ఇంటగెలిచి రచ్చగెల్వమని నారు! దేహములన్ దాత్మల రెంటనన్ జెడినవారైనాము! తపశ్శ్రీ చెడి రెంట చెడిన రేవడులమైతిమి! నల్వురి నోళ్ళలో బడుట!" మొదలైన పలుకుబడులు అక్కడ భావవ్యక్తీకరణకు క్రొత్త అందాన్ని సంపాదిస్తున్నాయి. గోపికా గీతలలో సంబోధనలు ప్రత్యేకంగా చెప్పుకొనదగినవి. ఉదాహరణకు కొన్ని - "ఈషత్కోమల, కేతన్ సుమదళీహ్రీకృత్ కపోలచ్ఛవీ!"; "లవలీనవపల్లవాగ్ర నేత్రాంత!"; "భ్రమరీనీలగరుత్ ప్రమాణనయన భ్రాజిష్ణు ముగ్ధచ్ఛవీ!"; "కృతజంఘాజ్ఞ

ఘనోజ్జ్వల....; "యశోద బెడంగు కుఱ్ఱడా!" వంటి మధురమైన సంబోధనలు సుకుమారార్థవ్యంజకమైనవి అనేకం. "కుఱ్ఱవానికి దిలాసాయయ్యె" వంటి ఆక్షేపాలు అడుగడుగునా మనకు కనిపిస్తాయి.

శ్రీకృష్ణ సంగీతము ఒక విచిత్రమైన రచన. పల్లెటూళ్ళలో ముగ్ధలైన స్త్రీలు మాట్లాడుకొనే తీరుతెన్నులు, ఆక్షేపాలు, అధిక్షేపాలు, వెక్కిరింపులు, మెప్పుదలలు మొదలైన తీరులెన్నో ఇందులో కనిపిస్తాయి. వెతికితే దొరికే చిన్న చిన్న సంస్కృత సమాసాలు తప్ప కావ్యం మొత్తం తెలుగు పలుకుబడి నుడికారము కుప్పలు పోసినట్లుగా కనిపిస్తుంది. ఈ పద్యాలలో కాకువు విరివిగా ప్రయుక్తమైనది. అందువల్ల పద్యం చదివేటప్పుడు పద్యమనికాక ఒక వ్యక్తి సహజంగా పలికే తీరులో, ధ్వని విన్యాసముతో, ఒడుపుతో చదివినప్పుడు కృష్ణ సంగీతములోని మాధుర్యం అనుభవంలోకి వస్తుంది. ఇందుకు కారణం ఇందులోని విషయమంతా ఒక గోపిక మరొక గోపికతో ఏదో విషయాన్ని చెబుతున్న తీరులోనే - సంభాషణాత్మకంగా ఉంటుంది. ఎంతో గొప్పదనుకునే విషయం చిన్నారి పొన్నారి మాటలతో వ్యక్తం చేయబడుతుంది. అందుకే ఈ కావ్యంలోని గీత పద్యాలు గీత పద్యాలుగా ఉండవు. నాటకీయ సంభాషణలాగా సాగిపోతూ ఉంటాయి. అందుకే నాలుగు పాదాల పద్యం అంటూ విడివిడిగా కాక నలభై పాదాల దాకా ఆగకుండా సాగుతుంది. ఒక పద్యఖండికను సంభాషణాత్మకంగా విరిచి కృష్ణ సంగీత అధ్యాయంలో ఇదివరకే ప్రదర్శింపబడింది. "ఎఱ్ఱకిరణాల వలె, కొండ ఎక్కునాలు" వంటి మనోహరమైన ఉపమలకు శ్రీకృష్ణ సంగీతము ఒక గని వంటిది. "భద్రకాళి కన్నులదాక పయిట కప్పి । కొన్న మొగమట్లు మలుసంధ్యఁ గోర పొద్దు । నాలపీపులఁజెందిరయలుకుచుండ । కొనబడిపోవు సెలయేరు నానెసంగునట" వంటి వెన్నెన్నొ ఉదహరించుకోవచ్చు. సంభాషణగా ఉంటుంది కాబట్టి సామెతలు అధికంగా భావోద్దీపకంగా విరివిగా కృష్ణ సంగీతంలో మనకు లభిస్తాయి.

"ఎగదీశినన్ బ్రహ్మహత్యయు, దిగదీశినంత గోహత్యయు," "నోరు మాటాడుచుండగా నొసలు వెక్కిరించు!", "ఊరి యందరు నొక త్రోవ, ఉలిపి కట్టె నొక త్రోవ!''; "అందరును నల్ల పూసలే, అందరును తమలోని దారము దూరుట కానలేదు।''; "బ్రతుకు కొలిమిలో పెట్టినట్లు కుములుచుండ।''; "ఆసు

లోని కండె విధాన।''; "చేసుకున్న వానికి చేసుకున్నంత పరశివా।'' మొదలైనవి ఆ విషయాన్ని చెప్పే వ్యక్తుల తీరును, చెప్పబడే విషయపు తీరును వ్యక్తం చేస్తూంటాయి.

"కులవృత్తి'' అన్న ఖండికలో వేణురవము వర్ణించిన తీరు, ఆ ధ్వని కలిగించే వివిధమైన అనుభూతులు చిత్రించిన తీరు ఉదాహరించుకోదగినది:

"........దవ్వు పిల్లనగ్రోవి రవము
ప్రాకి పసి త్రాఁచు పిల్లలు దూఁకినట్లు,
జల్లుపడినప్డు పరుపైన రాళ్ళ మీఁద
వెండి నీళ్ళులు జల జల వెదలినట్లు,
నీల మధుమూర్తి గుండెలో నిండినపుడు
యోగి చెక్కిళ్ళ కన్నీళ్ల సాగినట్లు,
నవ్వుచును పసివాఁడు స్తన్యంబు గ్రోలు
చమ్మ మొగమును జూచుచో నార విడుచు
సెలవులందున క్షీరమ్ము చిందినట్లు,
ఉపనిషద్దేవి ప్రక్కల కొరిగి నవ్వి
నట్లు, వేదముల్ గల గల లాడినట్లు,
వేలుపులు రక్కసులు కూడి పాలకడలి
చిలుకుచుండఁ బాలకరళ్ళ చివరలందు
ముట్టిగాఁ దేలి చెవులుగా మొటకరించి
వేలుపుల మావు తలదాఁక విసిరినట్లు........''

ఉన్నది. ఇందులో ప్రకృతి పసివాడు, యోగి పరమేశ్వరుడు, వేదాలు ఉపనిషత్తులు అన్నీ కలగలుపుగా విచిత్రమైన వేణురవ మాధుర్యాన్ని అభివ్యక్తం చేస్తున్నవి. శ్రీకృష్ణ సంగీతమంతా ఈ విధమైన భావమాధుర్యంతో భాషా వైభవంతో పొంగులు వారుతూ ఉంటుంది.

ప్రద్యుమ్నోదయం కావ్యమార్గాన పద్య సౌందర్యాన్ని చూపు [illegible]

"కాంచుచు నుండ బండికిని గట్టిన గుఱ్ఱములూడఁదీసి తో
లించెద సైన్యమున్ ఖురహలీకృతమై చనునట్లు ధాత్రి త్రా
క్కించెద నడ్డమైన భుజకీర్తుల వారిని నెత్రు దేఱ్చు క్ర
క్కించెద వేల్పు బువ్వ చిలికించెద మైత్రియులైనవారికిన్."

ఈ పద్యంలో తోలించెద, త్రొక్కించెద, క్రక్కించెద, చిలికించెద అన్న పదాల విన్యాస వైచిత్రి పద్యానికి, అందాన్ని సంపాదించడమే కాకుండా కృష్ణుని ఉద్ధత లక్షణాన్ని కృష్ణుని మాటల్లోని ఔద్ధత్యాన్ని కూడా స్ఫురింపచేస్తుంది.

"విఱిగిపోయిన విల్లు చెఱిగిపోయిన యిల్లు
కఱపించె నెఱపించెఁ గాంతపతికి
పట్టువీడిన యమ్మ పొట్టు రేగిన దుమ్ము
పట్టించె నెట్టించెఁ బడతి పతికి
కట్టుబాసిన జోడునెట్టి త్రోసిన జోడు
మెఱసించెఁ గఱపించె మెలతపతికి
ప్రాఁతయీలువు పట్టు లేఁతపిలుపు కట్టు
సడలించె బిగియించెఁ జానపతికి
నిదురయన్నమ్మ లక్కఱ కదియరాదొ
తోటలోననే యెప్పుడు తోటలోనె
పట్టమహిషి సేవకురాండ్రు భవనగతలు
విసవిసలు నాడగా గుసగుసలుపోవ."

ఈ సీసపద్యం రచనారీతి నాచన సోమనాథుని స్ఫురింపచేస్తుంది.

"అరవిందముల తోటలవఘళించినయట్లు
బిరుసు గాలులలోనఁ బరిమళింప
తగనశోక తరు ప్రతానంబు పూచిన
కరణి రత్నాల జూకాలు మెఱయ
చూతమహాతరుల్ పూఁతవట్టిన యట్లు

వెలుఁగులు చుక్కచుక్కలుగఁ బొడువ
తఱినవమల్లి పందిరిపూలు విచ్చెనా
తలతలగా వియత్తలము విరియ
మలఁగి నీలోత్పలచ్ఛవుల్ మసలినట్లు
వెలుగుఁపిండులు నును నీలిమలు రహింప
సాగె రతియు వసంతమాసమునఁ బుష్ప
వాటికలయందు రుక్మిణి తోటలందు."

ఈ పద్యం రతీదేవి వనవిహారాన్ని చిత్రిస్తున్నది. ఇక్కడ అరవింద, అశోక, చింత, నవమల్లి, నీలోత్పలముల ప్రస్తావన మన్మథుని పంచబాణాలను స్ఫురింప చేస్తూ రతీదేవికి భర్తృదర్శనానుభూతి కలిగించడం విశేషం,

కృష్ణకావ్యాల వస్తు విన్యాస పరిశీలన ప్రధానమైన ఈ వ్యాసంవో కావ్య సౌందర్య భావన ఒక చిన్న తెరిపి.

## పాదసూచికలు :

1. కావ్యాదర్శః - దండి 1.51.

# ఎనిమిదవ అధ్యాయము

# ఉపసంహారము

## ఉపసంహారము :

"నేను మన స్సన్యాసిని"1 అనీ, "కవితా రూపు తపస్సు చేసెదన్ శ్రీకంఠా"2 అని సత్యనారాయణగారు చెప్పుకున్నారు. అట్లాగే భ్రష్టయోగి అన్న ఖండికలో యోగ భ్రష్టుడై, తాను కవిగా జన్మించినట్లు భావించారు. ఆయన అద్భుతమైన కవితారూప తపస్సు చేస్తూనే యోగిగా, జపశీలిగా జీవితం గడిపారు. ఆయన ఎన్నెన్నో రకాల మంత్రాలను, ఎన్నో వేల సార్లు జపించినట్లుగా చెప్ప బడుతున్నది. ఆయన డైరీలలో చివర ఆయన చేసిన జప వివరాలు కొంత వ్రాయబడ్డాయి 3 ఆ వివరాలన్నీ శివ పంచాక్షరి, రామ మంత్రం, ఆంజనేయ మంత్రం లక్షల సార్లు జపించినట్లుగా తెలుపుతున్నాయి. కాని, శ్రీకృష్ణ మంత్రాన్ని జపించినట్లు ఆ వివరాలలో లేదు. జపించినదీ, జపించనిది కూడా చెప్పడం కష్టం. భ్రమరగీతలు, గోపికా గీతల వ్యాఖ్యానము, టిప్పణులలో అక్కడక్కడ శ్రీకృష్ణదేవుని ఉపాస్యస్వరూపాన్ని సూచనగా ప్రస్తావించారు. టిప్పణిలో ఒకచోట "శ్రీకృష్ణుడు శ్యామలాదేవి" అనియు, "శ్రీరాముడు ఒక లలితాదేవి" యనియు శ్రీవిద్యాసంప్రదాయములో కలదు అని తెలివిని శరీర మును విడమర్చినదట. ఇది సాధారణా మార్గమునకు ఒక లక్షణము అని చెప్ప బడింది. భ్రమర గీతల్లోని 11 వ పద్యం వ్యాఖ్యానంలో "ఇది తొలి నాటి శ్రీకృష్ణుని వేషము. శ్రీకృష్ణ దేవునియొక్క ధ్యేయమైన రూపమిది. ఇది బాల కృష్ణుని ఉపాసనారూపము'' అని అన్నారు. 60 వ పద్యాన్ని వ్యాఖ్యానిస్తూ "ఈ గోపికల యొక్క భావన అహికాముష్మికములను రెంటినీ వదలనిది. సంసారములను చేయుచునే ఉందురు. నిత్య పరమేశ్వరాభావలగ్న చిత్తవృత్తులై ఉందురు. ఇది పరమయోగము. ఒక విశిష్టమైన భక్తి లక్షణం" అని అన్నారు. ఈవిధంగా అనేక సందర్భాలలో శ్రీకృష్ణుని గూర్చి భక్తి ఉపాసనామార్గాలను గూర్చి సూచింపబడిన అంశాలు సత్యనారాయణగారికి అనుభవములోనివే అని

చెప్పవలనీ ఉంటుంది. అయితే, స్పష్టంగా ఆయన తన విషయంగా కృష్ణోపాసనను గూర్చి మంత్ర జపాన్నిగూర్చి చెప్పలేదు కాని, ఆయన కావ్య ప్రపంచములో రామాయణ కల్పవృక్షం ఒకటి ప్రక్కకు పెడితే ఇంచుమించుగా కృష్ణపరమైన కావ్య రచనయే అధికంగా కనిపిస్తుంది.

"ఒక మంత్రంబు జపింపమైతిమి మరే హోమంబునుం జేయమే
యొక యంత్రాన బిగింపమైతిమి ప్రభుండూరేగుచున్నాడ బా
చకి త్రైణాఘులనేమి చేసిన నదే సాగున్ దొరైనాడ బా
రక సాగించును సాగనిచ్చెద మహో రాజీవ పత్రేక్షణల్"

అని గోపికలంటారు. ఇది తన విషయంకూడానేమో తెలియదు. గోపికా గీతలలో శ్రీకృష్ణుని పాదాదికేశాంత వర్ణన చేయబడింది. ఈ వర్ణనలో శ్రీకృష్ణునికి సంబంధించి వివిధ ధ్యాన మంత్రాలలోని అర్థాలు చెల్లాచెదురుగా స్ఫురిస్తూ ఉంటాయి. శ్రీకృష్ణ సంగీతములో కృష్ణ యంత్రము అన్న ఖండిక బాలా శివులతో సహ కృష్ణునిలో లీనమైనట్లు చిత్రించబడింది. అంతేకాదు, కృష్ణ యంత్రము కూడా ఎవరో బ్రాహ్మణుడు ఇచ్చినట్లు ప్రస్తావించబడింది. ప్రద్యుమ్నోదయంలో శ్రీకృష్ణునికి శివునికి అభేదముతో పాటు పరమేశ్వరత్వము చిత్రించబడినది. ఈ అంశాలన్నీ కృష్ణతత్త్వగతమైన సత్యనారాయణగారి జీవిత ప్రవృత్తిని స్ఫురింపచేస్తున్నాయి. ఈ ప్రవృత్తి ఫలితంగానే కృష్ణకావ్యాల రచన, కవితారూప తపఃఫలంగా ఆవిష్కృతమయినాయి.

ఈ కావ్యాల ఉపరితలంలో భావకావ్యాల్లోగా రచనా సౌందర్యంతో అభివ్యక్తం కావడం ఆయన ప్రతిభాలక్షణం. కాని, అంతర్వాహినిగా తపోధ్యాన ఉపాసనాది విషయములకు జ్ఞానభక్తి యోగులకు సంబంధించిన అనేక విధమైన అంశాలు ఈ కావ్యాలలో అంతర్వాహినిగా ప్రవహిస్తున్నవి. సహృదయుల అనుభవ పరిమితుల మేరకు ఆ నదీ తరంగాలు కాంతి వక్రతలతో ఆనంద స్పందన కలిగిస్తున్నాయి. ఈ స్పందనరేఖ ఈ కావ్యాలలో వస్తువిన్యాస విలక్షణత్వాన్ని పరిశీలించటానికి పురికొల్పినది. అందుకే ఈ వ్యాసం వస్తుస్వరూపం, వస్తువిన్యాసము ప్రధానంగా సాగింది. ఈ వస్తువు కావ్యంగా మలచబడటంలోని కవితా లక్షణం కావ్యసౌందర్య పీఠికగా ప్రదర్శింపబడినది.

శృంగారవీధి మొదలుకొని సంతాన వేణుగోపాల శతకం దాకా సాగిన ఈ భాగవత భాగీరథి అయిదు ఘట్టాలుగా విభజింపబడినది. శృంగారవీధి కావ్యం వివిధ ఖండికల, కావ్యాల సంకలనం. కావ్యాలలో వస్తువిన్యాసం ప్రధాన మైనది. ఖండికలలో భావవైలక్షణ్యం ప్రధానమైనది. ఈ దృష్టితో శృంగారవీధి విహారము చేయబడినది. తరువాతి ఘట్టము గోపికా భ్రమర గీతాలాపన. ఇవి నిజానికి రెండు వేరు కావ్యాలు కాని, రెండింటి యందు వక్తలుగా గోపికలే దర్శనమిస్తారు. ఆ కారణంగా ఈ రెండూ ఒక ఘట్టంగా చిత్రింపబడ్డాయి. పరమేశ్వరుని అవతార విధానంలో వ్యూహపద్ధతి భూమికగా రచింపబడిన తాత్త్వికకావ్యం ప్రద్యుమ్నోదయం. రామకృష్ణాదులైన విభవావతారాల కావ్యాలు సాహిత్యంలో విరివిగా లభిస్తాయి కాని, వ్యూహాన్ని భూమికగా చేసుకొన్న కావ్యం సాహిత్యంలో ఇదొక్కటే. అందుకే వ్యూహ ప్రాధాన్యంతో ప్రద్యుమ్న వ్యూహో దయం ప్రత్యేక ఘట్టంగా రూపొందింది. శ్రీకృష్ణ సంగీతము కూడా ఒక విధ ముగా వివిధ ఖండికల సంకలన మనవచ్చును. కాని, లక్ష్య విషయం ఒకటే అయి, వివిధ వ్యక్తులు దానిని భావించినట్లుగా లేదా ఒకే వ్యక్తి దాన్ని గూర్చి వివిధంగా భావించినట్లుగా ఉండటంవల్ల ఉల్లేఖాలంకార పద్ధతిలో ఇది ప్రత్యేక కావ్యంగా రూపుదిద్దుకొని, ఒక ఘట్టంగా ఏర్పడ్డది. అటు మున్నంగిలోనూ, ఇటు నందమూరిలోనూ ఉన్నది వేణుగోపాల స్వామియే. ఒకరు సంతాన వేణుగోపాల స్వామి కావటం మాత్రమే విశేషం. ఆయన ఏ విధమైన గోపాలుడు అయినా ఆయన ముందు ఆయన విషయమైన వేదన యొక్క నగ్నమైన అభివ్యక్తి దాదాపుగా ఒకేవిధమైనది. అందువల్ల ఆ రెండు శతకాలు ఒకే ఘట్టంగా రూపొందినాయి.

మౌలికంగా ఇది ఈ వ్యాస విభజన.

అవతారికగా విశ్వనాథ సాహిత్యవైభవస్మరణంతో కృష్ణ కావ్యాలను నిర్ణయించుకోవటంతో ఈ వ్యాసం మొదలైంది. ఈ విధమైన విభజనతో అంది నంతమేరకు ప్రదర్శింపబడిన వస్తు స్వరూప విన్యాసాల విశ్లేషణ సహృదయా మోదంద్వారా సఫలమవుతుందని విశ్వసిస్తున్నాను.

పాదసూచికలు :

1. శ్రీమద్రామాయణ కల్పవృక్షము - బాలకాండ - అవతారిక - 44.

2. శ్రీమద్రామాయణ కల్పవృక్షము- అరణ్యకాండ - శబరి ఖండము- 411.

3. విమర్శిని - 2 - (విశ్వనాథ వాఙ్మయ జీవిత విశేష సంచిక)- పుట 240, 241, 242.

# అనుబంధము – 1

16-3-93

శ్రీ శ్రీరంగస్వామిగారికి,

your telephone—

ఎప్పుడో 1960 ప్రాంతాల్లో జరిగిన విషయం. 59 అయినా కావచ్చు.

డా॥ రామమనోహర లోహియా హైదరాబాదులో ఉన్నపుడు సాయంకాలాలు సాధారణంగా Abids లోని Kwality కి వెళ్ళి కాఫీ తాగడం అలవాటు. నేనూ వెంట ఉండేవాణ్ణి. ఒకనాడు ఈ సాయంకాలం నేను రాలేను అన్నాను. ఎందుకు అని ఆయన అడిగాడు. ఇవాళ విశ్వనాథవారు కల్పవృక్షం చదువుతున్నారు, నేను అక్కడకు వెళ్ళవలె అంటే నేనూ వస్తాను అని ఆయన సిద్ధమైనాడు. బేగంబజారులో సభ. సభ శ్రీ పాటిబండ మాధవశర్మగారు ఏర్పాటు చేసినట్లు గుర్తు.

ఇద్దరం వెళ్ళి ఎక్కడో మూలను కూచొని విన్నాము. లోహియాకు తెలుగు అక్షరం ముక్కరాదు. కాని, మొదటినుంచి చివరిదాకా కదలకుండా విన్నాడు. కార్యక్రమం అయిపోయి బయటికి వచ్చి కార్లో కూచోవటంతోటే ఆయన అన్న మొదటి మాట "తుమ్ ఇన్‌హే కవి కహతేహో యహ్ తో భక్త్‌హై" అని. (మీకు హిందీ చదవటం వచ్చునా? 'తుమ్ ఇన్హేఁ కవీ కహతే హో యహ్‌తో భక్త్‌హైం' అంటే ''నువ్వు ఈయనను కవి అంటావేమిటి? నిజం చెప్పాలంటే ఈయన భక్తుడు" అని అర్థం.)

యహ్‌తో అన్నచోట తో stress కోసం వాడతారు. అంటే ఆ మనిషిలో కవి లక్షణాల కంటే భక్తుని లక్షణాలు ఎక్కువ ఉన్నాయని అర్థం.

పద్యాలు చదువుతున్నపుడు ఆయన కంఠంలోని గాద్గద్యం, ఆయన తాదాత్మ్యం అవి చూచి అన్నమాట—''

I think this will do—

మీ

జువ్వాజి గౌతమరావు

# అనుబంధము – 11

రసతరంగిణి - (2) — 1.

శృంగారవీధి.

విశ్వనాథ సత్యనారాయణ

—అంకితం 8

6

3

6

2

స్నాన. సుం.) 3 3

—

కు - దా. 3. 28

2 శ్రు - గీ -

2 య. న.

3 రా. స్వ -

3 సా.రము.

9 ప్రా - స్త -

1 సా. వే -

1 అంతస్స్పృహ -

1 రాధిక -

2 రాధిక -

—

3 అమృతము -

2 రాధ - (వచనము).

—

5.7

---

* అసలు ప్రతి శిథిలావస్థలో ఉన్నది.

# అనుబంధము - III

## ఉపయుక్త గ్రంథ, వ్యాస సూచి


1. ఆంధ్ర మహా భాగవతోపన్యాసములు - ప్రచురణ ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు, 1957.
2. ఆంధ్ర మహాభారతము - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, హైదరాబాదు, 1967.
3. ఆంధ్ర వాఙ్మయము - కృష్ణకథ - 1 & 2 భాగములు - డా॥ ధారా రామనాథశాస్త్రి - ఒంగోలు, 1982.
4. ఆంధ్ర ప్రతాపరుద్ర యశోభూషణము - చెలమచర్ల రంగాచార్యులు, హైదరాబాదు, 1961.
5. ఆధునికాంధ్ర కవిత్వము - సంప్రదాయములు - ప్రయోగములు - రీతులు -డా॥ సి. నారాయణరెడ్డి, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌజ్, హైదరాబాదు, 1989.
6. ఒకడు నాచన సోమన్న - విశ్వనాథ సత్యనారాయణ, VSN & Co., విజయవాడ, 1960.
7. కవితా విప్లవాల స్వరూపం - వెల్చేరు నారాయణరావు, హైదరాబాదు బుక్ ట్రస్ట్, హైదరాబాదు, 1982.
8. కళాపూర్ణోదయం - పింగళి సూరన - వావిళ్ళ రామస్వామి శాస్త్రులు & సన్స్, మద్రాసు, 1968.
9. కావ్యాలంకార సంగ్రహము - సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి.
10. కృష్ణ కర్ణామృతము - బి. రామరాజు వ్యాఖ్య - సురభారతి, హైదరాబాదు- 1982.
11. కృష్ణపక్షము - దేవులపల్లి కృష్ణశాస్త్రి - రాజహంస ప్రచురణము, మద్రాసు, 1982.
12. గిరి కుమారుని ప్రేమగీతాలు - విశ్వనాథ సత్యనారాయణ - వి. ఎస్. ఎన్ & కం., విజయవాడ (1953)

13. గోపికా గీతములు - (వ్యాఖ్య) డా॥ కె. శివన్నారాయణ, నర్సాపురం, ప.గో. 1986
14. జయదేవుడు - సునీత కుమార ఛటర్జీ (తెలుగు అనువాదం) నేషనల్ బుక్ ట్రస్ట్, న్యూఢిల్లీ, 1976.
15. తెలుచిరాజు - విశ్వనాథ సత్యనారాయణ - వి. యస్. యన్. & కో. విజయవాడ, 1954.
16. దిండుకింది పోకచెక్క - యం. శేషాచలం అండ్ కంపెనీ, సికిందరాబాదు, 1967
17. భీమ ఖండము - శ్రీనాథుడు.
18. భ్రష్టయోగి - విశ్వనాథ సత్యనారాయణ - వి యస్. యన్. & కో. విజయవాడ.
19 పాండురంగ మాహాత్మ్యము - తెనాలి రామకృష్ణుడు - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి - హైదరాబాదు, 1984.
20. పారిజాతాపహరణము - ముక్కు తిమ్మన - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి - హైదరాబాదు, 1986.
21. పోతన పంచశతి స్మారిక - పోతన పంచశతి ఆహ్వాన సంఘం, వరంగల్లు - 1982.
22. ముంగిట ముత్యం - సి. వేదవతి - 45, L.I.C. కాలనీ, మెహదీపట్నం, హైదరాబాదు - 1986.
23. రాధాకృష్ణ నాటకము - పానుగంటి లక్ష్మీనరసింహారావు - కొండపల్లి వీరవెంకన్న & సన్సు - రాజమండ్రి.
24. విశ్వనాథ శారద - తాటికొండ వేంకటకృష్ణయ్య - తిరుపతి, 1981.
25. విశ్వనాథ వాఙ్మయ సూచిక - కాకతీయ విశ్వవిద్యాలయం - వరంగల్లు తెలుగువిభాగం - 1974.
26. విశ్వనాథశారద - 3 - వి.యస్.యన్ & కో - విజయవాడ.
27. విశ్వనాథమార్గము - కోవెల సుప్రసన్నాచార్యులు - శ్రీవాణీ ప్రచురణలు, వడ్డేపల్లి - వరంగల్లు - 1992.
28. వేయి పడగలు - విశ్వనాథ సత్యనారాయణ - వి.యస్.యన్ & కో, 1986.

29. విమర్శిని - 2 - కాకతీయ విశ్వవిద్యాలయము - వరంగల్లు 1977.
30. శ్రీ మద్రామాయణ కల్పవృక్షము - విశ్వనాథ సత్యనారాయణ, వి ఎస్. యన్ & కో - విజయవాడ, 1992.
31. శ్రీమదాంధ్ర మహా భాగవతము - పోతన - తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాదు.
32. శ్రీమదాంధ్ర భాగవతానుశీలనము - ధూళిపాళ శ్రీరామమూర్తి.
33. శ్రీమద్భగవద్గీత - తం. తవప్పెరు మాళ్ళయ్య వ్యాఖ్య - 1930.
34. శ్రీ గీత గోవింద కావ్యము - డా॥ దాశరథి వ్యాఖ్య, శ్రీ బాల సరస్వతీ బుక్ డిపో, కర్నూలు - 1937.
35. శాకుంతలము యొక్క అభిజ్ఞానత - విశ్వనాథ సత్యనారాయణ - కుల పతి సమితి, వరంగల్లు 1961.
36. శార్వరినుండి శార్వరి దాక - విశ్వనాథ సత్యనారాయణ - వి. యస్. యన్. & కో - విజయవాడ.
37. సవ్యాఖ్యాన తత్వత్రయము - పిళ్ళ లోకాచార్యులు వ్యాఖ్య.
38. సహృదయ చక్రము - కోవెల సుప్రసన్నాచార్యులు - శ్రీ వాణీ ప్రచురణలు, వడ్డేపల్లి, వరంగల్లు - 1983.
39. సాహిత్య వివేచన - పైదే ,1971.
40. తెలుగు ఛందోవికాసము - కోవెల సంపత్కుమారాచార్య - తెలుగు అకాదమి - హైదరాబాదు, 1990.

## వ్యాసాలు :

1. జయంతి సంచికలు - 1958 - 1960.
2. విశ్వనాథవారి ప్రణయదర్శనము - సాళ్వ కృష్ణమూర్తి, భారతి - 5/59.
3. శ్రీ జయదేవకవి - అష్టపదులు-శ్రీ వింజమూరి వరాహ నరసింహాచార్యులు, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, కాకినాడ 12/1937 - 1/1938.

## హిందీ :

శ్రీ రాధికా కా క్రమవికాస్ - శశిభూషణ్ గుప్తా (1956) - హిందీ ప్రచార్ పుస్తకాలయ్, వారణాసి.

## సంస్కృత గ్రంథాలు :


1. అభిజ్ఞాన శాకుంతలమ్
2. కావ్యాదర్శః - దండి
3. కావ్యాలంకార సంగ్రహమ్
4. కిరాతార్జునీయమ్
5. కుమార సంభవమ్
6. కువలయావళి - ఆంధ్ర విశ్వవిద్యాలయము
7. కృష్ణకర్ణామృతమ్
8. గీతగోవిందమ్
9. ప్రతాపరుద్రీయమ్ - రత్నాపణవ్యాఖ్య
10. ముకుందమాల - కులశేఖరాళ్వారులు
11. రసగంగాధరమ్ - జగన్నాథ పండితరాయలు
12. రామానుజ భాష్యం
13. శంకర భాష్యం
14. శివానందలహరి
15. శ్రీస్తవమ్ - కూరనాథులు
16. శ్రీ మహా భాగవతమ్
17. సాహిత్య దర్పణమ్ - విశ్వనాథుడు
18 శ్రీమద్రామయణమ్
19. సౌన్దర్యలహరి


